ఆంధ్ర చంద్రికా గ్రంథమాల - 3

# ఆంధ్ర
# సాహిత్య చరిత్ర సంగ్రహము




గ్రంథకర్త:-

ఆచార్య,

ఖండవల్లి లక్ష్మీరంజనం ఎం.ఏ.

ఆంధ్రచంద్రికా గ్రంథమాల. 3.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

(మొదటి భాగము)

రచయిత:

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ.

ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు.

ఉపోద్ఘాత రచయిత:

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, బి. ఏ. బి. ఎల్.

ఆంధ్ర చంద్రికా గ్రంథమాల,

హనుమాన్ టేకిడి - హైదరాబాదు (దక్షిణ).

1949

రా జ పో ష కు లు :

౧ శ్రీ రాజా రామదేవరావు బహద్దరుగారు

౨ శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారు

3 శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారు



వెల చందాదారులకు ౨-౮-౦

ఇతరులకు 3-౦-౦

ప్రతులు ౨౦౦౦.

శ్రీవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

# సంపాదకీయ భూమిక

ఆంధ్రభాషలో "ఆంధ్రసాహిత్య చరిత్రములు" రెండు మూడు గలవు. అవి యన్నియు పండితజనైకవేద్యము లయి యున్నవి. వానియందు సాహిత్యశాఖలన్నియు స్పృశింపబడ లేదు. ముఖ్యముగా నిచ్చటి తెలంగాణమునకు సంబంధించిన సారస్వత విచారమున కా గ్రంథములందు తగినంత ప్రస్తావన కనబడదు. కావున ఏతత్కారణాదికములను బురస్కరించుకొని, జటిలతర్కసంవాదములు లేకుండ, కథారూపమున, పండితపామరజన రంజకముగ, నాతివిపులముగ ఆంధ్రసాహిత్య చరిత్రమును ప్రకటింపవలెనని ఎన్నాళ్ళనుండియో తలంచుచుంటిమి. ఏతదాదర్శానుసార మిప్పుడీ "ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము" ను మా ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో మూడవ కుసుమముగా ప్రకటింప గలిగినందులకు మిగుల సంతసించుచున్నాము.

ఈ "ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహ" రచయిత ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ. గారు. శ్రీ లక్ష్మీరంజనంగారు విద్వత్కుటుంబములో జనించినవారు; ఉస్మానియా విశ్వవిద్యాలయమునం దాంధ్రశాఖాధ్యక్షులు; బి. ఏ. ఎం. ఏ. పరీక్షలకుచదువు విద్యార్థులకు ఏతద్విషయ బోధనమునందు నిమగ్నులై యున్న ఆచార్యులు; సంస్కృతాంధ్రాంగ్ల భాషలయందు కోవిదులు; పౌరస్త్య, పాశ్చాత్య రచనా

విధానములను పుణికి పుచ్చుకొన్న ధీమంతులు; కవితాధురీణులు. ఇది నిరుపమాన సన్నివేశముగదా! విషయము సారస్వతక్షేత్రము. రచయిత సారస్వతవ్యవసాయి. ఆ వ్యవసాయి నేరుపు మెయిం ఫలింపజేసినదే యీ గ్రంథరాజము. ముచ్చటయిన ఆంధ్రసారస్వత కథనము, ముద్దులొలుకు కూర్పు తీర్పులు. మనోహరమైనభాష, మహిమాన్వితమయిన చర్చ. ఇట్టి విశిష్టగుణ సంపన్నమైన గ్రంథమును రచించినందులకు శ్రీ లక్ష్మీరంజనంగారిని మిగుల అభినందించుచున్నాము.

పూర్వచరిత్ర గ్రంథములకును ఈ చరిత్ర గ్రంథమునకును గల భేదమును సులభముగనే గ్రహించి, ఏతద్గ్రంథ ప్రత్యేకత్వమును, ఏతద్గ్రంథకర్త ప్రతిభను ఆంధ్రలోకము గ్రహించునని మేము విశ్వసించుచున్నాము. ఈ గ్రంథముయొక్క ప్రత్యేక లక్షణములుగ నిందభివర్ణితమైన కళాక్షేత్రముల ప్రశంస, వచన వాఙ్మయ విన్యాసము, తెలంగాణకవుల యుదంతము, ఆంధ్ర కవయిత్రుల ముచ్చట, చారిత్రిక కావ్యముల ధోరణి, యక్షగానముల సంవిధానము, శతకవాఙ్మయపు రీతులు, గేయ వాఙ్మయ సౌందర్యము— ఇత్యాది ప్రకరణములు ఆంధ్రవాఙ్మయముయొక్క వైశాల్యమును, శాఖలను, అభిరుచులను, గాంభీర్యమును, శోభను ప్రకాశమానముగావించుటకు ఎంతయు తోడ్పడుచున్నవి. ఆంధ్రజనులు ఇందలి సాహిత్య చరితామృతమును గ్రోలి తనివిచెందుదురుగాక! ఆంధ్ర భారతీదేవికి మేము భక్తిపూర్వకముగ సమర్పించు పూజాపుష్పముగా, అలంకారముగా నీ యుద్గ్రంథము తనరుగాక!

## గ్రంథకర్త



ఆచార్య, ఖండవల్లి-లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.

మేము కోరినదే తడవుగ నంగీకరించి యీ గ్రంథము నకు ఘనమయిన ఉపోద్ఘాతము వ్రాసియిచ్చిన శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బుధవరేణ్యులుంగారికి మా యభివందనములు సమర్పించుకొనుచున్నాము.

ఆంధ్ర భాషాభిమానులును, రసగ్రహణ పారీణులును, ఔదార్య గుణశోభితులును అగు శ్రీ గడ్డంపల్లి రామకృష్ణా రెడ్డిగారి కీ "ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము" ను అంకితము చేయుటకు మిగుల సంతసించుచున్నాము. శ్రీవారు మా కోరికను మన్నించినందులకు మేమెంతయు కృతజ్ఞులము.

1—11—1949. సంపాదకుడు.

అంకితము



శ్రీ కొడ్రెడ్డి-రామకృష్ణారెడ్డి (గడ్డంపల్లి)

గారికి.

# గ్రంథకర్త విన్నపము

మోహినీదేవి పంచు నమృతమును త్రాగుటకై పంక్తులు తీర్చి, దోసిళ్లుపట్టి కూర్చుండిన దేవతావర్గము నా మనస్సులో నున్నది. 'విశ్వశ్రేయః కావ్యమ్' అను సాహిత్య తిరుమంత్రము ప్రవచనముచేయుచు, "మేము కావ్యామృతమును పంచిపెట్టుచున్నాము. వలసినవా రందరును వచ్చి సేవింపుడు" అని పల్కుచు దానహస్తముచాచి, నన్నయభట్టు ముఖముగ సుఖాసీనమై యున్న ఆంధ్రకవిపంక్తి నాకన్నుల దోచుచున్నది. ఈ యభినవ నిర్జరపంక్తి యశోగానముచేయు వందినై తరింప దలచితిని. ఈలోపల నా మిత్రులును హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు మొదటి వ్యవస్థాపకులును అగు శ్రీ బిదురు వేంకటశేషయ్యగారు ఆంధ్రసాహిత్య చరిత్రను వ్రాయుటకు నన్ను ప్రేరేపించిరి.

రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్రకవుల కాలనిర్ణయమును చేయుటలో విశ్వసనీయమైన కృషిచేసిరి. ఆంధ్రకవులమీద పంతులుగారు చారిత్రిక శోధక దీపమును (Search Light) ప్రసరింపజేసినంతగా సాహిత్యశోధక దీపమును కేంద్రీకరింప జేయలేదని విషయజ్ఞులు అనుకొనుచున్నారు. ఈ లోపమును కొంతవరకైనను పూరించగల్గుట భాషాసేవ యగునని తలపోసి ఆంధ్రసాహిత్య చరిత్ర వ్రాయుచుండగా అదియొక పెద్దగ్రంథము కాజొచ్చెను.

ఇట్లుండ, స్వాతంత్ర్యశోభా దరిద్రాణమును, సంస్కృతి విదారిణమును అయిన తెలంగాణమును మేల్కొల్పిన మేధావి,

ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు నన్ను పిలువనంపిరి. భాషాప్రియుడైన సామాన్యపాఠకున కందు బాటులో నుండగల సులభసంగ్రహరీతిలో, ఎక్కువ చారిత్రక విమర్శనములేకుండ, 'ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము' ను వ్రాయుట ప్రస్తుత దేశావసరమని సూచించి, అట్టిది వ్రాయుటకై నన్నాదేశించిరి. ఆంధ్రపితామహుల వాక్యము తెలంగాణపు వాణిగా గ్రహించి ఈ పుస్తకమును సమర్పించుకొనుచున్నాను.

ఈ గ్రంథమును కొంతవరకు కవుల చరిత్రగను, కొంత వరకు సాహిత్యశాఖల చరిత్రగను నిర్వహించితిని. పూర్వకవులలో పెక్కుమందినిగూర్చియు, మధ్యయుగ కవులలో కొందరినిగురించి మాత్రమును వ్రాయనైనది. కవులకాలము విషయమై నాకు స్ఫురించిన నూతనాంశములను కొలదిగ అచ్చటచ్చట సూచించితిని. ఈ నా ప్రయత్నము అఖిలాంధ్ర మహాజనుల యాదరమునకును, విద్వాంసుల సదయ విమర్శనమునకును పాత్రమగునని ఆశించుచున్నాను. దీనిని చదివిచూచి విలువయైన సూచనలుచేసి ముద్రణకార్యమును నిర్వహించిన వారును, ఆంధ్రచంద్రికా గ్రంథమాల సంపాదకులును అగు మ॥ రా॥ శ్రీ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు నా కృతజ్ఞతా వందనములను చేకొందురుగాక.

౨౦ అక్టోబరు ౧౯౪౯
హైదరాబాదు.

ఖండవల్లి లక్ష్మీరంజనం.

# ఉపోద్ఘాతము

"పంపా విరూపాక్ష బహుజటా జూటికా
రగ్వధప్రసభ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
గంభీర ఘుమఘుమా రంభములకు
... ... ... ...
నిర్నిబంధ నిబంధమై నెగడుకవిత

అదీ మన తెనుగుకవిత. గీర్వాణవాణికే అందచందాలు కూర్చిన మధురసృష్టి మన పూర్వుల "ఆంధ్రసృష్టి" * మన జాను తెను గెట్టిది? కాకతీయుల కాలపు మహాకవియగు పాల్కురికి సోమనాథు డిట్లు తెలిపినాడు.

బలుపొడతోలుసీరయును, బాపసరుల్, గిలుపారుకన్ను, వె
న్నెలతల, సేదుకుత్తుకయు, నిండినవేలుపుటేరు, వల్గుపూ
సలుగల ఱేనిలెంక వని జాను తెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా.

ఇట్టి యాంధ్రసారస్వత చరిత్రమును పలువురు పండితులు వ్రాసినారు. ఇప్పుడు ఈ సంగ్రహ చరిత్రమును శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ. గారు చక్కని సుందర సులభశైలిలో

* ఆంధ్రుల కల్చర్ అను యర్థములో గోగులపాటి కూర్మనాథకవి తన నారసింహ శతకములో వాడినాడు.

ముఖ్యాంశములను వదలక విజ్ఞానప్రదమగు రీతిగా రచించినారు. ఖండవల్లిమిత్రులెట్లు జీవితమందు నిరాడంబరులో అటులే వారిశైలియు "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్". వారిది కపటమెరుగని హృదయము. రచనయు ఎందును ఎత్తిపొడుపులు పక్షపాతములు లేక సాగినది.

ఇట్టి గ్రంథానికి పీఠిక యవసరమా? వారు రచించినది "సంగ్రహ" చరిత్ర. అందుచేత ఇవెందుకులే యని కొన్ని వదలినట్లున్నది. అట్టివాటిని పూరించుట కిది పనికివచ్చునేమో. నన్నయకన్న పూర్వము తెనుగెట్టిదై యుండెనను విషయమున మన సోదర పరిశోధకులు ఈ ౪౦ ఏండ్లనుండి తమ యుపజ్ఞా ప్రజ్ఞలచే గొన్నింటిని వెల్లడించినారు. నన్నయకు ఇంచుమించు 300 ఏండ్లపూర్వము తెనుగురచనలు, పాటలు, కవితలు, ఉండియుండును. అవి నన్నయకంటె ఏడునూరేండ్లకు ముందుకూడ ఉండియుండునంటే చిత్రపడరాదు. దినేశచంద్ర సర్కారుగారు (Successors of the Satavahanas అనుదానిలో) ఇట్లు వ్రాసినారు:—

"ఇక్ష్వాకు రాజులయొక్క కొన్ని ప్రాకృతశాసనాలు జగ్గయ్యపేటలో లభించినవి. నాగార్జునకొండలోని రికార్డుల భాషను గూర్చి 'అనేకవిధమగు ప్రాకృతమనియు బహుశా కన్నడమై యుండుననియు' స్టెన్‌కొనోఫ్ గారనిరి. నాగార్జునకొండలో కొన్ని ప్రాకృతశాసనాలు దొరికినవి."

అయితే జగ్గయ్యపేట, నాగార్జునకొండ అను నీ రెండు స్థలాలు తెనుగు నడిగడ్డలోని వగుటచేత ఆ ప్రాకృతరూపము తెనుగునకే సంబంధించియుండును, కన్నడ మనియన్నను బాధ లేదు. ఇక్ష్వాకురాజుల కాలములో కన్నడము తెనుగు ఒకటి గానే యుండియుండును. ఇక్ష్వాకులు ములకసీమనుకూడ పాలించిరి. నేటికిని పాలమూరుజిల్లాను మొలకసీమ అందురు. శాలంకాయనులు క్రీ. శ. ౫ వ శతాబ్దమందు తెనుగుసీమలో రాజ్యముచేసిరి. వారి శాసనాలలో మనకర్థమగు మనశబ్దాలే కొన్ని కలవు. ఊరు, చెరువు, మునుడు అనున వందు కలవు. క్రీ. శ. ౬ వ శతాబ్దమందు తెనుగుగడ్డపై రాజ్యముచేసిన విష్ణుకుండినరాజుల దానశాసనములో "వర్షంబుల్" అను తెనుగురూపము కలదు. ఈ వంశములోని జయాశ్రయుడు నన్నయకు ౫౦౦ ఏండ్లు ముందటివాడు. అతడు శీర్ష (సీసపద్య)లక్షణమును వ్రాసెను. నన్నయకుపూర్వము తరువోజ, సీసము, అక్కరలు, విశేషముగానుండిన ట్లూహ్యాము. అవికాక ద్విపద బహువిధములుగా గానముచేయబడెను. ప్రాచీనమందు తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల, అను పదాలుండె నని పాల్కురికి తెలిపినాడు. తెనుగుకవితను మార్గకవితతో (గీర్వాణవిధానముతో) లంకె పెట్టి దేశిద్విపద కాదరణములేకుండా నన్నయ చేసియుండును. అందుచేత పాల్కురికి అదేపనిగా ద్విపద ప్రాశస్త్యమును చాల చాల తర్కించి స్థాపించి రచించెను. నన్నయకంటే (క్రీ. శ. ౧౦౫౦ కంటే) ముందుండిన కొన్ని పద్యాలు, వచనాలు, శాస

నాలలో మనకు లభించినవి. గుంటూరుమండలములోని అద్దం కిలో క్రీ. శ. ౮౪౫ ప్రాంతపు శాసనముకలదు. అందొకపద్య మిట్లున్నది.

తరువోజ :

పట్టంబుగట్టిన ప్రథమంబునేండు
బలగర్వంబొప్ప బైలేచిసేన
పట్టంబు గట్టించి ప్రభు పండరంగు
బంచిన సమత్త పడువతో బోయ
కొట్టంబుల్ పంద్రెండు గొణి వేంగినాంటిం
గొళల్చి యాత్రిభువనాంకుశ బణ నిల్చి
కట్టెపుదుర్గంబు గడు బయల్సేసి
కందుకూర్బెజవాడ గావించె మెచ్చి.

నన్నయకన్న ముందటిదగు మరొకశాసనము యుద్ధమల్లుని బెజవాడశాసనము. అది క్రీ. శ. ౯౩౦ ప్రాంతముది. దానిలో ౫ మధ్యాక్కరలు కలవు. అందు మొదటిది :

"జనసుత చేబ్రోలునుండి బెజవాడ జాత్రకువచ్చి
త్రినయన సుతుండొందు సోటుమెచ్చక తివిరి యిన్నెల వ
యినఘుండు సేకొని యిందు ప్రత్యక్షజయన్నని చ్చ
గని మల్లండెత్తించెగుడియు మఠంబునుం గార్తికేయునకు"

నన్నయకన్న పూర్వులైన పలువురు తెనుగువారు కన్నడములో రచనలు కావించినట్లు విందుము. నన్నయకు

పూర్వము సంస్కృత వాక్యాలతోకూడిన తెనుగురచనలు "మణిప్రవాళము" లుండినట్లు

"ఆనయము చేతులందు భవదంఘ్రి సరోజయుగంనమామి
అనుచు మణిప్రవాళమున నంకనసేయుదు........."

అని పాల్కురికి వృషాధిపశతకములో తెలిపెను.

తెనుగు పైశాచీ భాషనుండి యేర్పడిన దని కొందరందురు. పిశాచజాతి టిబెట్ ప్రాంతపు ప్రాచీనజాతి. గాథాసప్తశతిలోని ప్రాకృతములోని కొన్నిపదా లితర ప్రాకృతజన్య భాషలలోకంటె హెచ్చుగా తెనుగులో నిలిచిపోయినవి. అత్తా (శతకం ౧-శ్లో. ౮) వల (వలగొను ౧—౨౫) పల్లీ (పల్లె ౧-౩౧) ఇయర (వేరు. ఇతర ౧-౬౧) పాడి (పాడియెనుము ౧-౬౫) కంఠియ (కంటియ-కంటె ౧-౭౫) మున్నగు పదాలు కానవచ్చును. సమర్తయగు కన్యముఖమునకు పసుపుపూయుట, నృత్యముసేయువారు అర్ధళము ముఖానికి పూసుకొనుటవంటి అనేకాచారాలున్నూ తెనుగు దేశములోనే ఎక్కువగా కలవు. ఇట్టివి శతాధికముగా గాథాసప్తశతిలో లభ్యమగును.

పురాణకవులలో నన్నయ ప్రసాదగుణముతో "ప్రసన్నకథాకలితార్థముగా" రచించెను. తిక్కనకవిత్వ "శిల్పమునఁ పారగుఁడై" రచించెను. నాచన "రస" సిద్ధుడు. సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి. వారి యనంతరం కేతనవచ్చెను. పురాణాలను ముట్టుకొనక దశకుమార చరిత్రను తెనిగించెను. దశకుమార చరిత్రకు దూరపుజాడ కథాసరిత్సాగరములోని

మృగాంకదత్తునికథలో కలదు. కేతనతర్వాత కేయూరబాహు చరిత్రయను అతి మనోహర కవితనువ్రాసిన మంచెన వెలసెను. సాహిత్యచక్రవర్తి వెనువెనకనే కవిసార్వభౌముడువచ్చి ఆసేతు వింధ్యాచలమువరకు ధక్కా ధమధమాయితముతో సారస్వత రంగముపై రాజ్యముచేసెను. అదేకాలములో బాలరసాల సాలనవపల్లవకోమల కావ్యకన్యకకు జనకుడైన పోతనమహాకవి యుద్భవించెను. అతడు చిన్నతనములో వీరభద్ర విజయము రచించె ననియు, కొన్ని వ్రాతప్రతులలో భాగవతమందు శివాపచారముచేసి ప్రాయశ్చిత్తముగా వీరభద్ర విజయము వ్రాసితినన్న పద్యము లేదనియు శ్రీ శేషాద్రిరమణకవు లన్నారు. శ్రీనాథయుగములో గౌరనకుమారుడు భైరవకవి శ్రీరంగ మహాత్మ్యమను నుత్తమ ప్రబంధమును రచించెను. అంతకుపూర్వమే ఫణిభట్టు పరతత్త్వ రసాయనమను గ్రంథమును ఉత్తమ శైలిలో రచించెను. అళియరామరాయల కాలములోను తిరుమలదేవరాయల కాలములోను నుండిన కొందరికవులలో ముఖ్యుడు రామరాజభూషణుడు. అతడు కైవారాలకుదిగిన భట్టుకాడు. చక్రవర్తి సరిగద్దెపై కొలువుదీరిన వీరుడు (వీరాః పండితకవయః) అందుచేత నతనిని అపకీర్తిపాలుసేయ అప్పకవ్యాదులు కంకణము కట్టిరి. నానాసూన వితానవాసనల నానందించుముక్కును వర్ణించలేక బుర్రముక్కు నందితిమ్మన్న ముక్కును దొంగిలించి ముక్కుతిమ్మన్ననుగా జేసెనని యొక కాకమ్మకథను కల్పించిరి. ఆ ముక్కునుదన్నే వర్ణనలు ఒకటి కాదు పదికావు శతాధికము లుండగా ముక్కుకథకే యిన్ని

కాళ్లువచ్చుట గర్హింపదగినది. ఆకాలపు మరొక మహాకవి పాలవేకరి కదిరీపతి. అత డనంతపుర మండలమువాడు. ఆర్వీటి రాజుల వంశీయుడు. అతనికి లోకానుభవము అపారము. జాను తెను గతనిరూపిత యే! లలితహాస్యమున కత డొక్కడే నిదర్శనము. సుందర సుకుమారమై గులాబీకాంతులతో వన్నెలతో పన్నీటిజల్లుతో సువాసనలతో నొప్పునట్టి దీతని కాంతాసమ్మిత యగు కవితాసుందరి. గులాబికుండు చిరుముండ్లే యతని రంకు కథలు. అందుచేత అట్టికవితలను తిట్టిపోయరాదు. షేక్స్పియరు కన్న మించి పచ్చిపచ్చి పద్యాలువ్రాసినకవి ఇంగ్లీషులో లేడు. కాని ఇంగ్లీషువారు తమ షేక్స్పియరును కవిలోక మూర్ధన్యునిగా ప్రేమించి గౌరవించుటలేదా? కందుకూరి వీరేశలింగము గారు మొదట పచ్చి శృంగారాన్ని నిందింప మొదలుపెట్టిరి. ఆనాటినుండి గతానుగతికముగా ఆంధ్రలోకము శృంగారాధిక్యతకల కవితలను మడివారు మైలవారిని 'గచ్ఛదూరం' అన్నట్లుగా నిందిస్తున్నది. ఆ ధోరణిలో కొంతైనా మార్పు రావలెను. ఇంచుమించిదేకాలమందే వెన్నెలకంటి అన్నయ కవి షోడశకుమార చరిత్రమును రచించెను. ఇది ఆంధ్రభారతి ధరించిన సొమ్ములలో ఒక సుందరాభరణము. మంచెన, కేతన, అన్నయ, అనంతుడు, కదిరీపతి, ఈ యైదుగురును రమణీయ లలితశైలిలో హృద్యనూత్న వర్ణనలతో, మనోహర సంవిధానముతో, ఆకర్షణీయములగు కథలు చెప్పుటలో సరితూకముకలవారు. అన్నయకథలకు మూలము కథాసరిత్సాగరము. ౧౨ వ లంబకంలోని మృగాంకదత్తుని కథయును బేతా

ఘునికథలును షోడశకుమారచరిత్రకు మూలములు. శుకసప్తతిలోని కథలు కొన్ని కథాసరిత్సాగర మూలకములు. లోహజంఘునికథ (౧౦-౨ త-౪) నుండియే శుకసప్తతి ౧౭వ ధూర్తకీరకథ యేర్పడినది.

"అంతలోననె శాలివాహనుదివాణ
మునకు నేగుటకై బంధు జనులుగొలువ"

అని యీ కథలోనే మూలము సూచితమైనది. క. స. సా. లోని పరివ్రాజక మాయలకథ (౧౦-౨ త-౫) నుండియే శు. స. లోని ౬ వ కథ యేర్పడినది. క. స. సా. లోని శక్తిమతికథ (౧౦-౨ త-౫) నుండియే శు. స. లోని ౧౪ వ కథ యేర్పడినది. ఇట్టివింకెన్నో? ప్రపంచకథలకు దారిచూపిన కథాసరిత్సాగర సృష్టికర్తకు గుణాఢ్యపండితునికి నమోవాకములు.

అప్పకవిదెబ్బను తప్పించుకొన్న అన్నయ, కదిరీపతి, గోపరాజు, గౌరన, అనంతాదులు ధన్యులు. ప్రౌఢకవి మల్లన రుక్మాంగద, చిత్రకవి సింగరార్యుని బిల్హణీయ మీకాల మందలివే. పైడిపెద్ది కృష్ణకవి యనువాడు పైకమిచ్చి తనపేరు వ్రాయించుకొన్నను, కొంచెచిత్రకవి ఆశ్వాసాంతమందు గర్భకవిత్వములో తనపేరు నిరికించుకొన్నది మొదట కనిపెట్టిన వారు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి కళాప్రపూర్ణులు. ఈ కాలములోని తాళ్ళపాకవారి పరమయోగివిలాస ముత్తమగ్రంథజాల మందలిది.

విజయనగరపీఠము చంద్రగిరికి పోయెను. తెనుగుసరస్వతి తంజావూరికి, మధురకు వలసపోయి తుదిమా రచ్చట ఒక శతాబ్దముపాటు నిలిచియుండెను. ఆకాలములోనే చేమకూర వేంకటపతి తెనుగుతల్లి కాళ్ళకు నూపురములను దొడిగెను. "చేమకూర పసేకాని నస వదలలేదు" అనిపించెను. అతడు బోగమువాడు, అయితేయేమి?

"పన్నినసత్ప్రబంధమున బాగును నోగును జూడ కీసుచే
మన్ననమాలి మాకులముమాట దలంతురు, చేమకూర వెం
కన్నకు లోపమేమి, కులమా కవనానకు, వేంకటాద్రి రా
జన్న! గణించి మీరలు దయామతిబ్రోచిన, నాకుజాలదే."

అని వాసిరెడ్డి వేంకటాద్రి నాయునితో బుచ్చివెంకు అను బోగముకవి మనవిచేసెను. (చూ. పెదగాడ గంగయ్యశాకవుల సంగ్రహచరిత్ర.)

౧౬౦౦-౧౭౦౦ మధ్యకాలవు "అనంతర ప్రబంధయుగము" లో చేరదగినవారిలో ముఖ్యులు కిరీటి వేంకటాచార్యులు, బిజ్జుల తిమ్మారెడ్డి, అయ్యలరాజు నారాయణకవి, కాణాదము పెద్దన అను కవులు నానాఫడ్నవీసు ఆస్థానానికి సురపుర సంస్థాన బోయరాజుల గురువులగు కిరీటి వేంకటాచార్యులు వెళ్ళగా "కాయ్ మ్హణతాహే కాయ్ కర్తాహే" అని మరాటీలో ప్రశ్నింపగా తనకు తెలియని "మ్హణతాహే, కర్తాహే"లకు మారుగా వారికి తెలియరాని గీర్వాణములో అప్పటి కప్పుడే ఇట్లు పలికెను:-

"కణభయితా హేతర్కే
ఫణభయితాహే సుశబ్ద గణనోదర్కే
మందర వృత్తంవర్తే
శుభ్రత్యంత సుధాంబుధామహాగర్తే"

ఇతడు తెనుగులో "అచలాత్మజా పరిణయము" అను ద్వ్యర్థి కావ్యాన్ని సుందర శైలిలో రచించెను. (మంజువాణీ ప్రెస్) బిజ్జుల తిమ్మారెడ్డి (అలంపూరు తాలూకావాడు ౨౦౦ ఏండ్ల క్రిందటివాడు) రంగసముద్ర కృష్ణకవియు కలిసి అనర్ఘరాఘవమును ప్రౌఢముగా తెనిగించిరి. అయ్యలరాజు నారాయణకవి (కర్నూలుజిల్లావాడు) హంసవింశతిని రచించెను. ఇది శుకసప్తతి అనుకరణమైనను సాంఘికచరిత్రకు పనికివచ్చునట్టిది. కాణాదం పెద్దన (గద్వాల ౧౫౦ ఏండ్లకుపూర్వుడు) ముకుందవిలాసము, ఆధ్యాత్మరామాయణము రచించి రెండవ (అల్లసాని) పెద్దన యని తనకాలములో ప్రఖ్యాతుండయ్యెను. కంకంటి పాపరాజుది నెల్లూరుప్రాంత మంటున్నారు. కనకల్లుగ్రామము నాగరకర్నూలు (పాలమూరుజిల్లా) ప్రాంతాలలో కలదు. అతని వంశమువారమని చెప్పుకొనువారందు కలరు. వారినుండి వివరాలు తెలుసుకొని సేకరించియుంచిన కాగిదాలు మాయమైనందున ఇది వరలో నీవిషయమై చర్చించియుండలేదు. ముద్దుపళని "అష్టపదులు" చాలా సుందరమైనవి. శృంగారగ్రంథమండలివారు కొన్ని ప్రకటించిరి. కూచిమంచి జగ్గకవి పచ్చిబూతుల చంద్రరేఖావిలాపమును వ్రాసి అది ఉత్తమహాస్యమనెను అది జుగుప్సాకరము.

యక్షగానాలకు యక్షుల (జక్కుల) నుండి పేరువచ్చి నందురు. యక్షులు అక్షస్ (Oxus) ప్రాంతమువారో లేక యఛీ (Yuchi) అను మంగోలు జాతివారో లేక యుక్సైన్ (Euxine sea or Black sea) సముద్ర ప్రాంతపువారో యైయుందురు. ఏమైనా ఆసంబంధము చాలదూరమే! యక్షులు, గంధర్వులు గానవిద్యాప్రవీణు లని ప్రతీతి యగుటచే పూర్వము మనవారు నృత్యయుక్తగానానికి యక్షగానమని పేరుపెట్టియుందురు. సింగి, సింగడు అనునవి చెంచులకు పేళ్లుగా కదిరీపతి వాడినాడు. వారు ఎరుకలజాతివారై యుందురు. వారిలోనే యీ యక్షగానాలు ప్రారంభమై యుండును. అప్పకవ్యాదులుకూడ యక్షగానాలు వ్రాసిరి. పట్టంపాపకవి నాగరకర్నూలు పట్టంనివాసి. 30 ఏండ్ల క్రిందట చనిపోయెను. యక్షగానాల విధానము, వేషాలు, రంగులు, నృత్యములు, దరువులు, రంగము, మున్నగు వివరాలను పటాలతోసహా ప్రత్యేకగ్రంథముగా వ్రాయవలసియుండును. అవిప్పుడు మాయమై పోతున్నవి. ఈ పని ఆంధ్రసారస్వతపరిషత్తుచేయవలెను.

శతకవాఙ్మయమును జనులు నిరాదరించినారు. నిజముగా అందు జీవము, హాస్యము, నీతి, భక్తి, చాలాయిమిడినది. భద్రగిరి శతకమందు సూచితుడగు ధంసా యను వాని గోరి నిర్మలలో కలదు. వానికోట, వానికథ అచ్చటనేకలదు. గువ్వలచెన్న శతకము మంచిశతకమే.

గేయవాఙ్మయము ప్రబంధకవులమూలాన నలిగిపోయి

నది. "ముదివిటులు, విధవలంజెలు, పదకవితలు" అని తిట్టినది ప్రాబంధికకవులే. ఇంచుమించు ౧౦౦ ఏండ్లక్రిందట ఒక ఆంగ్లేయుడు కొన్ని తెలుగుపాటలను ఇంగ్లీషులోనికి అనువదించి ప్రకటించెను. హిందీ మరాటీ మున్నగుభాషలలో జానపద గీతములను సమకూర్చి బహుసంపుటములుగా ముద్రించిరి. మనచిన్ననాటిదగు మంజువాణి వారిస్త్రీలపాటల ముద్రణతో మనము తృప్తిపడినాము. తందాన కథలన్నియు ఇంచుమించు చారిత్రికములే. తెలంగాణమందే మియాసాబ్, సోమనాద్రి, రామేశ్వరరావు, రాణీశంకరమ్మ (మెదకు) సర్వై వెంకటరెడ్డి (వనపర్తి), కుమారరాముడు (కంపిలి యువరాజు— సవతితల్లి మోహమును నిరాకరించి కాలుసేతులు కోలుపోయిన సారంగధరు డితడే!) కర్నూలునవాబు (తుదివాడు ౧౮౩౮ క్రీ. శ.) మున్నగువారి కథలలో కొన్ని యిప్పుడు అరుదై పోతున్నవి. తందానకథలను సమకూర్చి చక్కనిపీఠికలతో ఆంధ్రసారస్వత పరిషత్తువారు ప్రచురింపవలెనని కోరుతాను. బాలనాగమ్మ ఒడ్డెరాణియనియు, ఆమెశాపమువల్ల తెనుగునాటనుండు ఒడ్డె స్త్రీలు రవికలను తొడుగరనియు ఒడ్డెవారు చెప్పుకొందురు. నాగరకర్నూలు తాలూకాలోని పానగల్లుకోట హిందూముసల్మానుల యుద్ధాలరంగస్థలము కాన అదియే బాలనాగమ్మ కోట యగును. ఈ కథ పరిశోధనీయమగునట్టిది. "చెమ్మచెక్క చేరడేసిబొక్క" "కొంగరాజు కొండఎక్కి కాలువిరిగె" వంటి పిల్లల పాటల కర్థములేదని జనుల భావనయై యుండెను. వీటిలో

ఆయుర్వేదపు చిట్కాలున్నవని మొదట వెల్లడించినవారు శ్రీ వే. తి. రామానుజస్వామిగారు.

ఛందశ్శాస్త్రకారులను, అప్పకవిప్రభృతులను ఈగ్రంథ మందు తడవలేదు. బహుశావ్యాకరణాలు, ఛందశ్శాస్త్రాలు, కవిత్వాలు కావని వదలియుందురు. దండకవాఙ్మయము చాలా కలదు. భోగినీదండక ప్రశంసవచ్చినది. కర్నూలుజిల్లావాడును ౨౦౦ ఏండ్ల క్రిందటివాడునునగు గండ్లూరి నరసింహకవి సాంఘిక చరిత్రకు పనికివచ్చు భాషీయగండకము రచించెను. స్తోత్రరూప మైన హనుమద్దండకాదులును కలవు.

పై వాక్యములన్నియు శ్రీ ఖం. లక్ష్మీరంజనంగారి గ్రంథానికనుబంధమేకాని మరేదియుకాదని మనవి. గ్రంథకర్తగారు శ్రద్ధతో బహువిషయములను సేకరించి సంగ్రహరూపముగా మనభాషాచరిత్రను పాఠకుల కందించినందులకు ప్రశంసకుపాత్రులును కృతజ్ఞతలస్వీకరింప నర్హులునునై యున్నారు. ఆంధ్రచంద్రికాగ్రంథమాలాస్థాపకులును పూజ్యులును నగు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు నిరంతరసంస్తవనీయులు.

౨౫-౧౦-౧౯౪౯
సీఖ్లులేనిఇటికేలపాడు

సురవరము ప్రతాపరెడ్డి.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## ౧. ఆంధ్రజాతి

ఆంధ్రసాహిత్యచరిత్రల కన్నిటికిని పునాది కట్టడమువంటిది రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి* "ఆంధ్రకవులచరిత్ర". పంతులుగారు తమ ఉద్గ్రంథమును వ్రాయుటకుపూర్వము ఆంధ్రమహాకవులను గూర్చి తెలుగువారు పుక్కిటిపురాణములను, "గాసట బీసట" కథలను మాత్రమే చెప్పుకొనుచుండిరి. ఇట్టి స్థితిలో వీరేశలింగము పంతులుగారు ఈ గాథలను జల్లెడపట్టి శాసనాదుల సహాయముతో సత్యమైన ఆంధ్రకవులచరిత్రను నిర్మించుటకు అపారమైన కృషిచేసి తరించిరి. అట్టి వీరేశలింగ మహనీయునికి శ్రద్ధాంజలి సమర్పింతును.

కవులు రచించిన గద్యపద్యకావ్యములను గురించి సముదాయముమీద చెప్పవలసి వచ్చినప్పుడు సారస్వత మనియు, వాఙ్మయ మనియు, సాహిత్యమనియు పేళ్లు వాడుచున్నారు. వీనిలో సాహిత్యశబ్దమే చక్కగా కుదురుచున్నది. సారస్వతము, వాఙ్మయము అను పదములు ఎక్కువ విస్తృతమైన గ్రంథసముదాయమును సూచించును. అనగా శాస్త్రగ్రంథములకు కూడ ఈ పేళ్ళు చెల్లవచ్చును. 'శాస్త్రవాఙ్మయము' అని వ్యవ

---

* శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారి కవిజీవితములు అను గ్రంథము వీరేశలింగము పంతులుగారి గ్రంథముకన్న కొంతముందే వెడలినది.

హారము కలదు. సాహిత్యచరిత్ర అన్నప్పుడు మనము కవులు వ్రాసిన గ్రంథములనే ఉద్దేశించి పలుకుచున్నాము. శాస్త్రమనగా పూర్వము తర్కమీమాంసావ్యాకరణాదులు చెప్పుకొనువారు. ఇటీవలి కాలములో శాస్త్రముల సంఖ్య అనంతముగా పెరిగి పోయినది. పూర్వశాస్త్రములే కాక ఇప్పుడు భౌతికశాస్త్రములు లెక్కకు మీరి యున్నవి. శాస్త్రగ్రంథములకును కవులగ్రంథ ములకును నడుమగల ఒక ముఖ్య భేదమును గమనించవలెను. శాస్త్రగ్రంథములు ఆ యా శాస్త్రములందు ప్రవేశము, అభిమా నము కల కొలదిమందికి మాత్రమే రుచించును. వారు మాత్రమే వాటిని చదివి జ్ఞానమును పొందుదురు. కవులగ్రంథములు అనగా కావ్యములను ప్రజ లందరును చదివి ఆనందింతురు. గణితశాస్త్ర పుస్తకము ఉన్నదనుకొనుడు. ఇది వైద్యశాస్త్రజ్ఞునకు నిరుప యోగము కావచ్చును. కాని ఆంధ్రమహాభారతమును చూడుడు. దీనిని గణితశాస్త్రజ్ఞుడు, వైద్యమహాశయుడు, తార్కికుడు అందరును ఒకేరీతిని చదువుదురు. అందుచేతనే "కావ్యము విశ్వజనీనము", ఎల్లరకును అమృతప్రాయమైనదని చెప్పుచున్నా ము. శాస్త్రములకును కావ్యములకును గల మరియొక భేదలక్ష ణమును గుర్తింపవచ్చును. శాస్త్రము బుద్ధివిషయము. కావ్యము హృదయమును కరగించునది. శాస్త్రము జ్ఞానము నొసంగును. కావ్యము ఆనందమును పిదుకును. కావ్యము చదువుటవలన కలి గిన ఆనందమునకే రసము అని పేరు. 'కావ్యము రసవంతము' అనగా కావ్యము నిర్హేతుకము, అలౌకికము అగు ఆనందమును ప్రసాదించు చున్నదని యర్థము.

మనభాషను గురించి చెప్పు నప్పుడు ఆంధ్ర, తెలుఁగు తెనుఁగు శబ్దములను వాడుచున్నాము. ఈ పదముల పుట్టు పూర్వోత్తరములు తెలిసికొనుటకు ముచ్చటగా నుండును. ఆంధ్ర శబ్దము ఒక తెగ జనులపరముగా ఐతరేయబ్రాహ్మణమునందు వినవచ్చినది. ఈ బ్రాహ్మణము ఋగ్వేదమునకు చెందినది. ఇది క్రీ. పూ. వేయిసంవత్సరముల నాటిదని పండితులు చెప్పుచున్నారు. విశ్వామిత్రమహర్షి పుత్రులలో కొందరు ఆతని యాజ్ఞను జవదాటిరనియు, కావున నా మహర్షి వారిని శపించె ననియు, వారే 'అంధ్ర, పుండ్ర, పుళింద, మూతిబ, శబరు, లనియు ఐతరేయ బ్రాహ్మణము వాకొనుచున్నది. అంధ్రులనే తరువాత ఆంధ్రు లనుటయు కలదు. పై కథనుబట్టి ఆంధ్రులనబడు వారు ఆర్య జాతులకు చెందినవా రనియు, వారు వింధ్యపర్వతముల ప్రాంతమున వ్యాపించి అచ్చట నివసించు పుండ్ర పుళిందాది జాతులవారితో కలిసి రనియు ఊహించ వచ్చును. ఆంధ్రులు ఆర్యజాతికి చెందినవా రగుటచే వారు మాటాడినభాష ఆర్యభాషలకు చెందిన ఒకానొక ప్రాకృతమై యుండవచ్చును. కొందరు దీనిని పైశాచిప్రాకృత మని తలచు చున్నారు. ఆర్యులైన ఆంధ్రులు దక్షిణముగా వ్యాపించుచు వింధ్య సమీపమునందు నివసించు అనార్య ద్రవిడ జాతులవారితో కలిసి పోయిరి. ప్రాచీన కాలమునుండియు వింధ్యకు దక్షిణమున నివసించు చున్న ఈ ద్రవిడజాతివారు ఉత్తరమునుండి వ్యాపించు ప్రజాసమూహములకు దారియివ్వవలసిన వారైరి. అట్లు చేయు

టలో వీరు ఇంకను దక్షిణమునకును, తూర్పునకును వ్యాపించిరి. ఇట్లు దక్షిణమునకు నడచినవారే తెనుఁగువారు. ద్రవిడభాషల లో 'తెణ్' అనగా దక్షిణము తెణ్ అగువారు తెనగువారు, క్రమముగా తెనుగువారును అయిరి. నన్నయభట్టారకుడు "తెనుంగున౯ మహాభారతసంహితా రచన బంధురుడయ్యె" అని తనను గురించి చెప్పుకొనెను. తెలుఁగువా రుండు దేశము కనుక తెలుగు శబ్దము ఈనాడు తెనుఁగు అను పదముకన్న విరివిగా వాడుకలో నున్నది. తెలుగువారుండు దేశము కనుక ఈ దేశ మందలి యొక భాగమునకు తెలంగాణము అనుపేరు ఏర్పడినది. శ్రీ కృష్ణదేవరాయలవారు 'దేశభాషలందు తెలుఁగులెస్స' అని కీర్తించియున్నారు. 'తెలుఁగు' పదము 'త్రిలింగ' శబ్దమునుండి పుట్టినదని పండితులు వ్యుత్పత్తి చెప్పుచున్నారు ద్రాక్షారామము, శ్రీశైలము, కాళేశ్వరము అనుమూడు ప్రసిద్ధ శైవ క్షేత్రములు ఆంధ్రదేశమునందున్నవి. ఈ క్షేత్రము లందలి శివ లింగములచే సంరక్షింపబడు దేశముకాన దీనికి త్రిలింగ సంజ్ఞ కలిగినదని పండితుల యూహ. త్రిలింగ శబ్దమే, త్రికలింగ శబ్దభవ మని మఱికొందరు విద్వాంసులు నిర్వచించు చున్నారు. ఆంధ్రదేశ మునొక్క సముద్రతీరప్రాంతమునకు కళింగ దేశము అను వ్యవహారము పూర్వమునుండియు ఉండెను. కళింగమనుపేరు విశాల భూభాగమునకు చెల్లుచుండెను. గంగానది దక్షిణతీరము నుండి గోదావరి యుత్తర తీరము వరకు గల దేశము కళింగ మని సామాన్యసంజ్ఞ. ఇది మూడు విభాగములుగా నుండెను.

ఉత్తరకళింగము, మధ్య కళింగము, త్రికళింగము వీనిపేర్లు. ఉత్తరకళింగము, ఉత్కళమనబరగు ఓఢ్ర దేశము. మధ్యకళింగము త్రికళింగము ఆంధ్ర దేశమునకు చెందినవి. ఇవి గోదావరికి ఉత్తరమున ఉన్న భాగములు. త్రికళింగ శబ్దములోని 'క', కారము జనుల ఉచ్చారణ వేగముననో లేక విదేశీయుల పలుకుబడిలోనో జారిపోయి 'త్రిలింగ', పదముగా నిలిచిన దనియు, ఇది యే కాలక్రమమున తెలుఁగుగా మారిన దనియు చేసిన యూహా యుక్తియుక్తముగనే తోచును. దీనికి తార్కాణముగ టాలెమీ యను గ్రీకు దేశపు భూగోళశాస్త్రజ్ఞుడు ఈ దేశమును వర్ణించుచు దీనిని ట్రిలింగాన్ అని పేర్కొని యుండుట గమనింపదగినది. టాలెమీ యను నాతడు క్రీ. శ. ౧౫౦ సంవత్సర ప్రాంతమున నుండినవాడు. ఈతడు తన భూగోళశాస్త్రగ్రంథములో భారత దేశమును వర్ణించుచు త్రిలింగదేశమునుగూడ పేర్కొన్నవాడయ్యెను. ఇట్లు తెలుఁగు శబ్దముకూడ మిక్కిలి ప్రాచీనమైనకథను వహించియున్నది. ఆంధ్ర-తెనుఁగు శబ్దముల పుట్టుకనుబట్టి ఇప్పటి మన యాంధ్రజాతి ఆర్య ద్రవిడ సమ్మేళనముచే నేర్పడిన మహాజాతి యని యూహింప నగుచున్నది. అట్లే మన నాగరకతయు, భాషయు రెండుజాతుల సంప్రదాయములను, పదజాలమును కలుపుకొని గంగా యమునా స్రవంతుల వలె కలిసిపోయి భారత దేశ కళ్యాణమునకై ఏకవాహినిగా ప్రవహించి వచ్చుచున్నవి.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## ౧. న న్న య పూ ర్వ యు గ ము

తెలుఁగు సాహిత్యము క్రీ శ॥౧౧వ శతాబ్దమునందు నన్నయ భట్టారకునితో ప్రారంభించినట్లు సామాన్యముగ నంద రును తలతురు. ఈ యంశమునే స్థాపించుచు వసుచరిత్రను వ్రాసిన రామరాజభూషణు డను పూర్వమహాకవి చెప్పిన పద్యము వినసొంపుగానుండును.

"మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు పోషింపన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్"

అనగా వాగనుశాసను డను బిరుదుగల నన్నయ భట్టు ఈ విశాలమైన ఆంధ్రోక్తిమయ ప్రపంచమును బ్రహ్మదేవుని వలె సృజించినా డనియు, తిక్కనసోమయాజి దీని భారమును ఆదిశేషునువలె మోసినా డనియు, శ్రీనాథమహా కవి విష్ణుమూర్తివలె పోషించినా డనియు, నాచనసోముడు, భాస్కరుడు అను కవులు ఈ భాషాప్రపంచమును చంద్రసూర్యు లవలె వెలిగించి రనియు కవి చమత్కారముగ వర్ణించెను. రామ రాజభూషణుని కల్పనము చాలవరకు సత్యమే అనవచ్చును. అయినను నన్నయకు పూర్వము ఆంధ్రభాష లేకపోలేదు. అందు

గద్యపద్యరచన లేకపోలేదు. కావున నన్నయకుపూర్వము ఆంధ్రదేశమునందు జరిగిన సాహిత్యకృషిని, అప్పటి ఆంధ్రభాషాస్వరూపమును కొలదిగా తెలిసికొనుట ఆవశ్యకము.

ఆంధ్రదేశమునందు కవిత్వపోషణము తరుచు రాజులు, మహారాజులవలన పూర్వము జరిగెడిది. మన ఆంధ్రదేశమును మొట్టమొదట పాలించిన గొప్ప రాజవంశము ఆంధ్ర శాతవాహను లనబడు వారిది. వీరినే సాతవాహను లని, శాలివాహను లని, శాతకర్ణు లని వ్యవహరించుచున్నారు. వీరిలో మొదటి సాతవాహనుని కాలములో కొంత సాహిత్యకృషి జరిగెను. ఈతని మంత్రియైన గుణాఢ్యుడను పండితుడు పైశాచీ ప్రాకృత భాషలో‡'బృహత్కథ'యను పేరుగల గొప్ప కథాకావ్యమును రచించెను. సాతవాహనరాజు తన భార్య ప్రేరేపణవలన సంస్కృతభాషాభిమానిగా నుండెను. అందుచే కాబోలు ఈతడు పైశాచి భాషలో వ్రాయబడిన 'బృహత్కథ'ను మొదట ఆదరించలేదు. ఆ గ్రంథము నశించు పరిస్థితి యేర్పడెను. కాని కొంతకాలమునకు రాజు సాతవాహనుడు తన తప్పిదము గ్రహించి బృహత్కథను ఉద్ధరించి లోకమునందు వెలయింప బూనుకొనెను. దీని కాతడు ఉపోద్ఘాతమువంటి 'కథాపీఠమును' కూడ స్వయముగ వ్రాసెనట. పైశాచీభాషలోని బృహత్కథ ఈనాడు అంతరించి

‡ బృహత్కథ హాల శాతవాహనుని కాలములో జనించె నని విన్సెంటుస్మిత్ పండితుడు అభిప్రాయపడెను.

నది. ఇందలి కథలనే సోమదేవు డను కవి సంస్కృతభాషలోని కనువదించెను. దీనిపేరు 'కథాసరిత్సాగరము'. దీని మూలముననే బృహత్కథలోని చిత్రవిచిత్రకథలు ఇప్పటికిని మనకు తెలియవచ్చు చున్నవి. పైశాచిభాషయనగా పిశాచములు, భూతములు మాటలాడు భాష యని యనుకొనుట పొరపాటు. ఇది యొక ప్రాకృతభాష. ప్రాకృతము అనగా ప్రకృతిజనులు సామాన్యులు మాటలాడు భాష. సంస్కృత మనగా సంస్కరింపబడినభాష. ఉన్నతసంఘములవారు పండితులు మాటలాడు భాష అన్న మాట. పైశాచిప్రాకృతమే మన వర్తమానాంధ్రభాషకు మాతృక యని విద్వాంసు లిప్పుడు తలచుచున్నారు.

బృహత్కథ తరువాత ఆంధ్రదేశములో వెలసిన గొప్ప ప్రాకృతకావ్యము 'గాథాసప్తశతి' కావ్యము. దీనిని హాలు డను చక్రవర్తి కూర్చెను. ఇందు ఏడువందలవరకు శృంగారరసము చిప్పిలజేయు పద్యములు కలవు. ఇవి సభ్యశృంగారమునకు ఉదాహరణములుగా నుండదగినవి. గాథాసప్తశతి కావ్యము ఇప్పటికిని ప్రచారములో నున్నది. ఇందలి గాథలన్నియు హాలుడు స్వయముగ వ్రాయలేదు. కొన్నిటిని అతడు రచించెను, మరికొన్ని ఆతని యాస్థానమును దర్శించిన కవిపతంసులు చెప్పినవి. హాలుడు ప్రతిష్ఠానమునందు యువరాజుగా నున్న కాలములో ఈ శృంగారపద్యములు చెప్పి, ఇతరులచే చెప్పించి ఏకకావ్యముగా గూర్చె నని చెప్పుదురు. గాథాసప్తశతి ప్రాకృతభాషలో నున్నను ఆంధ్రసాహిత్య లక్ష్మికి తొలినూపుర మని చెప్పవలెను.

వెలసినది ఆంధ్ర దేశము. చెప్పినవారు ఆంధ్రకవులు. కూర్చినవాడు ఆంధ్రచక్రవర్తి. బృహత్కథయు నిట్టిదే. గాథాసప్తశతి యందు ఆంధ్రజీవితము చక్కగా ప్రతిబింబించినది. గోదావరీనది ఈ గాథలలో పలుతావుల ప్రశంసింపబడినది. తెలుగుదేశములోని పంటపైరులు ఇందు వర్ణితమైనవి. తెలుగువారి సాంఘికాచారములు మేనరికమువంటివి వినవచ్చును. ఇంతకన్నను ముఖ్యమైన సాక్ష్యము, తెనుగుభాషాపదములు గాథాసప్తశతిలో కనబడుట. ఈ పదములు రెండురకములుగా ఉన్నవి. తద్భవములు, దేశ్యములు. ప్రాకృతపదములు తెలుగుభాషలో కలిసిపోవుక్రమమును గాథాసప్తశతిలో మనము చూతుము. ప్రాచీనాంధ్రులు ఆర్యప్రాకృతములు భాషించుచుండిరి. కావున వారు ప్రాకృతకవిత్వమును ఆదరించుట సహజము.

సాతవాహనుల తరువాత కూడ కొన్ని శతాబ్దములవరకు ఆంధ్ర దేశమునందు ప్రాకృతమే రాజభాషగా నుండినట్లు తోచును. ఆంధ్ర దేశము నేలిన రాజులు ఇక్ష్వాకులు, పల్లవులు తమ శాసనములను ప్రాకృతములో వ్రాయించుచుండిరి. సామాన్యప్రజలు మాత్రము ఇప్పటి మన తెలుగువంటి భాషనే మాట్లాడు చుండిరనుటకు స్వల్ప నిదర్శనములు గలవు. ప్రాకృత శాసనముల నడుమ అక్కడక్కడ కొన్ని బిరుదుపదములును, గ్రామముల పేళ్లును, మనుష్యుల నామధేయములును తెలుగుమాటలుగా నున్నవి క్రీ. శ. ౬౨౦ సంవత్సర ప్రాంతమునుండియు తూర్పుచాళుక్య వంశపురాజులు ఆంధ్ర దేశమునకు పరిపాలకులైరి. వీరు మొదట

కన్నడదేశము నేలుచుండిరి. అచ్చట కన్నడ భాషావాఙ్మయమును పోషించిరి. ఆ మర్యాదన వీరు తెలుగు దేశమునందును స్థాపించి తమ శాసనములను ఆంధ్రభాషలో వ్రాయింప మొదలిడిరి. తూర్పుచాళుక్యుల మొదటి మొదటి తెలుగు శాసనములలో ప్రాకృతపదములు మెండుగా నుండెడివి. తెలుగుపదములు తక్కువ. క్రమముగా తెలుగుపదముల ప్రయోగము పెరిగి ప్రాకృతపదములుతగ్గినవి. ఈ శాసనములు మొదట గద్య అనగా వచనములోనుత,రువాత గద్యపద్యములలోను వ్రాయుచుండిరి. పద్యములలో తరువోజ, సీసము, అక్కర, ఇటువంటి దేశీయఛందస్సులు తూర్పుచాళుక్య శాసనములలో వాడ నయినవి. వీనిలో కాలక్రమమున ప్రాకృతము సన్నగిల్లుటయే కాక సంస్కృతము ప్రాధాన్యతను పొందసాగెను. సంస్కృతపదములు, చక్కని సమాసములు, తత్సమక్రియలు ప్రబలసాగెను. ఈ రీతు లన్నియు నన్నయగారి ఆంధ్రమహాభారతరచనకు దారి తీసినవి.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## 3. ఆదికవి నన్నయ-ఆతనిసమకాలికులు.

ఆంధ్రసాహిత్యజనకు డని చెప్పదగిన నన్నయభట్టు తూర్పు చాళుక్యరాజగు రాజరాజనరేంద్రుని యాస్థానము నలంకరించెను. రాజరాజునకు విష్ణువర్ధను డను పేరుకూడ కలదు. ఈతడు క్రీ. శ ౧౦౨౨ మొదలుకొని ౧౦౬౩ వరకును గోదావరీనదిమీది రాజమహేంద్రవరపురము రాజధానిగా వేంగిదేశమును పరిపాలించెను. ఈతని రాజ్యకాలములో దేశము సుభిక్షముగ నుండెను. కావున నీతడు విద్యాప్రియుడై పండితులను కవులను ఆదరించి వారిచే గ్రంథములు వ్రాయింప జొచ్చెను. వారికి అగ్రహారములను దానము చేసెను. ఇట్లు రాజరాజుచే సత్కరింపబడిన వారిలో ఇద్దరు ముఖ్యులు. ఒకడు నారాయణభట్టు అను గొప్ప విద్వాంసుడు. కవి. ఈతడు ఆంధ్రమహాభారత రచనమునందు నన్నయభట్టుకు తోడ్పడెను. రెండవ యాతడు పావులూరిమల్లన యను కవిచరేణ్యుడు. సంస్కృత భాషలో వీరాచార్యులు రచించిన గణితసారగ్రంథము నీతడు తెలుగులో వ్రాసెను. దీనికి పావులూరి గణిత మని పేరు. §

---

§ రాజరాజీకవికి నవఖండవాడ యను నగ్రహారమిచ్చెనట. ఈ యగ్రహారము గణితరచయిత యైన మల్లనకు గాక ఆతనితాత యైన మరొక మల్లనకీయబడెనని బ్రహ్మశ్రీ చాగంటి శేషయ్యగారు ఆంధ్రకవి తరంగిణిలో చెప్పచున్నారు.

రాజరాజు నాస్థానములో నింకను ఎందరో బహుశాస్త్ర పండితు లుండిరి. వా రందరిలోను చుక్కలలో చంద్రునివలె ప్రకాశించిన వాడు నన్నయభట్టు మహాకవి. ఈతడు వేగినాటి శాఖకు చెందిన బ్రాహ్మణుడు. వేదాధ్యయనసంపన్నుడు. బ్రహ్మాండాది మహాపురాణముల సార మెరిగినవాడు. సంస్కృతాంధ్రభాషలలో కవిత్వము చెప్ప నేర్చిన మేటికవి. నన్నయ జపమును అగ్నిహోత్రమును అనుష్ఠించుచు శ్రోత్రియముగ జీవించిన నిష్ఠాగరిష్ఠుడు. లోకానుభవము కలవాడు. ఇట్లే ఈతని బహుముఖప్రజ్ఞలను గుర్తించి రాజరాజనరేంద్రు డీతనిపై ఒక గొప్పభారమును పెట్టెను. సంస్కృతభాషలో వేదవ్యాసమునీంద్రుడు వ్రాసిన మహాభారతమును తెనుగుభాషలో వ్రాయుమని రాజు నన్నయభట్టును కోరెను.

మహాభారతమును తెనుగులో వ్రాయుట సామాన్య కార్యము కాదు. నన్నయకు పూర్వము తెనుగు భాషలో ప్రామాణికకవిత్వము ఆవిర్భవింపలేదు. అక్కడక్కడ కొంత పద్యరచనయు, బహుశః కొంత గేయరచనయు జరిగి యుండవచ్చును. కాని ఆంధ్రమహాభారతమునకు ముందు తెనుగులో ఎట్టి యుద్గ్రంథమును వెడలినట్లు కనబడదు. తనకు పూర్వము ఆంధ్రమహాకవు లున్నట్లు నన్నయ చెప్పలేదు. ఇట్టిస్థితిలో మహాభారతమువంటి గొప్పకావ్యమును వ్రాయుటకు సమర్థమైన విపులభాషాసామగ్రిని నిర్మించుకొను భారము నన్నయభట్టుపై నుండెను. ఈ కార్యము నాతడు అద్వితీయసామర్థ్య

ముతో నిర్వహించెను. కావుననే ఈతనికి "వాగనుశాసనుడు" "శబ్దశాసనుడు" అను కీర్తి కలిగినది. నన్నయభట్టారకుడు ఆంధ్ర మహాభారతమును వ్రాయ బూనుకొనుటలో నొక పవిత్రోద్దేశము గోచరించును. నన్నయకాలమువరకును పురాణములు, కావ్యములు, శాస్త్రములు అన్నియు దేవభాష యని తలపబడు సంస్కృతములో నుండెను. ఆంధ్రభాషలో చెప్పదగిన గ్రంథ మేదియు లేదు. దీనివలన తెలుగువారిని మానసికాంధకారము ఆవరించి యుండెను. వారిలో, జ్ఞాన విజ్ఞాన వ్యాప్తి చేయవలసిన యావశ్యకత యెంతయో ఉండెను. ఉద్గ్రంథములు లేక విజ్ఞానవ్యాప్తి చేయు టెట్లు? ఆ గ్రంథములు ప్రజాసామాన్యమునకు తెలిసినభాషలో నుండకపోయినచో వారియందు జ్ఞానభాస్కరుడు ఉదయింపడు గదా! తనకాలపు తెలుగువారిని అలముకొనియున్న అజ్ఞానమును తొలగించి, వారిని విజ్ఞానవంతులనుగా చేయుటకే నన్నయభట్టారకుడు పంచమవేదమైన భారతమును దేశభాషయైన తెనుఁగులో వ్రాయుటకు దీక్ష వహించెను. నన్నయభట్టారకుడును ఆతనిని ప్రోత్సహించిన రాజరాజనరేంద్రుడును ఆంధ్రజాతి ప్రథమ నిర్మాతలనుట తెల్లము.

నన్నయభట్టారకుని, రాజరాజనరేంద్రుని మహాభారతాంధ్రీకరణమునకై ప్రేరేపించిన కారణము మరియొకటి ఊహింపవచ్చును. శాతవాహనుల కాలమునుండియు ఆంధ్రదేశమున బౌద్ధమతము విస్తారముగా నెలకొని యుండెను. జైనమతము కూడ ప్రజాదరణమును పొందుచుండెను. వైదికమతమునకు

అగ్రవర్ణములవారిలో మాత్రమే కొంత యవలంబనము ఉండెను. క్రీ. శ. ఏడవశతాబ్దినుండియు సనాతన వైదికమతము ఆంధ్రదేశములో తిరిగి విజృంభింప జొచ్చెను. కుమారిలభట్టు అను గొప్ప ఆచార్యుడు ఆంధ్రదేశములో నుద్భవించి బౌద్ధజైనమతములను ఖండించి వైదికమతప్రాశస్త్యమును ఉద్ఘోషించెను. ఈతడు కర్మమార్గమును అనగా యజ్ఞయాగాదుల ఆచరణమును ప్రతిపాదించెను. నాటినుండియు బౌద్ధజైనమతములు ఆంధ్రదేశములో సన్నగిల్లెను. వైదికమతధర్మములను ప్రజాసామాన్యమునకు సులభముగ తెలియునట్లు ప్రకటించుట అత్యంతావశ్యకమనిపించెను. ఈయవసరమును గుర్తించియే రాజరాజు మహాభారతమును తెనిగింపుమని నన్నయను కోరెను. వైదికమతధర్మమును ప్రతిపాదించుటలో వేదశాస్త్రముల తరువాత మహాభారతమే గొప్ప అధికారముగల గ్రంథము. రాజరాజు శివభక్తియు, బ్రాహ్మణరక్తియు గలవాడు. మహాభారతమును వినుటయందు ప్రీతికలవాడు. నన్నయగొప్ప వేదజ్ఞుడు. వేదములను తెనిగింపరాదను భావము కలవాడగుటచేత వేద మంతటి ఉన్నతస్థానముగల మహాభారతమును ప్రజాక్షేమమునుగోరి నన్నయభట్టారకుడు ఆంధ్రీకరింప మొదలిడెను.

నన్నయ మహాభారతసముద్రమునంతను కడముట్ట ఈదదలచి ప్రారంభించినను, ఆయన దానిని కొంతవరకు మాత్రమే నిర్వహించెను. భారతాంధ్రీకరణము పూర్తిచేయకుండగనే ఈయన మరణించి యుండును. భారతములోని ఆదిపర్వమును,

సభాపర్వమును, ఆరణ్యపర్వములో మూడాశ్వాసముల పై గ్రంథమును మాత్రమే ఈ మహాకవి రచించెను. ఆరణ్యపర్వము ౪ వ ఆశ్వాసములోని శరత్కాలవర్ణనవరకు నన్నయకవిత్వము అని తెలిసికొనవలెను. మహాభారతమును ఆంధ్రీకరించుటలో నన్నయ చూపిన త్రోవ చాల ప్రశంసనీయము. సంస్కృతమహాభారతములో తనకు లోపములుగా తోచిన వానిని ఈతడు తన యాంధ్రీకరణములో విడిచి పెట్టెను. సంస్కృతభారతములో చెప్పిన కథయే తిరిగిచెప్పుట సుదీర్ఘమైన మతధర్మోపన్యాసములు, రాజనీతివిస్తరము అపారముగనుండి ప్రధానకథకు ఒక్కొక్కచోట అడ్డు వచ్చుచుండును. ఇటువంటి లోపములను గుర్తించి పరిహరించుచు, నన్నయ తెనుగుభారతమును నడపెను. మహాభారతమును తెనిగించుటలో ఈయన రెండు లక్ష్యములను పెట్టుకొనెను. ఒకటి:-కథను మిక్కిలి ప్రసన్నముగను రసవంతముగను వ్రాయుట. నన్నయభారతభాగములో చక్కని యుపాఖ్యానము లెన్నియో వచ్చినవి. ఉదంతునికథ, రురుప్రమద్వరల వృత్తాంతము, శకుంతలోపాఖ్యానము, నలచరిత్ర మున్నగునవెన్నియో కలవు. ఈ కథలను నన్నపార్యుడు గొప్ప కథాశిల్పముతో నడిపించెను. దీర్ఘవర్ణములును, అతిశయోక్తులును ఈతనికి గిట్టవు. బాలురుకూడ హర్షించగల మృదురీతిలో నీతడు కథలను చెప్పును. ప్రకృతివర్ణనములు నన్నపార్యుడు మితముగా చేయును. రెండవది: రమ్యమైన శైలిని గూర్చుకొని అత్యుత్తమ కవిత్వము వ్రాయుట. ఈ రెండు గంభీరోద్దేశములను కూడ నన్నయభట్టారకుడు అద్వితీయముగ సాధించెనని పూర్వమహాకవులును, నేటి

కాలపు విమర్శకులునుకూడ ఏకగ్రీవముగ అంగీకరించు చున్నారు. నన్నయ చేసిన గొప్పకార్యము ఏదన- వ్యాకరణాది వ్యవస్థలేక అల్లిబిల్లిగా అల్లుకొనిపోయిన ఆంధ్రభాషయను తీగను బూడిద నుండి లేవనెత్తి, సంస్కరించి, ఆంధ్రమహాభారతము అను పందిరిమీఁద ప్రాకించి అనంతర కవులకు నాతఁడు మార్గదర్శకుఁడయ్యెను. కావుననే తరువాతిమహాకవు లందరును నన్నయ భట్టారకునకు మ్రొక్కి గాని గంటము చేతపట్టెడి వారు కారు.

నన్నయభట్టారకునకు వాగనుశాసను డను బిరుదు గలదని చెప్పియున్నాము. ఆంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణ గ్రంథమును వ్రాయుటచే నన్నయ కీ బిరుదు వచ్చె ననిపూర్వ పండితులు తలంచుచుండిరి. ఆంధ్రశబ్దచింతామణి తెలుగుభాషకు సంస్కృత శ్లోకములలో వ్రాయబడిన వ్యాకరణము. ఇది నన్నయ కృతము కాదని వీరేశలింగము పంతులుగారును ఆధునికవిమర్శకులును నిశ్చయించిరి. ఈవ్యాకరణములో చెప్పబడిన సూత్రములకును, భారతములో నన్నయ చేసిన ప్రయోగముల కును సమన్వయము కుదురక పోవుటచే నిట్లూహించిరి. ఆంధ్రశబ్దచింతామణి యునికి కొన్ని శతాబ్దములవరకును పండితలోకమునకు తెలిసినట్లు లేదు. క్రీ. శ. ౧౭వ శతాబ్ది ప్రారంభమునను, ఎలకూచి బాలసరస్వతి మహోపాధ్యాయుడు దీనికి తెనుగు వివరణము వ్రాసెను. బాలసరస్వతి కాలమువరకును ఆంధ్రశబ్దచింతామణికి వ్యాప్తి కలుగలేదు. తెనుగునకు వ్యాకరణము వ్రాసిన పూర్వకవులైన కేతన, అథర్వణుడు, విన్నకోట

పెద్దనవంటివారు ఆంధ్రశబ్దచింతామణి నన్నయ రచించినట్లు చెప్పకపోవుట గూడ ఈ యభిప్రాయమును బలపరచుచున్నది. చింతామణి వ్రాయకపోయినను నన్నయకుగల శబ్దానుశాసన బిరుదము సార్థకమగుచునే యున్నది.

నన్నయభట్టారకుని పద్యశైలిని పూర్వ మహాకవు లందరును ప్రశంసించియే యున్నారు. పద్యరచనయందువలెనే * గద్యరచనయందును నన్నపార్యుడు సంతోషదాయకుడు. ఈతని భారతభాగములందు వచనములు తరుచు వచ్చుచునే యుండును. ఇవి ప్రసన్నశైలి గలవై సులభముగ అర్థమగుచు చక్కని సంభాషణ రీతులలో నుండును. వాక్యములు దీర్ఘముగను జటిలముగను ఉండక చిన్నవై ఉక్తి ప్రత్యుక్తి రూపమున నుండును. చమత్కారముకొరకు ఒక సందర్భమునమాత్రము నన్నపార్యుడు వచనములో శ్లేషను రుచి చూపించెను. ఆదిపర్వములోని సముద్రవర్ణనమును చదువనగును. ఇట్టివి యరుదు. కథను వేగముగను రమణీయముగను నడుపుటకే నన్నయభట్టు వచనము నందు కొని ముదమును చేకూర్చును.

* విమర్శకాగ్రేసరు లగు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు నన్నయ వచనశైలిని సముచితముగ భూషించిరి. చూడుడు. రాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## ౪. నన్నయ-తిక్కనల నడిమి కాలము

ఆంధ్ర ప్రజానీకమునందు వైదికమత సిద్ధాంతములను ఆర్య విజ్ఞానమును వ్యాప్తినొందించుటకై నన్నయభట్టు మహాభారతము తెనుఁగు సేతకు పూనుకొనెనుగదా. నన్నయ రాజరాజుల యనంతరము భారతాంధ్రీకరణోద్యమము ఇంచుమించు రెండు శతాబ్దములవరకును వెనుకబడెను. ఈ దీర్ఘకాలములో ఆంధ్ర దేశము నావరించిన మతవిప్లవమే దీనికి కారణమని చెప్పవలెను. దేశమునందు రాజకీయములుకూడ స్థిరగతితో నడువక తారుమారు అగుచుండెడివి. రాజరాజనరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోడచక్రవర్తి వేంగీసింహాసనమును తనపినతండ్రికి నప్పగించి తాను చోళసింహాసనము నధిష్ఠించుటకై కాంచీపురమునకు వెడలిపోయెను. కులోత్తుంగునికి సామంతులై వెలనాటి చోడులనువారు గుంటూరుమండలములోని చందవోలునుండి తెలుగు దేశమును పాలింప జొచ్చిరి. క్రీ. శ. ౧౨వ శతాబ్దారంభమునుండి యుపశ్చిమాంధ్రమునందు కాకతీయులు విజృంభింపజొచ్చిరి. వీరు సమగ్రాంధ్రదేశాధిపత్యమునకై పరాక్రమించుచుండిరి. ఇట్లు దేశములో స్థిరమైన కేంద్రప్రభుత్వశక్తి లేకుండెను. దీనిని మించి దేశమును అలజడిలో ముంచినవి మతశక్తులు. శైవ వైష్ణవమతములు ఈ సంధికాలమునందు ప్రత్యేకస్వరూపమును

దాల్పు జొచ్చెను. శ్రీ బసవేశ్వరుడు కన్నడదేశమునుండి వీర శైవసిద్ధాంతమును లోకమునకు చాటుచుండెను. శ్రీరామానుజులు దక్షిణదేశమునుండి వైష్ణవమతాధిక్యతను ప్రతిపాదించుచుండెను. వీరశైవమును వైష్ణవమును రెండును భక్తిప్రధానములైన మతములే. ఈ రెండు సిద్ధాంతములును కూడ వర్ణవిభేదమును రూపుమాపుటకై కంకణము కట్టుకొన్నవియే. కాని ఈ యుభయమతానుయాయులును తమ సిద్ధాంతమే సత్యమనియు తక్కిన మతములు పాషండమతము లనియు తలచుచుండుటచే ప్రజలలో అసహనము ప్రబలిపోయి మతయుద్ధములును ధర్మముపేర రక్తపాతమును జరుగుచుండెను. ఇట్టి వాతావరణములో వైదికమార్గప్రచారమునకు సాధనముగా ఉద్దేశింపబడినదియు, అద్వైతతత్త్వమును ప్రతిపాదించునదియు నగు మహాభారతమును తెనిగించుటకు పూనుకొను కవులుగాని, ప్రోత్సహించు రాజన్యులుగాని లేకపోయిరి.

సంధికాలములో ప్రజ్ఞావంతులైన కవులు లేకపోలేదు. కాని వారి అభినివేశములు మాత్రము వేరుగా నుండెను. కవులు వీరశైవమునో వీరవైష్ణవమునో అభిమానించువారుగా నుండిరి. ఈ యుగములో శైవమే మన యాంధ్రకవులను బలవత్తరముగ నాకర్షించెను. ఇది శివకవుల కాలమని చెప్పినను అతిశయోక్తి కానేరదు. ఆంధ్రమునందలి శివకవులలో మొదట పేర్కొనవలసిన వాడు నన్నెచోడకవి.

## న న్నె చో డ క వి.

ఈతడు కుమారసంభవమను కావ్యమును వ్రాసెను. శ్రీ నన్నెచోడుడు నన్నయభట్టారకునికంటె కూడ ప్రాచీనుడని శ్రీమానవల్లి రామకృష్ణకవి వంటివారుతలంచిరి. అయినను ఈకవి క్రీ. శ. ౧౧౫౦ ప్రాంతమున నుండి యుండు నని ఇప్పుడు సామాన్యముగ నందరును అంగీకరించు చున్నారు. నన్నెచోడుడు పశ్చిమచాళుక్యచక్రవర్తులకు లోబడిన యొక సామంతరాజు. ఈతని కుమారసంభవకావ్యము స్వతంత్రకావ్యమనియే చెప్పవలెను. కాళిదాసమహాకవి కుమారసంభవములోని కొన్ని భావములను నన్నెచోడుడు సందర్భానుసారముగా ఉపయోగించుకొనినను, ఈతని గ్రంథము సంస్కృతకుమారసంభవమునకు అనువాదము కాదు. ఈ కావ్యము నీతడు తన గురువైన జంగమమల్లికార్జునయోగి కంకితము చేసి తన యమేయ గురుభక్తిని ప్రకటించుకొనెను. నన్నెచోడకవి కావ్యరచనలో కొన్ని క్రొత్త పోకడలను ఆరంభించెను. కావ్యారంభమునందు పూర్వకవి స్తుతి చేయుట, కుకవులను తెగడుట, షష్ఠ్యంతవిశేషములను ప్రయోగించుట మొదలైనవి నన్నెచోడకవి కల్పితములు. వీటికన్న ముఖ్యమైన మరియొక భావము నీతడు ప్రకటించి నూతన పంథను త్రొక్కెను. నన్నయభట్టారకుడు తన రచనలో తత్సమ పదములను విస్తారముగవాడెను. నన్నెచోడుడు జాను తెనుఁగులో కావ్య ముండదగునని తన యాశయమును చాటెను. జాను తెనుఁ గనగా దేశిపదములు బహుళముగా గల శైలి య

యీతని అభిప్రాయమై యుండును. జాను తెనుఁగు నీతడు ప్రశం సించినను తన కావ్యములలో సంస్కృతపదములను,సమాసములను విరివిగనే ప్రయోగించుచు వచ్చెను.

కుమారసంభవకావ్యములో ఈశ్వరునకు కార్తికేయుడు జన్మించి తారకాసురుని సంహరించినకథ వర్ణితమైనది. దక్షాధ్వరధ్వంసము, గజాననునిజన్మము, మన్మథదాహము, రతీవిలాపము, పార్వతితపస్సు మున్నగు కథలు ఇందు రసవంతముగ కవి వర్ణించెను. నన్నెచోడుడు ప్రకృతి పరిశీలనమునందును, వర్ణనమునందును నిపుణుడు.వర్ణనలు సహజముగనే ఉండును. ఈతడు తన గ్రంథము 'వస్తుకావ్యము' అని చెప్పుకొనెను. వస్తుకవిత్వమనగా వర్ణనాత్మక మైన ఫణితి యని ఈతని భావమై యుండును. ఇట్లు నన్నెచోడకవి మార్గము నన్నయమార్గమునకు భిన్నముగా తోచుచున్నది. నన్నయకథాప్రసన్నతను తత్సమశైలిని లక్ష్యముగ నుంచుకొనెను. నన్నెచోడుడు వర్ణనకావ్యమును జాను తెనుఁగును ప్రధానములుగ ఎంచెను. నన్నయ ఆదర్శము పురాణకవితకును, నన్నెచోడునిరీతి ప్రబంధకవితకును మార్గదర్శకము లయ్యెను.

## మల్లికార్జున పండితారాధ్యుడు

పండ్రెండవ శతాబ్దములో నుండిన మరియొక గొప్ప శివకవి మల్లికార్జున పండితారాధ్యుడు. ఈతడు 'శివతత్త్వ

సారము' అను గ్రంథమును ఇతర లఘుకృతులను రచించెను. ఆంధ్రదేశమునందు శైవమతవ్యాప్తికి తోడ్పడిన ముగ్గురు ప్రసిద్ధ శైవాచార్యులలో మల్లికార్జునపండితు డొకడు. శ్రీపతిపండితుడు, శివలెంక మంచెన పండితుడు, మల్లికార్జున పండితుడు వీరిని పండితత్రయము అందురు. మల్లికార్జున పండితారాధ్యుడు వీరశైవమతప్రవర్తకుడైన శ్రీబసవేశ్వరునకు సమకాలికుడు. ఈతడు క్రీ. శ. ౧౧౨౦ వరకైన జీవించియుండును. పండితుడు గోదావరీ మండలమునందు జనించెను. బసవేశ్వరుని యాధిక్యమును విని ఆతనిని సందర్శించుటకై ఈ పండితుడు కల్యాణపురమునకు బయలుదేరెను. కాని ఈ లోపుననే బసవేశ్వరుడు లింగైక్యము నొందెనట. శివతత్త్వసారము ఈశ్వర స్తుతి చేయుకావ్యము. శివునిలీలలు, శివభక్తుల మహాత్త్వ చర్యలను పండితుడు దీనిలో వర్ణించెను. దీనిలో నూటికి మించిన పద్యములున్నను ఇది యొక శతకమువలె నుండును. తెనుగు శతక కవిత్వమునకు శివతత్త్వసారమును తొలి యుదాహరణముగా చెప్పవచ్చును.

రాజనోత్తములై కవులని కీర్తిగాంచిన వారిలో కాకతీయ మొదటిప్రతాపరుద్రు డొకడు. ఈతనినే రుద్రదేవు డందురు. ఈ మహారాజు క్రీ. శ. ౧౧౮౦ నుండి ౧౧౯౬ వరకు కాకతీయ రాజ్యమును పాలించెను. ఈతడు సంస్కృతములో 'నీతిసారము' అను రాజనీతిని గురించిన గ్రంథమును

వ్రాసి దానిని తానే తెనుగులో కూడ వ్రాసె నని చెప్పుదురు. కాని ఈ గ్రంథ మిపుడు లభించుటలేదు. ఈ క్రిందిపద్యము తెలుగు నీతిసారములోని దట.

ఆపదలఁ జెందు ప్రజలను
భూపతి మొద లిచ్చి మగుడఁ బ్రోవగఁ జనుఁ దా
జేపట్టి విడువవలవదు
భూపతికిఁ గుటుంబమనగ భూమియ కాదే.

♦ గోన బుద్ధారెడ్డి – రంగనాథ రామాయణము ♦

రంగనాథ రామాయణము ప్రాచీన ద్విపద కావ్యములలో బేరెన్నిక గన్నది దీనిని రచించిన కవియెవరు, ఆతని కాలమేది యను నంశములపై విమర్శకులలో అభిప్రాయభేదములు కలవు. గోనబుద్ధారెడ్డి ఈ ద్విపదరామాయణమును తన తండ్రియైన విఠలరాజు పేర రచించినట్లు గ్రంథమునందు చెప్పబడినది. రంగనాథ రామాయణకర్త క్రీ. శ. ౧౨౪౦ ప్రాంతమున నుండి యుండు నని కందుకూరి వీరేశలింగముపంతులుగారు వ్రాసి యుండిరి. రంగనాథ రామాయణకర్త ౧౩వ శతాబ్దాంతము ననే జీవించియుండు నని కొన్ని సాధనములచే నేను ఊహించు చున్నాను. †

† క్రీ. శ. ౧౨౮౩ ప్రాంతమున వెలసిన రాయచూరు శాసనము దీని కాధారము. ఇందొక గోనగన్నారెడ్డియు ఆతని రాజ్యరక్షామణి

రంగనాథు డను బ్రాహ్మణకవి యీ ద్విపద రామాయణమును వ్రాసె నని లోకములో నైతిహ్యము కలదు. కాని గ్రంథములో రంగనాథు డను కవి పేరు లేదు. గోనబుద్ధారెడ్డి రచించెననియే యున్నది. ఎవరు వ్రాసినను ఈ ద్విపద రామాయణమునకు ఆంధ్రసాహిత్యములోను, ప్రజాహృదయములోను గూడ ఉన్నతస్థానము లంభించినది. ఆదికవియైన నన్నయభట్టారకుడు పండితశైలి నవలంబించి భారతమును వృత్తములలోను కొంతవరకు దేశీయ ఛందస్సులలో వ్రాసెను. జాతులు అనబడు దేశీయ ఛందస్సులలో కందము, సీసము, గీతము, అక్కరలు మున్నగువాటిని నన్నయ వాడెను. వీటి కన్నను సులభమైనది పాడుకొనుటకు అనువుగా నుండునది దేశీయమైన ద్విపదచందస్సు. స్త్రీలపాటలు, పామరజనుల రచనలు తరుచు గేయఛందస్సులలోనే ఉండును. కావ్యము స్త్రీసమాజమునందును పామరులందును కూడ వ్యాప్తి గాంచవలెనన్నచో అది వారి కభిమతమగు గేయఛందములలో నుండవలెను. దీనిని గుర్తించియే గోనబుద్ధారెడ్డి తన రామాయణమును ద్విపదలో వ్రాసి లోకారాధన చేసెను.

వాల్మీకి రామాయణములో లేని కొన్ని విశేషకథలను బుద్ధారెడ్డి ద్విపదరామాయణములో వర్ణించెను. జంబుమాలి

---

యైన విఠలభూనాథుని గురించియు ప్రశంస గలదు. విఠలనాథుడే గోనబుద్ధారెడ్డి తండ్రిగా గన్పట్టుచున్నాడు. ఆంధ్ర తరంగిణిగూడ చూడదగును.

కథ, సులోచనసహగమనము, కాలనేమివృత్తాంతము ఇట్టివి. తన కాలమున ప్రజలలో వ్యాపించిన రామాయణాంశముల నీతడు గ్రంథస్థము చేసెను. వీనిలో సులోచన సహగమన వృత్తాంతము కరుణాత్మకమైనది. సులోచన యను పతివ్రత ఇంద్రజిత్తు భార్య. ఈతడు రణనిహతుడైన తరువాత సులోచన తన భర్తశరీరముతో సహగమనము చేయదలచెను. ఇందులకై యామె శ్రీరాముని స్కంధావారమునకు బోయి భర్తశరీరమును యాచించి తెచ్చుకొని, కుమారులకు కడసారి బుద్ధులుచెప్పి మేఘనాథునితో సహగమనము చేయును. బుద్ధారెడ్డి శైలి ద్రాక్షాపాకము. చదివినకొలదిని చవులూరుచుండును గాని విసువు పుట్టింపదు. ఈతడు నన్నయ మార్గమునే యనుసరించి సులభమైన తత్సమపదములో కావ్యమును వ్రాసెను. శివకవులవలె జాను తెనుగు పేరున దేశిపదములు మిక్కుటముగా వాడలేదు. శివకవులవలెనే ఈతడును కావ్యము ప్రజాసామాన్యమున కందుబాటులో నుండవలె నను దృష్టితో వ్రాసినవాడే. కావుననే తన రామాయణమును సులభమైన ద్విపదలో వ్రాసెను.

బుద్ధారెడ్డి కుమారులు, కాచవిభుడు పినవిఠలరాజు అనువారు, ఉత్తరరామాయణకథను ద్విపదలో వ్రాసిరి. మొత్తముమీద ఆంధ్రసాహిత్యముయొక్క తొలియుగములలో మహోన్నతసందేశముగల కావ్యములను జనసామాన్యమునకు సులభముగ అర్థమగు రీతిలో వ్రాయుటయే కవుల యాదర్శమని చెప్ప వీలగును.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## ౫. తిక్కన యుగము

నన్నయభట్టు ప్రారంభించిన మహాభారతరచనమును కొంచెము వెలితిగా కడముట్టసాగించిన మహనీయుడు తిక్కనామాత్యుడు. ఈతనికి ఉభయకవిమిత్రు డనియు, సోమయాజి యనియు, కవిబ్రహ్మ యనియు బిరుదులు కలవు. ఈ కవి కాకతీయ గణపతిదేవచక్రవర్తి కాలమునను, రాణిరుద్రమదేవి కాలమునను జీవించి యుండును. తిక్కనామాత్యుడు నెల్లూరు ప్రభువగు మనుమసిద్ధి యను తెలుగు చోడరాజు నాస్థానమున విలసిల్లి యాతని మంత్రియై యుండెను. ఈతని తండ్రితాతలు నెల్లూరు చోడులవద్ద మంత్రులు, దండనాథులుగ నుండుచు వచ్చిరి. ఈ కారణముచేత తిక్కనామాత్యునకుగొప్ప రాజనీతివిజ్ఞానమును సంగ్రామకళాపరిచయమును గల్గెను. ఈ గుణముల నాతడు తన భారతాంధ్రీకరణములో చక్కగా ప్రదర్శించెను. తిక్కన తండ్రి కొట్టరువుకొమ్మనామాత్యుడు. తల్లి అన్నమాంబ. కొమ్మనామాత్యుడు గుంటూరునకు సైన్యాధిపతిగ నుండెను. తన తాతయైన మంత్రిభాస్కరుడు గుంటూరువిభు డనియు గొప్ప కవి యనియు తిక్కనయే స్వయముగ నుదహరించెను. కాని మంత్రిభాస్కరు డే గ్రంథముల వ్రాసెనో పేర్కొనలేదు. తిక్కన పెదతండ్రికుమారుడు ఖడ్గతిక్కన మేటివీరుడు. ఈ మహాకవివంశమువారు నియోగిబ్రాహ్మణులు. నెల్లూరి మనుమసిద్ధిరాజు శాసనములు క్రీ. శ. ౧౨౫౬-౬౨ సంవత్సరముల

నడుమ కాన్పించు చున్నవి. మనుమసిద్ధిరాజు దాయాదులవలన రాజ్యము పోగొట్టుకొనగా తన ప్రభువు నిమిత్తమై కాకతి గణపతి దేవచక్రవర్తి సహాయమును గోరుటకు తిక్కనామాత్యుడు అనుమకొండ కేగె ననియు, ఆ రాజును తన పాండిత్యముచే మెప్పించె ననియు సిద్ధేశ్వరచరిత్రము చెప్పుచున్నది. కావున తిక్కనామాత్యు డీ సమయమునను తరువాత కొన్ని వత్సరముల వరకును జీవించి కవితావ్యవసాయము చేయు చుండె నని చెప్ప వచ్చును.

తిక్కనవ్రాసిన రెండుగ్రంథములు ప్రసిద్ధములై వెలయు చున్నవి. ఒకటి నిర్వచనోత్తరరామాయణము. రెండవది ఆంధ్ర మహాభారతము. నిర్వచనోత్తరరామాయణము నీతడు తన యేలికయైన మనుమసిద్ధిరాజున కంకిత మిచ్చెను. ఉత్తరరామాయణకథను అనగా శ్రీరామచంద్రు డరణ్యావాసమునుండి తిరిగి వచ్చి అయోధ్యలో రాజ్యముచేయుట, సీతాదేవికి గలిగిన యపవాదము, గర్భవతియై యుండగా శ్రీరాము డామెను తిరిగి వనములకు బంపుట మున్నగు కథలును, రావణాదుల పూర్వ కథలును నిర్వచనోత్తరరామాయణములో కవి చిత్రించెను. దీనిలో పద్యములేకాని వచనము బొత్తుగా లేకుండ వ్రాయుటకు కవి సంకల్పించుటచే 'నిర్వచనము' అను పేరు దీని కుంచెను. మనకు లభించినవానిలో ఇది తిక్కన మొదటికావ్యము. దీని పీఠికలో ఉత్తమకవిత్వ మెట్లుండవలెనో తిక్కనామాత్యుడు వివరించెను.

ఇది యాతని ప్రియపుకవిత్వలక్షణము. ఈ కావ్యా రంభమున తిక్కనామాత్యుఁడు కుకవినింద గావించెను. నిర్వచ నోత్తరరామాయణమునందలి కవిత్వము సంస్కృతసమాస ములతో గూడి ప్రౌఢముగనే యుండును. అయినను రసవంతముగ నున్నది. విష్ణువు రాక్షసులను జయించిన ఘట్టములో వీరరస మును తిక్కన సమర్థతతో పోషించెను. సీతాదేవి వనవాసగమన వృత్తాంతమును హృదయము కరగునట్లు సకరుణముగ వ్రాసెను.

తిక్కనామాత్యుని కీర్తిభవనమునకు ముఖ్యముగ ఆధారమైనది యాంధ్రమహాభారతరచనము. మహాభారతము వేదముతో తుల్యమైన పవిత్రగ్రంథ మగుటచే దానిని ఆంధ్రీ కరించుటకు తగిన యర్హతను పొందదలచి తిక్కన యజ్ఞము చేసి సోమయాజి యయ్యెను. భారతమహాగ్రంథమును సోమయాజి హరిహరనాథదేవునకు కృతి సమర్పించెను. తిక్కన కాలము నాటికి శైవులకును వైష్ణవులకును మతవిషయిక మైన వివాద ములు పెచ్చుపెరిగి అన్యోన్య యుద్ధములలోనికిని రక్తపాతము లోనికిని దిగెను. ఈవిచారదృశ్యమును జూచి, * "వివేకవంతుల

* ఉ॥ భూరి వివేకచిత్తులకు బోలుననన్ దలపన్ దశాంబులన్
సౌరభ మిచ్చు గంధవహు చందమునం బ్రకటంబు చేసి యిం
పారెడు పల్కులం బడయ నప్పలుకు ల్సరిగ్రుచ్చునట్లుగాఁ
జేరుప నేరఁగా వలయుఁ జేసెద నేఁ గృతి యన్న వారికిన్.
చ॥ పలుకుల పొందులేక రసభంగము సేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ దమనేర్పు చూపి యొకటన్ హృదయం బలరింపలేక యే

మెప్పునకు వచ్చునట్లు, తామరపూరేకులనుండి పరిమళమును గొనివచ్చు గాలివలె, కవి కాదలచినయాతడు భావమునకు తగిన యింపైనపలుకులను కూర్చుకొని, వానిని హారము గ్రుచ్చునట్లు చేరుపవలెను. పలుకుల పొందిక లేక, ప్రాతవడిన మాటలతో నేర్పు చూపువారు రసభంగము చేయుచు దుర్విటు లట్లు హాస్యాస్పదులగుదురు. కవిత్వము లలితపదఘటితమైన పద్యములతో నొప్పి, కథార్థము పూర్వాపరవిరోధములు లేనిదై కాహళ (బాకా) యూది నట్లు చిన్నచిన్న తునియలుగ (లఘుదీర్ఘ స్వరములు గలదై) యుండదగును." శివకేశవుల యభేదమును చాటి లోకమునకు వివేకము గలిగింపదలచి తిక్కనసోమయాజి తన గ్రంథమును హరిహరనాథున కంకితము జేసెను. తిక్కన అద్వైతవాది. నన్నయభట్టారకుని వలెనే వేదమతప్రాశస్త్యమును విశ్వసించినవాడు. స్వయముగ యజ్ఞాదికర్మల జేసిన నిష్ఠాపరుడు. భారతాంధ్రీకరణ కాలమునందు సోమయాజి

---

పొలముగు గాని యట్టి క్రమముం దమ మెచ్చగ లోక మెల్లన
వ్వులఁ బొరయం జరించు కుకవుల్ ధర దుర్విటు లట్లుచూడఁగాఁ

క॥ లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలంతి తునియ కా
హళ సంధించిన విధంబు నమరఁగ వలయున్.

పా.అం. 'తునియలుగ। హలసంధించిన'

హృదయము పరిపక్వమై, స్వభావము మిక్కిలి వినమ్రమై, కవిత్వము గంభీరము ప్రసన్నము అయి విలసిల్లెను. భారతారంభమున నీతడు కుకవినింద చేయలేదు. ఆదికవియైన నన్నయభట్టారకుని సముచితముగ పొగడెను. కవిత్వము దివ్యమైన ప్రయోజనము గలది యని ఈ నాడు తిక్కనసోమయాజి ప్రకటించెను. భారతము తెనుగుసేయుటవలనఆంధ్రులకు సమ్మోదము గలుగు ననియు తాను జననమరణసంసారదుఃఖములను దాటి ముక్తిని పొంది తరింతుననియు ఈ మహాకవి విశ్వసించెను. కవిత్వమునకు ఇంత మహోన్నతమైన ప్రయోజనమును కల్పించిన తిక్కనామాత్యుడు ప్రపంచకవులపట్టికలో జేర్పదగినవాడు.

భారతరచనచే లోకారాధన చేయుట సోమయాజి యుద్దేశము. కావున ప్రజాసామాన్యమునకు కూడ సులభముగ నర్థము కాగలిగిన శైలినే యాత డవలంబింప దలచెను. నిర్వచనోత్తరరామాయణశైలి ప్రౌఢముగ నున్న దని చెప్పితిమి. భారతరచనమునందు తిక్కన కఠినసంస్కృతరీతిని చాలవరకు విడిచిపెట్టి సులభములు ప్రసిద్ధములు నగు దేశీయపదములతో కవిత్వము చెప్పెను. శివకవులు పేర్కొన్న 'జాను తెనుఁగు' శైలి ఇటువంటిదే. కాని శివకవులు మారుమూలలనున్న దేశీయపదములనుగూడ విరివిగ వాడుటచే వారి కవిత్వము తిక్కనకవిత్వమంత సులభముగ అర్థముకాదు. మరియు ఈ కావ్యరచనయందు తిక్కనామాత్యుడు నన్నయవలెనే గద్యపద్యములు రెంటిని

గూర్చెను. నన్నయ వచనశైలియు పద్యశైలియు రెండును సమప్రధానములై మృదువుగ నుండును. తిక్కనసోమయాజికి పద్యముమీదను, అందులో చిన్నపద్యము లైన కందములు ఆటవెలదులు తేటగీతల మీదను, అభిమానము మెండు. ఆంధ్రీకరణమునం దీతడు నన్నయవలెనే స్వతంత్రమును బూనెను. భారతమును సంస్కృతములోఉన్నది యున్నట్లుగా, యథామూలముగ, తెలుగుకవులు అనువదించలేదు. రసవంతము లని తోచిన కథాభాగములను వీరు పెంచి వ్రాసిరి. తిక్కన విరాటపర్వము దీని కుదాహరణము. నీరసము లని తోచిన భాగములను సంక్షిప్తములు చేసిరి. వేదాంతభరిత మగుటచే కాబోలు భగవద్గీతాభాగమును తిక్కన కొలదిపద్యములలోనే ముగించెను. రసభావాదులయందు ఔచిత్యమును కవిత్రయమువారు బాగుగా దృష్టియం దిడుకొనిరి.

తిక్కనసోమయాజి భారతమునందు పదునైదు పర్వములను తెనిగించెను. విరాటపర్వమునుండి స్వర్గారోహణపర్వము వరకు నున్న విస్తారగ్రంథము నీతడు పూర్తి చేసెను. ఆరణ్యపర్వములో నన్నయభట్టు విడిచినభాగమును మాత్ర మీతడు చేపట్టలేదు. తిక్కనరచనలో విరాటపర్వము, ఉద్యోగపర్వము మిక్కిలి రసవంతముగానుండును. విరాటపర్వమునందు కీచకవధ వృత్తాంతములో శృంగారవీరరసములను పోషింపదలచి రసభావముల కనుగుణముగ విస్తరించి వ్రాసెను. సీసపద్యముల నడకలో తిక్కన నూతన మార్గములను కల్పించెను. ధర్మరాజవర్ణనము

నందలి పద్యము "ఎవ్వని వాకిట నిభమదపంకంబు, రాజభూషణ రజోరాజి నడఁగు" ఉదాహరణము. తరువాతి కవులు ముఖ్యముగ నాచనసోముడు, శ్రీనాథుడు దీనిని బాగుగా పోషించిరి. పాత్రముల మనోభావములకును వారి ముఖచర్యలు చేష్టాధికములకును సంబంధము కుదురునట్లు చిత్రించుట తిక్కన రచనలోని యొక కళాసౌభాగ్యము. సింహబలుడును ఉపకీచకులును సంహరింపబడినతరువాత విరాటనగరము ప్రవేశించు చున్న ద్రౌపది మానసికసంక్షోభమును, దానిని కప్పిపుచ్చుటకై యామె చేసిన ప్రయత్నమును తిక్కన గొప్ప నైపుణ్యముతో చిత్రించినాడు. ఉద్యోగపర్వమునందు సంజయరాయబారము శ్రీకృష్ణరాయబారమును తిక్కనసోమయాజి కడు విన్నాణముతో వ్రాసెను. ఆతనికిగల రాజనీతిజ్ఞత యీ ఘట్టములలో ప్రతిబింబించినది. ఈ భాగములు ధ్వనిప్రధానములుగ నున్నవి. యుద్ధపర్వములలో నీతడు తనకుగల యుద్ధవిజ్ఞానమును చక్కగా ప్రదర్శించెను. శాంతిత్రయమునందు రాజనీతి, ధర్మవేదాంతాదివిషయములను ఈ మహాకవి చక్కగ వివరించెను. సంస్కృతమహాభారతము విశ్వవిజ్ఞానకోశము అని చెప్పవచ్చును. తిక్కనసోమయాజియు విశ్వవిజ్ఞానసమన్వితుడైన కవివతంసుడు. కావున ఆతని యాంధ్రభారతము తెనుఁగుభాషలోనేకాదు ఇతరభాషలలోకూడ నిరుపమానమైన గ్రంథమని యెంచదగును. తిక్కనామాత్యుని కళావిశేషము లెన్నియో గలవు. ఆతని భావనాశక్తి యత్యున్నతమైనది. భావమును నిర్మలముగను క్లేశములే

కుండగను మిక్కిలి తక్కువపదజాలములో అవతరింప జేయుగల ప్రజ్ఞ తిక్కనకు సహజము. కథాపాత్రములచేత నాటకమునందు వలె సంభాషింప జేయుటలో తిక్కన కౌశల్యము పొగడదగినది. ఇట్లెన్నియేని మహాకవిత్వలక్షణము లీతని కడ భాసించుట చేతనే తరువాతి యాంధ్రకవులు తిక్కనసోమయాజిని 'కవిబ్రహ్మ' యని స్తుతింప జొచ్చిరి. ఆంధ్రులలో వేదమతమును విజ్ఞానమును ప్రదీపింపజేయుటకు సాధనముగా నన్నయభట్టారకుడు ప్రారంభించిన మహాభారతాంధ్రీకరణమును తిక్కనామాత్యుడు సంపూర్తి చేసి కీర్తనీయు డయ్యెను.

## కేతన

తిక్కనసోమయాజికి సమకాలికుడై ఆతనితో సన్నిహిత సంబంధముగల కవిశ్రేష్ఠుడు మూలఘుటిక కేతన. ఈతడు మొదట వేగిదేశమునందలి వెంటిరాల కాపురస్థుడు. తరువాత నెల్లూరికరిగి తిక్కనామాత్యుని జేరి ప్రసిద్ధికి వచ్చెను. ఈతడు నియోగి బ్రాహ్మణుడు. దశకుమారచరిత్రము, ఆంధ్రభాషా భూషణము, విజ్ఞానేశ్వరము అనునవి యీతని రచనలు. దశకుమారచరిత్రము, సంస్కృతమునందు దండిమహాకవి రచించిన దశకుమారచరిత్రకు పద్యకృతి. సంస్కృత దశకుమారచరిత్రము వచనమునందున్నది. కేతన దీనిని పద్యకావ్యముగా నాంధ్రీకరించెను. దీనినాతడు తిక్కనామాత్యున కంకిత మొనర్చెను. ఈ యంశమును బట్టియే సమకాలిక కవులు కూడ తిక్కనసోమయాజియెడ నెంత గౌరవములు

కలిగియుండిరో తెలిసికొనవచ్చును. దశకుమారచరిత్ర పీఠిక యందు తిక్కనామాత్యుని వంశప్రశస్తిని కేతన సవిస్తరముగ వ్రాసెను. ఎవరికవిత్వమును మెచ్చని యుభయకవిమిత్రుని (తిక్కన) పొగడ్తకు తన కవిత్వము పాత్రమైన దని కేతన సగర్వముగ చెప్పుకొన్నాడు. నిజముగ నీతనికవిత్వ మీ పశ్రంసకు తగియున్నది. సంస్కృతకవి దండిని గురించి 'దండినః పదలాలిత్యం' అనగా దండి కవి పదలాలిత్యముచే అతిశయించును అని విమర్శ కలదు. అట్లే యాంధ్రకవి కేతనకవిత్వముకూడ లలితపదవిలసితమై ద్రాక్షాపాకముగా నున్నది కావున నీతనికి అభినవదండి యను బిరుదు గల్గినది. దశకుమారచరిత్ర యొక్క కథాకావ్యము కాశీమజిలీల కథలవంటిది. ఈ కథలలో శృంగారము హాస్యము తొణుకుచుండును. పదిమంది రాజకుమారుల సాహసచర్యలును వారిప్రేమవృత్తాంతములును దశకుమారచరిత్రలో మధురముగ వర్ణింపబడినవి. ఆ కాలపువారికి కల్పితకథలయం దభిరుచి మెండుగా నుండెడి దనుటకు ఈ కావ్యము సాక్ష్యము. కేతన యాంధ్రభాషాభూషణము తెనుగుభాషకు పద్యములలో వ్రాయబడిన వ్యాకరణము, తెలుగులో తనది మొదటివ్యాకరణ మని యాతడు సూచన జేసెను. విజ్ఞానేశ్వర మనునది ధర్మశాస్త్ర గ్రంథము. పూర్వాంధ్రకవులు కావ్యప్రియు లైనను ధర్మప్రధానమైన జీవితమునే లక్ష్యముగ నుంచుకొని రనుటకు కేతనకవి యుదాహరణము.

## అథర్వణాచార్యుడు

ఈతఁ డొక గొప్పపండితకవి. తిక్కనసోమయాజికి కొంచెము ముందువెనుకగా సమీపకాలమునందున్నట్లు ఊహించ నగుచున్నది. ఈతఁడు మతముచే జైనుఁడుగా కన్పించును. నన్నయకు ముందు బౌద్ధజైనమతములు ఆంధ్రదేశములో ప్రజాసామాన్యమునందు మిక్కిలి వ్యాపించియుండెను. జైనపండితులు దేశభాషాభిమానులై కావ్యములను వ్యాకరణగ్రంథములను తరుచు వ్రాయుచుండి రనుటకు కన్నడభాష మనకుసాక్ష్యము. తెలుగు దేశపు జైనులు కూడ ఇట్లే యాంధ్రభాషాసేవ చేసియుందురు. ఆంధ్రదేశమునందు జైనమతము అడుగంటినతరువాత జైన కవులు రచించిన గ్రంథములును నశించియుండును. అథర్వణాచార్యుఁడు భారతము నాంధ్రీకరించినట్లు నిదర్శనములుకలవు. ఈతని భారతములోనివని చెప్పబడు పద్యములు కొన్ని లక్షణ గ్రంథములలో లభించుచున్నవి. కాని ఆభారతమిప్పుడు లోకములో దొరకుట లేదు. అథర్వణుఁడు విరాటపర్వమునుండి భారతము నాంధ్రీకరించినట్లు తోఁచును. ఈతని శైలి తిక్కనసోమయాజి శైలివలె సర్వజనసులభముగా నుండలేదు. అది పండితులను మాత్రమే యాకర్షింపగల ప్రౌఢశైలి. ఈతఁడు త్రిలింగ శబ్దానుశాసన మను నొక చిన్నవ్యాకరణము వ్రాసెను. 'అథర్వణకారికావళి' యను మరియొక వ్యాకరణముకూడ నీతనిపేర గనవచ్చుచున్నది.

## బద్దెన భూపాలుడు

బద్దెనకవి "నీతిశాస్త్రముక్తావళి" యను గ్రంథమును రచించెను. నన్నెచోడునివలె నీతడును చిన్న సామంతరాజు. ఈ కవి క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమున నుండెను. "సుమతిశతకము" తాను వ్రాసిన ట్లీకవి నీతిశాస్త్రముక్తావళిలో చెప్పుకొనెను. ఇప్పుడున్న సుమతిశతకము ఆబాలగోపాలము నెరింగినదే. బద్దెనవ్రాసిన సుమతీశతకమిది యగునో కాదో యని సందేహముకలదు. ఏలయనగా భీమన యను కవి సుమతిశతకము చెప్పినట్లు దీని చివర చెప్పబడియున్నది. నీతిశాస్త్రముక్తావళియందు రాజనీతిపద్ధతి, మంత్రిపద్ధతి, ఉపాయపద్ధతి మున్నగు వానిపై నీతిబోధకములైన పద్యము లున్నవి. ఈకవి శైలి రమ్యమై మృదువుగ నున్నది. అన్వయకాఠిన్యముండదు. చక్కని యుపమానములు లోకోక్తులతో నీతనిరచన హృదయంగమముగ నుండును.

## పాల్కురికి సోమనాథుడు

ఆంధ్రశివకవులలో పాల్కురికి సోమనాథు డగ్రేసరుడు. శివకవు లనగా శివుడే పరదైవత మని నమ్మువారు. ఇతర దేవతాగణ మంతయు శివునిపరివార మని వారి నమ్మకము. బసవేశ్వరుడు స్థాపించిన వీరశైవధర్మమునందు పరమవిశ్వాసముగలిగి తన గ్రంథముల మూలమున దానిని వ్యాపింపచేయుటకు పాల్కురికి సోమకవి ప్రయత్నించెను. ఈకవి కాకతీయ మొదటిప్రతాప

రుద్రుని కాలమున అనగా క్రీ. శ. ౧౧౯౫ ప్రాంతమున జీవించి యుండె నని ఇదివరలో నిర్ణయము జరిగెను. కాని ఇటీవలి విమర్శకులు పాల్కురికిసోమన క్రీ. శ. ౧౨౯౦నుండి ౧౩౨౩వరకు పాలించిన రెండవప్రతాపరుద్రుని కాలమువా డని తలచుచున్నారు. * ఇదియే విశ్వసనీయముగానున్నది. సోమనాథుడు తెలంగాణాప్రాంతమువా డనియు, వరంగలుజిల్లాలోని పాలకుర్తి గ్రామ వాస్తవ్యు డనియు కొందరు చెప్పుచున్నారు. సోమనాథుని యింటిపేర బరగిన పాలకురికి యను గ్రామము మైసూరురాష్ట్రమునం దున్న దనియు, ఆతడు లింగైక్యము నందిన కలికెమను గ్రామముకూడ మైసూరురాష్ట్రమునందే యున్న దనియు, కావున సోమనాథుని జన్మస్థానము మైసూరురాష్ట్రమనియు మ. రా. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు ఊహించుచున్నారు. ఈతడు పుట్టుకచే బ్రాహ్మణు డయి వీరశైవదీక్షనొందిన తరువాత బ్రాహ్మణ

---

* సోమనాథుని జన్మస్థానము ఏప్రాంతమైనను అతడు ఓరుగంటిని దర్శించి యుండుట వాస్తవమైయుండును. రెండవ ప్రతాపరుద్రుని మంత్రులలో పాలకుర్తి సూరయ్య యను నాతడొక డుండినట్లు సిద్ధేశ్వరచరిత్రవలన తెలియవచ్చుచున్నది. పండితారాధ్యచరిత్రమును గృతిపొందిన సూరయామాత్యు డితడే యని నేను ఊహించుచున్నాను. పాలకుర్తి సూరయ్య, సోమనాథుని విషయమును ఆతడు రచించిన యారాధ్యచరిత్రవిషయమును ప్రతాపరుద్రునకు శ్రుతపరచినట్లు సిద్ధేశ్వర చరిత్ర వర్ణించుచున్నది. పండితారాధ్య కృతిభర్త తనకు బందుగు డయి నట్లు సోమనాథుడే చెప్పుకొనెను. కావునపాల్కురికి సోమనాథునకు తెలంగాణములో సన్నిహితబంధువు లుండుట విశ్వసనీయముగా తోచుచున్నది. ప్రతాపరుద్రుడు సోమనాథకవికి గొట్టిపెర యను గ్రామము నగ్రహారముగ నిచ్చెనట.

త్వమును త్యజించె నని తోచును. పాల్కురికిసోమనాథుడు గొప్పకవియే కాక మహావిద్వాంసు డనికూడ చెప్పవలెను. వేదములనుండియు స్మృతులు, ఆగమములు మున్నగు గ్రంథములనుండియు శివాధిక్యమును గూర్చి ప్రమాణముల నీతడు తన కావ్య గ్రంథములలో తరచు పేర్కొనుచుండును. సంస్కృతాంధ్రకర్ణాటభాషలం దీతడు అసమానప్రజ్ఞ గలవాడై కావ్యములు భాష్యములు వ్రాసెను. ఈతనికి మహారాష్ట్రభాషయు ద్రావిడ భాషయు కూడ చక్కగా పరిచితములు. ఈతని తెలుగుకృతులలో ప్రసిద్ధమైనవి బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, వృషాధిపశతకము, చెన్నమల్లుసీసములు, చతుర్వేదసారము, అనుభవసారము. సంస్కృతమునం దీతడు సోమనాథభాష్యము, రుద్రభాష్యము మరికొన్ని చిన్నకృతులను రచించెను. ఈతని గ్రంథము లన్నియు శివుడే పరదైవ మని చాటుటకును, వీరశైవ సిద్ధాంత ప్రతిపాదనమునకును వినియోగపడినవి. వర్ణాశ్రమ విభేదములను విసర్జించి భక్తు లందరు ఏకులమువా రైనను పూజనీయులే యని వీరశైవము బోధించెను. వీరశైవము కన్నడ దేశములో తలయెత్తినను ఆంధ్రకవి యగు పాల్కురికిసోమనాథుని రచనలమూలముననే దానికి మొదట విశేషవ్యాప్తి కలిగెను.

పాల్కురికి సోమనాథుని 'బసవపురాణము' తెలుగుభాషలో నపూర్వకావ్యము. దీని నాతడు ద్విపదలో రచించెను. నన్నెచోడుని నాటనుండియు శివకవులు జాను తెనుఁగులో కావ్యర

చన చేయవలె నని చాటుచుండిరిగదా. పాల్కురికి సోమనకూడ ఈ యభిప్రాయమే గలవాడు. సంస్కృతవృత్తములును దీర్ఘసమాసములుగల రచనయు సర్వసామాన్యము కాదనియు, కావున తాను ద్విపదను వాడెద ననియు జాను తెనుగులో కృతి చెప్పెద ననియు నీతడు ప్రతిజ్ఞ చేసెను. కాని సోమనాథుని శైలి యెల్ల చోటులను సులభముగా లేదు. ఆతడు గొప్ప పండితుడు. అద్వితీయమైన భావనా వేగము కల మహాకవి. భావావేశమునకు లోనై రచించినప్పు డీతడిది జాను తెనుగా, దీర్ఘసమాసవంత మైన ప్రౌఢసంస్కృతమా యని పరికింపడు. ఇట్టి పట్టులలో నీతనికవిత్వము ఉన్నతశిఖరము నుండి పడు జలపాతమువలె వేగము, శక్తి గలిగినదై యాతని వశముదప్పును. బసవపురాణములో శ్రీబసవేశ్వరుని యవతారచరిత్రమును, అతని మహిమలను పాల్కురికి సోమనాథుడు కన్నులకు గట్టినట్లు వర్ణించెను. ఇతర శైవభక్తుల చరిత్రములను గూడ దీనిలో సందర్భానుసారముగ సోమన చిత్రించెను. శ్రీబసవేశ్వరుడు నందికేశ్వరుని యవతారమై శ్రీశైల పర్వతమునకు పశ్చిమమున నున్న కన్నడదేశములో మండెగ మాదరాజు మాదాంబయను పుణ్యబ్రాహ్మణ దంపతుల కుమారుడై పుట్టెను. ఎనిమిదవయేట తండ్రి యాతని కుపనయనము చేయదలచెను. బసవేశ్వరు డిది పనికిరా దని వాదించెను. శివభక్తులకు కులగోత్రము లుండవు. వడుగు అను కర్మ కేవలము బ్రాహ్మణకర్మ. కావున తాను వడుగొల్ల నని బసవేశ్వరు డిల్లు వెడలి పోయెను. ఈతనితో నీతనిసోదరి నాగాంబకూడ పయన

మయ్యెను. బసవేశ్వరుడు కూడలి సంగమక్షేత్రములో శంభుని గురించి తపస్సు చేసెను. శివుడు ప్రత్యక్షమై యాతనికి మహాోత్తరసందేశము నొసగెను. శివధర్మమును లోకములో వ్యాపింపజేయుటకు బసవేశ్వరుడు పూనుకొనెను. ఆతడు కల్యాణపురమేలు బిజ్జలుని మంత్రియు బండారియు నయ్యెను.

బండారి బసవేశ్వరుడు శివభక్తులను దగ్గరజేర్చుచు వారి నాదరించుచు వారిపై ప్రజాధనము వెచ్చించుచుండెను. మరియు వర్ణభేదముల రూపుమాప దలచినవాడు గావున బసవేశ్వరుడు మాలలగు శివభక్తులతో కూడి కొలువు నకువచ్చుచుండెను. ఈ చర్యలను సహించని ఇతరమంత్రులు బిజ్జలునకు బసవేశ్వరునిపై కోపము దెప్పించుచుండిరి. బసవని మిత్రులైన కొందరు శివభక్తులు శైవులుకానివారిపై నత్యాచారములు చేయసాగిరి. దీనివలన బిజ్జలునకును బసవేశ్వరునకును మనస్పర్థలు గలిగె శ్రీబసవేశ్వరుడు కల్యాణపురిపై నలిగి శపించి వెడలిపోయె నట. తరువాత కల్యాణనగరియందు శైవులకును జైనులకును ఘోరయుద్ధము జరిగి యాపట్టణము నశించెను. ఇది బసవపురాణమందలి కథ పాల్కురికిసోమన యీకథను గొప్ప భక్త్యావేశముతో రచించెను.

సోమనాథుని పండితారాధ్యచరిత్రయు ద్విపదకృతియే. దీనిలో మల్లికార్జునపండితారాధ్యుని చరిత్రమును సోమన వర్ణించెను. ఈ కావ్యమందలి కవిత్వధార బసవపురాణ కవిత్వ

ముకన్న భావావేశమెక్కువగా గలది. పండితారాధ్యుడు గొప్ప శివారాధకుడు. ఈతని మిత్రులగు భక్తులలో బెలిదేవివేమనారాధ్యు డను నాత డొక డుండెను. వేమనారాధ్యుని మనుమడు గురులింగార్యుడు తన గురువని పాల్కురికిసోమన చెప్పుకొనెను*. శివభక్తులలో స్త్రీలును ఉండిరి. పోరండ్లసూరసానమ్మ యను భక్తురాలు పండితారాధ్యుని శివపూజావిధానమును దర్శించుట కేతెంచెను. సోమనాథుని వృషాధిపశతకము తెనుఁగుభాషలోని మొట్టమొదటి శతకమని చెప్పవలెను. దీనిలో కూడ నాతడు తన యిష్టప్రభువైన బసవేశ్వరుని జీవితలీలలను స్తుతించెను. చెన్నమ సీసములు శైవవేదాంతప్రతిపాదకము లైన సీసపద్యములు. వీనిలో చెన్నబసవేశ్వరుడు కీర్తింపబడెను. చతుర్వేదసారము శైవసిద్ధాంతమును ప్రతిపాదించు పద్యకావ్యము. ఇట్లనేక మహాగ్రంథములలో వీరశైవధర్మమును వెల్లడించి తన నిరుపమాన కవితాశక్తిని పాల్కురికిసోమనాథుడు శివకైంకర్యము చేసి తరించెను.

## మారన

మారనకవి తాను తిక్కనసోమయాజి శిష్యుడ ననియు, నాతని ప్రసాదముచే కవిత్వము నేర్చితి ననియు చెప్పుకొనెను. ఈతడు మార్కండేయపురాణమును తెనిగించెను. దీని నాతడు

* "కట్టకూరిపోతిదేవర" అను ఇంకొక గురుడున్నట్లు వక్కాణ ముగలదు. కరస్థలి విశ్వనాథుడు విద్యాగురుడు.

కాకతీయచక్రవర్తి రెండవ ప్రతాపరుద్రదేవుని సేనాపతియగు నాగయగన్ననికి అంకితము సమర్పించెను. ఈ నాగయగన్న చమూపతియు, క్రీ॥ శ॥ ౧౨౪౯ సంవత్సరపు రాయచూరు శాసనమునందు చెప్పబడిన గన్నయరెడ్డియు ఒకే వ్యక్తిగా భావించుచున్నారు. తిక్కనామాత్యుని శిష్యుడగుటకు మారనకవికి సర్వదా అర్హత కలదు. ఈతడు కేతన వలెనే మృదుమధురమైన కవిత్వము చెప్పనేర్చినవాడు. ధారాశుద్ధియు అన్వయసౌలభ్యము నీతనికి చక్కగా యలవడినవి. తిక్కనసోమయాజి వర్ణనా రీతులను గమనికలను చివరకు అతని పదజాలమును కూడ మారనకవి చక్కగా అనుకరించి గురువునకు తగిన శిష్యుడనిపించుకొనెను. భారతములో సంపూర్ణముగా చెప్పబడక సంశయాస్పదములుగ నున్న కథలను పూర్తి చేయుటకు మార్కండేయ పురాణము యత్నించినది. ఈ పురాణము అనేక మనోహరమైన కథలకు పుట్టినిల్లు. మదాలసకు వలయాశ్వులకథ; ఉత్తముడు బహులాదేవి వృత్తాంతము; రుచి ప్రజాపతికథ; మానినీ రాజవర్ధనులకథ ఇట్లెన్నియో ఉపాఖ్యానము లిందు కలవు. ఇంతకన్న ముఖ్యమైనవి హరిశ్చంద్రవృత్తాంతము, వరూధినీ ప్రవరుల యాఖ్యానము. మార్కండేయ పురాణమందలి కథయే అల్లసాని పెద్దనగారి మనుచరిత్ర కథకు మూలమైనది. ఈ విధముగా మార్కండేయపురాణము అనేక కావ్యములకు కథా భిక్షను ప్రసాదించిన మూలగ్రంథము.

ఆంధ్ర సాహిత్యచరిత్రయందు తిక్కనయుగము మిక్కిలి ఫలవంతమైనది. ఈ కాలమున గొప్పకవులు పలువురు వెలసిరి. వారిలో శివకవులుగాక తదితరుల నడుమ, గ్రహచక్రమునడుమ సూర్యునివలె, తిక్కనసోమయాజి విరాజిల్లు చున్నాడు.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## ఆరవ ప్రకరణము

## ఎఱ్ఱనయుగము. క్రీ. శ. ౧౩౦౦--౧౩౭౫

### భాస్కరరామాయణము.

పదునాల్గవ శతాబ్దపు మొదటిభాగములో వెలసిన గొప్ప గ్రంథము భాస్కరరామాయణము. ఇది పలువురు కవులు కలిసి రచించిన గ్రంథము. భాస్కరుడను మహాకవి దీనికి మూలమున నుండుటచే దీనికి భాస్కరరామాయణ మను పేరు కలిగినట్లు చెప్పుచున్నారు. తిక్కనసోమయాజి తాత యొక మంత్రిభాస్కరుడుండెను.* ఆతడు గొప్పకవియని తిక్కన పొగడెను. మంత్రి భాస్కరుడే మొదట నీరామాయణమును వ్రాసెనని కొందరు తలతురు. కాని దీని కొక యాక్షేపణ కలదు. భాస్కరరామాయణములో కొన్ని భాగములు, ముఖ్యముగా నరణ్యకాండము, సాహిణిమారడను నాతనికి అంకిత మీయబడినది. సాహిణిమారడు ౧౨౯౫—౧౩౨౩ల నడుమ పాలించిన కాకతీయచక్రవర్తి రెండవ ప్రతాపరుద్రదేవుని కడ

---

*ఇప్పుడున్న భాస్కరరామాయణములో మంత్రి భాస్కరుని కవిత్వ భాగమును వేరుచేయుటకై శ్రీ చాగంటి శేషయ్యగారు తమఆంధ్రకవితరంగిణిలో విశేషము కృషిచేసియున్నారు.

అశ్వసైన్యమున అధ్యక్షుడుగ నుండెను. మంత్రి భాస్కరుడు క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతముననుండినవాడు. కావున భాస్కర రామాయణకర్త ఈతడనుట కుదురదు. సాహిణిమారని కాలమున హుళక్కి భాస్కరుడను మహాకవి యుండెను. ఈతడే భాస్కరరామాయణమునందు ముఖ్యపాత్ర వహించినవాడు. భాస్కరుడును, ఆతని కుమారుడు మల్లికార్జునభట్టును, సాహిణి మారని పుత్రుడును, భాస్కరుని శిష్యుడును అగు కుమారరుద్ర దేవుడను కవియు, అయ్యలార్యుడను కవియు, ఈ నలుగురును భాస్కరరామాయణమును పూర్తి చేసిరి. వీరిలో మల్లికార్జున భట్టు బాలకాండము నెత్తుకొనెను. కుమారరుద్రదేవుడు అయోధ్యకాండమును రచించెను. భాస్కరుడు తాను స్వయముగ అరణ్యకాండమును జేపట్టెను. బాలకాండమును ముగించి, భాస్కరుని కొడుకు మల్లికార్జునభట్టు, కిష్కింధా కాండమును సుందరకాండమును వ్రాయబూనుకొనెను. ఈ లోపున భాస్కర కవి తాను యుద్ధకాండము నందుకొనెను. కాని యాతడు యుద్ధకాండములో ౧౧౩౩ పద్యములను మాత్రమే వ్రాయ గల్గెను. యుద్ధకాండములో మిగిలినభాగమును అయ్యలార్యుడను కవి తరువాత లిఖించెను. ఇట్లీ గ్రంథమును ఒక కవి గాక నలుగురు కవులు వ్రాసి ముగించిరి. రామాయణాంధ్రీకరణమును త్వరలో పూర్తి చేయదలచుట చేతను, తన కుమారుడును, శిష్యుడును, సమర్థులగు కవులగుటచే వారిని ప్రోత్సహించుటకును భాస్కరమహాకవి యీ మార్గమవలంబించియుండును.

ఆంధ్రమహాభారత భాగవతముల తరువాత భాస్కర రామాయణమే మిక్కిలి ప్రజాదరణమును పొందిన గ్రంథము. దీనికి మూలము వాల్మీకి రామాయణము. భారత కవుల వలెనే భాస్కరరామాయణ కవులును దీనిని అనువదించుటలో స్వతంత్రత వహించిరి. ఉన్నది యున్నట్టు తెలుగుసేయలేదు. వివిధ కవులు రచించినదగుటచేత ఈ రామాయణపు శైలియు కొంచె మెగుడుదిగుడుగా నుండును. అయినను ఇది మిక్కిలి రసవంతమైన రచనయని నొక్కి చెప్పవచ్చును. ఇందులో భాస్కరుడు మేటికవి. ఈతని కవిత్వము, నన్నయ కవిత్వము వలె, తత్సమపదబాహుళ్యము కలిగియుండి ప్రసన్నముగ నుండును. యుద్ధవర్ణనములం దీతడు తిక్కనసోమయాజి భారత వర్ణనములను దృష్టియం దుంచుకొనెను. ఈతని వచనభాగము కూడ మృదువుగను రమ్యముగను ఉన్నది. భాస్కరుని కుమారుడు మల్లికార్జునభట్టు తండ్రియంత సమర్థుడు కాకపోయినను సరసమైన కవియే. బాలకాండమునందుకన్న కిష్కింధాసుందర కాండములయం దీతని కవిత్వము మేలుగా నున్నది. వాలిభార్యయైన తార శోకమును ఈ కవి సవిస్తరముగను సకరుణముగను వ్రాసెను. అయోధ్యాకాండము వ్రాసిన కుమారరుద్రదేవుడు భాస్కరునకు తగిన శిష్యుడు. ఈతనికి సంగ్రహరచన ప్రీతికరము. అయోధ్యకాండను సంగ్రహించి వ్రాసెను. అయినను కవిత్వము నూటిదనము, భావసంగ్రహము, చక్కని సమాసములకూర్పు గలిగి రసవంతముగ నున్నది. యుద్ధకాండము

నందలి చివరి భాగమును రచించిన అయ్యలార్యుడను కవి పై ముగ్గురంత రసవత్కవి గాడు. ఈతనికి దీర్ఘ సమాసములును ప్రౌఢరచనయు ఇష్టము. ఔచిత్యమునుగూడ చక్కగా పాటించ లేడు. అయ్యలార్యుడు భాస్కరకవి తరువాత కొంత కాలమున కీ గ్రంథము పూర్తిచేసి యుండును. రంగనాథ రామాయణము ద్విపదలో నున్నది. భాస్కర రామాయణము వృత్తములలోను దేశీయ పద్యములలోను రచింపబడినది. వాల్మీకి రామాయణములో లేని కొన్ని కథలును, విశేషాంశములును* ఈ రెండు తెలుగు కావ్యములలోను చేర్చబడి యున్నవి.

---

* అ. రంగనాథ రామాయణము. శ్రీరాముడరణ్యమునకు పయనమగు నప్పుడు కౌసల్య యాతని చేతికి రక్షరేఖ కట్టుట, లక్ష్మణుడు అరణ్యములో సీతను విడిచి రాముని వెంట పోవునప్పుడు పర్ణశాల చుట్టు గీరలు గీయుట. శూర్పణఖకుమారుడు జంబుమాలికథ, ఇంద్రజిత్తు భార్య సులోచన సహగమన వృత్తాంతము, కాలనేమికథ, శ్రీరాముడు సేతువువద్ద శివలింగప్రతిష్ఠ సేయుట లోనగునవి.

ఆ. భాస్కరరామాయణము—గౌతముడహల్యను పాషాణము గమ్మని శపించుట; మంథరను రాముడు కాలితో తన్నినట్లు కల్పన; జంబుమాలికథ; తార శ్రీరాముని శపించుట; కాలనేమి వృత్తాంతము; శుక్రాచార్యుని యుపదేశముచే రావణుడు పాతాళహోమము చేయుట; రావణుని నాభికమలమునందమృత భాండ మున్నదని విభీషణుడు చెప్పుట లోనగునవి.

శ్రీరామచంద్రుని యవతారచర్యలనుగూర్చి ప్రజానీకమునందు వింత వింతకథలు పాటలరూపమున వ్యాప్తిలో నుండగా ఈ కవులు వానిలో మనోహరమైన వానిని తమ గ్రంథములలోనికి స్వీకరించి యుందురు.

## ఎఱ్ఱాప్రగడ

ఆంధ్రమహాభారతరచనమునందు పాల్గొనిన నన్నయ తిక్కనఎఱ్ఱనలను కవిత్రయ మని వ్యవహరింతురు. ఎఱ్ఱనార్యుడు రామాయణమును, ఆంధ్రభారతమునందలి ఆరణ్యపర్వశేష మును, లక్ష్మీనృసింహపురాణమును, హరివంశమును రచించెను. ఈతడు రచించిన రామాయణగ్రంథ మిప్పుడు లభించుటలేదు. ఈ కవి తన హరివంశమును ప్రోలయవేమారెడ్డి కంకిత మొన ర్చెను. క్రీ. శ ౧౩౨౩ ప్రాంతమున ఓరుగంటిలో కాకతీయ సామ్రాజ్య మస్తమించెను. దేశము తురుష్కాక్రాంత మయ్యెను. అయినను ఇంతటితో నిరుత్సాహము చెందక యాంధ్రవీరులు ప్రోలయనాయకుడు కాపయనాయకుడు, అను శూరుల నాయ కత్వమున జాతీయకూటమిగా నేర్పడి ఆంధ్రదేశమునుండి తురు ష్కులను పారద్రోలి తిరిగి స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి. ప్రోలయకాపయనాయకులకు సహాయము చేసిన వీరులలో ప్రోలయవేమారెడ్డి యొకడు. అద్దంకి రాజధానిగా నీతడు రెడ్డి రాజ్యమును స్థాపించెను. ఈ కాలముననే తెలంగాణమునందలి రాచకొండ రాజధానిగా చేసికొని వెలమవీరులు మరియొక స్వతంత్రరాజ్యము స్థాపించిరి. ప్రోలయవేమారెడ్డి ౧౩౨౪-౪౯-ల నడుమ పరిపాలన చేసి యుండుటచే ఎఱ్ఱనకవికూడ ఈ కాలము ననే యుండె నని చెప్పవచ్చును. ఈతడు నియోగిబ్రాహ్మణుడు. శివభక్తు డగుటచే నీతనికి శంభుదాసు డనియు, ప్రబంధరీతిలో కవిత్వము చెప్పుటచే 'ప్రబంధపరమేశ్వరు' డనియు పేర్లు. ఈ

కవీశ్వరుడు వినయశీలుడు. మృదుహృదయము కలవాడు. ఎఱ్ఱన తన గ్రంథములలో కుకవినింద చేయలేదు.

నన్నయతిక్కనల కవిత్వమునం దీతనికి గౌరవాదరములు మెండు. వా రారంభించిన భారతాంధ్రీకరణకార్యము నీతడు పూర్తి చేసెను. నన్నయభట్టారకుడు ఆరణ్యపర్వములో చతుర్థాశ్వాసమునందు "శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులన్" అను పద్యముపరకును తెనిగించెను. తిక్కనసోమయాజి యారణ్యపర్వమునందలి శేషించిన భాగము నెత్తుకొనక విరాటపర్వమునుండి మహాభారతము కడముట్టువరకును వ్రాసెను. ఇట్లు ఆరణ్యపర్వములో మిగిలిపోయిన భాగమును ఎఱ్ఱనార్యుడు పూరించెను. ఈ భాగమునాతడు నన్నయభట్టు పేరనే తెనిగించెను. నన్నయ కవితారీతి ననుకరించుటకు ఎఱ్ఱనార్యుడు కృషి చేసి కృతకృత్యు డయ్యెను. ఎఱ్ఱన వ్రాసిన భారతభాగములో ధర్మవ్యాధోపాఖ్యానము, రామోపాఖ్యానము, సావిత్రీసత్యవంతుల వృత్తాంతము మొదలగు రసవంతములును నీతిదాయకములు నైన కథలు గలవు.

లక్ష్మీనరసింహపురాణము నీకవి యహోబిలనరసింహస్వామి కంకితము చేసెను. ఇది యాతని స్వతంత్రగ్రంథము. బ్రహ్మాండపురాణము మొదలగు గ్రంథములనుండి ప్రహ్లాదకథను స్వీకరించి యెఱ్ఱన దీనిని ప్రబంధముగ నిర్మించెను. ప్రబంధములో నుండవలసిన పెక్కు వర్ణనములను లక్ష్మీనరసింహపురాణములో కవి

గావించెను. వైకుంఠనగరము, క్షీరసముద్రము, శ్వేతద్వీపము మున్నగువాని వర్ణనములును ఇట్టివి. హిరణ్యకశిపుని రాక్షససైనికులు స్వర్గమునందు చేసిన వికృతచేష్టల వర్ణనములో ఈకవిహాస్యరసమును కనబరచెను. బమ్మెరపోతరాజకవి భాగవతములో ప్రహ్లాదచరిత్రమును చిత్రించెను. దానిలో భక్త్యావేశము వెల్లివిరియు చుండును. ఎఱ్ఱన వ్రాసిన ప్రహ్లాదకథ భాగవత కథయంత రసవంతముగా నుండదు. అయినను ఎఱ్ఱనమహాకవి యందు వ్రాసిన యనేక పద్యసందర్భములు పోతనామాత్యుని ప్రహ్లాద చరిత్రలోని గొప్పపద్యములకు మూలము లయ్యెను.

హరివంశము ఎఱ్ఱనార్యుని యత్యుత్తమ రచనము. ఈ గ్రంథము వ్రాయుసమయమున కాతనికవిత్వకళ మహోన్నత స్థితికి వచ్చెను. దీని నాతడు సంస్కృతమునుండి యాంధ్రీకరించెను. మహాభారతములో శ్రీకృష్ణచరిత్రము కొంతవరకు మాత్రమే గోచరించును. శ్రీకృష్ణుని సంపూర్ణచరిత్ర హరివంశమునందు వర్ణింపబడినది. హరివంశము నాంధ్రీకరించిన నన్నయతిక్కనల భారతరచనోద్యమము తుదముట్టనేర దని తలచి యెఱ్ఱనకవి దీనిని చేబట్టెను. శ్రీకృష్ణుని బాల్యలీలలు హరివంశమునందు మిక్కిలి మనోజ్ఞముగను సహజముగను కవి చిత్రించెను. భాగవతములోని శ్రీకృష్ణలీలలయందు శృంగారము మెండుగా నుండును. హరివంశవర్ణనలు విశుద్ధముగా నున్నవి. కంసుని సంహరించి శ్రీకృష్ణుడు యాదవరాజ్యమును స్థాపించుటలో గొప్ప శూరత్వమును రాజనీతికౌశలమును ప్రదర్శించెను.

ఎఱ్ఱన మహాకవి భక్తిరసమునుకూడ చక్కగా నొప్పించును. హరివంశమున శివకేశవుల సమావేశములో నిది చూడనగును. ఎఱ్ఱన హృదయము మిక్కిలి కోమలమైనది. అట్లే యాతని శైలియు మృదువుగ నుండును. ఆతని వర్ణనములు మితముగా నుండును. నన్నయతిక్కనల తరువాత ఆంధ్రమహాకవులలో నెఱ్ఱనార్యుడే పేర్కొనదగినవాడు.

## చిమ్మపూడి యమరేశ్వరుడు.

ఈత డొక పూర్వమహాకవి. అమరేశ్వరుడు విక్రమసేనము అను కావ్యము వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. కాని ఈ గ్రంథ మిప్పుడు లభించుటలేదు. కొందరు పూర్వకవుల నామములు తరువాతికవులు గావించిన కవిస్తుతి మూలముననూ, లక్షణ గ్రంథములలో వారి పద్యములు ఉదహరింపబడుట చేతను, మనకు తెలియవచ్చు చున్నవి. చిమ్మపూడి యమరేశ్వరుని గొప్పకవిగా అనంతామాత్యుడు స్తుతించెను. అనంతామాత్యుడు ౧౫వ శతాబ్దమువాడు. అతడు కొనియాడిన చిమ్మపూడి యమరేశ్వరుడు ౧౪వ శతాబ్దమువా డయి యుండెను.

## విన్నకోట పెద్దన.

ఈ కవి పదునాల్గవ శతాబ్ద ప్రారంభమున నుండెను. కావ్యాలంకారచూడామణియను లక్షణగ్రంథమును వ్రాసెను. ఈత డితరకావ్యము లేవైన రచించెనేమో తెలియదు. విన్న

కోటపెద్దన నియోగిబ్రాహ్మణుడు కావ్యాలంకారచూడామణిని ఈతడు రాజమహేంద్రవరప్రభువైన చాళుక్య విశ్వేశ్వరరాజునకు కృతి యిచ్చెను. చాళుక్య విశ్వేశ్వరరాజు ఆంధ్రమహాభారతమును కృతిగొన్న రాజరాజనరేంద్రుని వంశములోనివాడు. రసము, భావము, అలంకారము, వస్తువు మొదలగునవి కావ్యములందు ముఖ్యముగ పరిశీలింప దగినవి. వీనిని గురించి చెప్పు గ్రంథములను సాహిత్యశాస్త్రగ్రంథము లనియు, అలంకార గ్రంథము లనియు చెప్పుదురు. విన్నకోటపెద్దన గ్రంథ మిట్టిది. ఇందులో సాహిత్యాంశములేకాక వ్యాకరణ ప్రశంసకూడ కలదు. ఉదాహరణము లిచ్చు సందర్భమున నీకవి తన ప్రభువైన చాళుక్యవిశ్వేశ్వరునే యుదాహరణముగా గొనెను. విన్నకోటపెద్దన తన జన్మస్థానమైన రాజమహేంద్రవరపట్టణమును మిక్కిలి ఆసక్తితో వర్ణించెను. పెద్దనకవిత్వము ఉదాహరణభాగములలో బాగుగనే యుండును.

### వేములవాడ భీమకవి.

వేములవాడభీమకవి మహాకవుల శ్రేణికి చెందినవాడని లోకములో ప్రతీతి గలదు. శ్రీనాథునివంటి మహాకవి భీమకవినిగూర్చి ప్రశంసచేసెను. కాని భీమకవి వ్రాసిన గ్రంథమేదియు ఇప్పుడు లభించుట లేదు. 'కవిజనాశ్రయము' అను ఛందశ్శాస్త్రగ్రంథము నీతడు వ్రాసె నని వాడుకయున్నది. కాని ఇప్పుడు లభించినకవిజనాశ్రయము భీమకవి రచితము

కాదు. భీమకవి రాఘవపాండవీయము అను రెండర్థములుగల కావ్యమును వ్రాసినట్లు లోకప్రసిద్ధిగలదనియు, అట్టి కావ్యము నెవ్వరును చూడలేదనియు పింగళిసూరనకవి తన రాఘవపాండవీయములో చెప్పెను. లక్షణ గ్రంథములలో నుదహరింపబడిన పద్యములనుబట్టి భీమకవి నృ సిం హ పు రా ణ ము ను శతకంధర రామాయణమును వ్రాసినట్లు తెలియవచ్చును. కాని ఈ కావ్యములుకూడ నేడు లేవు. ఇక భీమకవియొక్క ప్రశస్తియంతయు ఆతని చాటుపద్యములపై నాధారపడి యున్నది. వేములవాడ భీమకవి తన పద్యములచేతనే యితరులపై కోపించి శపించుటకును, అనుగ్రహించి దీవించుటకును కూడ సమర్థుడని లోకములో అనేక కథలును, చాటుపద్యములును గలవు. ఈతడొకప్పుడు రాజకళింగగంగు అను రాజుపై నాగ్రహించి వానిని రాజ్యభ్రష్టునిగా శపించెనట! తరువాత కొంతకాలమున కాతనిపై జాలివహించి తిరిగి రాజ్యమును పొందుమని దీవించెనట! భీమకవి శాపమును అనుగ్రహవాక్యముకూడ నిజముగా పరిణమించె నని చెప్పుదురు! ఇట్లే భీమకవియొక్క అద్భుతశక్తులను గూర్చి ఎన్నియో పద్యములు కలవు. కావున భీమనకు 'ఉద్దండకవి' యను ప్రసిద్ధి కలిగెను. ఈ కవి కాలమును నిశ్చయముగ చెప్పవీలులేదు. భీమకవి పదునాల్గవ శతాబ్దములో నుండినట్లు ఆతని చాటుపద్యములలో నుదహరింపబడిన రాజుల పేర్లనుబట్టి యూహింపనగుచున్నది. ఒక పద్యములో సాహిణి మారని పేరెత్తబడినది. వేములవాడ భీమకవి జన్మవృత్తాం

తముకూడ అద్భుతముగనే చెప్పబడుచున్నది. ఈతడు దాక్షారామభీమేశ్వర దేవుని యనుగ్రహమున జన్మించె నట. ఆ దేవుని వరప్రసాదముననే యీతనికి ఉద్దండకవిత్వశక్తి యలవడెను. దాక్షారామము గోదావరిమండలములో నున్నది. కావున వేములవాడ భీమకవి యీ మండలమువాడని తోచుచున్నది. తెలంగాణములోని కరీంనగరుజిల్లాయందు వేములవాడయను గ్రామముకలదు. భీమకవి యిచ్చటివాడని కొందరు తలచుచున్నారు.

### నాచనసోముడు.

నాచనసోమనాథుడను పేరుగల ఈ మహాకవి 'ఉత్తరహరివంశము'ను రచించెను. ఈతడు నియోగిబ్రాహ్మణుడు. సోముడు గొప్పవిద్వాంసుడును నిష్ఠాపరుడును నై యుండెను. విద్యానగరమునేలిన బుక్కరాయలు నాచనసోమునకును మరి కొందరు పండితులైన బ్రాహ్మణులకును కలిపి కడపమండలము లోని పెంచుకలదిన్నె యను గ్రామమును దానము చేసి శాసనము వేయించెను. బుక్కరాయలు క్రీ. శ. ౧౩౫౫-౧౩౭౭నడుమ విజయనగరమును పాలించెను. నాచనసోముడు ౧౩౭౦ ప్రాంతమునను అంతకు కొంచెము ముందుగనుకూడ నుండియుండును. *పెంచుకలదిన్నె శాసనములో నాచనసోముడు సకలాగమవేది యనియు అష్టభాషాకవిత్వశ్రీ గలవాడనియు ప్రశంసింపబడెను.

* ఈ శాసనకాలమును గురించి విమర్శకులలో నభిప్రాయభేదము కొంత

ఉత్తరహరివంశము హరివంశమునందలి రెండవభాగము. ఎఱ్ఱాప్రగడకవి హరివంశమును సంపూర్ణముగా నాంధ్రీకరించిన ట్లిదివరలో చదివియున్నాము. హరివంశములోని యుత్తరకథలను కొన్నిటిని నాచనసోమనాథుడు స్వతంత్రధోరణిలో పెంచియు తుంచియు వ్రాసెను. సందర్భానుసారముగా వర్ణనములను విస్తరించి చేసెను. ఎఱ్ఱనార్యుడు వీలైనంతవరకు మాతృక ననుసరించుచు విశేషవర్ణనలు గావింపక సంగ్రహముగ వ్రాసెను. ఈతనిది మృదుసులభశైలి. నాచనసోముడు మూలకథలలో కొన్నిటిని మాత్రమే చేబట్టి రసవంతముగ పెంచి వ్రాయుచు ప్రబంధ మార్గము నవలంబించెను. ఈతని శైలి మిక్కిలి ప్రౌఢమై తరుచు దీర్ఘసంస్కృతసమాసములు గలిగి జటిలముగ నుండును. నాచనసోముని యుత్తరహరివంశములో నరకాసురవృత్తాంతము, శ్రీకృష్ణుడు బ్రాహ్మణకుమారుని తెచ్చినకథ, శ్రీకృష్ణుడు కైలాసమునకు దపము చేయబోవుట, ఉషా అనిరుద్ధుల ప్రేమకథ మొదలగు సంఘటనలు కలవు. ఈ కథలు ఎఱ్ఱనార్యుని హరివంశమునందును వచ్చినవి. ఇట్లు సమానమైన కథాఘట్టములను పోల్చి చూచినచో ఎఱ్ఱనసోమనగార్ల కవితాశిల్పము విశదమగును.

నాచనసోముడు తన గ్రంథమును తిక్కనసోమయాజివలె హరిహరనాథదేవునకు కృతి సమర్పించెను. ఈతనికి తిక్కనా

---

గలదు. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మున్నగు వారు పెంచుకలదిన్నె శాసనము క్రీ. శ. ౧౨౮౦ నాటిదని యూహించుచున్నారు దీనివలన నాచనసోముడు ఎఱ్ఱాప్రగడకవికి సమకాలికుడగుచున్నాడు.

మాత్యునిపై భక్తిగౌరవములు అపారము. ఉత్తరహరివంశపు ఆశ్వాసాంతగద్యములలో నీతడు తిక్కనసోమయాజిపై తనకు గల భక్తి తాత్పర్యములను ప్రదర్శించెను. మరియు నీ గద్యములందు సోమనాథుడు తనను గురించి పెక్కు విశేషములు వేసికొనెను. సకలభాషాభూషణ, సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీనగుణసనాథ ఇటువంటి వీతని విశేషణములు. నాచనసోమునితో పోల్చినప్పుడు ఎఱ్ఱనార్యుడు మిక్కిలి వినయశీలుడుగా తోచును నాచనసోముడు తాను ధరించిన బిరుదులకు అర్హుడనుటలో సందేహములేదు. చిన్నయసూరి, వీరేశలింగము పంతులుగారు మున్నగువారు నాచనసోముడు కొన్ని సందర్భములలో కవిత్రయము వారికన్న కూడ మించిన ప్రతిభాశాలి యని తలచిరి. ఈతనికి సంస్కృతాంధ్రములు రెండును అనర్గళధారగా నడుచును. గొప్ప భావనాశక్తి గలవాడు. పద్యమునందలి వర్ణనము కన్నులకు కట్టినట్లు వ్రాయుటలో ఈతనిశక్తి యద్భుతము. ఈవిషయములో నితడు యెఱ్ఱాప్రగడకవిని మించును. ఔచిత్యపోషణమునందు ఎఱ్ఱనార్యుడు నాచనసోముని మించును.

నాచనసోముని శైలి ప్రౌఢిగలది యని చెప్పనైనది. ఒక్కొక్కప్పుడీ మహాకవి మిక్కిలి రమ్యమైన సులభశైలి వ్రాయుచుండును. ఈతనికి సామెతలు వాడుటయం దెంతయో ప్రీతి సామెతలను జాతీయములను సోముడు ముచ్చటగా పద్యములలో గూర్చుచుండును. ఈతడువాడిన కొన్ని సామెతలు, చిలు

కవోయిన పంజరమేమి సేయు' 'ఎంతదఱిగిన మిరియాలు జొన్నలు సరిపోవే' 'శిరసుండగ మోకాలను సేసలు వెట్టుట' తగునే కఱకుట్లను చంకబొత్తముల్ 'వరుగుతో దాగరయు నెండ వలసినట్లు'. పద్యరచనమునందు నాచనసోమనాథుడు గొప్ప ప్రతిభావంతుడైనను గద్యశైలియందీతడు ఎఱ్ఱాప్రగడకు సరి కాజాలడు. సోముని వచనములు పద్యముల కన్నను కష్టములై ప్రౌఢశైలిలో నున్నవి. ఎఱ్ఱన గద్యశైలి ప్రసన్నమై సులభముగ నుండును. మొత్తము మీద నాచనసోముడు భారతకవులకన్న కుమారసంభవము వ్రాసిన నన్నెచోడకవికి దగ్గరవాడు. పూర్వకవులలో వీరిద్దరును ప్రబంధవర్ణనములకు బాట వైచినవారు. తరువాతి ప్రబంధకవులు దీర్ఘవర్ణనములను ప్రౌఢ గద్యపద్యశైలిని నాచనసోమనాథునివద్ద నేర్చుకొనిరని చెప్పవచ్చును.

## రావిపాటి తిప్పన్న.

తిప్పన్న యను పదము త్రిపురాంతక శబ్దమునుండి పుట్టినది. ఈ కవి యాంధ్రమున మదనవిజయము, అంబికాశతకము, త్రిపురాంతకోదాహరణము, తారావళి యను గ్రంథములును సంస్కృతమున ప్రేమాభిరామ మనువీథి నాటకమును రచించినట్లు తెలియుచున్నది. సంస్కృతప్రేమాభిరామము ననుసరించి శ్రీనాథుడు వినుకొండ వల్లభరాయని పేర క్రీడాభిరామమను వీథినాటకమును తెలుగులో వ్రాసెను. రావిపాటి తిప్పన్న క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమువాడని వీరేశలింగముపంతులుగారు

వ్రాసిరి. క్రీడాభిరామములో రెండవప్రతాపరుద్రుని కాలపు ఓరుగల్లు విశేషములు వర్ణింపబడినవి. ఈ వర్ణనలు ప్రేమాభిరామములోనుండియే శ్రీనాథుడు గ్రహించి యుండును. కావున ప్రేమాభిరామమును వ్రాసిన రావిపాటి త్రిపురాంతకుడు ఓరుగల్లు వైభవమునుజూచి యుండుననియు, ఈతడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాడై యుండుననియు కొందరు తలచుచున్నారు.

ఈ కవి కులగోత్రాదులు తెలియవు. ఈతడుశివభక్తిపరాయణుడు. శృంగారరస ప్రియుడు. అంబికాశతకమునందు భక్తిరసముకన్న శృంగారరస మెక్కుడుగా నున్నది. కవిత్వము రసవంతమై భావగర్భితమై యున్నది. త్రిపురాంతకోదాహరణము శివస్తుతిపరమైన చిన్న కావ్యము. ఉదాహరణములు ఆంధ్రభాషకు ప్రత్యేకమైన రచనలు. ఉదాహరణ మనగా విభక్తికి ఒక్కొక్క పద్యము చొప్పున ఏడువిభక్తులలోను పద్యములుచెప్పుట. ఒక్కొక్క పద్యము తరువాత కలిక, ఉత్కలిక అను రగడభేదములను గూర్చవలెను. ఉదాహరణము చివర సప్తవిభక్తులు గల ఒక పద్యముండును. ఉదాహరణకావ్యములు దేవతాస్తుతికై వ్రాయబడు చుండెడివి. శివకవులు ఉదాహరణము వ్రాయుటలో మొదటివారు. తరువాత వైష్ణవకవులుగూడ ఉదాహరణములు

* ఆంధ్రకవితరంగిణి; బ్రహ్మశ్రీచాగంటి శేషయ్యగారు. నాల్గవ సంపుటము.

చెప్పిరి. ఎఱ్ఱనయుగమున భారతరామాయణహరివంశముల యాంధ్రీకరణము ముగిసెను. ఇప్పటినుండియు కవులదృష్టి సంస్కృతమునందలి యితర పురాణములపై ప్రసరింప జొచ్చెను.

# ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

## ఏడవ ప్రకరణము

### శ్రీనాథయుగము క్రీ. శ. ౧౩౮౫—౧౫౦౦

కవిత్రయము వారి తరువాతి ప్రబంధయుగమువరకు గల కాలమును శ్రీనాథయుగముగా తీసికొన్నాము. ఇతర కవుల మాట యటుంచి ఈ కాలమున శ్రీనాథుడు, బమ్మెరపోతన ముఖ్యమునిగా పేర్కొనదగిన మహాకవులు. వీరిలో కూడ పోతనామాత్యునికంటె శ్రీనాథు డనేకగ్రంథములు రచియించినవా డగుటచే నీతనిని ఈయుగమునకు నాయకునిగా స్వీకరించితిమి. శ్రీనాథుడు దీర్ఘకాలము జీవించి, అనేకగ్రంథములు వ్రాసి, వివిధ ప్రభువుల నాశ్రయించి, దేశాటనము చేసి, గొప్ప వైభవమును తుదకు లేమినికూడ అనుభవించెను. ఆంధ్రదేశముయొక్క తూర్పుభాగమును పరిపాలించిన రెడ్డి రాజులతో శ్రీనాథునకు సన్నిహిత సంబంధము కలదు. శ్రీనాథుడు రెడ్డివారి కవి యని లోకములో వాడుక ప్రబలినది. కొండవీటి రెడ్డిరాజ్యమునందును అది యస్తమించినవెనుక రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమునందును శ్రీనాథునకు ఆశ్రయము లభించెను. శ్రీనాథుని జీవితకాలము క్రీ. శ. ౧౩౭౫-౧౪౫౫ వరకును గ్రహింపవచ్చును.

శ్రీనాథుడు పాకనాటి నియోగిబ్రాహ్మణుడు. తిక్కనామాత్యుని తాతయైన మంత్రి భాస్కరుఁ వలెనే, శ్రీనాథుని తాత

ద్యైన కమలనాభామాత్యుడు కూడ పేరువడసిన కవియట. తనతాత పద్మపురాణసంగ్రహము వ్రాసెనని శ్రీనాథుడు చెప్పెను. శ్రీనాథుడు బాల్యమునందే గొప్ప పాండిత్యమును కవిత్వపై పుణ్యమును అలవరచుకొనెను. †మిక్కిలి లేత వయస్సునందే తాను గ్రంథరచనగావించినట్లు శ్రీనాథుడు కాశీ ఖండములో చెప్పుకొన్నాడు. ఈతని బాల్యమునాటి కావ్యములు మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్యచరిత్రము, పల్నాటివీరచరిత్రలో కొంత భాగము. వీనిలో మొదటి మూడును ఇప్పుడు లభించుటలేదు. హాలుడు ప్రాకృతములో వ్రాసిన గాథాసప్తశతి పద్యములనే శ్రీనాథుడు శాలివాహనసప్తశతిపేర నాంధ్రీకరించి యుండును. శ్రీనాథునకు మొదటినుండియు శృంగారముపై ప్రీతి మెండు. గాథాసప్తశతి శృంగార పద్యములకు పుట్టినిల్లు. పాల్కురికి సోమనాథుడు వ్రాసిన ద్విపద పండితారాధ్యచరిత్రము ననుసరించి శ్రీనాథుడు తన కావ్యమును పద్యములలో వ్రాసియుండును. దీని నాతడు మామిడి సింగనమంత్రి యన్న యగు పెద్దయ్యకు కృతి యిచ్చె నని నైషధములో నున్నది. పల్నాటివీరచరిత్ర ద్విపదప్రబంధము. పల్నాటివీరుల శౌర్యము, కారెంపూడి యుద్ధము, బ్రహ్మనాయకుడు, బాలచంద్రుడు, నాగమ్మ మొద

---

† ఈతడు శివభక్తుడు. శ్రీనాథుని జననము క్రీ. శ. ౧౩౬౫ కావచ్చు నని వీరేశలింగము పంతులుగారును. క్రీ.శ. ౧౩౮౫ కావచ్చునని బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రులవారును అభిప్రాయ పడిరి.

లగువారివృత్తాంతము ఈ ద్విపదకావ్యములో వర్ణితములైనవి. శ్రీనాథుడు పల్నాటివీరచరిత్రనంతను వ్రాయలేదు. బాలచంద్ర యుద్ధముమాత్రమే యీతని రచన యని విమర్శకులు తలచుచున్నారు.

ఇట్లు మొదట చిన్నచిన్నకృతులను వ్రాసి పేరు సంపాదించి శ్రీనాథుడు ఉద్గ్రంథములు వ్రాయ బూనుకొనెను. క్రమముగా నాతడు గ్రామవాతావరణమును వీడి రాజాస్థానములకు చేరుకొన జొచ్చెను. శ్రీనాథుని మొదటి గొప్పకావ్యము 'శృంగారనైషధము'. దీని నాతడు కొండవీటిప్రభు వైన పెదకోమటి వేమారెడ్డి మంత్రి మామిడి సింగనామాత్యునకు అంకిత మొనర్చెను. మామిడిసింగనకూడ విద్యాధురీణుడే. సంస్కృతమునందు శ్రీహర్షపండితుడు వ్రాసిన నైషధీయ చరితమునకు శృంగార నైషధము ఆంధ్రీకరణము. నలదమయంతుల ప్రేమయు వారి వివాహము, సుఖజీవితము, నైషధములో వర్ణింపబడినవి. ఇందు చక్కని వర్ణనలు కలవు శ్రీనాథుని శైలి నైషధమునందు మిక్కిలి ప్రౌఢముగా నున్నది. తన గొప్ప పాండిత్యము నీతడు దీనిలో ప్రదర్శించెను.

నైషధరచనవలన శ్రీనాథునికీర్తి స్థిరపడెను. పెదకోమటి వేమారెడ్డి యీతనిని తన రాజ్యములో విద్యాధికారిగా నియమించెను. ఆస్థానమునకు వచ్చిన విద్వాంసుల పరీక్షచేసి వారికి బహుమతు లిప్పించుటయు, రాజశాసనములు వ్రాయించుటయు,

రాజునకు గ్రంథరచనమునందు తోడ్పడుటయు విద్యాధికారి కృత్యము. పెదకోమటి వేమారెడ్డి స్వయముగ గొప్పవిద్వాంసుడు. ఈతనికి 'సర్వజ్ఞ'అను బిరుదుండెను. వేమారెడ్డి సంస్కృతమునందలి యమరుకశతకమునకు సంస్కృతమునందే వ్యాఖ్య రచించెను. సాహిత్యచింతామణి, యను అలంకారశాస్త్ర గ్రంథమునుకూడ పెదకోమటి వేముడు సంస్కృతమునఁ రచించెను. ఈ కాలపు రెడ్డిరాజులు పలువురు గొప్ప విద్యాధికులుగా నుండుట గాన్పించును. పెదకోమటివేమునికి ముందు కొండవీడేలిన కొమరగిరిరెడ్డి యను రాజు సంస్కృతములో 'వసంతరాజీయము' అను నాట్యశాస్త్ర గ్రంథము వ్రాసెనట. కొమరగిరిరెడ్డి బావమరదియు మేటివీరుడును అగు కాటయవేమారెడ్డికూడ గొప్ప విద్వాంసుడు. ఈతడు మహాకవి కాళిదాసు నాటకత్రయమునకు సంస్కృతములో వ్యాఖ్య గావించెను.*శ్రీనాథుడు పెదకోమటివేమారెడ్డికి శాస్త్రములు ఆగమములు, పురాణములు విన్పించుచుండెను.

కొండవీటి రెడ్డిరాజ్యము క్రీ. శ ౧౪౨౪ ప్రాంతమున అస్తమించెను. శ్రీనాథునకు అశ్రయము నశించెను. కావున నాతడు దేశాటనముచేయబూనెను. ఈ పర్యటనకాలములో నీతడు కాంచీపురమున కేగి యచ్చట అవచి దేవయ, తిప్పయ యను

---

* ఈ రెడ్డిరాజులుగొప్ప పండితులై కీర్తిపొందుటయే కాక దేశోపయోగమైన పను లెన్నియో గావించిరి. వీరు చెరువులు కాలువలు త్రవ్వించి ప్రజలను సుఖపెట్టిరి.

మహాధనికుడైన వర్తకుని సందర్శించెను. తిప్పయసెట్టికి కొండవీటి రెడ్డిరాజులతో వ్యాపారసంబంధ ముండెను. శ్రీనాథుడు తాను వ్రాసిన 'హరవిలాసము' అను మహాకావ్యమును అవచి దేవయతిప్పయకు అంకిత మొనర్చెను. హరవిలాసము చాలవరకు శ్రీనాథుని స్వతంత్రకావ్య మనిచెప్పవచ్చును. ఇందులో శివుని లీలలు చక్కనికవిత్వములో వర్ణింపబడినవి. నైషధకావ్యము సంస్కృతపదములతోను సమాసములతోను నిండియుండెను. హరవిలాసమునందుకూడ సంస్కృతశైలి కలదు కాని దీనిలో జాతీయమైన రచనకూడ చాల కలదు. శ్రీనాథుడు గొప్ప పండితుడుమాత్రమే కాడు. అతనికి లోకానుభవము మెండు. భావనాశక్తియు వర్ణనాచతురతయు ఆతని కపారము. ఈలక్షణములు హరవిలాసములో చక్కగా కనిపించును.

దేశసంచారము చేయుచు రాజాస్థానముల సందర్శించుచు శ్రీనాథుడు విద్యానగరమున కేగి ప్రౌఢదేవరాయలచే కనకాభిషేక గౌరవమును పొందెను. రాయల యాస్థానమునందు గౌడడిండిమభట్టు అను మహావిద్వాంసు డుండెను. ఈతడు తన పాండిత్య నిరంకుశత్వమును చాటుటకై కంచుఢక్క నుంచుకొనెనట! శ్రీనాథు డితని వాదములో గెల్చి వాని కంచుఢక్కను పగుల గొట్టించెనట! శ్రీనాథుని యద్భుతపాండిత్యమునకు మెచ్చి ప్రౌఢదేవరాయ లితనికి 'కవిసార్వభౌమ' బిరుదమును ప్రసాదించి బంగారు నాణెములతో నభిషేక మొనర్చెను. ఈ కాలముననే

శ్రీనాథుడు రాచకొండ పద్మనాయక రాజగు సర్వజ్ఞ సింగ భూపాలుని యాస్థానమును సందర్శించెను. కొండవీటి రెడ్డి రాజులవలెనే రాచకొండ వెలమరాజులలో కూడ పలువురు గొప్పవిద్వాంసులుండిరి. రసార్ణవసుధాకరము మొదలగు సంస్కృతగ్రంథములను వీరు వ్రాసిరి. దేశపర్యటన సందర్భము ననే శ్రీనాథుడు తెలుగురాయుడు, పంటమైలారవిభుడు, వినుకొండ వల్లభరాయుడు మొదలగు చిన్న చిన్న పాలకప్రభువులను చూచి వారి గౌరవ బహుమానముల నందుకొనెను. వీరిలో వినుకొండ వల్లభరాయుడు క్రీడాభిరామము అను గ్రంథమును వ్రాసెను. ఈ గ్రంథరచనమునందు శ్రీనాథుడీతనికి చాలవరకు తోడ్పడె నని క్రీడాభిరామ శైలినిబట్టి యూహింపవచ్చును.

శ్రీనాథకవిసార్వభౌముడు దేశసంచారమును ముగించు కొని రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమును చేరెను. కొండవీటి ప్రభువగు కొమరగిరిరెడ్డి యీ రాజ్యమును తన బావమరదియైన కాటయవేమారెడ్డికి నిచ్చెను. కాటయవేముని కూతురు అనితల్లి మూలమున రాజమహేంద్రవరరాజ్యము అల్లాడరెడ్డికుమారుడు వీరభద్రారెడ్డికి సంక్రమించెను. వీరభద్రారెడ్డిమంత్రియైన బెండ పూడిఅన్నమంత్రి శ్రీనాథుని బంధువర్గములోనివాడు. కావున శ్రీనాథుడితనిని దర్శించి యాతనికి 'భీమఖండము' అను కృతిని సమర్పించెను. భీమఖండము ద్రాక్షారామభీమేశ్వర దేవుని లీల లను వర్ణించు మహాకావ్యము. కవిత్వము మిక్కిలిప్రౌఢము; రసవంతము. గోదావరతీరమును శ్రీనాథుడు చక్కగా వర్ణించి

నాడు. బెండపూడిఅన్నయమంత్రిద్వారా శ్రీనాథునకు వీరభద్రా రెడ్డి పరిచయము లభించెను. 'కాశీఖండము' అను మహాప్రబంధ మును వ్రాసి శ్రీనాథుడు వీరభద్రారెడ్డికి అంకిత మొనర్చెను. కాశీక్షేత్రమాహాత్మ్యము, ఇతరపుణ్యకథలును ఈ కావ్య ములో వర్ణింపబడినవి. పుణ్యప్రబంధములందుకూడ శ్రీనాథునకు శృం గారవర్ణనములు ప్రీతిదాయకములు. భీమఖండ కాశీఖండములలో శ్రీనాథుని కవిత్వము మహోన్నతస్థితికి వచ్చినది. సంస్కృతాం ధ్రములందాతని ప్రజ్ఞ నిరంకుశము. ప్రౌఢకవిత్వముతో పాటు శ్రీనాథుడు రమ్యమైన మృదుశైలిగల పద్యములనుగూడ వ్రాయు చుండును. ఈతడు గొప్ప పండితుడయ్యు చక్కనివచనశైలిని కూడ అప్పుడప్పుడు రుచిచూపించు చుండును. కాశీఖండమందలి 'గుణనిధి' యను బ్రాహ్మణకుమారుని కథ రమ్యముగా నున్నది.

రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము క్రీ. శ. ౧౪౪౦ నుండి క్షీణించెను. మరికొంత కాలమునకు, కటక రాజులు ఈ రాజ్యమును తుదముట్టించిరి. శ్రీనాథకవిసార్వభౌమునకు తిరిగి యాశ్రయము నశించెను. ఆతని కవిత్వమును పోషించు దేశీయప్రభువు లందరును కాలగతులైరి. ఈ కాలమున నీతడు 'శివరాత్రిమాహాత్మ్యము' అను కావ్యమును వ్రాసి శ్రీశైలక్షేత్రనివాసియైన ముమ్మడిదేవ శాంతయ్యకు అంకిత మొనర్చెను. ఇది యాతని కడపటి గ్రం థము. దీనిలోనికవిత్వముకూడ ప్రౌఢశైలిలోనే ఉన్నది. కాని వార్ధక్యమందలి గ్రంథ మగుట చేత కంబోలు ఆతని యితరగ్రం థము లంత రసవంతముగా లేదు.

రాజాశ్రయము నశించుటచేత శ్రీనాథకవిసార్వభౌముడు మిక్కిలి వృద్ధాప్యమునందు వ్యవసాయవృత్తి నవలంబించెను. కృష్ణాతీరమందలి బొడ్డుపల్లెయను గ్రామమును ఒడ్డెరాజులనుండి గుత్తకుతీసికొని కృషినారంభించెనట. కాని యిందులో నాతడు విజయము నందలేక పన్నులు బాకీపడెను. ఒడ్డెరాజుల యధికారులు పన్నులకై శ్రీనాథుని చెరపెట్టి ఎంతయో బాధించి యవమానించిన ట్లొకచాటుపద్యమువలన తెలియవచ్చుచున్నది. ఈమహాకవి క్రీ. శ. ౧౪౪౫ ప్రాంతమున అస్తమించి యుండును. శ్రీనాథు డెన్నియో చాటుపద్యములను సందర్భానుసారముగా చెప్పుచువచ్చెను. ఈ పద్యములుకూడ రసవంతములుగను చమత్కారముగను ఉండును. కొండవీటి దుర్గమును గురించియు, పల్నాటినిగురించియు, రావుసింగభూపాలుని యాస్థానము దర్శించినప్పుడును శ్రీనాథుడు చెప్పిన పద్యములు ప్రసిద్ధములు. జీవిత వైభవమునందును, కవిత్వ వైభవమునందునుకూడ ఈమహాకవికి ఆంధ్రకవులలో ప్రత్యేకస్థానము కలదు.

### వినుకొండ వల్లభరాయడు.

ఈతడు క్రీడాభిరామ మను వీధినాటకమును రచించెను. ఈ కవి శ్రీనాథునకు సమకాలికుడు. వల్లభరాయని తండ్రితాతలు విజయనగర ప్రభువులయొద్ద నుద్యోగులుగ నుండిరి. శ్రీనాథుడు దేశాటనము చేయు సందర్భమున వల్లభరాయనికడ కేగి యాతడు రచించుచున్న క్రీడాభిరామమునం దాతనికి తోడ్పడి

యుండును క్రీడాభిరామపద్యముల శైలి చాలవరకు శ్రీనాథుని కవితాశైలినిపోలి యుండుటచే ఇట్లూహింపనైనది. రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము ననుసరించి క్రీడాభిరామము వ్రాసినట్లు ఆ గ్రంథ పీఠికలో నున్నది. 'వీధి' యను నది సంస్కృతనాటకములలో నొక విభాగము. ఇది శృంగారబహుళమైన యొక చిన్న నాటకము. ఇందొకటిరెండు పాత్రములును, శృంగార వర్ణనలు నుండును. క్రీడాభిరామమునందు వర్ణింపబడిన దృశ్యములకు స్థానము ఓరుగల్లునగరము. రెండవ ప్రతాపరుద్రచక్రవర్తి కాలములో ఈపట్టణవైభవ మెట్లుండెడిదో క్రీడాభిరామము చదివిన గోచరించును. గోవిందశర్మయను బ్రాహ్మణుడును ఆతని మిత్రుడు టిట్టిభసెట్టియు ఓరుగల్లు వీధులలో తిరుగుచు అక్కడ తమ కెదురుపడిన శృంగారదృశ్యములను వర్ణింతురు. ఓరుగల్లు కోటను, అగడ్తనువంకదారులను, రథగజయానములతో నిండి నడువ దారిలేకుండ నున్న రాజమార్గములను ఈ మిత్రులు చూచిరి. ఆ మహానగరమందెన్నియో గొప్ప దేవాలయములు వారి కంట బడెను. తురకలమసీదు కూడ నుండెనట. ప్రతాపరుద్రచక్రవర్తి యభిమానించిన మాచల్దేవి యను వారాంగన యొక్క చిత్రశాలను వారు వీక్షించిరి. పామరజనుల వేడుకలుకూడ క్రీడాభిరామములో వర్ణింపబడినవి. జూదము, కోడిపోరు, పొట్టేళ్ళపోరు జక్కులవాండ్రపాటలు, మైలారదేవునిభటుల వీరకృత్యములు ఇట్టివెన్నియో ఈ మిత్రులకు వేడ్కగొలిపెను. కాకతీయుల నాటి ప్రజాజీవితము క్రీడాభిరామములో చక్కగా ప్రతిఫలించినది.

## బమ్మెరపోతన.

బమ్మెర పోతనామాత్యుడు సంస్కృతమునందలి శ్రీమద్భాగవతము నాంధ్రీకరించిన మహాకవి. తెనుగు భారతభాగవతములు ఆంధ్రదేశమందలి పల్లెపల్లెలలోను వ్యాపించినవి. గ్రామజనులుకూడ వీటిని ఆదరముతో చదువుచుందురు. ఇవి తెలుగువారి జాతిసొత్తులు. ఆంధ్రభాగవతమును వ్రాసిన పోతనామాత్యుడు కవిత్రయమువారి తరువాత ప్రజాదరమును అధికముగా పొందిన కవిపతంసుడు. ఈతడు శ్రీనాథునకు సమకాలికుడై క్రీ. శ. ౧౪౦౦-౧౪౭౦ ల నడుమ నుండినట్లు ఊహింపబడుచున్నది. పోతనామాత్యుని నివాసస్థానము పూర్వము ఏకశిలానగర మనబడు ఓరుగల్లు పట్టణము. ఇదియిప్పుడు వరంగల్లు అనబడుచు తెలంగాణమునందున్నది. ఏకశిలానగరమనగా కడప మండలమందలి ఒంటిమెట్ట గ్రామమని కొందరు తలచిరి. కాని ఇది సరికాదు. ఏకశిలానగర మనుపేరు ప్రాచీన గ్రంథములలోను శాసనములలోను కూడ వరంగల్లు పట్టణమునకే చెల్లుచున్నది. *పోతరాజు ఇంటిపేరు బమ్మెరవారు. బమ్మెరయనుగ్రామము నల్లగొండ

* పోతనజన్మస్థానము ఒంటిమెట్ట యని వాదించినవారు ఆంధ్రవాఙ్మయ బిరుదాంచితులైన వావిలికొలను సుబ్బారావుగారు. వీరేశలింగముపంతులుగారుకూడ ప్రథమమున ఈమతమునే వహించిరి. ఈవిషయమై సమగ్రకృషిసల్పి, పోతనజన్మస్థానము వరంగల్లని స్థాపించిన కీర్తి శ్రీ శేషాద్రిరమణకవులకు దక్కినది. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారును వీరేశలింగముపంతులుగారును తరువాత ఈ సిద్ధాంతమును బలపరచిరి.

జిల్లాలోని జనగామ తాలూకాలోనిది. ఓరుగల్లునకు కొంత సమీపమున నున్నది. పోతనామాత్యుని శిష్యులైన వెలిగందలనారయ, ఏర్చూరిసింగన కవుల యింటిపేళ్ళు బరగిన వెలిగందల, ఏర్చూరు గ్రామములుకూడ తెలంగాణమునందే యున్నవి. కావున మహాకవియు, భక్తాగ్రేసరుడును నగు పోతనామాత్యుని జన్మముచే పవిత్రత నొందిన భాగ్యము తెలంగాణమునకు దక్కుచున్నది.

పోతరాజు నియోగిబ్రాహ్మణుడు. ఈతని తండ్రి కేసన మంత్రి. తల్లి లక్కసానమ్మ. పోతనామాత్యుడు తన తల్లిని భక్తిప్రేమలతో స్తుతించి ధన్యుడయ్యెను. పోతనవిద్యాగురువెవ్వరో తెలియదు. ఈతడు సహజ పాండిత్యయను బిరుదును గద్యలో వేసికొనెను. పోతన మిక్కిలి వినయశాలి. ఈతడు భాగవతములో కుకవినింద చేయలేదు. వర్తమానకవులను భావికవులనుకూడ గౌరవముతో సంబోధించెను. పూర్వకవులలో నన్నయతిక్కనలను భక్తితో కొనియాడెను. తనను ధన్యాత్ముని చేయుతలంపుతోనే వాడు భాగవతము నాంధ్రీకరింపక తనవంతుకు విడిచి రని కృతజ్ఞతతో పలికెను. పోతనవంశము వారు శివభక్తులు. పోతరాజుకూడ శివభక్తుడే. పరమేశ్వరుని కరుణచే తనకు కవిత్వమలవడినట్లు పోతనామాత్యుడు భాగవతగద్యలో చెప్పుకొనెను. అయినను ఈ మహాకవి విష్ణుభక్తిప్రతిపాదకమైన భాగవతమును వ్రాసి తన యద్వైతబుద్ధిని ప్రకటించెను. పోతనామాత్యుడును శ్రీనాథుడును బావ, మరదు లైనట్లు లోకములో కథలు గలవు.

ఇవి సత్యకథ లనుటకు నాధారములు లేవు. శ్రీనాథుడు పాకనాటి వాడు. బమ్మెరపోతన తెలంగాణమునివాసి. ఈ కాలమునందు వలె ఆ కాలమునందు దూరబాంధవ్యము లుండియుండుట సందేహాస్పదము.

పోతనామాత్యుడు వ్యవసాయవృత్తిచే జీవించి యుండును. రాజుల నాశ్రయించుటయు వారికి గ్రంథములు కృతి యిచ్చి ధనార్జనము చేసి భోగభాగ్యముల ననుభవించుటయు పోతనకు గిట్టకుండెను. ఈ గుణములో శ్రీనాథునకును పోతనకును ఎంతయో భేదము కలదు. పోతన తన భాగవతమును రాజుల కివ్వనొల్లక శ్రీరామచంద్రునకు సమర్పించెను. భూపాలురకు గ్రంథములు కృతి యిచ్చుట పాపహేతు వని యీమహాకవి 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి' యనుభాగవతపద్యములో చాటెను. కవిత్వ మొక పుణ్యకళ యనియు, దానిని భగవంతుని యారాధనమునందు వినియోగించుట మోక్షదాయక మనియు తిక్కనామాత్యుడు వచించెను. బమ్మెరపోతరాజుకూడ ఇట్టి మహోన్నత భావమునే కలవాడు. ఈ యుదారాశయమును పోతన పలుమార్లు తన గ్రంథములో ప్రకటించెను. హరినామస్తుతి సేయు కావ్యము బంగారు కమలములతో విరాజిల్లు మానససరోవరము వంటి దనియు, హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థములు కలదయ్యు పాపిష్టి గొయ్యివంటి దనియు ఈ మహాకవి యుద్బోధించెను. భాగవతరచనము చేయు నాటికి పోతనామాత్యుని మనస్సు ఈ విధముగా నుండెనను జీవితము మొదటినుండియు

ఈతడు నరస్తుతి విముఖుడు కాడని తోచును. ప్రారంభమునం దీతడు రాచకొండప్రభు వగు సింగభూపాలుని దర్శించి ఆతని భోగకాంతపై 'భోగినీదండకము' అను చిన్న కృతిని చెప్పెను. దీనిలోని కవిత్వము, పదప్రయోగము పోతనశైలిని బాగుగ పోలియున్నది. పోతనామాత్యున కత్యంతప్రీతిపాత్రమైన పదాంతాను ప్రాసరీతియు ప్రౌఢసమాసకల్పనమును ఈదండకములో గూడ గాన్పించును. ఇట్లు పోతరాజు చిన్నతనములో నరాంకితముగ కవిత్వము చెప్పినవాడైనను త్వరలోనే ఈతనికి రాజసేవ మీదను నరస్తుతిమీదను వైముఖ్యము జనించెను. ఆంధ్రకవి ప్రపంచములో పోతనామాత్యునివంటి నిర్భీకుడును నిరాడంబర జీవియు త్యాగరాజస్వామి కాక మరియొకడు లేడనుట అతిశయోక్తి కాదు.

శ్రీమద్భాగవతము నాంధ్రీకరించుటకు ముందుజరిగిన పవిత్ర సన్నివేశమును పోతనామాత్యుడు కన్నులకు గట్టినట్లు వర్ణించెను. శ్రీమన్నారాయణకథా ప్రపంచ విరచనాకుతూహలుడై యీతడుండగా ఒక చంద్రగ్రహణపుణ్యకాల మేతెంచెను. గ్రహణస్నానమునకై పోతన గంగకు జనెనట! ఇచ్చట గంగ యనగా గోదావరినది. దీనికి దక్షిణగంగ యను ప్రసిద్ధి ఆంధ్ర మహాభారతమునందు కూడ గాన్పించుచున్నది. గోదావరిలో స్నానమాడి యచ్చటి యిసుకతిన్నెలమీద పోతనామాత్యుడు మహేశ్వర ధ్యానసిద్ధాగరిష్ఠుడై యుండు సమయమున శ్రీరామచంద్రు డాతనిముందు దోచిన ట్లయ్యెను. అట్లు సన్నిధిచేసిన

రామభద్రుడు భాగవతమును తనపేర ఆంధ్రీకరింపు మనియు, దానివలన సంసారబంధవిమోచనము కలుగుననియు మహాకవికి ఆనతిచ్చెనట. ఇంతటి యుత్తమ ఆధ్యాత్మిక వాతావరణములో జనించిన దగుటచే ఆంధ్రభాగవతము ప్రపంచవాఙ్మయములోని యుద్గ్రంథములలో స్థానము పొందుటకు దగియున్నది. దీనియందు మనము మూడు ముఖ్యలక్షణములను గమనింపవచ్చును. ఒకటి భక్తిసంపద. రెండవది వేదాంతవిస్తరణము. మూడవది రసనిర్భరమైన కవిత్వము. ఈ మూడింటియందు గూడ పోతనామాత్యుడు సాటిలేని మేధావి. భక్తియే యాతని కవిత్వమునకు ప్రాణాధారమువంటిది. ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షణకథ మొదలగు అనేకస్థలములందు దీనిని చూడవచ్చును. భక్తితత్పరుడౌటచే పోతనామాత్యుడు సంస్కృతభాగవతములో లేనియపూర్వభావములనుకూడ ఆంధ్రభాగవతములో చేర్చి తనగ్రంథమును మూలగ్రంథముకన్న పెంచి వ్రాసినాడు. తత్త్వవిషయములను వేదాంతచర్చలనుగూడ పోతన సర్వజనసులభముగా రచించెను. ఈతనిది యద్వైతదృష్టి. ఇక కవిత్వగుణమును చెప్పవలసినప్పుడు పోతరాజు కొన్ని సందర్భములలో కవిత్రయమును గూడ మించిపోయిన మహాకవి యని విమర్శకుల యభిప్రాయము. అర్థగౌరవమును, పదములువాడుటలో పొందుపును కవిత్రయమువారి కవితాలక్షణములు. భావావేశమునందును పాఠకుని తనవెంట లాగుకొనిపోగల కవిత్వపు ఆకర్షణశక్తియందును పోతనామాత్యుడు మిన్న. తన భక్త్యావేశముచేత నీతడు నాస్తికహృదయమునందు

కూడ అప్పటికి భక్తి జనించునట్లు వ్రాయగలడు. ఈతనికి భక్తిర సముతోపాటు శృంగార రసవర్ణనముకూడ ప్రీతిదాయకము. దశమస్కంధములోని శ్రీకృష్ణచరిత్రయందు పోతరాజు భక్తి శృంగారములను విశేషముగ జూపెను. శ్రీకృష్ణుని బాల్యచరిత్ర నుదర్శించుటలో నీత డెంతయో మెలకువ ప్రదర్శించెను. బాలుర క్రీడాదికము నీమహాకవి చక్కని పరిశీలనతో తిలికించి వ్రాసెను. ఐశ్వర్యము, ధనము మానవునకు మదము పెంచు ననియు, దారి ద్ర్యమే మేలనియు చాటి బమ్మెరపోతరాజు నిక్కముగా రైతు కవియు, పేదకవియు, ప్రజాకవియు అయినాడు.

ఆంధ్రభాగవతములో కొన్ని స్కంధములు పోతన రచి తములుగా లేవు. పంచమషష్ఠస్కంధములును, ఏకాదశద్వాదశ స్కంధములును అక్కడక్కడ మరికొన్ని భాగములును ఇతర కవులు రచించిరి. రాచకొండ వెలమరాజగు సింగభూపాలుడు భాగవతమును తనకు కృతి యిమ్మని పోతనామాత్యుని కోరె ననియు ఆత డంగీకరింపనందున రాజుకోపించి భాగవతమును పాతిపెట్టించె ననియు, ఆకారణమున ఆంధ్రభాగవతములో కొన్ని భాగములు నశించగా, పోతన శిష్యులు దానిని పూరించి రనియు లోకములో కథ చెప్పుదురు. ఈ కథ విశ్వసనీయము కాదు. సింగభూపాలుని వంటి మహావిద్వాంసుడు సరసుడు అయిన రాజు ఈ యకృత్య మును చేసియుండడు. పోతనామాత్యుడు స్వయముగ తన శిష్యుల ననుగ్రహింపగోరి భాగవతమునందలి చిన్నచిన్న స్కంధము

లను వ్రాయుపని వారికి ప్రసాదించి యుండును. భాస్కర రామాయణములో భాస్కరమహాకవియు, ఆతనిపుత్త్రుడును శిష్యుడును పాల్గొనలేదా! అట్లే యిచ్చటను జరిగి యుండును. భాగవతములోని పంచమస్కంధమును గంగనకవియు, షష్ఠస్కంధమును ఏర్చూరిసింగనయు, ఏకాదశద్వాదశములను వెలిగందలనారయకవియు రచించిరి. వీరిలో ఏర్చూరిసింగకవి మిగిలినవారికన్న సమర్థుడు. స్వతంత్త్రకవిగాగల ప్రతిభ యీతనికున్నది. భాగవతమునునిర్వహించుటకు పోతనామాత్యుడొక్కడే యర్హతముడు. భాగవతరచనకు కావలసిన భక్తిసంపద ఈ మహాకవియెడ ప్రత్యేకముగ కుదిరినది.

పోతనామాత్యుడు *వీరభద్రవిజయము అను కావ్యమును వ్రాసినట్లు కొందరు తలచుచున్నారు. ఈ యంశమును స్థాపించుటకు నిరాక్షేపమైన సాధనములు కానరావు. దీని కనుకూలప్రతికూల సాక్ష్యములను పేర్కొనవచ్చును. (౧)కృతికర్తృ వంశావతారము భాగవతమునందును వీరభద్రవిజయమునందును నూటికి తొంబదిపాళ్ళపైన సంవదించుచున్నవి. ఒక్క చిన్నయంశములో మాత్రము భేదము కలదు. కాని యది ముఖ్యమైనది. భాగవతకర్త తల్లిపేరు బమ్మెరలక్కసానమ్మగారు. వీరభద్రవిజయకర్త తల్లిపేరు లక్ష్మమ్మ. బమ్మెరపోతనామాత్యుని తల్లి లక్ష్మమ్మయైనచో

* వావిళ్ళవారు ప్రకటించిన వీరభద్రవిజయము ముఖపత్రముపై బమ్మెరపోతనామాత్య ప్రణీత మనియే ముద్రింపబడినది.

నాత డామెను లక్కసానిగా మార్చుటకు కారణము కనబడదు. (౨)భాగవతకర్త తన యింటిపేరును రెండుమూడుసారు లుచ్చరించినాడు. 'బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగాఁ'. వీరభద్రవిజయకర్త తన యింటిపేరు బమ్మెర యని యొక్కమారైన పేర్కొనలేదు. (3) భాగవతకర్త అన్న తిప్పన. వీరభద్రవిజయకర్త అన్నకూడ తిప్పనయే. వీరిద్దరును కేసనమంత్రిపుత్రులే. ఇట్లు భాగవతకర్తయు వీరభద్రవిజయకర్తయు నొక్కరను భావము బలపడుట నిర్హేతుకముగాదు.

కాని దీని కాక్షేపకము లగు కొన్ని బలవత్తరసూచనలు గోచరించుచున్నవి. (౧) ఈ గ్రంథకర్తల తల్లులు వేరుగా కన్పింతురు. (౨) భాగవతకర్తయైన పోతనామాత్యుడు తన గురువును ప్రశంసించలేదు. ఈతడు గురువువద్ద పాండిత్యము నలవరచుకోలేదని చూపుటకు 'సహజపాండిత్య' విశేషణము జ్ఞాపకముగా నున్నది. వీరభద్రవిజయకర్త గురువు ఇవ్వటూరి సోమనారాధ్యుడు. ఈ గురువు ప్రేరణమీదనే పోతనకవి వీరభద్రవిజయరచనకు గడగెను. (౩)బమ్మెరపోతనయే వీరభద్రవిజయమును వ్రాసినచో నాగ్రంథము నాతడెప్పుడు రచించె నను ప్రశ్నకు సమాధాన మీయవలసి వచ్చుచున్నది. వీరభద్రవిజయరచనము భాగవతమునకు పూర్వమా, పరమా? భాగవతమునకు తరువాతనే పోతన వీరభద్రవిజయమును రచించినట్లు ఆగ్రంథములోని యొక పద్యము చెప్పుచున్నది. దక్షయజ్ఞకథాసందర్భమున భాగవతములో శివనింద చేసితి ననియు,

దానికి పరిహారముగా వీరభద్రవిజయము వ్రాయదలచితి ననియు కవి సూచించినవాడాయెను. ఇది సత్యమైనచో భాగవతరచన పూర్వమును, వీరభద్రవిజయ రచన పరమును కావలసియున్నది. ఈ రెండుగ్రంథముల శైలియు పరికించినవారు దీనిని విశ్వసింప జాలరు. భాగవతమునందలి లోకోత్తరభావావేశమండితమును మహోన్నత పాండితీవిలసితమును అగు కవిత్వమెక్కడ, వీరభద్రవిజయపు నీరసబాలకవిత్వ మెక్కడ? కావున ఈ వాదము పొసగదు. వీరభద్రవిజయకవి బాలుడైనట్లు పీఠికలోనే చెప్పబడియున్నది "పిన్నవాడ ననియుపెక్కు సంస్కృతులు వినని వాడ ననియు వెఱవవలదు" అని యివ్వటూరిసోమనారాధ్యుడు వీరభద్రవిజయ కర్తను ప్రోత్సహించెను.

అయినచో వీరభద్రవిజయము బమ్మెరపోతనామాత్యుని బాల్యరచనయందుమా? ఇదియు విశ్వసనీయముగా దోపదు. వీరభద్రవిజయరచనకును భాగవతరచనకును భక్తిపారవశ్యమునందు గాని, భావసాంద్రతయందుగాని, ప్రౌఢసంస్కృతాంధ్రపద సమాసగుంఫనమునందుగాని ఎట్టిపోలికలును లేవు. వీరభద్రవిజయ కర్తకు సమాసము జరుగనేజరుగదు. ఎంత బాల్యకవిత్వమైనను బమ్మెరపోతనగారింత పేలవముగా రచించియుండడు. పోతనామాత్యునికవిత్వమంత ప్రీతిదాయకమైన పదాంతానుప్రాసశైలి వీరభద్రవిజయములో మందునకైన లేదు. ఈ యంశములో భోగినీదండకము భాగవతపదప్రౌఢిమను చక్కగా తలపించు చున్నది. పువ్వుపుట్టగనే పరిమళము పుట్టునట్లు ఒక కవి ప్రతిభా

విశేషము బాల్యమునుండియు నొకరీతిగా నడచుచు వయసు ముదిరినకొలదియు స్థిరపడి పరిపక్వ మగును. వీరభద్రవిజయకర్త భాగవతకర్తగా పరిణమించు నని పరిశీలకులు నమ్మరు. నిర్వచనోత్తరరామాయణములోనే మహాభారతకవి తిక్కన గోచరించుటలేదా?. కావున వీరభద్రవిజయము బమ్మెరపోతనామాత్యుని రచన కాకపోవచ్చు నను భావమే దృఢపడుచున్నది. అట్లయినచో దీనికర్త యెవరై యుందు రనుట యూహలపై నాధారపడి యుండును. బమ్మెరపోతనకు పోతయ యను పేరుగల సవతితమ్ముడుండియుండును. కేసనమంత్రికి లక్కసానియు లక్ష్మమ్మయు నను ఇరువురు భార్య లున్నట్లు ఈగ్రంథములవలన తెలియనగును. లక్కసానియే లక్ష్మమ్మ యనుట కాధారము మృగ్యము. లక్కసానియు లక్ష్మమ్మయు వేరని భావించి, బమ్మెర కేసనామాత్యున కిద్దరు భార్య లనియు ఇద్దరికిని పుత్రద్వయ ముండె ననియు వారిర్వురను తిప్పయ పోతయ యను పేర్లుగలవా రనియు నూహించవలెను. భాగవతకర్త బమ్మెరపోతన శైవాచార సంపన్నుడైనను అద్వైతిగా గాన్పించును. ఈయన విష్ణుస్తుతి పరాఙ్ముఖుడుగాడు. వీరభద్రవిజయకర్త వీరమాహేశ్వరాచారసంపన్నుడు. బహుశః ఇది యాతని తల్లివంశమువారినుండి వచ్చిన యభినివేశమై యుండును. వీరభద్రవిజయకర్త తన తల్లివంకవారిని, ఆమె మాతాపితరులను సోదరుని పేర్కొన్నాడు. బమ్మెర పోతనామాత్యుడు తన తల్లిపుట్టినింటి ప్రశంసచేయలేదు. వీరభద్ర విజయకర్త మాతామహి

వంశమునకు ఇవ్వటూరి సోమనారాధ్యుడు గురువయి యుండును. కేసనమంత్రి కుమారుడైన పెద్దపోతన (భాగవతకర్త) విష్ణుస్తుతి ప్రతిపాదకమైన గ్రంథము రచించుట వీరశైవాచార్యుడగు నీగురువునకు రుచించక పోయియుండును. పోతన సవతి తమ్ముడగు చిన్నపోతన (వీరభద్రవిజయకర్త) కూడ కవిత్వము చెప్ప నేర్చినవా డగుటచే ఆ యువకుని ప్రోత్సహించి ఇవ్వటూరుసోమనారాధ్యు డాతనిచే వీరభద్రవిజయమును చెప్పించియుండును. ఈ యూహ పొసగనిచో ఇవ్వటూరిసోమనారాధ్యుడో లేక ఆతనిప్రేరణచే నాతని శిష్యులో నొక్కరో వీరభద్రవిజయమును వ్రాసి గ్రంథప్రశస్తి నిగోరి బమ్మెరపోతనామాత్యున కారోపించి యుందురని తలపవలెను.

## జక్కన.

ఈ కవి 'విక్రమార్కచరిత్ర' యను కావ్యమును వ్రాసెను. ఈతడు విద్వత్కవి. జక్కన తన కావ్యమును విజయనగరప్రభు వగు దేవరాయల గణకుడు సిద్ధనామాత్యునకు కృతి యొసగెను. దేవరాయలు క్రీ. శ. ౧౪౦౬-౧౪౨౨ ల నడుమ పరిపాలించెను. కావున సిద్ధనామాత్యుడును జక్కనకవియు ఈ కాలమున నుండియుందురు. జక్కన పూర్వీకులు కూడ కవిత్వమున ప్రసిద్ధి కెక్కిరట. ఈతని తాత పెద్దయామాత్యుడు నెల్లూరిరాజులకడ కవియని కీర్తి గడించెనట. కృతిభర్తయైన సిద్ధనామాత్యుని పూర్వీకులుకూడ కవులుగను గణకులుగను పేరు గాంచిరి. సిద్ధన

పెదతండ్రియైన వెన్నెలకంటిసూరకవి రెడ్డివేమనరపాలకునివలన అగ్రహారములు గొనినవాడు. జక్కనకవి చక్కని వైదుష్యమును రసవంతమైన కవిత్వధోరణియు కలవాడు. అవధానకవిత్వమునం దీతడు దిట్ట యని కృతిపతి యీతనిని ప్రశంసించెను.

శ్రీనాథయుగము, పురాణయుగమునకును ప్రబంధయుగమునకును నడిమి కాలము. ఈ యుగమునందలి కవులు పురాణము లనుపేరుతో ప్రబంధములు వ్రాయుచుండిరి. నన్నయనుండి అల్లసానిపెద్దనవరకుగల కాలమును పురాణయుగ మని సామాన్యముగ చెప్పవచ్చును. నన్నయతిక్కనాదులు ధర్మదృష్టితో కావ్యములు వ్రాసిరి. బమ్మెరపోతనామాత్యుడు తక్క శ్రీనాథయుగమువారైన యితరకవులు కళాదృష్టితోను కావ్యానందముకొరకును గ్రంథరచన చేయుచుండిరి. ఈనాటినుండియు శృంగారరసము అగ్రస్థానము వహింపజొచ్చెను. అద్భుతవృత్తాంతములను సాహసగాథలను చదువుట కీకాలమువారు ముచ్చట పడుచుండిరి. కవులును అట్టి కావ్యములు వ్రాయుచుండిరి. జక్కన విక్రమార్కచరిత్ర యీరీతి కావ్యము. ఇందు వీరరసమును అద్భుతరసమును ముఖ్యమైనవి. విక్రమార్కు డొక పూర్వకాలపు రాజు. ఈతనిపేర 'విక్రమార్కశకము' వాడుకలో నున్నది. ఈతనికి అద్భుతశక్తులుగల నాగబెత్తము, పావుకోళ్ళు, దివ్యాన్నములు గూర్చు పాత్రము, వలసినంతధనము గూర్చు నొక బొంతయు దొరకెను. వీటి సహాయముతో విక్రమార్కుడు అనేక సాహసకృత్యములను సాధించుచు, ఎందరికో దీనులకు తోడ్పడుచు,

విక్రమార్క చరిత్ర యిట్టి విచిత్రవినోదకథలకు గనివంటిది. జక్కన కవిత్వము రసవంతముగ నుండును. ఈతడు చక్కని సామెతలను తన పద్యములలో పొదుగును. జక్కన ఋతువర్ణనములను పరిశీలనతో గావించెను. ఆంధ్రదేశపు పుణ్యక్షేత్రములైన శ్రీశైలమును, అహోబిలమును ఈకవి భక్తితో వర్ణించెను.

## అనంతామాత్యుడు.

ఈకవి భోజరాజీయము, రసాభరణము, అనంతఛందస్సు అను గ్రంథములను రచించెను. భోజరాజీయము కావ్యము. రసాభరణము అలంకారగ్రంథము. ఈతడు తన రసాభరణమును శా. శ. ౧౩౫౬ అనగా క్రీ. శ. ౧౪౩౪ లో ముగించినట్లు వ్రాసికొన్నాడు. కావున నితడు శ్రీనాథుని కాలమువాడగుచున్నాడు. ఈకవి నియోగిబ్రాహ్మణుడు. *కృష్ణామండల మీతని నివాసస్థానము. తన తల్లిదండ్రుల నీతడు కృత్యారంభమునందు ప్రేమభక్తులతో నుతించెను. ఈతని పూర్వీకులలో నొకడగు బయ్యనమంత్రి కవి యని యనంతుడు చెప్పెను. బయ్యనమంత్రి తిక్కనామాత్యుని కాలములోనుండి, కవిబ్రహ్మగారిచేత 'భవ్యభారతి' యను బిరుదు పొందెనట. అనంతామాత్యునికి అన్నదమ్ములారుగురుండిరి. ఈయారుగురును ఆరువేలకుటుంబములకు మూలమగుదు రని యూహించి పెద్దలు ఆర్వేలశాఖ యని పేరిడి రని

* మ. రా. శ్రీ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారివ్యాసము భారతి సర్వజిత్తు. కార్తికము.

యనంతుడు చమత్కరించెను. ఆర్వేలవారు నియోగిబ్రాహ్మణులలో నొక ముఖ్యశాఖ. ఈ కవి మిక్కిలి వినయశీలుడు. మృదుస్వభావుడు. ఈతడు కుకవినింద చేయలేదు. తననుగురించి గ్రంథారంభమునందు ఆడంబరముగ చెప్పుకొనలేదు. ఈతడు విష్ణుభక్తిపరాయణుడు. కృతి రచింపవలె నని యాతడుత్సాహముతో నుండగా నొకనాటిస్వప్నమందు అహోబిలనృసింహదేవుడు ప్రత్యక్షమయ్యెను. అనంతామాత్యుని గురువు ప్రక్కనే యుండి భగవంతుని కృతిభర్తగా చేయు మని ప్రోత్సహించెను. కలగని లేచి యనంతామాత్యుడు తాను రచింపబూనిన భోజరాజీయమును అహోబలదేవునకు కృతి సమర్పింప నిశ్చయించుకొనెను.

అనంతామాత్యుడు మృదుమధురరచన సేయగల మహాకవి. ఈతని హృదయము కడుమెత్తన యనిపించును. భావములు సున్నితములు. శైలి ద్రాక్షాపాకము. భోజరాజీయములో భోజరాజునుగురించిన కథలు గలవు. జక్కన విక్రమార్కచరిత్రలో సాహసగాథ లున్నట్లే భోజరాజీయమునందు నీతిపరములైన కథ లెన్నియో కలవు. సత్యమునందు ప్రీతినికల్గించుటకై యీ కథలు పుట్టుట మిక్కిలి ప్రశంసావహము. రత్నమండనుడను రాజకుమారుడు బ్రహ్మరక్షస్సునకు జిక్కి యాతని కాహారము కాబోవుచుండెను. తనను భక్షించులోపల నొకమారింటికి బోనిమ్మని రాజకుమారుడు రాక్షసుని వేడుకొనెను. రాక్షసు డీతని సత్యనిష్ఠను శంకించును. అంతట రత్నమండనుడు పశువులయందు

గూడ సత్యవ్రతపరాయణత్వము గోచరించు నని ప్రతిపాదించుచు గోవ్యాఘ్రసంవాద కథను చెప్పెను. ఈ గోవుకథను అనంతామాత్యుడు మిక్కిలి కరుణతో చిత్రించినాడు. గోవు తనబిడ్డనికి బుద్ధులు నేర్పు ఘట్టము చదివిన రాతిగుండెయైన ద్రవించును. తల్లిలేని పిల్లల శోచ్యస్థితిని గోవు వర్ణించినక్రమము.

చులకన జలరుహతంతువు
చులకన తృణకణము దూది చులకన సుమ్మీ
యిల నెగయు ధూళిచుల్కన
చులుకన మఱి తల్లిలేని సుతుడు కుమారా!

సంసారజీవితమును స్త్రీలసంభాషణరీతులను అనంతమాత్యుడు కడు నేర్పుతో చిత్రించును. ఈ యంశములో నితడు పింగళిసూరనకవికి మార్గదర్శకు డయ్యె నని తోచును.

## గౌరన.

ఈమహాకవి హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథచరిత్రము అను ద్విపదకావ్యములను రచించెను. ఈతడు సంస్కృతమున లక్షణదీపిక యను ఛందోగ్రంథమునుకూడ వ్రాసెను. గౌరన పెదతండ్రి పెద్దన. పోతరాజు రేచెర్లమాదానాయనింగారివద్ద మంత్రిగా నుండెను. గౌరన క్రీ. శ ౧౪30 ప్రాంతమున నున్నవాడు. ఈతడును శ్రీనాథునికి సమకాలీనుడు. గౌరన నియోగి బ్రాహ్మణుడు. ఈతడు పరమశివభక్తుడు. అయినను పాల్కురికి

సోమనాథునివలె బ్రాహ్మణ్యమును త్యజించినట్లు కాన్పించదు. గౌరనామాత్యుడు రాచకొండరాజ్యమునకు చెందినవాడు. ఈ కాలమున ఆంధ్రదేశమునందు భైరవపూజలు సాగుచుండెను. అనపోతానాయడను రాచకొండరాజు భైరవదేవాలయములను ప్రతిష్ఠించెను.

తన కావ్యములను శ్రీశైల మల్లికార్జున దేవుని పేర రచించి గౌరన తన శివభక్తిని ప్రకటించుకొనెను. శ్రీశైల భ్రమరాంబ యనుగ్రహముచే తనకు కవిత్వ మలవడెనని యాతడు చెప్పుకొనెను. ఈతని మొదటికావ్యము హరిశ్చంద్రోపాఖ్యానము. హరిశ్చంద్రచరిత్రను స్వతంత్ర కావ్యముగా మొట్టమొదట వ్రాసిన యాంధ్రకవి గౌరనామాత్యుడు. ఈ కావ్యవస్తువు నీతడు స్కాందపురాణమునుండి గ్రహించియుండును. మార్కండేయపురాణములోకూడ హరిశ్చంద్ర వృత్తాంతము కొంతవరకు నున్నది. గౌరన తనకావ్యములను ద్విపదలో వ్రాయుట గమనింపదగినది. పూర్వకవులలో పాల్కురికిసోమనాథుడును రంగనాథ రామాయణకర్తయు ద్విపదబంధముల వ్రాసిరి. శివకవులకు దేశిరచనములమీద ప్రీతి మెండు. ద్విపద దేశీయమైన ఛందస్సు. ద్విపదరచన గేయానుకూలముగా నుండును. గావున ప్రజలలో దీనికి వ్యాప్తి మెండు. శివకవులలో మరియొక ప్రశంసనీయమైనలక్షణము కలదు. వారు స్వతంత్ర కావ్యములను వ్రాయుటకు బూనుకొందురు. అనువాదముల నంతగా ఆదరింపరు. పాల్కురికి సోమనాథుని ద్విపదకన్న గౌరనామాత్యుని ద్విపద సులభ

ముగ అర్థమగును. ఈతని శైలి జీవశక్తి గలిగి ద్విపదలు పరుగెత్తు చుండును. ఒక్కొక్క చోట సంస్కృతశైలిని మరికొన్ని చోట్ల ముద్దులు గులుకు తెలుగునుడికారమును గౌరన ప్రదర్శించుచుండును. ఈతడు చక్కని సామెతలను జాతీయములను తరుచు వాడుచుండును. పాత్రపోషణవిషయమై గౌరన ప్రత్యేక శ్రద్ధను వహించెను. హరిశ్చంద్రుడు, చంద్రమతి, నక్షత్రకుడు, కాలకౌశికుడు వీరి పాత్రల నీతడు స్ఫుటరేఖలతో చిత్రించెను. గౌరనకవి హాస్య రసమును చక్కగా పోషించెను. హాస్యమునకు కావ్యములో సముచితస్థాన మిచ్చుట కీతడు తెలుగుకవులలో ప్రథము డని చెప్పదగును. ఈతడుచేసిన ప్రకృతివర్ణనములు సహజములై స్వభావోక్తులతో నలరుచున్నవి.

నవనాథచరిత్ర శివయోగులైన భక్తులచరిత్రము. సిద్ధుల చరిత్రము అందు ప్రబంధధోరణిలో వర్ణింపబడినవి. శ్రీశైల మఠాధిపతియైన శాంతభిక్షావృత్తి కోరికపై గౌరనామాత్యుడు నవనాథచరిత్రను మల్లికార్జునదేవుని పేర చెప్పెను. శ్రీనాథుడు తన శివరాత్రిమాహాత్మ్యమును శాంతభిక్షావృత్తి భృత్యుడైన ముమ్మడి శాంతయ్యకు అంకితమిచ్చెను. నవసిద్ధనాథులలో మీననాథసిద్ధుడు గొప్ప మహిమాన్వితుడు. ఈతడు మాళవ దేశములో తపస్సు చేయుచుండెను. మాళవదేశపు రాజైన రాజమహేంద్రునకు రత్నాంగి యను భార్యయు చిత్రాంగి యను నుంపుడుకత్తెయు నుండిరి. సారంగధరుడు రత్నాంగికొడుకు. సారంగధర, చిత్రాంగులకథ మాళవదేశమునందు నడచినది. తూర్పుచాళు

క్యరాజును ఆంధ్రభారత కృతిపతియు నగు రాజరాజనరేంద్రు నకీ కథతో ఏమియు సంబంధము లేదు. కాళ్లు నరకబడిన సారంగధరుని మీననాథుడు రక్షించి సిద్ధులలో కలుపుకొనెను. మీననాథు డెన్నియో అద్భుతములు నాశ్చర్యకరములు నైన శక్తులు గలవాడు. ఈ కావ్యమునందు గౌరనామాత్యుడు ప్రబంధరీతి వర్ణనము గావించెను. దీనిలో కూడ చక్కని హాస్యరసమును ప్రదర్శించెను. హరిశ్చంద్రోపాఖ్యానములో కాలకౌశిక కలహకంఠులును నవనాథచరిత్రలో ఒక కుటిల బ్రాహ్మణుడును హాస్యపాత్రలుగానున్నారు. గౌరనామా త్యుడు భావములందును కావ్యవస్తువులందునుకూడ స్వతంత్ర ప్రతిభగల మహాకవి.

## మడికి సింగన.

ఈ కవి పద్మపురాణోత్తరఖండమును వాసిష్ఠరామా యణమును, భాగవతదశమస్కంధమును, సకలనీతి సమ్మతమును రచించెను. ఈతడు నియోగిబ్రాహ్మణుడు. ఈతని తాత యల్లాడమంత్రి. కవిబ్రహ్మ తిక్కన సోమయాజిమనుమ రాలు చిట్టాంబికను పెండ్లి యాడెనట. ఇట్లు మడికిసింగన పద్మ పురాణోత్తరఖండము నీతడు క్రీ. శ ౧౪౨౦ సంవత్సరమున రచించినట్లు చెప్పుకొనెను. కావున ఈకవి శ్రీనాథునకు సమ కాలికు డగుచున్నాడు. సింగన జన్మస్థానము గోదావరి మండ లము. ఈతని తండ్రి అయ్యలమంత్రి రాజమహేంద్రవరము

నేలు తొయ్యేటి అనపోతభూపాలునకు మంత్రియై గోదావరి కుత్తరతీరమున పెద్దమడికి యను గ్రామమునందు భూవసతి కలిగియుండెను. తొయ్యేటి అనపోతరాజు మునునూరి వంశీయుడైన కాపయనాయకుని పినతండ్రి కుమారుడు. కాకతీయ ప్రతాపరుద్రదేవచక్రవర్తి మహమ్మదీయుల కోడి చెరగొని పోబడిన కొలదికాలమున కే ప్రోలయనాయకు డను ఆంధ్రవీరుడు విజృంభించి యవనులను ఆంధ్ర దేశపు తూర్పుమండలములనుండి తరిమివేసి దేశ స్వాతంత్ర్యమును తిరిగి స్థాపించెను. ప్రోలయ నాయకునకు పినతండ్రికుమారు డైన కాపయనాయకు డంత కన్నను సమర్థుడు. ఈతడు యవనులనుండి ఓరుగల్లు రాజ్యమును కూడ స్వాధీనము చేసికొని క్రీ. శ ౧౩౪౫ నుండి ౧౩౬౭వరకు పాలించెను. † ఈతని పినతండ్రి కుమారుడు తొయ్యేటిఅన పోతభూపాలుడు మునునూరి నాయకుల పరిపాలనము క్రీ. శ. ౧౩౭౦ ప్రాంతమున అస్తమించినది. ఆప్తులైన రాజుల యాశ్రయము పోవుటచే కాబోలు మడికిసింగన తెలంగాణాపరగణా చేరెను. ప్రస్తుత కరీంనగరుజిల్లా ఆనాడు సబ్బినాటిమండల మని వ్యవహరింపబడుచుండెను. ఇచ్చట ముప్పయభూపాలుడు పరిపాలన సేయుచుండెను. ఈతని సచివుడైన వెలిగందల కందనమంత్రి మడికిసింగనకు బంధువు. కందనమంత్రి ప్రాపకము పొంది ఈకవి పద్మపురాణోత్తరఖండము నాతనికి కృతి యిచ్చెను.

---

† ఆంధ్రకవితరంగిణి ౪వ సంపుటము.

మడికిసింగన పూర్వకవులలో నన్నయతిక్కనలను మాత్రము స్తుతించెను. ఈతని కవిత్వము పరమేశ్వరుని మకుటము నలంకరించిన గంగాప్రవాహముగతి నుండు నని కందన మంత్రి ప్రశంసించెను. వాసిష్ఠరామాయణములో మడికిసింగన కుకవులను కఠోరముగా విమర్శించెను. అయినను ఈకవి వినయపరుడు. తిక్కనామాత్యునివలెనే యీతడును కవిత్వ మొక పూజావిశేషమని వచించెను. పద్మపురాణము సంస్కృతమునం దున్నది. దీనిలో యుత్తరఖండమును సింగన తెనుగు చేసెను. పద్మపురాణకథలను వసిష్ఠమహాముని దిలీపునకు చెప్పినట్లు కలదు. ఇందు మాఘస్నాన మాహాత్మ్యమునుగురించిన కథలు పెక్కుగలవు. శ్రీకృష్ణచరిత్రను మడికిసింగన మిక్కిలి హృదయంగమముగా వ్రాసినాడు. పద్మపురాణము వైష్ణవపక్షపాతము గల పురాణము. మడికిసింగన నన్నయతిక్కనల శైలిని భావములను పుణికి పుచ్చుకొన్నట్లు వ్రాయును. కవిత్వము ద్రాక్షాపాకము. భావములు రమణీయములు.

వాసిష్ఠరామాయణము వేదాంతప్రబోధకమైన యుత్తమోత్తమ ప్రబంధము. దీని నీకవి యహోబలనరసింహస్వామికి కృతిగాచెప్పెను. సంస్కృతమునందలి జ్ఞానవాసిష్ఠమున కిది సంగ్రహరూపమైన యాంధ్రీకరణము. ఇది శ్రీరామచంద్రునకును వసిష్ఠ మహర్షికిని జరిగిన వేదాంత సల్లాపము. భావములు ఉదాత్తములు. సర్వజనసులభముగాని వేదాంతమును మడికి సింగనకవి అరటిపండొల్చి చేతపెట్టినట్లు సులభశైలిలో మృదు

రీతి నుపన్యసించుట ప్రశంసావహము. పుష్పములనుండి మకరందమును సేకరించు తుమ్మెదయే చెట్లుకూడ దొల్చును. అట్లే సుకుమారమైనకవిత్వముతో జటిలమైన యాధ్యాత్మికవిషయములను చెప్పుదునని యీతడు ప్రతిజ్ఞ చేసి కృతకృత్యు డయ్యెను. భాగవత దశమస్కంధము ద్విపదకావ్యము. ఇతరస్కంధముల నీతడు ద్విపద చేసినట్లు లేదు. సకలనీతిసమ్మతము సంకలన గ్రంథము. ఇతర మహాకవులు వ్రాసిన నీతివిషయిక పద్యముల నేర్చి కూర్చి మడికిసింగన యీగ్రంథము వ్రాసెను. కడివెడు పాలకు కోణిదెడుమజ్జిగ తోడువలె నడుమనడుమ తన పద్యములను సంధింతు నని యీతడు చెప్పెను. కామందకము, పంచతంత్రి, నీతిసారము, నీతితారావళి, బద్దెనసీతి, భారతము మున్నగు గ్రంథములనుండి నీతిపద్యములు సకలనీతిసమ్మతములో చేర్చబడినవి.

## దగ్గుపల్లిదుగ్గయ.

ఈ కవి నాసికేతోపాఖ్యానము రచించెను. తాను కవిసార్వభౌముడైన శ్రీనాథుని భావమరది ననియు, ఆతని ప్రసాదముచే తనకు గవిత్వ మలవడిన దనియు దుగ్గయ్య కవి నాసికేతోపాఖ్యానములో వర్ణించెను. ఈ ప్రబంధమును కృతి గైకొన్నవాడు అనంతామాత్యునిగంగయ. ఉదయగిరికి ప్రభువైనబసవభూపాలునకు గంగయ ప్రధానమంత్రిగా నుండెను. ఈబసవరాజునకు దూబగుంటనారాయణకవి పంచతంత్రమును కృతి

యిచ్చెను. అనంతామాత్యుని గంగయ కావ్యప్రియుడు. నంది మల్లయ ఘంటసింగయ కవులు తమ ప్రబోధచంద్రోదయము నీ మంత్రిసత్తమునకు కృతి నిచ్చిరి. నాసికేతోపాఖ్యానము క్రీ. శ. ౧౪౬౫ ప్రాంతమున రచింపబడియుండును. తిక్కనసోమయాజి శిష్యుడైన మారనకవివలెనే శ్రీనాథునిశిష్యుడును బావమరదియు నగు దుగ్గయకూడ గురుభక్తిని విశేషముగ ప్రదర్శించెను. ఈతడు తన గురువంతవాడు కాకపోయినను స్వయముగ పండితుడు. చక్కనికవిత్వము చెప్ప నేర్చినవాడు. శ్రీనాథునకును దుగ్గయ కవికిని మనోరీతులయందు స్ఫుటమైన భేదము కలదు. శ్రీనాథుడు భోగప్రియుడు. శృంగారమీతని కిష్టమైన రసము. దగ్గుపల్లిదుగ్గయ మిక్కిలి మృదుస్వభావము గలవాడుగా తోచును. శాంతరసవర్ణనమునం దీతని కభిలాష మెండు. ఈతడు స్వీకరించిన ప్రబంధ వస్తువునుబట్టి యిట్లు చెప్పవచ్చును.

నాసికేతోపాఖ్యానము శాంతరసప్రధానమైన అత్యుత్తమ కావ్యము. దీనికి నాచికేతోపాఖ్యానము అను పేరుగూడ విన వచ్చును. నాచికేతునిచరిత్ర కఠోపనిషత్తునందును, మహాభారత మున అనుశాసనికపర్వమందును కనబడును. ఆంధ్రకవులు తమ కావ్యవస్తువును సంస్కృతపురాణములనుండియు గద్యపద్య ప్రబంధములనుండియు స్వీకరించుట యలవాటు. దుగ్గకవి తన ప్రబంధకథను ఉపనిషత్తులనుండి గ్రహించు టొకవిశేషము. కావుననే నాసికేతోపాఖ్యానము రమ్యమైన కథయు లోకోత్త రనీతియుగల్గి వన్నెకెక్కుచున్నది. ఇందలికథచిత్రముగ నుండును.

ఉద్దాలకుడను మహర్షి చిరకాలము బ్రహ్మచర్యమునే నడుపుచు గృహస్థాశ్రమములో కాలుపెట్టుట కిష్టపడకుండెను. బ్రహ్మ దేవుడుకూడ ఈతని నిశ్చయమును మరల్పలేక పోయెను. అయినను బ్రహ్మయీమహర్షితో నిట్లనెను "నీకు తెలియకయే నీకు జనించినకుమారుడు తన తల్లికిని నీకును వివాహము చేయును." పరమేష్ఠివాక్కు లమోఘములు. ఉద్దాలకమహర్షి యూహించకుండగనే యాతని తేజఃప్రభావమువలన నాసికేతుడు జనించెను. నాసికేతునితల్లి చంద్రవతి యను రాజకన్య. కొంతకాలమునకు చంద్రవతియు ఉద్దాలమహర్షియు నాసికేతునిమూలమున యొండొరులను వీక్షించుకొనిరి. అప్పుడు వీరిర్వురకును. వివాహము జరిగెను. నాచికేతుడు బాల్యమునుండియు ఉద్దాలకముని చేతనే పెంచబడెను. ఆబాలుడుతనకుమారుడే యని మహర్షి తరువాత తెలిసికొని యానందించెను. ఇట్లుండ నొకనాడు తండ్రికిని కుమారునకును వేదాంతవిషయికమైన పెద్ద వివాదము తటస్థించెను. ఉద్దాలకమహర్షి కర్మాచరణమే శ్రేష్ఠ మని వాదించెను. బాలుడైనను గొప్ప తత్వవేత్తయైన నాసికేతుడు యోగమును ఆత్మవిద్యయు ఉపాస్యము లని ధీరతతో వాదించెను. వాదముచే కుమారు నొప్పింపలేక యుద్దాలకమౌనీంద్రుడు కుపితుడైయముని దర్శింపబొమ్మని కుమారునితో కఠినముగ పల్కెను. నాసికేతుడు మూర్ఛబడియుండి కొంతతడవునకు మేల్కాంచి దుఃఖితులైన తల్లిదండ్రుల సంతోషపెట్టెను, తాను యమలోకమునకు బోయి యచ్చట దర్శించిన విశేషములను నాసికేతుడు

వర్ణించి చెప్పెను. ఇట్టి ప్రబంధము మిక్కిలి నీతిదాయకమై ఉదాత్తభావములు గలిగి శోభించుచున్నది. దగ్గుపల్లిదుగ్గయ కవిత్వము మృదుమధురమై చక్కనిసామెతలుగల్గి మనస్సు నాకర్షించును.

## కొఱవి గోపరాజు.

ఈ కవి సింహాసనద్వాత్రింశిక యను కథాప్రబంధమును వ్రాసెను. ఈతడు తెలంగాణమున వర్థిల్లెను. ఈతడు నియోగి బ్రాహ్మణుడు. ఈతని పెదతండ్రులు రాచకొండ ప్రభువైన రేచర్ల కుమారసింగమ నాయనికడ మంత్రులుగ నుండిరి. కుమారసింగమ నాయుడు క్రీ. శ. ౧౩౯౭ తరువాత సింహాసనమునకు వచ్చెను. కావున కొఱవి గోపరాజు ౧౫ వ శతాబ్ద ప్రథమపాదమునం దుండెనని చెప్పవచ్చును. సింహాసనద్వాత్రింశకయందు మనోహరమైన కథలు గలవు. విక్రమార్కుని సింహాసనమధిరోహించుటకై భోజరాజు వచ్చినప్పుడు విక్రమార్కసింహాసనముపైనున్న బొమ్మలు కొన్నికథలు వర్ణించి భోజరాజును వారించును. ఇందు ముప్పదిరెండుకథ లున్నవి. *ఈకావ్యమును గూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగా రిట్లు వ్రాయుచున్నారు. "మొత్తముమీద గోపరాజు రచించిన యీగ్రంథము చాల గొప్పది. ఆ యా ప్రసంగముల సందర్భమున ఆనాటి విద్యల సంపూర్ణ స్వభావమును ప్రదర్శించి కవి తన సర్వజ్ఞతను

* ఆంధ్రపితామహ, మాడపాటి హనుమంతరాయ షష్టిపూర్తి సంచిక.

చూపినాడు. ఆనాటి విద్యలను, మర్యాదలను ఆచారములను వినోదాదులను తెలిసికొనుటకు ఈ గ్రంథము ఒక విజ్ఞానకోశము వంటిది. ”

దూబగుంట నారాయణ.

ఈ కవి పంచతంత్రమును తెనుగుచేసి వాసి కెక్కెను. పంచతంత్రము జగత్ప్రసిద్ధమైన కథాకావ్యము. ఇది సంస్కృతము లో మొదట వెలసి క్రమముగ అనేక ప్రపంచభాషలలోనికి పరివర్తన మందినది. దీననిబట్టియే దీని ప్రశస్త్యమును జనరంజకత్వమును ఊహింపవచ్చును. దూబగుంట నారాయణకవి నియోగిబ్రాహ్మణుడు. ఈతడు దూబగుంట గ్రామమునకు కరణమని తోచును. పంచతంత్రము నీతడు తమ్మరాజుకొడుకు బసవ భూపాలున కంకిత మొనర్చెను. నాసికేతోపాఖ్యానమును కృతిగొన్న అనంతామాత్యునిగంగయ్య ఈ బసవరాజుకడనే సచివుడుగ నుండెను. తమ్మరాజును, బసవరాజును మాధవవర్మవంశీయులు. మాధవవర్మ న్యాయబుద్ధికి మెచ్చి దేవతలు పూర్వము బెజవాడలో కనకవర్షము కురిపించిరట. ఆంధ్రదేశమును పాలించిన ప్రాచీన రాజవంశములలో విష్ణుకుండిను లొకరు. ఈ వంశములోని మూడవ మాధవవర్మయే ఈతడై యుండవచ్చును. బసవరాజు కటకము నేలు గజపతులకు సామంతుడై యుదయగిరి యం దుండెను. తమ్మరాజు శాసనము క్రీ. శ ౧౪౬౦ నాటిది లభించినది. కావున బసవరాజు అటుతరువాత నుండియుండును. దూబగుంటనారాయణ కాలముకూడ నిదియే.

పంచతంత్రము రాజనీతిని బాలబోధగా తెలియ జేయు టకై పుట్టిన కావ్యము. కథారూపముగ నీతిని బోధించినచో అది హృదయాకర్షకమై జనరంజకముగా నుండును. దీనిలో మిత్ర భేదము, సుహృల్లాభము, సంధి విగ్రహము, లబ్ధనాశము, అవి మృశ్యకారిత్వము అను నైదు విభాగములు కలవు. పంచతంత్ర ములోని చమత్కార మేమన నందలి పాత్రలు జాలవరకు పశు పక్ష్యాదులు. పేను మొదలుకొని సింహమువరకును అన్నియు రాజనీతిలో ఆరితేరినవే. ఇవి చేయు నీతిప్రసంగములు గంభీరము లును యుక్తియుక్తములు నయి ఆశ్చర్యము గొల్పుచుండును. ఈ కావ్యమునందలి మరియొక విశిష్టత దానిలోని మృదుహాస్య ము. కావ్యమునకు హాస్యము ప్రాణమువంటిది. నారాయణకవికి కథలు చెప్పునేర్పు సహజముగా నున్నది. ఇతనిశైలియు అత్యంత మృదువై రమ్యముగ నుండును. కాఠిన్యము మందునకైనను లేదు. కావుననే ఆబాలవృద్ధులు పంచతంత్రమును చదివి యానందిం తురు.

## పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు.

ఈ కవి శృంగారశాకుంతలమును, జైమినిభారతమును రచించెను. పిల్లలమఱ్ఱి గ్రామము తెలంగాణములో నున్నది. ఈ కవికాలము నాటికి ఈ వంశము వారు నెల్లూరుమండలమున నుండి తరువాత విజయ నగరమునకు వెడలిన ట్లూహింపవచ్చును. శృంగారశాకుంతలమును పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి నెల్లూరు

సమీపముననున్న సోమరాజుపల్లి నివాసియైన చిల్లర వెన్నయామాత్యునకు కృతి యిచ్చెను. ఈతని జైమినిభారతము విజయనగరప్రభువైన సాళువగుండ నరసింహరాయల కంకిత మీయబడెను. నరసింహరాయలు క్రీ. శ. ౧౪౮౭ లో విద్యానగర సింహాసనము నలంకరించి యుండుటచే పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవికూడ నీకాలమున నుండియుండును. ఈ కవి నియోగి బ్రాహ్మణుడు. పినవీరభద్రునకు తన వంశమునందును తన కవిత్వమునందును అభిమానము మెండు. తన యింటిపేరుపై చమత్కరించుచు నీత డిట్లువ్రాసెను.

మఱ్ఱిమాత్రమె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెగాదు శారదా పీఠకంబు.

శ్రీనాథ కవిసార్వభౌమునివలెనే పినవీరభద్రుడును గొప్ప విద్వత్కవి. శ్రీనాథున కీతడు శిష్యు డని కొన్నికథలు చెప్పబడును. ఈ యిద్దరికాలమును బట్టి వీరికి గురుశిష్యసంబంధము పొసగును. గాని యీ యంశము నిర్ధారణచేయుటకు వీలులేదు. శ్రీనాథుని కవిత్వము ననుకరించుట మన కవీంద్రునకు గడుప్రీతి. అతని పద్యములనుబోలిన పద్యములను పినవీరభద్రుడు వ్రాయుచుండును. శృంగారశాకుంతలములోని 'రచియించినాడవు రమణీయవాగ్రీతి,' యను పద్యము శ్రీనాథుని 'వినిపించినాడవు వేమభూపాలునకు' అను పద్యరీతిలో నడచినది. శ్రీనాథునకు వలెనే పినవీరభద్రునకును సరస్వతి యుపాస్యదైవము. 'వాణినా రాణి'

యని పినవీరభద్రుడు చెప్పెనందురు. శ్రీనాథు నీత డనుకరింప యత్నించినను శ్రీనాథుని లోకజ్ఞతయు మానవస్వభావపరిజ్ఞానము పినవీరభద్రునకు అంతగాలేవు.

శృంగారశాకుంతలము పినవీరభద్రుని మొదటికావ్యముగా తోచుచున్నది. తాను మరికొన్ని ప్రబంధములను వ్రాసినట్లీతడు శాకుంతలములో పేర్కొన్నాడు. కాని అవి నేడు మాయమైనవి. శృంగారశాకుంతలమునకే శకుంతలాపరిణయము అనికూడ పేరు. కాళిదాసు శృంగారశాకుంతలనాటకమునాధారముగాగొని ప్రబంధమున కవసరమని తోచిన వర్ణనలు చేర్చుచు నీతడు తన కావ్యమును రచించెను. పూర్వాంధ్రకవులకు ప్రబంధవిధానముపై ఆదరము మెండు. సంస్కృత వచనకావ్యములను, సంస్కృత నాటకములనుకూడ వీరు తెనుగులో పద్యకావ్యములుగనే యవతరింపజేసిరి. ఈ విధముగ కాళిదాసునాటకము తెనుగులో పద్యకావ్యమైనది. ఈతడు సంస్కృతనాటకమును యథాతథముగ ననుకరింపలేదు. శృంగారరసమును పోషించు పెక్కు వర్ణనలు జేర్చెను. కాళిదాసు శ్లోకములను పినవీరభద్రుడు మిక్కిలి రసవంతముగను భావగర్భితముగను ఆంధ్రీకరించెను.

జైమినిభారత మీతని గొప్పగ్రంథము. సంస్కృతము నుండి దీని నీతడు తెనిగించెను. భారతాశ్వమేధ పర్వ కథయే జైమినిభారతమునందు వర్ణితమైనది. జైమినిభారతమునం దద్భుతవృత్తాంతములు కుప్పలుగ నున్నవి. ధర్మరా జశ్వమేధము చే

యదలచుటయు, భీమార్జునులు యాగ సైంధవమును సంరక్షించుచు దిగ్విజయము చేయుటయు నిందలి ప్రధానకథ. శ్రీకృష్ణుని మహిమను ఈ గ్రంథము విశేషముగ పొగడును. మరికొన్ని చక్కని కథలు జైమినిభారతములో గలవు. బభ్రువాహనునిచరిత్రము, ప్రమీలవృత్తాంతము, చంద్రహాసునికథ. పినవీరభద్రు డీ గ్రంథారంభమున కఠినశైలిలో వ్రాసినను క్రమముగ నీతడు రమ్యశైలిలోనికి దిగి మనోజ్ఞముగ రచించెను. తెనుగుపలుకుబళ్ళను చక్కగా వాడెను. పినవీరభద్రునిలో హాస్యరసము చాలతక్కువ. సందర్భమును పురస్కరించుకొని యాతడు తెలుగువారి జీవిత చిత్రములను మనోహరముగా వర్ణించును. శ్రీనాథుడును పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడును ప్రబంధరీతికి మార్గదర్శకులు. అనంతర కవులు వీరికవిత్వపు పోకడల ననుసరించు చుందురు.

## నందిమల్లయ, ఘంటసింగయ.

ఈ జంటకవులు ప్రబోధచంద్రోదయమును వరాహపురాణమును రచించిరి. నందిమల్లయ ఘంటసింగయ కవులు వర్తమానకాలమున ప్రసిద్ధులైన శ్రీ తిరుపతివేంకటకవుల వంటివారు. ఒకకవి యొక్క మనస్తత్వము వ్యక్తిత్వము శైలిమున్నగునవి ప్రత్యేకముగా నుండును. మఱియొక కవియొక్క ఈలక్షణములు భిన్నముగా నుండును. ఇద్దరుకవులు కలిసి ఒకేకావ్యమును రచించునప్పుడు వారివారి ప్రత్యేకలక్షణములు రచనలో కనబడక మానవు. గ్రంథరచనమునందు హెచ్చుతగ్గులు బాగోగులు దీనివలన కలు

గవచ్చును. నందిమల్లయ ఘంటసింగయ కవులు తమ భావములను శైలిని కూడ చక్కగా కలబోసి వ్రాయుటచే వారికవిత్వము ఏకకర్తృకముగనే తోచుచుండును. ఇది యొక అపూర్వసన్నివేశము.

ఈ కవులు నియోగిబ్రాహ్మణులు. వీరికాలము పదునేనవ శతాబ్ది రెండవ యర్ధము. ప్రబోధచంద్రోదయమును వీరు అనంతామాత్యుని గంగయమంత్రికి కృతి నిచ్చిరి. ఈ మంత్రిశిఖామణియే దగ్గుపల్లిదుగ్గననుండి నాచికేతోపాఖ్యానమును కృతి గైకొనెను. ప్రబోధచంద్రోదయము క్రీ. శ. ౧౪౭౫ ప్రాంతమున వ్రాయబడియుండును. ఈ కవులు తమ వరాహపురాణమును తుళువనరసనాయకున కంకిత మొనర్చిరి. ఈ నరసరాజు సాళువ గుండనరసింహరాయల సేనాపతి. సాళువనరసింహరాజు పిల్లలమఱ్ఱి పినవీరభద్రునిచే జైమినిభారతము చెప్పించుకొనె నని చదివియున్నాము. నరసనాయకుడు సాలువనరసింహుని సేనాధీశుడుగనున్న కాలములోనే మల్లయసింగయకవులు వరాహపురాణము నాతని పేర జెప్పిరి. కావున ఈ కావ్యము క్రీ. శ. ౧౪౮౦–౧౪౮౫ ల నడుమ వెలసియుండును. తుళువనరసరాజు సాళువవంశము తరువాత విజయనగర సింహాసన మాక్రమించెను. ఈతని కుమారుడే విఖ్యాతకీర్తియైన శ్రీకృష్ణదేవరాయలు. ఘంటసింగయకవికి మలయమారుతకవి యని బిరుదుగలదు. ఈతని మేనల్లుడు నందితిమ్మకవి కృష్ణదేవరాయల కాలములోనుండి పారిజాతాపహరణ ప్రబంధమును రచించెను.

ప్రబోధచంద్రోదయము సంస్కృతనాటకము. దీనిని కృష్ణమిశ్రుడను కవి గీర్వాణభాషలో వ్రాసెను. ఇది వేదాంతబోధకమైన యత్యుత్తమ నాటకము. దీనిని మన కవులు తెనుగులో చక్కని ప్రబంధముగా వ్రాసిరి. ఈ కాలపు కవులు సంస్కృతనాటకములకూడ తెనుగులో ప్రబంధములుగనే వ్రాయుట గమనించియుంటిమి. పినవీరభద్రుని శృంగారశాకుంతలము దీనికి మరియొక ఉదాహరణము. ప్రబోధచంద్రోదయము శాంతరస ప్రధానమైన కావ్యము. మానవుని యుత్తమప్రకృతులకును, ఆతనిలోని దుష్టప్రకృతులకును జరుగు నైతిక సంగ్రామము ఈ ప్రబంధవిషయము. మనస్సు, అహంకారము, కామక్రోధలోభమోహాదులు, వివేకము, విష్ణుభక్తి, ఉపనిషత్తు, శ్రద్ధ మున్నగునవి దీనిలోని పాత్రలు. వీనియందు మనుష్యత్వ మారోపింపబడినది. మనుష్యు నావరించిన తామసప్రకృతులు చివరకు ఓడిపోయి వివేకము జయించి ప్రబోధచంద్రుడు అనగా జ్ఞానము ఉదయించును. ఈక్లిష్టమైన వేదాంతార్థముల నింత సులభముగను ఆకర్షణీయముగను చెప్పుట ప్రశంసనీయము. నందిమల్లయ ఘంట సింగయ కవులు ఈతత్త్వప్రబంధమును మనోజ్ఞముగ వ్రాసిరి.

ఈ కవులు సంస్కృతమునుండి వరాహపురాణము నాంధ్రీకరించిరి. వీరు శివారాధనతత్పరులు. వరాహపురాణము విష్ణుమహాత్మ్యమును ప్రతిపాదించు గ్రంథము. ఇట్టిదానిని వీరు తెనిగించుట యీకవుల సమబుద్ధిని ప్రదర్శించును. కృతినాయకుడగు తుళువనరసరాజు వైష్ణవమతప్రియుడుగా గాన్పించును. ఈ కావ్య

ముయొక్క పీఠికయందు కృతిపతి వంశవర్ణనము చేయుచు నీకవులు కొన్ని ముఖ్యమైన చారిత్రికాంశములను పేర్కొనిరి. వట్టి యతిశయోక్తులతో నీభాగమును నింపకుండుట సంతోషదాయకము. వరాహపురాణము మహాభారత హరివంశములవలె రసవంతమైన పురాణము కాదు. దీనిలో విశేషభాగము వ్రతములు వ్రతదానమహిమలవర్ణనముతో నిండియున్నది. రమ్యమైనకథలు దీనిలో నంతగాలేవు. నందిమల్లయ ఘంటసింగయకవులు వరాహపురాణము నంతను తెలిగింపలేదు. రసవంతములైన ఘట్టములను వీరు చేకొని తమ స్వంతవర్ణనలతో పెంచి వ్రాసిరి. కృష్ణదేవరాయలకాలములో ఆంధ్రప్రబంధరీతి బాగుగా నెలకొనినది. వరాహపురాణము దీనికి సమీపకాలములోనే యావిర్భవించినది. అందుచే దీనియందు ప్రబంధపుపోకడలు బాగుగ కన్పట్టును. కథాసందర్భము తటస్థించినప్పుడు మనకవులు శృంగారరసమును విస్తరించి వర్ణించుట కలవడిరి. వరాహపురాణములోని దుర్జయుడను రాజువృత్తాంతము దీనికి తార్కాణము. నాయకావిరహవర్ణనమును సవిస్తరముగ వ్రాయుట కీకవులు దారి జూపిరి. ప్రబంధలక్షణములైన వేటవర్ణనము మొదలగునవి యీకవులు తమ కావ్యములో కూర్చిరి. 'అర్జునకి' యను పేరుగల భిల్లయువతి చరిత్రము నీ కవులు మిక్కిలి హృద్యముగ వ్రాసిరి. గౌరీకల్యాణవృత్తాంతము గౌతమమహర్షి కథయు రమ్యముగా నున్నవి. ఈ జంటకవులశైలి నిమ్నోన్నతములులేక సమరీతిని నడచినది. కొన్నిస్థలములందు ప్రౌఢసంస్కృతరచనయు, కొన్ని యెడల కడు మృదువైన యాచ్ఛికపద్యరచనయు ఈకవులు చేసిరి.

## వెన్నెలకంటి సూరన.

ఈ కవి విష్ణుపురాణము నాంధ్రీకరించి రావూరిబసవరెడ్డి కుమారుడు రాఘవరెడ్డికి కృతియిచ్చెను. రాఘవరెడ్డి నెల్లూరు మండలమునందలి గుడ్లూరున కధిపతియై యుండెను. హరివంశము మొదలగు గ్రంథములను వ్రాసిన ఎఱ్ఱాప్రగడ మహాకవి నివాసస్థలము గూడ గుడ్లూరుగ్రామమే. ఎఱ్ఱనయింటి పేరుగనున్న చెదలువాడ గ్రామము విష్ణుపురాణములో పేర్కొనబడినది. వెన్నెలకంటి సూరకవి నియోగిబ్రాహ్మణుడు. ఈతని పూర్వీకులు ప్రసిద్ధకవులై ప్రోలయవేమారెడ్డి అనపోతారెడ్డిగార్ల వద్ద కీర్తిబడసిరి. విక్రమార్కచరిత్రము వ్రాసిన జక్కన, వెన్నెలకంటిసూరనార్యునొకనిని పేర్కొనెను. ఎఱ్ఱాప్రగడ తరువాత వెన్నెలకంటి వారు రెడ్డిరాజుల కవులై ప్రశస్తిగాంచిరి. రావూరిరాఘవరెడ్డి శాసనములు క్రీ. శ. ౧౫౭౬-౧౫౭౮ సంవత్సరముల నడుమ నెల్లూరుమండలములో కనబడుచున్నవని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. ఈతని తండ్రి బసవరెడ్డి పరాక్రమవంతుడై ఉదయగిరిరాజ్యము నేలుచు కటకము నేలిన గజపతులచేతను విజయనగరప్రభువులచేతను గూడ గౌరవచిహ్నములు పొందెను. రాఘవరెడ్డిది పంటరెడ్డి కులము. శ్రీనాథమహాకవిచే కాశీఖండమును చెప్పించుకొన్న వీరభద్రారెడ్డియు ఆతనితండ్రి యల్లాడరెడ్డియు తన వంశస్థులని రావూరిరాఘవభూపాలుడు వర్ణించుకొనెను. రాఘవరెడ్డి కాలమునుబట్టి వెన్నెలకంటిసూరకవి పదునారవశతాబ్ది ప్రథమపాదమునందున్నవాడని

నిర్ణయ మగుచున్నది. ఇది ప్రబంధ ప్రారంభకాలము. అయినను వెన్నెలకంటిసూరకవిని పురాణయుగకవిగనే చెప్పవలెను. ఈతడు చేబట్టిన గ్రంథమునుబట్టియు, నీతనిని పురాణయుగకవులలో జేర్చుటయే యుక్తము. వర్ణనాబాహుళ్యము, ప్రౌఢశైలి, స్వతంత్రకావ్యనిర్మాణము ఇవి ముఖ్యముగ ప్రబంధయుగ చిహ్నములు. సంస్కృతపురాణముల నాంధ్రీకరించుట, మితవర్ణనము, సరళమృదుశైలి యివి పురాణయుగలక్షణము లని సామాన్యముగ తలపవచ్చును.

వెన్నెలకంటిసూరనార్యుడు ప్రాచీనకవులవలెనే ధర్మప్రతిపాదకమైన విష్ణుపురాణమును సర్వజనాంగీకార మగు శైలిలో వ్రాసి గణుతి కెక్కెను. ఈతడు కడు వినయముగల కవి. కుకవినింద చేయలేదు. విష్ణుపురాణమును సంస్కృతములో పరాశరుడు వ్రాసె ననియు దానిని తా నాంధ్రీకరింప దలచితి ననియు నీతడు నివేదించెను. సంస్కృతపురాణములలో విష్ణుపురాణము ప్రాచీనతమ మని చెప్పుదురు. ఇందలి పూర్వభాగమునందు శ్రీ మహావిష్ణువు అవతారకథలు వర్ణింపబడినవి. ఉత్తరభాగమునందు వివిధధర్మములు వ్రతనియమములు, వేదాంతము జ్యోతిషము మొదలగు నంశములు విస్తరింపబడినవి. ఇట్లు రెండవభాగము కావ్యముగా వ్రాయుటకువీలులేనిది. కావున వెన్నెలకంటిసూరనార్యుడు కావ్యరచన కనుకూలముగానున్న విష్ణుపురాణపూర్వభాగమునే గైకొని రసవంతముగ తెనిగించెను. భాగవతములోవచ్చిన కథ లన్నియు విష్ణుపురాణములో కూడ

వచ్చినవి. కవి వాని నిచ్చట సంగ్రహముగ వర్ణించెను. ధ్రువ చరిత్రము ప్రహ్లాదచరిత్రము వంటివి యుదాహరింపవచ్చును. విష్ణుపురాణములోని ప్రహ్లాద కథ భాగవతకథకన్న భిన్నముగా నున్నది. ప్రహ్లాదుడు తన విష్ణుభక్తిప్రభావముచే తన తండ్రి హిరణ్యకశిపును విష్ణుభక్తునిగా చేసెనని విష్ణుపురాణము చిత్రించుచున్నది. ఇది మిక్కిలి బాగున్నది. మాంధాతచరిత్రము జడభరతోపాఖ్యానము మొదలగుకథలను సూరనార్యుడు కడురమ్యముగ రచించెను.

విష్ణుపురాణములో శ్రీకృష్ణచరిత్రము మనోహరముగ వర్ణితమైనది. ఇందు శ్రీకృష్ణునిజీవితము సహజమై, అద్భుతములును అతిశయోక్తులును విస్తారముగ యొప్పారినది. శ్రీకృష్ణుని దివ్యత్వము నీ పురాణము కూడ విశ్వసించినదైనను శ్రీకృష్ణుని యమునా కూలవనవిహారభావములనుకూడ విష్ణుపురాణ మువిహా రించు చున్నది. సత్రాజిత్తు తెచ్చియిచ్చిన శమంతకమణికొరకై శ్రీకృష్ణబలరాము లిద్దరును ఆశపడిరట. విష్ణుపురాణము తదితర పురాణములవలెనే కథలకు గని వంటిది. ఈ కథలన్నిటిని సూరనార్యుడు మితవర్ణనలతో, దీర్ఘశృంగారవిన్యాసములకు పోక, ఔచిత్యమును పాటించుచు ప్రశంసనీయముగ వ్రాసినాడు. తారాశశాంకుల కథనుకూడ ఈ కవి సభ్యతారుచికి భంగములేకుండ వర్ణించి తన నేర్పు చూపినాడు. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో వర్ణించిన ఖాండిక్యకేశిధ్వజ సంవాదము విష్ణుపురాణములో నున్నది. వెన్నెలకంటి సూరన మహాకవి

యని పొగడదగును. భావమునందును శైలియందును మార్దవ మీతనికి సహజము. "కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు" అను ప్రశంస నీతడు చక్కగా నిర్వహించుకొనెను.

## సింహావలోకనము.

ఆంధ్రసాహిత్యము, గ్రంథములు లభించినంతవరకు, నన్నయభట్టారకునితో ప్రారంభించిన దని చెప్ప వీలగుచున్నది. కావుననే నన్నయభట్టారకుడాదికవి యనియు, వాగనుశాసను డనియు కవులందరిస్తుతికిని పాత్రుడైనాడు. నన్నయనాటిన యాంధ్ర సాహిత్యవృక్షము ప్రబంధయుగమునాటికి శాఖోపశాఖలు గల్గి విజృంభించినది. నన్నయనుండి శ్రీకృష్ణదేవరాయలవరకు గల కాలమును ఆంధ్రసాహిత్యములో పురాణయుగమని చెప్పుచుందురు. ఈనడిమికాలము రమారమి ఐదుశతాబ్దములు. ఇప్పటి కవులు సంస్కృతమునుండి పురాణములను మరి యితర గొప్ప గ్రంథములను తెనుగుసేయుచు భాషాసేవ జేసిరి. ఆంధ్రీకరణమే వీరి మార్గమైనను ఈ మహాకవులు వట్టియనువాదకులుగాక, వారు స్వతంత్రముగ నేయట్టి మహాగ్రంథములను వ్రాయగల సమర్థులు. దేవభాష యని చెప్పబడు సంస్కృతమునందును, వేదమతము నందును మనపూర్వుల కుండిన ప్రేమ గౌరవములచేత గీర్వాణ గ్రంథములనాంధ్రీకరించుట దేశభాషాసేవ యనియు, తమకు పుణ్యహేతు వనియు ప్రాచీనాంధ్రకవిశ్రేష్ఠులు విశ్వసించి యట్లు చేయుచుండిరి. వీరిది ప్రధానముగ ధర్మదృష్టి. కావ్యరచనవలనను

కావ్యమును కృతిగొనుటవలనను ధర్మసంపద చేకూరు నని యా నాటి కవులును రాజులును తలపోయుచుండిరి. దేవభాషాగ్రంథ ముల నాంధ్రీకరించుటచే ప్రజాసేవకూడ సిద్ధించునని మన కవిపుం గవులు తలంచిరి. వీరిలో చాలమంది రాజాశ్రయము ననుభవించి నవారు. అట్లగుటచే ఈ మహాకవులు రాజసేవకు లని తలపోయ రాదు. ప్రజారాధనము వీరి మాదర్శమైనట్లు "విశ్వశ్రేయః కావ్యమ్" అను నన్నయవచనము తార్కాణము. పురాణముల యుగమునందే తరువాత రాబోవు ప్రబంధరీతికి బీజములు చల్లబడి నవి. నన్నెచోడుడు, నాచనసోముడు, శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు వంటివారి రచనలే తరువాతికాలమున వచ్చు ప్ర బంధయుగాలకు దోహద మొసంగినవి.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## ఎనిమిదవ ప్రకరణము.

## కృష్ణదేవరాయల యుగము

### క్రీ. శ. ౧౫౦౦—౧౬౦౦

పదునారవ శతాబ్దమును ఆంధ్రసాహిత్యచరిత్రలో ప్రబంధయుగమని వ్యవహరింతము. అష్టదిగ్గజము లని పేరు వడసినమహాకవులును మరికొందరును ఈ కాలమునందు విలసిల్లిరి. వీరు శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునం దున్నట్లు లోకములో వాడుకగా చెప్పుకొందురు. కాని వీరందరును ఆ చక్రవర్తికొలువులో నుండలేదు. వీరిలో అల్లసానిపెద్దన, నందితిమ్మన, ధూర్జటి, మాదయగారిమల్లన అను వారు కృష్ణరాయలకు సమకాలికులు. అయ్యలరాజు రామభద్రుడు రాయలవారి చరమదశయందు బాలకవియై యుండెను. పింగళిసూరన, రామరాజభూషణుడు, తెనాలిరామకృష్ణకవి అనువారు కృష్ణరాయలకు తరువాత సమీపకాలమునందే యుండిరి. పదునారవ శతాబ్దినుండియు ప్రబంధరీతి వ్యాప్తిలోనికి వచ్చెను. పురాణముల యుగమునకును దీనికిని కొన్ని స్ఫుటమైన భేదములు గాన్పించును. (౧) రచనావిధానము. ఈనాటి నుండియు కవులు ఆంధ్రీకరణమార్గమును చాలవరకు విడిచిపెట్టి స్వతంత్రకావ్యనిర్మాణ పద్ధతినవలంబించిరి. (౨) కథావస్తువు ఇంతకు

పూర్వము సంస్కృతపురాణములు సమగ్రముగ కథావస్తు వగు చుండెను. ప్రబంధకవులు ఈపద్ధతిని విడిచిరి. వీరు రెండువిధము లైన కథావస్తువును చేబట్టుచుండిరి. (అ) ప్రసిద్ధకథ (ఇ) కల్పిత కథావృత్తాంతము. అల్లసానిపెద్దన వ్రాసిన మనుచరిత్రవంటి గ్రంథములలోనికథ ప్రసిద్ధమైనది. అనగా పూర్వగ్రంథముల లోనుండి తీసికొనబడినది. పురాణములలోనుండి యొక రమ్య మైనకథను గ్రహించి దానిని రసభావముల కనుగుణముగ విస్త రించి వ్రాయుట ఈ మార్గము. పింగళిసూరనార్యుడు వ్రాసిన కళాపూర్ణోదయమువంటి కావ్యమును కల్పిత కథాప్రబంధ మని చెప్పవచ్చును. ఇందులోని వృత్తాంతము కవి తన కల్పనా శక్తిచే నిర్మించుకొన్నది. (3) నాయికానాయకులు. భారత రామాయణాదిగ్రంథములలోని నాయకులు. ఉదాత్త ప్రకృతి గలవారు. వారియందు శౌర్యము, ఔదార్యము, సత్యవాక్య ప్రీతి మొదలగు గొప్పగుణములను కవులు చిత్రించిరి. అట్లే నాయికలైన సీత, ద్రౌపది మొదలగు కాంతలు ధీరస్వభా వము గలవారుగా చిత్రింపబడిరి. ప్రబంధములలోని నాయకులు మధురప్రకృతిగలవారు. వీరు తమకాలమును లలితకళలకును కామినీగోష్ఠికిని వినియోగించువారు. ప్రబంధనాయికలు ప్రేమ నిధానములుగ గన్పింతురు. వీరిలో కులస్త్రీలే కాక వారవనిత లును ఉన్నారు. నందితిమ్మన పారిజాతాపహరణములోని నాయిక సత్యభామ కులస్త్రీరత్నము. అల్లసానిపెద్దన మను చరిత్రలోని వరూథిని గంధర్వకామిని. పింగళి సూరనార్యుని

కళాపూర్ణోదయములోని కలభాషిణి వేశ్యకాంత. వీరు సంగీతమునకు పెట్టినది పేరు. (౪) రసము. పురాణములలో వీరశాంతరసములకు ప్రాధాన్యము. శృంగారము కొలదిగా నుండును. ప్రబంధకవులు శృంగారమునకు అగ్రస్థాన మిచ్చిరి. స్త్రీపురుషుల ప్రేమభావములను వీరు సూక్ష్మాతిసూక్ష్మముగ పరిశీలించి వర్ణింతురు. (౫) అలంకారములు. పూర్వకవులు ఉపమాలంకారము, రూపకము, స్వభావోక్తి, వీనిని తమ రచనలలో ఎక్కువగా వాడుచుండిరి. ప్రబంధకవులు ఈయలంకారములకు తోడు ఉత్ప్రేక్ష, అతిశయోక్తి వీనిని విరివిగ కూర్చిరి. (౬) వర్ణనము. పూర్వకవులు కథపై యెక్కువ శ్రద్ధను చూపుచు వర్ణనములను మితముగ చేయుచుండిరి. ప్రబంధకవులు తమ నైపుణ్యమును వర్ణనాత్మకమైన రచనయం దెక్కువగా ప్రదర్శించిరి. కావ్యములో అష్టాదశవర్ణనములుండవలెనని కొందరి మతము. నగరము, సముద్రము, పర్వతములు,సూర్యోదయ చంద్రోదయములు, ఉద్యానము, విరహము, జలక్రీడలవంటి రమ్యవస్తువులను పదునెనిమిదింటిని వర్ణించుటయే అష్టాదశ కావ్యవర్ణన మనబడును. ప్రబంధకవులు వీటిని తప్పక పాటించుచుండిరి. (౭) శైలి. పూర్వకవులు మొత్తముమీద సులభసామాన్యశైలికి నలవడినవారు. వీరు కూడ మృదువైన రచన అక్కడక్కడ చేయకపోలేదు. (౮) కవిత్వాదర్శము. పురాణముల యుగమందు కవుల యాదర్శము ధర్మప్రతిపాదనము, నీతిబోధచేయుట. ప్రబంధకాలపు కవుల

దృష్టి లౌకిక కావ్యదృష్టి. కావ్యము ఆనందము నిచ్చిన చాలునని వీరు తలచిరి. ధర్మమును నీతిని బోధించుటకు వీరు ప్రయత్నము చేయరు. ఇవి పూర్వకవిత్వమునకును ప్రబంధకవిత్వమునకును గల సామ్యభేదములు.

## అల్లసాని పెద్దన.

ఈ మహాకవి స్వారోచిషమనుసంభవమును వ్రాసెను. దీనినే మనుచరిత్ర యందురు. హరికథా సారమను మరియొక గ్రంథము నీతడు వ్రాసెనని చెప్పుదురు. అది యీ కాలమున లభించుటలేదు. అల్లసాని పెద్దన మనుచరిత్రను శ్రీకృష్ణదేవరాయలకు సంకిత మొనర్చెను. కృష్ణదేవరాయచక్రవర్తి క్రీ. శ. ౧౫౦౯ నుండి ౧౫౩౦ వరకును విజయనగర సామ్రాజ్యమును పాలించెను. కావున పెద్దనార్యుడీ కాలమున నుండెనని నిశ్చయమగుచున్నది. ఈ కవి నందవరీక నియోగిబ్రాహ్మణుడు. ఈతడు మొదట అద్వైతిగనుండి తరువాత వైష్ణవమతమును స్వీకరించెను. కృష్ణదేవరాయలీ మహాకవి నెంతో గౌరవాదరములతో చూచెడివాడు. "ఆంధ్రకవితాపితామహ" బిరుదమును కృష్ణరాయలు పెద్దనార్యున కిచ్చెను. "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూత యొసగి యెక్కించుకొనియె" అను పద్యములో కృష్ణరాయలు తనయెడ చూపిన యాదరమును పెద్దనార్యుడు చక్కగా వర్ణించెను. రాయలితనికి కోకట మొదలగు గ్రామముల నగ్రహారములుగా సమర్పించెను. అల్లసాని పెద్దన యీ గ్రామములను తన గురువులకును దేవాలయములకును తిరిగి

దానముచేసి పుణ్యమును కీర్తిని గడించుకొనెను. పెద్దనకవి సుఖభోగముల ననుభవించినవాడు. ఆశుధారగా గొప్పకవిత్వము చెప్పగల మేధాసంపన్నుడు. ఇతనికి శృంగార మభిమానరసము. ఈ కవికి నాత్మవిశ్వాసము మెండు.

భారతభాగవతరామాయణముల తరువాత తెలుగు కావ్యములలో అల్లసానిపెద్దనార్యుని మనుచరిత్రకే ప్రజాదరణము హెచ్చు. మనుచరిత్ర పీఠికలో నీతడు కృష్ణరాయల దిగ్విజయములను శక్తివంతమైన శైలిలో వర్ణించినాడు. ఆంధ్రుల వీరవిహారమున కానాడు హద్దులుకాని యాటంకములుగాని లేకుండెను. దేశము ఐశ్వర్యముతో మూలుగుచుండెను. భోగభాగ్యములకు కొదువలేదు. ఈ మనోహర వాతావరణములోనే మనుచరిత్ర జనించినది. స్వారోచిషమనుసంభవకథను పెద్దనార్యుడు మార్కండేయపురాణమునుండి గ్రహించెను. ఆ కథ యిట్లుండును. అరుణాస్పదపురమునందు ప్రవరుడను బ్రాహ్మణు డుండెను. అతడు వేదాధ్యయన సంపన్నుడు. అగ్నిహోత్రములను శ్రద్ధతో వేల్చుచు పరమనైష్ఠికుడై యుండెను. ఆతడు తరుణవయస్కుడు. మిక్కిలి చక్కనివాడు. ఒకనాడొకసిద్ధు డాతనియింటికి నతిథియై వచ్చి కామగమనము నిచ్చునొకపసరును ప్రవరుని పాదములకు బూసెను. దానిమహిమచే ప్రవరుడు హిమవత్పర్వతమున కేగి యచ్చటి పుణ్యప్రదేశములను తిలకించుచుండగా మధ్యాహ్నసమయ

మయ్యెను. ఆతని పాదములకున్న పసరు మంచుతోపాటు కరగి పోయెను. ప్రవరు డింటికిబోలేక చింతిల్లుచు దారివెదకుకొనుచు గంధర్వయువతియైన వరూధిని మందిరప్రాంతమున సంచరించు చుండెను. ఆమె వాని సౌందర్యమును గాంచి వానిని వలచి తన ప్రేమను గ్రహింపు మని ప్రవరుని వేడెను. శుద్ధశ్రోత్రియు డును ఏకపత్నీవ్రతుడును నగు ప్రవరు డామె యనుచితప్రార్థన మును మన్నింపక యెట్లో అగ్నిదేవుని దయచే నా పర్వతము విడిచి యిల్లుజేరెను. వరూధినిమాత్రము దుఃఖితయై విరహ వేదనపడుచుండెను. ఆమె నిదివరలో ప్రేమించి నిరాకరింప బడిన గంధర్వకుమారు డొకడు, ఇదియే సమయమని తలచి ప్రవరుని వేషముతో వరూధినిని జేరి యామెను రంజింపజేసెను. ఈ దంపతులకు స్వరోచి యను కుమారుడు పుట్టెను. స్వరోచి. పెద్దవాడై పలువురుభార్యలను పెండ్లాడి కామభోగముల పొం దెను. స్వరోచి కుమారుడు స్వారోచిషుడు. ఇతడే తరువాత మను వయ్యెను.

అల్లసానిపెద్దన యీ కథలో విశేషము మార్పులేమి యు చేయలేదు. అయినను మార్కండేయపురాణకథకన్న మను చరిత్రకథ మిక్కిలి రమణీయముగా నున్నది. దీనికి కారణము రసభావముల కనుగుణముగా పెద్దనార్యు డీకథను విస్తరించి వ్రాయుటయై యున్నది. శ్రోత్రియుడైన ప్రవరుని నైతికవర్త నమునకును, స్వేచ్ఛాచరితముగల వరూధిని మోహావర్తనమున కును గల సంఘర్షణము నీ కవీంద్రుడు గొప్ప నేర్పరితనముతో

చిత్రించెను. ఈతని కథారచన నైపుణ్యము ప్రశంసనీయము. "అల్లసానివాని యల్లికజిగిబిగి" యను నానుడి గలదు. పెద్దనార్యుని శైలి కొన్నిచోట్ల ప్రౌఢముగానున్నను మొత్తము మీద సౌష్ఠవకరమగుచు 'మృదువు', జాతీయములను సామెతలను ఈతడు చక్కగా వాడును. ప్రకృతి చిత్రములను అల్లసాని పెద్దన పరిశీలనతో వర్ణించెను. మానవహృదయమందలి ధర్మాధర్మములకు జరుగు సంగ్రామమును నేర్పుతో చిత్రించిన మహాకవి యల్లసానిపెద్దన.

## నందితిమ్మన.

ఈ కవి పారిజాతాపహరణమును వ్రాసి కృష్ణదేవరాయల కంకిత మొనర్చెను. తాను మలయమారుతకవి మేనల్లుడనని నందితిమ్మన చెప్పుకొనెను. వరాహపురాణమును వ్రాసిన జంట కవులలో నొకడగు ఘంటసింగయకవికి మలయమారుతకవి యను బిరుదముండెను. నందితిమ్మకవి వంశమునకు విజయనగరాస్థానముతో సన్నిహిత పరిచయము గల్గిన దని విశ్వసింప వచ్చును. శ్రీకృష్ణదేవరాయల పూర్వికుల విజయముల నీతడు పారిజాతాపహరణ పీఠికలో వర్ణించెను. ఈ వర్ణనాంశములు వరాహపురాణమందలి యంశములకు సరిపోవుచున్నవి. నందితిమ్మనకవి నియోగి బ్రాహ్మణుడు. శైవాచార సంపత్తి గలవాడు. ఈతడు వ్రాసిన గ్రంథము విష్ణుప్రశంస గలిగినది. దీనిని బట్టి యీతడు సమబుద్ధి గలవాడని యూహింపవచ్చును.

శ్రీకృష్ణదేవరాయలు తనకు నగ్రహారములు పల్లకీలు మొదలగు గౌరవచిహ్నములను బహూకరించె నని యీకవి చెప్పుకొని యున్నాడు.

ప్రబంధములలో మనుచరిత్రము పారిజాతాపహరణమును అక్కసెల్లెండ్రవంటివి. రెండును కొంచె మెచ్చుతక్కువగా నొకేకాలమున ప్రభవించినవి. వీనిలో నేదిముందు, ఏదివెనుక యని నిర్ణయించుటకు కొన్ని సూచనలుమాత్రము కలవు. రెండుప్రబంధములును కృష్ణదేవరాయల విజయపరంపరలను వర్ణించుచున్నవి. పారిజాతాపహరణము కొండపల్లి విజయమును పేర్కొని కృష్ణరాయలు కటకముపై బడబోవు చున్నట్లు వర్ణించినది. గజపతుల రాజ్యమును జయించుటను పారిజాతాపహరణ ముగ్గడింపలేదు. మనుచరిత్ర కృష్ణదేవరాయలవారి కళింగవిజయమును వర్ణించినది. కావున నీ ప్రబంధములలో పారిజాతాపహరణమే ముందు వ్రాయబడియుండు నని యూహింపబడినది. అయినను ఈ రెండు కావ్యములుగూడ కళింగవిజయానంతరమున నే రాయలకు కృతి సమర్పింప బడినవి. ఇట్లు పారిజాతాపహరణప్రబంధము క్రీ. శ. ౧౫౧౮ నకు ముందు వ్రాయబడినదని తలంపవచ్చును.

పారిజాతాపహరణకథకు మూలము సంస్కృతహరివంశమునందున్నది. ఈ వృత్తాంతమును స్వీకరించి కొలదిమార్పులను గావించి నందితిమ్మకవి దీని నొక లలితమనోహరకావ్యముగా దిద్దెను. ఇందలి కథ యిట్లుండును. శ్రీకృష్ణుడు ద్వారకానగరము

నందు అనేకమందిభార్యలతో సుఖవినోదములనుభవించు చుం
డెను. రుక్మిణీసత్యభామ లిర్వురును తానే యందక త్తెయని యొ
కరును, తానేయందక త్తెయని మరియొకరును గర్వించు చుండిరి.
ఇట్లుండ నారదమహాముని దివ్యప్రభావముగల పారిజాతకుసుమ
మును తెచ్చి శ్రీకృష్ణునకు సమర్పింపగా దాని నాతడు చెంతనున్న
రుక్మిణికిచ్చెను. ఈ వృత్తాంతము సత్యభామకు తెలిసి, పారిజాత
పుష్పమును రుక్మిణికిచ్చినందులకు కోపగ్రస్తురాలై ఈర్ష్యతో
మండిపడుచు కోపగృహము చేరి దుఃఖించుచుండెను. శ్రీకృష్ణు
డామె నోదార్చుట కెన్నియో ప్రియోక్తుల నాడెను. చివర కా
మె కాళ్ళకు మ్రొక్కబోగా కోపభరమును పట్టజాలక సత్యభామ
శ్రీకృష్ణుని శిరస్సును పాదముతో తొలగద్రోచెను. శ్రీకృష్ణుడు
దీనినికూడ ప్రియానుగ్రహముగనే స్వీకరించెను. ఒక్క పారిజాత
పుష్పమునకే వగవ వలదనియు స్వర్గమునుండి పారిజాత
వృక్షమునే తెచ్చి యామె పెరటిలో నాటింతుననియు శ్రీకృష్ణుడు
సత్యభామ నోదార్చెను. నరకాసురుడు హరించిన కుండలముల
ను అదితిమహాదేవికి సమర్పించు నెపమున శ్రీకృష్ణుడును సత్య
భామయు దేవతలపురమునకేగిరి. ఇంద్రుని జయించి శ్రీకృష్ణుడు
పారిజాతవృక్షమును తెచ్చి సత్యభామ వాకిట నిలిపెను.

నందితిమ్మన రచనాశిల్పము కడు రమ్యమైనది. అతని
శైలియు కడుమృదువైనది. కావుననే "ముక్కుతిమ్మనార్యు ము
ద్దుపలుకు" అను లోకప్రశంస జనించినది. ఈతడొకపద్యమున స్త్రీ
నాసికను వర్ణించుచు ముద్దుగులుకు "నానాసూనవితానవాసన

ల" అనుపద్యమును చెప్పుటచే నీతనికి ముక్కుతిమ్మన యను వ్యవహారము కలిగె నని చెప్పుదురు. ఈ పద్యమును రామరాజభూషణుడు నందితిమ్మకవి వద్దనుండి ఎరువు తెచ్చుకొనె నని కథ యున్నది. ఈపద్యము వసుచరిత్రలో నున్నది. వనితల మనోభావములను పూసగ్రుచ్చినట్లు వర్ణించుటలో నీ కవికి నేర్పు మెండు. శ్రీకృష్ణునకు తనపై గల ప్రేమ లోపించెనేమో యని సత్యభామకుండునప్పటి భావములు మిక్కిలి మనోజ్ఞములు. ప్రకృతివర్ణనమునందుకూడ నందితిమ్మన సమర్థుడే. శృంగారరసమును చిత్రించుటలో నీ కవి మెలకువ చూపెను. ఈతని భావములు వర్ణనములును సభ్యరుచికి వెలిగాక ప్రశంసనీయములై యున్నవి. మానవహృదయపరిశోధమునందీతడు అల్లసానిపెద్దనయంత వాడు కాడు. మృదులీలాభావములను మృదుతరశైలిలో వ్రాయుటయందు నందితిమ్మన సిద్ధహస్తుడు.

## కృష్ణదేవరాయలు.

ఈ మహాకవి ఆముక్తమాల్యదను రచించెను. కృష్ణదేవరాయచక్రవర్తి క్రీ. శ ౧౫౦౯—౧౫౩౦ల నడుమ విజయనగర సామ్రాజ్యమును పాలించి లోకవిఖ్యాతిని చెందినవాడు. రాజకీయప్రాభవమునందును, భోగభాగ్యములందును, సాహిత్యాభివృద్ధియందును,శిల్పము కళలందును, ఈ చక్రవర్తి పరిపాలనా కాలము ఆంధ్రచరిత్రయందు స్వర్ణయుగ మని చెప్పనగును. భాషాపోషణమునం దీమహారాజును భోజునితో పోల్చవచ్చును.

ఈతని యాంధ్రభాషాభిమానము ప్రశంసనీయము. 'దేశ భాష లందు తెనుగులెస్స' అను సూక్తి కృష్ణదేవరాయలమూలమున ప్రసిద్ధికి వచ్చినది. వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామములో మొట్టమొదట నిది కనబడుచున్నది. సంస్కృతభాషలో తాను మదాలసచరిత్ర మొదలగు ప్రబంధములు వ్రాసినట్లు కృష్ణదేవ రాయ లాముక్తమాల్యదలో పేర్కొనెను. కాని యాగ్రంథము లిప్పుడు గనరావు. ఈ చక్రవర్తి గాఢవైష్ణవమతాభిమానము గలవాడు. ఆముక్తమాల్యదలో నొకటిరెండు స్థలములందు పర మతములను కొద్దిగా పరిహాసించినను ఈతడు సమబుద్ధియు పర మతసహనమును గలవాడని నొక్కి చెప్పవీలగుచున్నది. అల్ల సానిపెద్దనవంటి వైష్ణవాభిమానముగల కవినే కాక ధూర్జటివంటి శివభక్తుడగు కవినిగూడ కృష్ణదేవరాయలాదరించెను.

ఆముక్తమాల్యద రచనాకాలము క్రీ. శ ౧౫౧౯ కి తరు వాతనై యుండు నని కొమర్రాజులక్ష్మణరావుపంతులుగా రూహ చేసిరి. ఈ గ్రంథపీఠికయందు ఆముక్తమాల్యద రచనాప్రశంసను రాయలు చేసెను. కళింగ దేశమును జయించు నభిలాషతో రా యలు దండెత్తిపోవుచు శ్రీకాకుళాంధ్ర దేవుని దర్శించి యొక హరివాసరమునా డచ్చట యుపవసించెను. శ్రీకాకుళము అతిప్రా చీనమైన యాంధ్రనగరము. ఇచ్చటి దేవుడు శ్రీకాకుళాంధ్ర విష్ణువు స్వామివారు రాయలకు కలయందు సన్నిధిచేసి తమపేర నొకగ్రంథము నాంధ్రభాషలో రచింపు మని శాసించిరి. శ్రీరంగ నాథుని యవతారమున తాము గోదాదేవిని పెండ్లియాడిన పుణ్య

కథను ప్రబంధింపు మని స్వామి సెలవు. శ్రీకాళహస్తీశ్వరస్వామికి కృష్ణదేవరాయలు శా.శ ౧౪౪౦ బహుధాన్య సంవత్సర ఫాల్గుణశుద్ధ ఏకాదశి శుక్రవారమునాడు భూదానము చేసి వ్రాయించిన శాసనము లభించినది. దీనినిబట్టి ఆముక్తమాల్యద రచనాసంకల్పము రాయల కీనాడు కలిగియుండు నని లక్ష్మణరావుపంతులుగారు ఊహించిరి. ఆముక్తమాల్యద యనగా తాను (కొప్పులో) ధరించి తీసిన పూలదండను సమర్పించిన కన్య యని యర్థము. ఈమెయే గోదాదేవి యను పరమవైష్ణవభక్తురాలు. ద్రావిడ పుణ్యప్రబంధములం దీమెరచనలకు గొప్పస్థానము కలదు.

ఆముక్తమాల్యద కథాసారమును సంగ్రహముగ వ్రాసెదము. శ్రీవిల్లిపుత్తూరను పుణ్యనగరమునందు మన్నారుదాసస్వామి వెలసి యుండెను. ఈ గ్రామమునందు విష్ణుచిత్తుడను వైష్ణవభక్తాగ్రేసరు డుండెను. ఆతడు తన జీవితమును స్వామిసేవకు కైంకర్యము చేసెను. మన్నారుదాసస్వామి యాలయమును నూడ్చుట, అభిషేకాదులకు జలము గొనివచ్చుట, స్వామిపల్లకిని మోయుట, పూదండలు గ్రుచ్చి సమర్పించుట, వింజామర వీచుట—ఇట్టిది విష్ణుచిత్తార్యుని పవిత్రజీవితక్రమము. ఆతిథ్యము నందుకూడ విష్ణుచిత్తుడు పెట్టినదిపేరు. అర్ధరాత్రులందుకూడ వైష్ణవభక్తు లాతనియింట కుడుచుచుండురు. కూరలు లేవు. నారలు లేవు. దయతో భుజింపుడని యాభక్తు డతిథులకు ఉపచారములు చెప్పుచుండును. విష్ణుచిత్తుడు విరాగియైనను మిక్కిలి మృదుహృదయుడు. వర్షాకాలమునందు అభ్యాగతులకు వంటచేయుటలో

తన భార్య క్లేశపడకుండ, అవసరమయిన వంటచెరుకు మున్నగు వాటి నాతడు వేసవియందే జాగ్రత పరచియుంచెడివాడు. ఇట్లుండ పాండ్య దేశము నేలెడు రాజు ఏమతము ముక్తిదాయక మని నిర్ణయించుటకై పండితసభను ప్రకటించెను. వైష్ణవమతప్రాశస్త్యము నాసభలో నుద్ఘోషించుటకై మన్నారు దేవుడు విష్ణుచిత్తార్యుని బొమ్మని ముదల యిడెను. తానీ గురుతరభారమును మోయుటకు అసమర్థుడ నని విష్ణుచిత్తార్యుడు మిక్కిలి వినయముతో నివేదించెను. "స్వామీ! నేను శాస్త్రగ్రంథపరిచయమునందు జాత్యంధుడను. మీకోవెలలో ఊడిగములు చేయవలసినవాడను గాని వాదసభలలో నోరెత్తి వాదించ గలవాడను గాను. మీ పూలతోటను గుద్దలితో త్రవ్వి నాచేతులు కాయలు గాచినవి. ఇట్టి పామరుడనైన నన్ను వాదసభలకు పంపినచో ఓటమి తథ్యము. అట్టియోటమివలన గల్గు నపకీర్తి మీకు కళంకము దెచ్చును". కాని స్వామియాజ్ఞకు తిరుగులేదు. నా యనుగ్రహముచే శాస్త్రము లన్నియు నీకు స్ఫురించు నని మన్నారు దేవుడు ధైర్యముదెల్పి విష్ణుచిత్తుని పాండ్యసభకు బంపెను.

విష్ణుచిత్తుడు పాండ్యసభలో వైష్ణవమతముయొక్క సర్వోత్కృష్టతను స్థాపించెను. ఈ సందర్భముననే యాతడు ఖాండిక్య కేశిధ్వజ సంవాదము అను వేదాంతబోధకమైన కథను రాజసభలో నుపన్యసించెను. విష్ణుచిత్తుడు విజయమును చేకొని వచ్చును. మన్నారు దేవుడు తనభక్తులలో నొకడగు యామునాచార్యుని ప్రశంస తెచ్చి యాతనిచరిత్రను సుదీర్ఘముగ వివరించె

ను. ఇట్లుండగా విష్ణుచిత్తులవారికి తోటలో నొక యాడుశిశువు దొరకెను. పుత్రికాప్రేమతో నాతడాశిశువును పెంచి పెద్దదానిని చేసెను. ఈమెయే గోదాదేవి. ఈమె శ్రీరంగేశ్వరుని మనస్సులో భర్తగా వరించి యన్యుల పెండ్లియాడ నని ప్రతిజ్ఞ గైకొనెను. భగవంతునికి సమర్పించవలసిన పూలదండ నామె తనకబరీభర మునందు మొదటపెట్టుకొని చెరువునీళ్ళలో ప్రతిబింబమును చూచుకొని స్వామికినలంకరించెడిది. శ్రీరంగనాథుడామె హృదయభక్తికి మెచ్చి విష్ణుచిత్తార్యుని యంగీకారము వడసి గోదాదేవిని పరిణయమయ్యెను. గోదాదేవి పూర్వజన్మవృత్తాంతముతో కొంతవరకు సందర్భించి మాలదాసరి యను వైష్ణవభక్తుని కథ చెప్పబడినది.

ఈ విధముగ ప్రధానకథయైన గోదాదేవి వృత్తాంతము స్వల్పముగనే యున్నది. వైష్ణవభక్తుల పుణ్యకథల నేదోరూపమున తన గ్రంథములో వర్ణించుటయే రాయల యుద్దేశము. అట్టివారిలో విష్ణుచిత్తుడు, ఖాండిక్యకేశిధ్వజులు, యామునాచార్యుడు, మాలదాసరియు ముఖ్యులు. విష్ణుచిత్తుని పేర ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయమను పేరుగలదు. కృష్ణదేవరాయలు నడవనేర్పిన విజ్ఞానసర్వస్వమని చెప్పుట అతిశయోక్తిగాదు. ఈయన తన గొప్పవిజ్ఞానము నంతను ఆముక్తమాల్యదలో ప్రదర్శించెను. ముఖ్యముగ రాజనీతియు వేదాంతమును ఈతని కభిమానవిషయములు. ఖాండిక్యకేశిధ్వజుల వృత్తాంతములో వేదాంతమును, యామునాచార్యచరిత్రలో రాజనీతిని చక్కగా

విస్తరించెను. కృష్ణదేవరాయలు పుట్టుభోగియైనను పేదల జీవిత కష్టములను చూచియో విని తెలుసుకొనియో మిక్కిలి కరుణతో వర్ణించెను. ప్రకృతిపరిశీలనమునం దీరాజకవి యసామాన్య నిష్ఠ గలవాడు. యామునాచార్యచరిత్రయందును తదితరస్థలములలోను కృష్ణరాయలు ఋతువర్ణనమును సవిస్తరముగ చేసెను. ఆంధ్రసాహిత్యమునందు ఋతువుల నింతమనోహరముగ వర్ణించిన కవి మరియొకడు లేడు. జంతువులచేష్టలను పక్షుల కష్టసుఖములను గూడ నీ మహారాజు దయతో వీక్షించి వర్ణించుట సంతోషదాయకముగ నుండును. ఈమహాకవిస్వభావోక్తియందు సిద్ధహస్తుడు. వాస్తవిక వర్ణన మీతనికి మిక్కిలి ప్రీతి. అతిశయోక్తులు ఉత్ప్రేక్షలుకూడ దండిగనే చేయును.

ఆముక్తమాల్యద ప్రౌఢతమమైన ప్రబంధములలో నొకటి. కృష్ణరాయలు శైలివిషయమున నంత శ్రద్ధవహించినట్లు గాన్పించదు. రాజకార్యములందు నిమగ్నుడైన యాతనికి తన పద్యములను మెరుగుపెట్టి మురిపెముగా దిద్దుటకు విరామము లేకపోవచ్చును. రాయలు భావమునే ప్రధానముగ దృష్టియందుంచుకొనెను. ఈ కవి సులభమ్మైన శైలినిగూడ చక్కగా వ్రాయగలడు. కాని యాముక్తమాల్యదలో విశేషభాగము కఠినశైలిలో నున్నది. ఈయన హాస్యరసమునుకూడ సందర్భానుసారముగా చవి చూపెను. వచనరచనయందు కూడ కృష్ణరాయలు నేర్పరియే. ఆంధ్రకవిత్వమునందు వాస్తవికతను ప్రప్రథమమున ప్రవేశపెట్టిన చతురుడు శ్రీకృష్ణదేవరాయలు.

## మాదయ్యగారి మల్లన్న.

ఈ కవిశేఖరుడు రాజశేఖరచరిత్రమును రచించి మంత్రి తిమ్మరుసు అల్లుడైన నాదెండ్లఅప్పామాత్యున కంకిత మిచ్చెను. మాదయగారిమల్లకవి కృష్ణదేవరాయల యాస్థానమునం దుండినట్లును, రాయలవిజయయాత్రలలో వెంట నుండినట్లును 'రాయవాచకము' వలన తెలియువచ్చును. అయినను ఈ కవి కృష్ణరాయల కెట్టికావ్యమును అంకిత మిచ్చినట్లు కనబడదు. మల్లన్నకవి నియోగిబ్రాహ్మణుడు. శివభక్తిపరాయణుడు. అట్లయ్యును ఈతడు విష్ణుప్రశంసను కావ్యములో చేసియే యున్నాడు. రాజశేఖరవిలాసమును కృతిబొందిన నాదెండ్లఅప్పామాత్యుడును, ఇతని తమ్ముడు గోపనమంత్రియు దుర్గాధిపతులుగ నుండినవారు వీరు మహామంత్రి తిమ్మరుసునకు మేనల్లుళ్ళు. అప్పామాత్యుడు వైష్ణవధర్మాభిమాని యైనను శివాలయములకు పెక్కుదానములు చేసి శివప్రియుడైన మల్లన్నకవిని పోషించుట ప్రశంసావహము.

రాజశేఖరచరిత్రము చిన్నప్రబంధ మైనను మిక్కిలి రసవంతమైన కావ్యములలో చేర్పదగినది. దీని మాధుర్యమంతయు ముద్దులొలుకు శైలియందును, కడు నుచితములు సహజములు నైన భావములయందును గాంచనగును. కథాకల్పనలో రాజశేఖరవిలాసము వైచిత్రిని చూపలేదు. దీనికథ యిట్లుండును. హేమధన్వుడను రాజునకు లేకలేక యొక కుమారుడు జనించెను.

అతఁడు రాజశేఖరుడు. బాల్యమునందే యీతడు మేటివీరు డని పించుకొనెను. ఒకానొక బ్రాహ్మణుడు తన బాలిక నొక రాక్షసు డపహరించె ననియు, ఆమెను సంపాదించుటకై రాజశేఖరుని పంపు మనియు రాజును వేడెను. ఇష్టము లేకున్నను రాజొడంబడి రాజ శేఖరుని పంపును. రాజశేఖరు డెంతయో సాహసము ప్రదర్శించి రాక్షసుని తరుమును. వాడు కాళికాదేవి శరణుజొచ్చెను. కాళి కాదేవి రాజశేఖరునకు ప్రత్యక్షమై యాతని కొక చిలుక నిచ్చెను. ఆచిలుక ఆగతానాగతవేది. మిక్కిలి చాతుర్యము వాక్చాతుర్యము గలది. రాజశేఖరుడు రాక్షసవిజయానంతరము మరలివచ్చుచు దారిలో నొక సౌందర్యవతియైన రాజకన్యను సందర్శించెను. చిలుక నడుమగా నది రాచకన్నియ పూర్వవృ త్తాంతమును వర్ణించి చెప్పెను. రాజశేఖరుడును ఆ సుందరియు నొకరినొకరు ప్రేమించిరి. చిలుక రాయబారము నడపును. ఈ కీరము నలదమయంతుల కథలోని హంసవలె మిక్కిలి నేర్పరి. చక్కగా మాట్లాడనేర్చినది. పింగళిసూరనార్యుడు తన ప్రభావ తీప్రద్యుమ్నములో శుచిముఖి యను హంసను ప్రవేశపెట్టును. సూరన్నగారి హంసము మల్లన్నగారి చిలుకకు శిష్యురాలు కాద గినది. రాజశేఖరునకును సింధురాజుకూతురు కాంతిమతికిని వివా హము జరిగెను.

ఈ విధముగా రాజశేఖరచరిత్రమందు కథాప్రాగల్భ్యత మంతగాలేదు. కాని యింతలి శైలియు రసభావములును ఉత్తమ శ్రేణికి చెందియున్నవి. "రసములు చిప్పిలునట్లు కవిత్వము చెప్ప

వలెను. లేకున్నచో సుకవియైనవాడు కవిత్వము చెప్పకయే యుండుట మేలు" అని మాదయ్యగారిమల్లన్నకవి వచించెను. ఈతడు తన గ్రంథము నిట్లే ప్రతిపద్యము రసవంతముగా వ్రాసెను. ఈతనికి మితవర్ణనము లిష్టము. దీర్ఘవర్ణనములు ఉత్ప్రేక్షాతిశయోక్తులును ఈతనికి గిట్టవు. ఔచిత్యదృష్టియందుకూడ మల్లన్నకవి ప్రశంసనీయుడు. శృంగారమును అతిమాత్రముగా చిత్రింపక ప్రాచీనకవులవలె మితముగను హితముగను పోషించును.

## ధూర్జటి.

ఈ మహాకవి 'శ్రీకాళహస్తిమాహాత్మ్యము' అను భక్తిరసప్రబంధమును వ్రాసెను. కృష్ణదేవరాయల యాస్థానము నలంకరించిన మేటికవులలో ధూర్జటి యొకడు. ధూర్జటి కవితాప్రాశస్త్యమును ప్రశంసించుచు కృష్ణరాయ లిట్లు నుడివెనట. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేట్లు గల్గె నీ యతులిత మాధురీమహిమ". శ్రీకాళహస్తీశ్వర శతకము ధూర్జటికృత మని కొందరును కాదని కొందరును విమర్శకులు తలచుచున్నారు. శ్రీకాళహస్తీశ్వర శతకమునందు కవియాత్మ పరీక్షను నిశితముగ చేసుకొని యున్నాడు. వారవనితల పొందును, భోగభాగ్యములను, మత్తరాజన్యులను తీవ్రముగ నిరసించినాడు. కవితాధోరణినిబట్టి చూడ ధూర్జటియే శ్రీకాళహస్తీశ్వర శతకమునుగూడ చెప్పె నని తోచును. ఈ కవి శివభక్తుడు. శుద్ధశై

వుడు. పోతనవలెనే నరనాథులను స్తుతించుటకు విముఖుడు. ఇట్టి సునిశితస్వభావుని తన యాస్థానమునం దుంచికొని గౌరవించిన కృష్ణదేవరాయల సమబుద్ధి ప్రశంసనీయము. ధూర్జటివంశము కవివంశము. ఏతద్వంశీయు డగు కుమారధూర్జటి 'కృష్ణరాయవిజయమును' రచించెను. ఈ కుమారధూర్జటి కుమారుడగు లింగరాజు తాను తిరిగి శ్రీకాళహస్తిమాహాత్మ్యప్రబంధమును దీర్ఘముగ వ్రాసెను.

మహాకవి ధూర్జటి తన కావ్యమును ఈశ్వరున కర్పించెను. తిక్కనపోతనలవలె కవిత్వము దివ్యకళ యనియు ఈశ్వరారాధనకే వినియోగింప దగినదనియు విశ్వసించిన మహనీయుడు ధూర్జటికవీంద్రుడు. తన ప్రబంధమునకు శ్రీకాళహస్తీశ్వరుని కృతినాథునిగా జేయదలచిన యాతని సంకల్పమును గురు డిట్లభినందించెను.

> "ఈ శుభకావ్యరత్నమున కీశునధీశునిఁ జేసినన్ మహా
> దేశికసార్వభౌముడు మదిన్ బ్రమదంబు వహించి, ధూర్జటీ
> నీ శివభక్తి కావ్యసరణిం గడుధన్యత బొంద నవ్య భా
> షాశతధానిగుంభనరసస్థితి నొప్పుదలిర్పఁ జెప్పుమీ"

శ్రీకాళహస్తిక్షేత్రమాహాత్మ్యమును ప్రశంసించు కథ లీకావ్యమునందు వర్ణితమైనవి. శ్రీకాళహస్తిక్షేత్రమునకు దక్షిణకైలాస మని ప్రసిద్ధిగలదు. సంస్కృతమునందలి స్కాందపురాణములోని శ్రీకాళహస్తిక్షేత్రమాహాత్మ్యము ననుసరించి

ధూర్జటి యీ కావ్యమును నిర్మించెను. వసిష్ఠమహర్షి యొకప్పుడు తన నూర్గురుకుమారులును విశ్వామిత్రునిచే జంపబడగా దుఃఖితుడై యాత్మహత్య చేసికొనబోవు చుండెను. ఆకాశవాణి యాతనిని వారించి యీశ్వరునిగూర్చి తపస్సుచేయు మని హెచ్చరించును. వసిష్ఠు డట్లు తప మొనర్చి శ్రీకాళహస్తీశ్వర లింగమును ప్రతిష్ఠించెను. శంకరునితోపాటు లోకమాతయు జ్ఞానప్రసూనాంబికయై వెలసెను. శ్రీకాళహస్తీశ్వరుని సమీపమున నదిలేని లోపమును దీర్చుటకై యగస్త్యమహాముని స్వర్ణముఖినదిని కొండలనుండి యవతరింపజేసెను. స్వర్ణముఖీప్రవాహమును వర్ణించుచు ధూర్జటికవి వ్రాసిన వచనము ప్రౌఢశైలిలో నున్నను చక్కగానున్నది. కృష్ణదేవరాయలవలెనే ధూర్జటి కూడ వస్తుపరిశీలనయందును సహజోక్తియు వర్ణనమునందును నిపుణుడు.

శ్రీకాళహస్తీశ్వరుని భక్తులలో మనుష్యులే గాక జంతువులును, కీటకములునుగూడ గలవని వర్ణింపబడినది. ఒకసాలెపురుగు పాము, ఏనుగు శివభక్తిచే తరించినవి. శివభక్తులలో పండితులును పామరులునుగూడ కలరు. తిన్నడను భక్తుడు అటవికుడు. ఈతని భక్తి నిరుపమానము. తిన్నడు ఈశ్వరునికై తన రెండునేత్రములను పెరికి యిచ్చుటకు వెనుకాడని ధీరభక్తుడు. నత్కీరుడను కవీంద్రుని కథ శ్రీకాళహస్తిమాహాత్మ్యపు కథలలో నత్యంతరమణీయమైనది. నత్కీరుడు పాండ్యరాజులవద్ద కవిశేఖరుడై మధుర యందుండెను. దేశములో నొకప్పుడు వర్షాభావముచే కరవు

సంభవించెను. ఈ దుర్భిక్షవర్ణనమునందు మహాకవి ధూర్జటి తన యతినిశితమైన పరిశీలనాశక్తిని ప్రదర్శించెను. కరువులో ప్రజలు పడు దురవస్థలనీతడు హృదయము కరుగునట్లు వర్ణించెను. నత్కీరుడు కవిత్వమువిషయమై ఈశ్వరుడంతవానిని ప్రతిఘటించి యా దేవుడు వ్రాసిన పద్యములో తప్పువట్టెను. ధూర్జటికవిత్వము మాధుర్యము గలది యని కృష్ణదేవరాయలే పొగడెను. ఈ మహాకవి శైలి ప్రౌఢముగను లలితముగను కూడ నుండును. దీర్ఘ సంస్కృతసమాసముల నీత డవలీలగా నడిపించును. చక్కని జాతీయములు సామెతలు ధూర్జటిశైలి కందమిచ్చును. శ్రీకాళహస్తీశ్వర శతకపు శైలికూడ ధారాళమై భక్తిభరితమై యొప్పుచున్నది.

## అయ్యలరాజు రామభద్రుడు.

ఈ కవి రామాభ్యుదయమును వ్రాసి గొబ్బూరినరసరాజున కంకిత మొనర్చెను. కృష్ణదేవరాయలు వ్రాసిన 'సకలకథాసారసంగ్రహమును' రామభద్రకవి తెనిగించె ననియు, రాయలాగ్రంథమును కృతినొందకమునుపే గతించె ననియు వీరేశలింగ ముపంతులుగారు వ్రాసిరి. పై యంశమునుబట్టి రామభద్రకవి క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమున కవియై యుండు నని చెప్ప వీలగుచున్నది. ఈతని తాతయగు తిప్పయ ఒంటిమెట్టరఘువీరశతకమును రచించెను. అయ్యలరాజురామభద్రుడు నియోగిబ్రాహ్మణుడు. రామాభ్యుదయ కృతిభర్తయైన గొబ్బూరినరసరాజు

అళియరామరాజు మేనల్లుడు. అళియరామరాజు కృష్ణదేవరాయల అల్లుడు. రామభద్రకవి కృతినాయకప్రశంసకై పెక్కు పద్యములు విరచించెను. కాని యిందు చారిత్రికాంశము లెవ్వియు దొరకవు.

రామాయణకథను ప్రబంధరూపమున సంతరింపజేయుట రామభద్రుని యాశయము. ఈ యుద్దేశముతో వ్రాయుటచే మూలములలో లేని వర్ణనములను తన గ్రంథములో కవి చేర్చెను. ఇవి కొన్ని రమ్యముగనే యున్నను మరికొన్ని యౌచిత్యపోషకములుగ లేవు. రామాయణకథ యుదాత్తసరళభావములు గల్గియుండును. అయ్యలరాజు రామభద్రుని కావ్యము కృత్రకవర్ణనలచే కొన్ని స్థలములందు వికృతమైనది. ప్రబంధావసరములను బట్టి రామభద్రకవి ఉద్యానవనవిహారము, పుష్పాపచయము, జలక్రీడావర్ణనము రామాయణములో ప్రవేశపెట్టెను. కాని వృద్ధుడగు దశరథుడును ఆతని భార్యలును ఈ క్రీడలకు దిగుట పరిహాసజనకముగా నున్నది. ఋష్యశృంగుని చరిత్రములో వేశ్యలమాయలను విలాసముల నీతడు అతిమాత్రముగా వర్ణించెను. సీతసౌందర్యమును విశ్వామిత్రమహర్షి సవిస్తరముగా రామునికి వర్ణించి చెప్పుట యుక్తముగా లేదు. ఈకవికి చిత్రకవిత్వముమీదను శ్లేష, యమకము, అనుప్రాస, వీనిలోకూడిన రచనమీదను ఆసక్తి మెండు. పుత్రశోకముచే దుఃఖించు దశరథుని మాటలయందు కూడ చిత్రకవిత్వమును చూపెను. ఇట్లు ప్రబంధనిర్బంధముచే కొన్ని యనుచితకల్పనలు చేసినను మొత్తముమీద అయ్యల

రాజు రామభద్రుడు సరసకవి యని చెప్పవచ్చును. సంస్కృతాంధ్రముల రెంటియందును ఈతడు సమముగా నడుపగలడు.

## పింగళి సూరన.

తిక్కన సోమయాజి తరువాత భావబంధురమైన కవితారచనయందు పింగళిసూరనార్యుని బోలిన మహాకవి లేడని విమర్శకులు తలంతురు. ఈతని ప్రజ్ఞ బహుముఖము. పాండిత్యము నందసమానుడు. కల్పనాశక్తియందు పింగళిసూరన సరసను నిలవబడగలవా రాంధ్రకవిత్వచరిత్రలోనే యరుదు. అత్యున్నత భావములు అతిసున్నితమైన భావములు కూడ నీతని కప్రయత్నముగ వచ్చుచుండును. పింగళిసూరన పేర మూడు కావ్యములు గనవచ్చుచున్నవి. రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము. తాను గరుడపురాణమును వ్రాసినట్లు సూరనయే చెప్పుకొనెను. కాని యా గ్రంథమిప్పుడు లభించుటలేదు. ఈ కవి నియోగిబ్రాహ్మణుడు. ఈతడు అల్లసాని పెద్దనవలె నైశ్వర్యములో మునిగి తేలినవాడు కాడు. ఆత్మగౌరవము, స్వవంశాభిమానము పింగళిసూరన కలంకారములు. ఈతడు ప్రభావతీ ప్రద్యుమ్నమును తన తండ్రి పేర కృతియిచ్చి పితృభక్తిని ప్రదర్శించెను. అసాధారణ కవియైనను వినయసంపన్నుడు. పింగళిసూరన శివభక్తిపరాయణుడు. ఈతడు రాఘవపాండవీయమును ఆకువీటి పెదతిమ్మరాజునకును, కళాపూర్ణోదయమును నంద్యాలకృష్ణరాజునకును అంకితమిచ్చెను. ఈ ప్రభువులు విజయనగర సామంతరాజులు. వీరు

క్రీ. శ. ౧౫౬౦ ప్రాంతముల నున్న వారనియు, కావున పింగళి సూరనార్యుఁడుకూడ ఈ కాలమువాఁడనియు వీరేశలింగము పంతులుగారు పరిగణించిరి.*

గరుడపురాణము పింగళిసూరనకు మొదటి గ్రంథము. తరువాత నీతఁడు రాఘవపాండవీయము అను ద్వ్యర్థిప్రబంధమును రచించి తన యద్భుతపాండిత్యమును ప్రదర్శించెను. రామాయణభారతకథలు రెండును ప్రతిపద్యమునందును స్ఫురించునట్లు మహాకవి యీ కావ్యమును నిర్మించెను. ఇట్టి రచనలను రెండర్థముల కావ్యములందురు. పూర్వకవియైన వేములవాడ భీమకవి రాఘవపాండవీయము వ్రాసెనని ప్రతీతికలదు. కాని యా గ్రంథము పింగళిసూరనకాలమునకే నష్టమయ్యెను. భీమన వ్రాసె నను ప్రసిద్ధియే గాని దాని నెవ్వరును చూడలేదని సూరనార్యుఁడు వచించెను. ద్వ్యర్థిప్రబంధనిర్మాణము కష్టసాధ్యమని పల్కుచు యాకువీటి పెదతిమ్మరాజిట్లు ప్రసంగించెను.

---

* పింగళిసూరన జీవించిన కాలము విషయమై విమర్శకులు భిన్నాభిప్రాయులుగా నున్నారు. కళాపూర్ణోదయరచనము క్రీ. శ. ౧౬౨౦ సంవత్సర ప్రాంతమున జరిగియుండు నని బ్రహ్మశ్రీ మల్లాదిసూర్యనారాయణశాస్త్రులవారు తాము ప్రకటించిన కళాపూర్ణోదయ పీఠికలో చర్చించి యున్నారు. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు కూడ పింగళిసూరన ౧౪ వ శతాబ్ది కవియని యూహను ప్రకటించిరి. ఈయంశ మింకను విచార్యము.

"రెండర్థంబుల పద్య మొక్కటియునిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్య మెల్ల నగునే నోహో యనం జేయుచే
పాండిత్యంబున నందునుం దెనుఁగు గబ్బం బద్భుతం బందుద
క్షుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిఁ"

ఇట్టి యద్భుతకావ్యమును సూరనార్యుఁ డవలీలగా నిర్మించుటను బట్టియే సంస్కృతాంధ్రము లీతనికి చక్కగా స్వాధీనమైనవని తెలియగలదు. ఈ కావ్యఘటనకై సూరనార్యుడు శ్లేషను అనేకరీతుల వాడినాడు. ఇట్టి కావ్యములు చమత్కారమును కవియొక్క పాండిత్యాతిశయమును ప్రదర్శించును. వీనిలో రసభావముల కంత ప్రాధాన్య ముండదు. కవిప్రతిభ యంతయు రెండర్థములను సాధించుటలో నిమగ్నమగును. అట్లయ్యును పింగళిసూరనయొక్క కవితాశక్తి ఈ కావ్యమునందు వ్యర్థముగ పోలేదు. సందర్భోచితముగ చక్కని వర్ణనలను రాఘవపాండవీయము నందు చేసి యున్నాడు.

సూరనార్యుని కీర్తిసౌధమునకు పునాది యని చెప్పదగినది యాతని కళాపూర్ణోదయ కావ్యము. ఇది కల్పితకథాకావ్యము. పూర్వాంధ్రకవిత్వములో కల్పితకథ గలిగిన ప్రబంధములు మిక్కిలి యరుదు. ఆలోపమును తీర్చుటకో యనునట్లు సూరన మహాకవి యీ గ్రంథమును రచించి తన యపూర్వకల్పనాశక్తిని బయటఁ జూపించెను. సంస్కృతభాషయందును కల్పితమైన కథ గల రచనలు తక్కువ. మహాకవి బాణుని కాదంబరి యొక్కటి

పేర్కొనవచ్చును. పింగళిసూరన బాణుని కాదంబరిని మించిన విచిత్రసంఘటనలు గల కావ్యమును కల్పించెను. కళాపూర్ణోదయ మచ్చపు నవలవలె కథామధ్యమున యారంభించినది. ద్వారకయందు శ్రీకృష్ణుడు సుఖమున్న కాలములో కలభాషిణి యను వేశ్యారత్న మానగరమున జీవించెను. ఆమె సౌందర్యవతి విద్యావతి కళావతియు నై యుండెను. ఒకనాడు నారదమహాముని శ్రీకృష్ణుని సందర్శించుటకు తన శిష్యుడైన మణికుండలునితో గూడి యాకాశమార్గమున వచ్చుచుండెను. ద్వారకానగరము సమీపించుచు అచ్చటి యుద్యానవనములలో యువతులు ఉయ్యాలలూగుటను చూచి నారదుడు వారి సౌందర్యమును మెచ్చుకొనుచు శిష్యునితో మాట్లాడు చుండెను. అదేసమయమున రంభయు నలకూబరుడును విమానములో నా మార్గమున బోవుచుండిరి. మనుష్యకాంతల సౌందర్యప్రశంసను సహింపక రంభ నారదమహామునిని నాక్షేపించెను. మహర్షి యామెరూపగర్వమునకు కొంచెము లోలోన కోపించి నవ్వుచు నిట్లు బదులు చెప్పెను "రంభా! నీకు దగినసతి నీకును, నలకూబరునివంటివాడాతనికిని సిద్ధించినప్పుడు మీప్రేమ లెట్లు పరిణమించునో చూతముగదా" అనెను. నలకూబరుని విమానము భూమికి సమీపముగా వచ్చినప్పుడు కలభాషిణి యాతనిసౌందర్యమును జూచి వానిని ప్రేమించెను, నలకూబరుని కీవృత్తాంతంమే తెలియుదు. నారదముని ద్వారక[illegible]జేరెను. కలభాషిణి యామహర్షిని సేవించి యాతని [illegible] తెచ్చుటకై యనుజ్ఞ వేడెను. కలభాషిణి

సౌందర్యవతియేగాదు. ఆమె విద్యావతి. నారదశిష్యుడైన
మణికుండలుడు వ్రాసిన శ్రీకృష్ణదండకము నామె యొక్క
మారే విని ముఖస్థము చేసెను. నారదుని యనుగ్రహముచే కల
భాషిణికి తాను కోరినరూపము ధరించు శక్తి యబ్బెను. దీని
సాయమున నామె నలకూబరునితో కలియ గోరుచుండెను. ఒక
నాడొక మాయాసిద్ధుడు వచ్చి యామెను ప్రియునికడ చేర్తునని
మోసపు పలుకులు పల్కి తన మంత్రసింహముపై నామెనెక్కించుకొని
పోయెను. దారిలో మృగేంద్రవాహన యను శక్తిదేవాలయ
ముండెను. సిద్ధుడు కలభాషిణి నా దేవతకు బలి యివ్వదలచెను. ఈ
ప్రయత్నము విఫలమై కలభాషిణి తత్సమీపమందలి యొక
వనములో విసరివేయబడెను. అచ్చట రంభానలకూబరులు విహ
రించుచుండిరి. కలభాషిణి యీ యదనుచూచి నారదునివర
ప్రభావముచే రంభరూపమును దాల్చి నలకూబరుని చెట్టపట్టెను.
వీరిట్లు విహరించుచుండగా మరియొకమూలనుండి మరియొక నల
కూబరుడును మరియొకరంభయు ప్రవేశించిరి. సత్యరంభయు
సత్యనలకూబరుడును, మాయరంభయు మాయనలకూబరుడును
చమత్కారముగా కలహించిరి. కలభాషిణి, వేషధారియని తెలి
సిపోయి, యామె శాపము తిని వెడలిపోయెను. కళాపూర్ణోదయ
మిట్లు చమత్కారము హాస్యము పుట్టించు కథలతో అల్లుకొని
పోయి యద్భుతముగ నుండును. అవాంతరకథలలో సుగాత్రీశా
లీనులకథ మిక్కిలి యింపు గులుకుచుండును.

ప్రభావతీప్రద్యుమ్నము కడు సుందరమైన చిన్న ప్రబంధము. శ్రీకృష్ణునికుమారుడు ప్రద్యుమ్నుడు వజ్రనాభుడను రాక్షసరాజు కూతురు ప్రభావతిని ప్రేమించి పెండ్లియాడిన కథ దీనిలో వర్ణింపబడినది. గ్రంథము విశేషభాగము పాత్రల సంభాషణ రూపమున నీమహాకవి నడిపించెను. ఇది యొక నాటకమువలె నుండును. ప్రభావతీప్రద్యుమ్నుల నడుమ ప్రేమరాయబారము నడిపినది శుచిముఖి యను ఆడుహంస. ఈ హంస నేర్పు, మాటల పొందిక, కార్యసాధకచాతురి, యద్భుతావహములుగా నుండును. దేవేంద్రుని కార్యభారమును పూని శుచిముఖి వజ్రనాభునికొలువుకు రాకపోకలు సల్పుచు గొప్ప రాజనీతికౌశల్యమును ప్రదర్శించెను. ఇట్లు పింగళిసూరన మహాకవి యనేకరీతుల రచన చేసి ఆంధ్రసాహిత్యమునం దొక మహోన్నతస్థాన మలంకరించెను. ఈతనిశైలి యొకప్పుడు ప్రౌఢముగా నుండును. కాని తరుచు మృదుసరళశైలిని వ్రాయుటయే యీతనికి ప్రీతి. జాతీయములు సామెతలు సూరన నాలుకచివర నుండును. మనోగత భావములను సూక్ష్మముగ చిత్రించుటలో నతడు తిక్కనసోమయాజి కీడగును.

## రామరాజభూషణుడు

ఈ మహాకవి కావ్యాలంకారసంగ్రహమును, వసుచరిత్రను, హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించెను. కావ్యాలంకారసంగ్రహమునకే నరసభూపాలీయ మని మరియొక పేరు. రామరాజ

భూషణుడు అనునది యీకవి పుట్టుపేరు కాదు. ఇది యాతనికి కీర్తివలన గలిగిన నామధేయము. తాళికోట యుద్ధమునకు ముందు విజయనగరసామ్రాజ్యమునకు అధినేతగా నుండిన అళియరామరాజువలన కవికి నీపేరు వచ్చినది. రామరాజుచే భూషింపబడిన యీతడు రామరాజభూషణు డైనాడు. ఈకవి నిజనామధేయము మూర్తి. భట్రాజుకులమువా డగుటచే నీతనిని బట్టుమూర్తి యందురు. తన తండ్రిపేరు నీతడు వేర్వేరుగ్రంథములలో వేరువేరుగా చెప్పియున్నాడు. కావున పైమూడుగ్రంథములను రచించినకవి యొక్కడా లేక వారుభిన్నులా అను సందేహము విమర్శకులకు గలిగినది. మూడుగ్రంథముల శైలినిబట్టియు, భావసామ్యమునుబట్టియు, కవియొక్క ప్రజ్ఞనుబట్టియు ఈమూడింటిని వ్రాసిన మహాకవి యొక్కడేయని నిర్ణయింపబడినది. మూర్తి, బట్టుమూర్తి రామరాజభూషణుడు ఒకకవి పేరులేయని విశ్వసింపవచ్చును. ఈ కవిరాజు మొదట మొదట హనుమద్భక్తుడుగ నుండినవాడు. వసుచరిత్రకాలమునుండియు నీతడు శ్రీరామభక్తుడుగ మారినాడు. తన కడపటిగ్రంథమైన హరిశ్చంద్రనలోపాఖ్యానమును శ్రీరామచంద్రమూర్తికి కృతిసమర్పించి తరించినాడు. రామరాజభూషణుడు మహావిద్వాంసుడు. అసామాన్యప్రజ్ఞగల కవీంద్రుడు. ఈతడు అవధానతంత్రమునందు గొప్ప ప్రజ్ఞ గలవాడు. ఆశుకవిత్వమునందు ఉద్దండుడు, గడియలో నూరుపద్యములు అవలీలగా చెప్పగలవాడు. రామరాజభూషణుడు సాహిత్యమునందేగాక సంగీతమునందుగూడ మంచికీర్తి గడించెను. ఈ

తనికి సంగీతకళారహస్యనిధి యని బిరుదుగలదు. ఈతడు సామాన్యభట్టుకవివలె బిరుదుపద్యములతో నారంభించి, గొప్పకవి యని పేరుపడసి, రామరాజభూషణబిరుదము వహించి, అగ్రహారములు బహుమతి పొందె, తాను తిరిగి అగ్రహారములు దానముచేసి కీర్తిశిఖరము నధిరోహించెను.

కావ్యాలంకారసంగ్రహము భట్టుమూర్తి మొదటి గ్రంథము. దీని నాతడు ఓబయనరసరాజున కంకిత మిచ్చెను. ఈ నరసరాజు అళియరామరాజు మేనల్లుడు. నరసభూపాలీయము అలంకారశాస్త్ర గ్రంథము. కావ్యభేదములు, నాయకులు, రసములు, అలంకారములు మున్నగు వానినిగురించి యిది చెప్పును. సంస్కృతమునందు విద్యానాథుడు రచించిన ప్రతాపరుద్రయశోభూషణము ననుసరించి మూర్తికవి నరసభూపాలీయమును వ్రాసెను. విద్యానాథుడు కాకతీయ ద్వితీయప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునలో నుండినవాడు. తన గ్రంథమునందలి యుదాహరణముల నాతడు ప్రతాపరుద్రుని పరముగా కల్పించెను. మూర్తికవికూడ నరసభూపాలీయమునందు నరసరాజుపేర నుదాహరణములను గూర్చెను. ప్రతాపరుద్రీయములో నాటకప్రకరణముగూడ కలదు. మూర్తి [illegible] గ్రంథములో నాటకప్రకరణము [illegible] కృతిపతి వంశోన్నతి సంపద్భాగ్యము [illegible] మున్నగు [illegible] ప్రసంగించెను.

రామరాజభూషణుని ఘనతరకీర్తి యంతయు ఆతని వసుచరిత్రపై నాధారపడి యున్నది. అళియరామరాజు పేర నీతడు పెక్కు సంస్కృతాంధ్రకృతులు చెప్పె నని వసుచరిత్ర యనుచున్నది. కాని యట్టిగ్రంథములు నేడు గనరావు. వసుచరిత్ర నీ మహాకవి రామరాజుతమ్ముడును తాళికోట యుద్ధానంతరము విజయనగరము నేలినవాడును అగు తిరుమలరాయలకు నంకిత మొనర్చెను. వసుచరిత్ర పీఠికలోఁగూడ రామరాజభూషణుడు కొన్ని ముఖ్యచరిత్రాంశములను పేర్కొనెను. తిరుమలరాయలు జీర్ణకర్ణాటసామ్రాజ్యము నుద్ధరించె నని పొగడెను. ఈ మహాప్రబంధము క్రీ. శ ౧౫౭౭ తరువాత తిరుమలరాయలకు కృతి యీయబడెను. నరసభూపాలీయములో భట్టుమూర్తికవి రవంత యాత్మస్తుతి చేసుకొనెను. వసుచరిత్రకాలమున కీతడు వినయపరుడు కాజొచ్చెను. పూర్వాంధ్రకవులను గురించి యీమహాకవి చెప్పిన స్తుతిపద్యము విఖ్యాత మైనది.

మహిమన్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండరవింద్రుడు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమును దత్ప్రాగల్భ్యమూహించెదన్

మహాభారతమునందలి యుపరిచరవసువు కథయే వసుచరిత్రకథకు మూలము. భారతమునం దీకథ మిక్కిలి

చిన్నది. దానిని చేబట్టి యీ మహాకవి తన స్వంత వర్ణనలతో పెంచి యీ యద్వితీయ ప్రబంధమును నిర్మించెను. వసుచరిత్రలో కథాచమత్కృతి యంతగా లేదు. పూర్వకథలే గొప్ప వనియు, కల్పితకథలు గాజుపూసలవంటి వనియు రామరాజభూషణుడు తలచెను. కల్పనాశక్తియందు పింగళిసూరన కీతడు చాలడు. కాని కవితాశక్తియందును భాషాపాండిత్యమునందును, రసాత్మకరచనయందును రామరాజభూషణుడు పూర్వకవులకు తీసిపోడు. వసుచరిత్రయందలి శుక్తిమతీకోలాహలుల వృత్తాంతములో నీతడు తన ఉత్తమకవిత్వమును ప్రదర్శించెను. ఈతని పద్యములు మిక్కిలి శ్రవణసుఖములై సంగీతమున కనువైనవిగా నుండును. వీణ మ్రోయించినట్లవి సన్నగా హాయిగా పలుకును. రామరాజభూషణుని ప్రకృతివర్ణనములు సుందరముగా నుండును. ఈతనిది ప్రౌఢశైలి. ఒకొక్కప్పుడు మృదువుగను వ్రాయును. వసుచరిత్రము సంస్కృతములోని కనువదింప బడినది. దీనిని బట్టియే ఈ ప్రబంధముయొక్క ప్రశస్తి గ్రహింపవచ్చును.

హరిశ్చంద్రనలోపాఖ్యాన మీకవీశ్వరుని చరమగ్రంథము. ప్రబంధారంభమునందు రామభూషణకవి తన రామభక్తిపారవశ్యమును చక్కగా నిరూపించెను. రాఘవపాండవీయమువలె హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్యము. ఇందు హరిశ్చంద్రునికథయు నలచక్రవర్తికథయు జోడింపబడినవి. రామాయణభారతకథలలో కొన్ని సమానకథాంశము లున్నవి. కావున

వానిని ఏక కావ్యములో జోడించుట కొంత సులభ కార్యము. నలహరిశ్చంద్రకథలలో నట్టి సమాన కథాభాగములు తక్కువ. అయినను రామరాజభూషణుడు వీనిని కడునేర్పుతో కలబోసి రెండర్థముల కావ్యమును నిర్మించెను. శ్లేషకవిత్వమునందు రామరాజభూషణుని ప్రజ్ఞ యసాధారణము. రెండర్థములు వచ్చునట్లు పద్య మల్లుట యాతని కొక పిల్లలాట. ఆతని యద్భుత పాండిత్యమును మేధాసంపత్తియు నట్టివి. ఇటువంటి కఠినప్రబంధములోకూడ నీ మహాకవి ప్రకృతివర్ణనములను సందర్భోచితమైన యితర రసవద్వర్ణనలను గావించెను. అనంతర సాహిత్యముపై రామరాజభూషణుని ప్రభావ మాశ్చర్యకరము. తరువాతి కవులు పలువురు ఈతని వసుచరిత్ర రీతులను భక్తితో అనుకరించిరి.

## తెనాలి రామకృష్ణుడు.

ఈ కవి "పాండురంగమాహాత్మ్యము" అను ప్రౌఢప్రబంధమును రచించెను. రామకృష్ణకవి ప్రథమశాఖా బ్రాహ్మణుడు. ఇంటిపేరునుబట్టి యీతడు తెనాలి నివాసి యనిపించును. ఈతడు తన గ్రంథమును విరూరు వేదాద్రికి కృతియిచ్చెను. విరూరుగ్రామము నెల్లూరుజిల్లాలో పినాకినీతీరమున నున్నది. కావున రామకృష్ణకవి జీవితము నెల్లూరు ప్రాంతమున గడచె ననియు, ఆతని వంశమువారిది తెనాలి యనియు ఊహింపవచ్చును. తెనాలి రామకృష్ణకవి క్రీ. శ. ౧౬ వ శతాబ్ది కడపటి భాగమున నుండినవాడు. 'ఉద్భటారాధ్యచరిత్ర' అను శైవప్రబంధమును వ్రాసిన

తెనాలిరామలింగకవి యొకడు కలడు. రామలింగకవియే తరువాత వైష్ణవమతము నవలంబించి రామకృష్ణకవిగా మారెనని కొందరు చెప్పుచున్నారు. కాని యీ కవులిద్దరును భిన్నులని తోచుచున్నది. రామకృష్ణకవి విష్ణుభక్తిని ప్రతిపాదించు గ్రంథమును వ్రాసినను ఈతడు శైవమునకు విముఖుడు గాడు. ఈతడు తనకావ్యములో శివస్తుతిని గావించెను.

భైమినదీతీరమున పుండరీకక్షేత్రము గలదు. ఇచ్చటి దేవుడు పాండురంగడు. ఈ దేవుని మాహాత్మ్యమును వర్ణించునది పాండురంగమాహాత్మ్యము. ఈ కథను రామకృష్ణకవి స్కాంద పురాణమునుండిస్వీకరించి తానుచేర్చిన నూతనకల్పనలతో పెంచి వ్రాసెను. క్షేత్రము, తీర్థము, దైవము మూడింటను గొప్ప ప్రభావముగల పుణ్యక్షేత్ర మేదియని కుమారస్వామివలన తెలుసుకొనగోరి ఒకానొకప్పుడు అగస్త్యమహాముని కాశీనుండి దక్షిణమున కేతెంచెను. ఆతడు తుంగభద్రానదిని దర్శించెను. రామకృష్ణకవి తుంగభద్రను మిక్కిలి సరసముగ వర్ణించెను.

> "గంగాసంగమ మిచ్చగించునె, మదిం గావేరి దేవేరిగా
> నంగీకార మొనర్చునే, యమునతో నానందముం బొందునే,
> రంగత్తుంగతరంగహస్తములతో రత్నాకరేంద్రుండు నీ
> యంగం బంటి సుఖించునే నిను గుణభద్రా! తుంగభద్రానదీ!"

ఈశ్వరుడు అగస్త్యుడు మున్నగు వారికి పుండరీకక్షేత్ర ప్రభావమును తెలియజెప్పును. పుండరీకుడను సాధుజనుడు ఈ

క్షేత్రమున తపస్సుచేసి బాలకృష్ణుని ప్రత్యక్షము చేసుకొనెను. బాలకృష్ణుడు పాండురంగడై యా క్షేత్రమందు నిలుచుటకు వరమిచ్చెను. పాండురంగక్షేత్రముయొక్క మహాప్రభావమును భూషించుటకై చక్కని కథలు వర్ణింపబడినవి. అట్టికథలలో నిగమశర్మ యను బ్రాహ్మణయువకుని కథ మిక్కిలి రసవంత మైనది.

నిగమశర్మోపాఖ్యానము ఆంధ్రసాహిత్యములో ప్రముఖ స్థానము వహింప దగినది. నిగమశర్మ ఆహితాగ్నుల యింట బుట్టిన వాడు. యౌవనమునం దీతడు కామవశముచే చెడు స్త్రీల వల దొరికెను. ఈతని యక్క గొప్పగుణవతి. నేర్పుగలకాంత. ఆమె తన తమ్ముని ప్రవర్తనము దిద్దుటకును, వానిసంసారమును బాగుచేయుటకును ఎంతయో శ్రమపడును. కాని నిగమశర్మ దుష్టబుద్ధియై చెడుకార్యము లెన్నియో చేసి భ్రష్టు డయ్యెను. జీవితాంతమున వాడు పుండరీకక్షేత్రమును దర్శించి తరించెనట. రామకృష్ణకవి యీ కథపై తన యత్యుత్తమకవిత్వమును ప్రసరింప జేసెను. నిగమశర్మ అక్కచరిత్రము కడుంగడు ప్రశంసనీయము. నిగమశర్మ కథవలెనే సుశీల యను పతివ్రత కథకూడ రసవంతముగ నున్నది. సుశీలపెనిమిటి పరమలోభి. వాడు ధనార్జనమునకై యెన్నియో నీచమార్గము లవలంబించును. అతడు తన భార్యను రాచి అంపమున బెట్టును. సుశీలహృదయమును పరీక్షించుటకై బాలకృష్ణు డొక బ్రాహ్మణవటువు రూపముతో వచ్చును. ఆమె యాతిథ్యమునకు మెచ్చి ప్రత్యక్షమగును. పాండు

రంగమాహాత్మ్యమునందలి మరియొకకథ గృహస్థాశ్రమము గొప్ప దనియు, గృహస్థుడుగాక యెవడును ముక్తిని పొందలే డనియు చక్కగా ప్రతిపాదించును.

తెనాలిరామకృష్ణకవి సమర్థుడైన కవీశ్వరుడు. ఈతడు సంసారజీవితమును, చక్కగా పరిశీలనతో తిలకించి వర్ణించును. ఈతని శైలి తరుచు కఠినముగా నుండును. మూరుమూల సంస్కృతపదములను దీర్ఘసంస్కృతసమాసములను ఈతడు కూర్చుటచే శైలి జటిలముగా నుండును. "పాండురంగవిభుని పదగుంభనమును" అని లోక మీతని శైలిగుణమును వర్ణించును. అచ్చ తెలుగు రచనమునుగూడ తెనాలిరామకృష్ణుడు నేర్పుతో చేయును. సామెతలును, జాతీయములు నీతనికవితకు వన్నె పెట్టును. అష్టదిగ్గజము లని ప్రసిద్ధిచెందిన కవులలో నీతడు కడపటివాడు. ఈతడు కృష్ణదేవరాయలకాలములో లేడు.

### కందుకూరిరుద్రయ

ఈ కవి నిరంకుశోపాఖ్యాన మను ప్రబంధమును సుగ్రీవ విజయ మను యక్షగానమును రచించెను. రుద్రకవి విశ్వబ్రాహ్మణుడని, కంసాలియని చెప్పుచున్నారు. ఈతని తండ్రి పెదలింగనార్యుడు. కాళికాసరప్రసాదముచే తనకు కవిత్వ మలవడె నని యాతడు చెప్పుకొనెను. రుద్రకవి తన కావ్యమును కందుకూరునందు వెలసిన సోమేశ్వరదేవుని కంకితమర్పించెను. కావున నీ

తడు నెల్లూరుమండలము వాడని చెప్పనగును. రుద్రకవి క్రీ. శ. ౧౬౨౦ ప్రాంతము వాడని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసి యున్నారు. గోల్కొండ నవాబైన ఇబ్రహీంషా ఒకానొక రుద్రకవికి చింతలపాలెమనుగ్రామమును. శా.శ౧౪౭౦ లో దానము చేసినట్లు శ్లోకము గలదు. మల్కిభరాము అనబడు నీ ఇబ్రహీంషాహా క్రీ.శ౧౫౫౦-౧౫౮౦ల నడుమ గోలకొండరాజ్యము నేలెను. ఈతనిచే చింతలపాలెమును అగ్రహారముగా బడసిన రుద్రకవియు ఈకాలమువాడగుచున్నాడు. నిరంకుశోపాఖ్యాన రచనము రామరాజభూషణుని వసుచరిత్ర తరువాతనే జరిగియుండును. వసుచరిత్రరీతు లిందు గాన్పించుచున్నవి. మణిపురమునందలి క్షత్రియులను వర్ణించుచు వారి చరిత్రమునకు శ్రీరామునిచరిత్రముతో నభేదమును కవి సాధించెను. అళియ రామనృపాలుని జీవితమును, రామాయణమునగ కల్పించును వసుచరిత్రలో రామరాజభూషణకవి చెప్పిన ప్రసిద్ధపద్యమునకు అనుకరణమే. నిరంకుశోపాఖ్యానపద్యము. తాళికోట యుద్ధానంతరము మహమ్మదీయులు విజయనగరమును కొల్లలాడిన వృత్తాంతమును గూడ రుద్రకవి నిరంకుశోపాఖ్యానములో స్మరించెను. వేశ్యమాత దుర్గుణములను క్రౌర్యమును వర్ణించుపట్ల నిట్లు వ్రాసెను.

చేరి కన్నడభూమిఁ బెఱవట్టు బాశ్చాత్య
నృపతికైన నొకింత కృప దలిర్చు.

రుద్రకవి నిరంకుశోపాఖ్యానము సరసమైన కావ్యము. మహాప్రబంధము సేయ నూహించియున్న యీ కవికి నీశ్వరుడు కలలో గాన్పించి, నీ కావ్యకన్యక కుంకువగా ఆయురారోగ్య మహాభాగ్యము లొసంగెద నన్ను బరిణేతం జేయుము అని కోరెను. నిరంకుశోపాఖ్యానకథ పాండురంగమాహాత్మ్యములోని నిగమ శర్మకథను బోలి యుండును. కథాప్రగతియందును పద్యసందర్భ ములందును ఈ రెండుకథలకును పోలిక స్ఫుటముగా నున్నది. ధర్మశీలు డను రాజుకడకు పులస్త్యమహాముని వచ్చెను. "వ్యసన ములలో సంభోగకాంక్ష నోషమలీమసము. దీనిలో ప్రవర్తిం చియు పాపముజెందని వాడు గలడా" యని ధర్మశీలు డామునిన డిగెను. అంత ఋషి యిట్లు చెప్పెను.

"అడిగిన నేమి దోసమె సమస్తధరాతలనాథ కోరికల్
నుడువుల నున్నవే, మనసులోపలఁ గాక, రతిప్రసంగముల్
దడవనియంతమాత్రనె విదారితమోహుఁడ, యీ విచారముల్
విడువుము, వాగ్విశేషమును విశ్రుతవేషము మోక్షహేతువే"

దీనికి తార్కాణగా పులస్త్యఋషి నిరంకుశుడను బ్రా హ్మణయువకుని వృత్తాంతము నుపన్యసించును. శ్రోత్రియకుటుం బములో పుట్టి, వేదాదివిద్యల నేర్చిన నిరంకుశుడు యౌవనప్రా దుర్భావమునందే చెడునడతలకలవడి వేశ్యామోహమున జిక్కు కొని యిల్లును దేహమును గుల్లచేసుకొని సానిమాతచే వెడల గొట్టబడెను. నిర్ధనుడును హతాశుడును నగు నా ధూర్తయువకుడు అడవులబడి పోవుచు నొక జీర్ణ శివాలయము నుజూచెను. జూద

రియైనవాఁడు శివలింగమును తనతో జూదమాడుమని నిర్బంధించెను. ఈశ్వరుడు వాని తెగకు మెచ్చి ప్రత్యక్షమయి వరముకోరుకొమ్మనఁగా కాముకుఁడగు నిరంకుశుఁడు రంభను తనకిప్పింపుమని యాచించెను. నిరంకుశుని నిరంకుశ మోహాజీవిత మిట్లు సాగి దేవేంద్రుఁడుకూడ వానిసాహసమునకు మెచ్చి వరములిచ్చెనట. ఈకథ యొక అతుకులబొంత వలె నున్నది. నిరంకుశుని ధూర్తసాహసముతప్ప దీనియందెట్టి పరమార్థమును గోచరింపదు. ఉత్తమసందేశము నివ్వజాలినదే యుత్తమకావ్య మని యంగీకరించినచో, అట్టి సత్సందేశము నిరంకుశోపాఖ్యానమునందు మృగ్యము. నిరంకుశునియందు పశ్చాత్తాపమును కవి ప్రకటింపలేదు. రుద్రకవి శైలి సరసమై రమ్యముగా నున్నది. సామెతలను జాతీయములను, వాడుచు చక్కని పొందికగల సంభాషణరీతిని ఈత డవలంబించెను. ప్రౌఢసంస్కృతరీతియందు గూడ నీతఁడు దిట్టరి.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## తొమ్మిదవ ప్రకరణము.

## అనంతరప్రబంధయుగము. క్రీ. శ. ౧౬౦౦-౧౮౦౦

పదునేడుపదునెనిమిదవ శతాబ్దులను అనంతరప్రబంధయుగ మని వ్యవహరింప దగును. కొందరు దీనిని క్షీణయుగ మని చెప్పుచున్నారు. ఈ కాలములో తెలుగుకవిత్వము క్రొత్త పోకడలు లేక వెనుకటిరీతులలోనే విస్తారముగా నడచినది. నూతనప్రతిభ క్షీణించినకాలము అగుటచే క్షీణయుగ మని తలచుట యుక్తముగానే యున్నది. తిక్కనపోతనగార్లవలె కవిత్వము దివ్యకళ యని విశ్వసించినవారు గాని, శ్రీనాథునివలె రసోచితముగ వ్రాయుగలవారుగాని, పింగళి సూరనవలె నూత్నకల్పనలు చేయగలవారుగాని ఈ కాలములో లేరు. కాని ఈ కాలములో వ్రాయబడిన గ్రంథములుమాత్రము అసంఖ్యాకములుగనే యున్నవి. సాహిత్యముక్షీణదశలో నుండుటకు కారణము సంఘజీవితము కూడ క్షీణస్థితిలో నుండుటయే మూలమని చెప్పవలెను. ఆంధ్రుల చారిత్రికవైభవముగూడ నీకాలమున సన్నగిల్లినది. క్రీ. శ. ౧౫౬౫ లో జరిగిన తాళికోట యుద్ధానంతరము విజయనగర సామ్రాజ్యము క్రమముగ దుర్బలమై విచ్ఛిన్నమై పోవజొచ్చెను. *సామంత రాజ్యములు స్వతంత్ర రాజ్యము లగుటకు యత్నించు

---

* మహమ్మదీయ సుల్తానులు, ముఖ్యముగ గోల్కొండబిజాపూరు వారు, ఆంధ్రదేశమును తమయేలుబడిలోనికి తెచ్చుకొనుటకై పెనగులాడుచుండిరి.

చుండెను. ఇట్టి సామంత రాజ్యములలో పేర్కొనదగినవి తంజావూరు, మధుర నాయక రాజ్యములు. విజయనగరచక్రవర్తు లీ రాజ్యములను పాలించుటకై తెలుగునాయకులను స్థాపించిరి. తెలుగునాయకులతోపాటు విద్వాంసులు, కవులు, కళారాధకులును పెక్కురు తెలుగుదేశమునుండి పోయి దక్షిణదేశములో నివసింపజొచ్చిరి. ఈ విధముగా ౧౭, ౧౮, శతాబ్దులలో మధుర తంజావూరు రాజ్యములు ఆంధ్రసరస్వతికి నాటపట్టు లయ్యెను. కావున తెలుగు సాహిత్యములో నీ ఘట్టమును నాయకరాజుల యుగ మని కొందరు వ్యవహరించుచున్నారు. ఇది క్షీణయుగ మైనను ఈ కాలములో పెక్కు సాహిత్యప్రక్రియలు ఆంధ్రభాషలో వెలసినవి. మొట్టమొదటిసారి వచన రచనము విస్తారముగా ఈ కాలముననే జరిగినది. యక్షగానము లని పిలువబడు నాటకము లీనాడే వ్యాప్తిలోనికి వచ్చినవి. శతకములు, గేయ రచనలు విరివిగ జన్మించిన సమయ మిది.

## దక్షిణదేశమునందలి తెలుగుసాహిత్యము.

### తంజావూరు.

విజయనగరసామ్రాజ్యము క్షీణించిన తరువాత ఆంధ్రభాషాపోషణము నాయకరాజుల కర్తవ్య మాయెను. చిన్న రాజ్యముల నేలినను ఈ రాజులు కవిపండితగాయకులను ఆదరించి ఘనత కెక్కిరి. నాయకయుగములో సంగీతము నాట్యవిద్య గొప్ప ప్రాభవమును సంపాదించెను. ఈ విద్యలు వారవనితల

యధీనములో నుండెడివి. కావున రాజాస్థానములందు కవులతోను విద్వాంసులతోను పాటు వారకాంతలకుగూడ అగ్రమర్యాదలును సత్కారములును జరుగుచుండెను. విజయనగరము తరువాత ఆంధ్రసాహిత్యరంగమైనది తంజావూరునాయక రాజ్యము. అందును, తంజావూరు రఘునాథరాయల రాజ్య కాలము తెలుగు భాషాచరిత్రలో ప్రశంసనీయమైనది.

## రఘునాథరాయలు

ఈ రాజకవి రఘునాథరామాయణమును వాల్మీకిచరిత్ర నురచించెను. శృంగారసావిత్రియను మరొక పద్యకావ్యమీతని పేర గనబడుచున్నది. పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము, అచ్యుతాభ్యుదయము మొదలగు ఇతరగ్రంథముల నీతడు వ్రాసినట్లు తెలియుచున్నది, కాని యవి నేడు గానరావు. రఘునాథరాయలు క్రీ. శ. ౧౬౧౪-౧౬౩౩ ల నడుమ తంజావూరు రాజ్యమును పాలించెను. ఈతడు కవిత్వమునందేకాక సంగీతమునందుగూడ గొప్ప ప్రజ్ఞ గలవాడు. రఘునాథరామాయణము అసమగ్రమైన గ్రంథము. బాలకాండలో కొంతభాగము మాత్రమే లభించుచున్నది. ఈ స్వల్పభాగములోనే యీతని కవితాశక్తి వెల్లివిరిసినది. సమకాలిక జీవితవిశేషముల నీతడు రామాయణ వర్ణనములలో చొప్పించి రసవంతముగ వ్రాసెను. వాల్మీకిచరిత్రను మొట్టమొదటిసారి తెలుగులో వ్రాసినకవి రఘు

నాథుడు. దీనిని స్వతంత్ర కావ్య మని చెప్పవలెను. ఆదికవియైన వాల్మీకి పూర్వజీవితమునందు కిరాతుడుగా నుండి దారులుకొట్టి జీవించుచుండెను. సప్తమహర్షులు పుణ్యతీర్థసందర్శనము చేసికొనుచు కిరాతుడు జీవించు అరణ్యప్రాంతమును జేరగా వాడు వారిని దోచుకొనుటకై పూనుకొనెను. “ఈ పాపజీవితములో నీ భార్యాపుత్రులు పాలు పంచుకొందురా” అని మహర్షులు కిరాతు నడిగిరి. వాడును భార్యనడుగగా నామె “నీ ధనముతోనే గాని నీ పాపవృత్తముతో నాకు సంబంధములేదు” అనెను. కిరాతునకు వైరాగ్యముజనించెను. మహాముని లాతని ననుగ్రహింపదలచినవారై శ్రీరామమంత్రము నుపదేశించి వానిని తరింపజేసిరి. వాల్మీకిచరిత్రలో కథాభాగము స్వల్పముగానున్నది. కాని యిందలి వర్ణనములు మనోజ్ఞములుగా నున్నవి. ఆంధ్ర దేశపు పుణ్యక్షేత్రముల ప్రశంస హృద్యముగా నున్నది.

రఘునాథునిపేర నున్న శృంగారసావిత్రి ఈ కాలపు సాహిత్యరుచికి నిదర్శనము కాగలదు. శృంగారమును విచ్చలవిడిగ వర్ణించుట అనంతరప్రబంధయుగము వారి ధోరణి. నన్నయాది ప్రాచీనకవులు శృంగారమును మితముగను ఔచిత్యభంగము లేకుండగను వర్ణించిరి. ప్రబంధకవులైన అల్లసానిపెద్దనాదులు తమ కావ్యములలో శృంగారమునే ప్రధానరసముగ విస్తరించిరి. ఈ రసప్రతీతికై వలయు సామగ్రిని వీరు విపులముగ వర్ణించుట కలవాటుపడిరి. శృంగారవర్ణనములో అనంతరప్రబంధకవులు విశృంఖలమార్గము నవలంబించిరి. ధర్మమునకును కామమునకును సం

ఘర్షణము గలిగినప్పుడు వీరు కామమునకే విజయము చేకూర్చు చుందురు. నీతి ధర్మములకు ఈ కాలపు రచనలలో ఉన్నతస్థానము దొరుకలేదు. ఇట్టి కావ్యములను శృంగారప్రబంధము లని వ్యవహరింతురు. ౧౭, ౧౮ వ శతాబ్దములను క్షీణయుగ మనుట కిది యొక కారణము. శృంగారసావిత్రి రఘునాథకృత మగునో కాదో దృఢముగ చెప్పవీలులేదు. దీనిలోని మొదటిభాగము ఆ కాలపు రుచుల కనుగుణముగ పచ్చిపచ్చి శృంగారవర్ణనలతో నిండియున్నది. సావిత్రీసత్యవంతుల కథాభాగము వచ్చినప్పుడు మాత్రము కవి సభ్యముగను మృదువుగను రచన చేసెను. సావిత్రిజీవితములోని పవిత్రభావమును కరుణదశను కవి హృదయంగమముగ చిత్రించెను. ఈ కావ్యమునందు రవంత హాస్య మున్నది. కాని యది ఉదాత్తమైనహాస్యముకాదు. తంజావూరు రఘునాథ రాయలు అపరకృష్ణదేవరాయ లని చెప్పవచ్చును. కత్తి పట్టుట యందును, గంటమును నడుపుటలోను రఘునాథుడు శ్రీకృష్ణదేవ రాయలను పోలును.

## చేమకూర వేంకటరాజు.

ఇతడు మధురకవిత్వము చెప్పనేర్చిన కవిశేఖరుడు. సారంగధరచరిత్ర, విజయవిలాసము ఈతని కావ్యములు. చేమకూర వేంకటకవి బ్రాహ్మణు డని కొందరును, బట్రాజు కులస్థు డని, కొందరును తలచుచున్నారు. విజయవిలాసము నీతడు తంజావూరు రఘునాథరాయల కంకిత మొనర్చెను. కావున ఈ కవి క్రీ.శ౧౭వ

శతాబ్ది ప్రారంభమున నుండె నని చెప్పవచ్చును. సారంగధరచరిత్రనుగూడ రఘునాథునకే కృతి యిచ్చినట్లు చెప్పుదురు. కాని విజయవిలాసములో ఏతత్కావ్యప్రశంస లేదు.

సారంగధరచరిత్రకు మూలమైన కథ గౌరన వ్రాసిన నవనాథచరిత్రలో నున్నది. సారంగధరుడు ఆంధ్రమహాభారతమును ప్రోత్సహించిన రాజరాజనరేంద్రుని కుమారుడను భ్రమ తెలుగు లోకమున వ్యాపించినది. కాని చిత్రాంగి సారంగధరుల వృత్తాంతము మాళవదేశములో నడచినట్లు గౌరన గ్రంథమునందును చేమకూరవాని కావ్యమునందును వర్ణింపబడినది. మాళవదేశపు రాజు రాజమహేంద్రుడు. ఈతనిచుట్టును ఈ కథ బయలుదేరినది. చేమకూరకవి కొంచెము పొరపడి రాజమహేంద్రుడును రాజరాజనరేంద్రుడును ఒకడే యని తోచునట్లు వ్రాసినాడు. ఈ ప్రమాదము తరువాత స్థిరపడి యాంధ్రభారతకృతిభర్తకు లేనిపోని కళంకము నాపాదించినది. సారంగధరచరిత్రను చేమకూర వేంకటకవి మృదువుగను సరసముగను వ్రాసెను. ఈతనికి శబ్దాలంకారములమీద ప్రీతి యెక్కువ. యమకానుప్రాసము లీతనికి అప్రయత్నముగ దొర్లుచుండును. శృంగార మీతని కభిమానరసము.

చేమకూరకవి కీర్తిప్రతిష్ఠలకు మూలమైనది విజయవిలాస కావ్యము. సుభద్రార్జునుల ప్రణయము వివాహము నిందలి ముఖ్యకథాంశములు. అర్జునుడు తీర్థయాత్రలు చేయుచు ఉలూపి, చిత్రాంగదలను వరించిన కథలుకూడ ఇందు వర్ణితములైనవి

మేనత్త మేనమామబిడ్డల పెండ్లి తెలుగువారికి మిక్కిలి యిష్టము. ఇట్టి దంపతుల ప్రణయగాథ జనరంజకముగా నుండును. సుభద్రార్జునులు మేనత్త మేనమామ పిల్లలు. ఆంధ్రుల కత్యంతపరిచితమైన ప్రేమకథను చేబట్టి వేంకటకవి తన యచ్చపు తెలుగుహృదయము నావిష్కరించెను. ఈ కావ్యమునం దీతని శైలి అనన్యోపమానమై తనరారినది. దీర్ఘసంస్కృతరీతిని విడిచి కోమలమైన తత్సమ, అచ్చికశైలి నీతడు నడపెను. లోకవ్యవహారమునకు వీలైనంత దగ్గరగా కావ్యశైలిని గొనివచ్చుటకు చేమకూర వేంకటకవి ప్రయత్నించి కృతకృత్యుడయ్యెను. జాతీయములైన పలుకుబళ్ళను, సామెతలను ఈతడు సందర్భానుకూలముగ విరివిగ వాడెను. ఈతని శైలివలెనే భావములును మిక్కిలి సుకుమారములు. మృదుశృంగారమే ఈతని కవితాలతకు పట్టుగొమ్మ. వీరరసము వంటి దృఢరసముల నీతడు చక్కగా ఒప్పించజాలడు. అనంతరప్రబంధ యుగములో చేమకూర వేంకటరాజును మించినకవి లేడు. ఈతని శబ్దాలంకారచిత్రమైన శైలిని అనుకరించుటకు పలువురు ప్రయత్నించిరి. కాని చేమకూరకవి మృదుప్రసన్నరీతి వారి కలవడలేదు.

## మధురరాజ్యపు కవులు.

మధుర నాయకరాజ్యము కృష్ణదేవరాయల యాజ్ఞను విశ్వనాథనాయకుని క్రింద యేర్పడెను. మధురరాజ్యమునగూడ ఆంధ్రభాషాపోషణము జరిగెను.

లింగనమఖి శ్రీకామేశ్వరకవి:

ఈతడు సత్యభామాసాంత్వనము అనుపద్య కావ్యమును ధేనుకామాహాత్మ్యము అను వచనకావ్యమును రచించెను. కామేశ్వరకవి మధుర రాజ్యములో నుండెను. సత్యభామాసాంత్వనము ముద్దళఘురికి అంకిత మీయబడెను. ముద్దళఘురి మధుర చొక్కనాథనాయకుని తమ్ముడు. సత్యభామాసాంత్వనము క్రీ.శ. ౧౬౭౦ ప్రాంతమున రచింపబడెను. ఈ కాలములో శృంగారప్రబంధములు సాంత్వన కావ్యములు వ్రాయుట కవులకు ప్రీతి. ఈ కావ్యములో శ్రీకృష్ణుడు శృంగారనాయకుడు. విరహమును సహింపలేక కోపము చెందిన సత్యభామను శ్రీకృష్ణుడు బ్రతిమాలుకొనుట ముఖ్యమైన యితివృత్తము. నందితిమ్మన పారిజాతాపహరణ ప్రబంధములో కూడ నిట్టికథవచ్చినది. తిమ్మకవి సత్యభామ మానవిరహమును మిక్కిలి సరసముగ వ్రాసెను. కామేశ్వరకవి రచన యంత బాగుగా లేదు. ఈ కవి సంస్కృతాంధ్రములందు మంచి ప్రజ్ఞగలవాడు. కానియీతనికి నూతనకథాకల్పనాశక్తి శూన్యము.

శేషము వేంకటపతి.

మధురలో వెలసిన తెలుగుకవులలో శేషము వేంకటపతి సమర్థతరుడు. ఈతడు శశాంకవిజయమును వ్రాసి వంగలసీనయకు అంకిత మిచ్చెను. ఈతడు ౧౭౦౬–౧౭౩౨ ల నడుమ మధుర నేలిన విజయరంగచొక్కనాథుని కాలములో నుండెను. నిర్లజ్జము,

నీతిబాహ్యము నయిన శృంగారమును వర్ణించుటకు కవులు సంకో చింపని కాలమిది. దూష్యమైన శృంగారకథలు పురాణములలో నున్న వాసిని వెతకి వెతకి కవులు ప్రబంధనిర్మాణము చేయుచుం డిరి. తారాశశాంకుల మోహవృత్తాంతమును శేషము వేంక టపతి గ్రహించెను. రాధాకృష్ణులు జారజారిణుల క్రిందకు లాగ బడిరి. ఇందు్రిడు, అహల్య ఈ శ్రేణిలోనికే వత్తురు. శేషము వేంకటపతి కావ్యమునందు అసభ్యవర్ణనలు తరుచు గలవు. ఇవి లేకున్నచో ఈకవి గొప్పపేరు వహించియుండును. ఈతని భాషా మాధుర్యము, భావలాలిత్యము, ప్రశంసింపవలెను. ఈతని భావనాశక్తి కూడ చెప్పదగినదియే. కామేశ్వరకవికన్న కథా కల్పనమునందు శేషము వేంకటపతి నిపుణుడు.

సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు.

ఈతడు అహల్యాసంక్రందనము పద్యకావ్యమును జైమినీభారతము, సారంగధరచరిత్ర వచనకావ్యములను వ్రాసెను. ఈ కవి విజయరంగచొక్కనాథుని కాలములో నుండెను. శేష ము వేంకటపతి యీతని మిత్రుడట. ఇందు్రిడు గౌతమమహర్షి భార్యయైన అహల్యను కామించుట ఈ కావ్యమందలి యితివృ త్తము. వేశ్యగాని, పరకీయకాంతగాని శృంగారప్రబంధములలో నాయికలుగా నుందురు. అహల్య పెండ్లికాకముందే సంక్రందనుని ప్రేమించిన దని యీ కవి కల్పించుట బాగున్నది. అహల్యాసం క్రందనుల అనంతరప్రవర్తనము దీనిచే కొంతవరకు క్షంతవ్య మగు చున్నది.

ఇతర శృంగారప్రబంధ రచయితలలో వెలిదిండ్ల వేంకటపతిని ఎడపాటి ఎఱ్ఱయను పేర్కొనదగును. వెలిదిండ్ల వేంకటపతి రాధామాధవసంవాదమును వ్రాసెను. ఈతని కవిత్వము మృదులలితమై యున్నది. కావ్య మంతయు చక్కనిసంభాషణలలో వ్రాసెను. కాని విషయౌన్నత్యము నీతిసంపద కొఱవడినవి. ఎడపాటిఎఱ్ఱయకవి మల్హణచరిత్రను వ్రాసెను. ఈతనికవిత్వము మెత్తనై తియ్యనై యుండును. ఇందలినాయిక వేశ్యాకన్యయైనను సుస్వభావము మంచిశీలము గలది. శృంగారకావ్యములలో నిది యత్యుత్తమము. ఈ తెగకవులు ఆంధ్రభాషామార్దవమును శ్రద్ధాసక్తులతో నుపాసించిరి. వాడుకపలుకుబళ్ళను జాతీయములను మెత్తమెత్తని పదసందర్భమును పదములకూర్పును వీరియొద్ద చూడవలెను.

## మైసూరురాజ్యపుకవులు.

విజయనగరసామ్రాజ్యము విచ్ఛిన్నమై పోవుకాలమున అనేక సామంతరాజ్యములు బయలుదేరెను. వానిలో మైసూరురాజ్యమొకటి. ఇచ్చటి యాంధ్రులు తమ మాతృభాషను గద్యపద్యకావ్యరచనలచే భూషించిరి.

## పాలవేకరి కదిరీపతి.

ఈ కవి 'శుకసప్తతి' అను కథా కావ్యమును వ్రాసి ప్రశస్తి వహించెను. కదిరీపతి పూర్వులు కోలాహమండలములో

చిన్న సామంతరాజులుగ నుండిరి. శాసనములలో వీరి యింటిపేరు తాడిగోళ్ళ యని ఉన్నది. తాడిగోళ్ళ వీరికి రాజధాని. కావున పాలవేకరి అను మొదటి గృహనామము తాడిగొళ్ళగా మారినది. తనది చంద్రవంశములోని యాదవాన్వాయమని కదిరీపతి చెప్పుకొనెను. శాసనములనుబట్టి యీతని తండ్రితాతలు నాయకుళ్ళుగా తోచుచున్నారు. ఈ కవి * క్రీ. శ. ౧౬౬౦ ప్రాంతమున నుండెను. కదిరీపతి తన గ్రంథమును శ్రీ రామాంకితము చేసెను.

తెలుగుసాహిత్యములోని కథాకావ్యములలో శుకసప్తతికి అగ్రస్థానమీయవచ్చును. కొఅవిగోపరాజు క్రీ. శ. ౧౫వ శతాబ్దిప్రారంభమున నుండి సింహాసన ద్వాత్రింశత్సాలభంజికల కథలు వ్రాసెను. దానికన్న శుకసప్తతి రమ్యతరముగ నున్నది. ఇందలికథలు శృంగారప్రధానములు. కొన్నికథలు ఉత్తమనీతిని బోధించునవిగ లేవు. స్త్రీలు చపలచిత్తలనియు వారిమనస్సు బ్రహ్మకైనను తెలియవశముగాదనియు ధర్మరాజు ధౌమ్యునితో ప్రసంగించును. అంతట నా భూసురుడీయంశమును స్థాపించుటకై జారిణీకథలను చిలుకచే చెప్పించును. చిలుక చెప్పిన కథలుగావున దీనికి శుకసప్తతియను పేరుగల్గినది. శుకసప్తతిలో డెబ్బదికథలు పూర్తిగాలేవు. ఇందలి మొదటికథ వసుమంతుడను వర్తకునిగురించి నైయున్నది. తొందరపడి యే కార్యమును జేయు

* భారతి ౨౨ సంపు ౧౧ సంచిక. మ. రా. శ్రీ. డాక్టరు యర్రా వేంకటరమణయ్యగారి వ్యాసము.

రాదను నీతిని బోధించుచు ఈ కథ చక్కగానున్నది. పూర్వ గ్రంథములలో కథలుకొన్ని శుకసప్తతిలో చేరినవి. లీలావతియను రాజకుమార్తె కథకుమూలము గౌరన వ్రాసిన నవనాథ చరిత్రములో నున్నది. శుకసప్తతి మూడవయాశ్వాసమందు చపల యను బ్రాహ్మణయువతికథ చెప్పబడినది, ఇది కళాపూర్ణోదయము లోని సుగాత్రీశాలీనుల కథనుబోలియున్నది. పింగళిసూరనమహా కవి యీకథనుమిక్కిలి సున్నితములైన భావములతోను అశ్లీలము అనౌచిత్యము మాటకైనను లేకుండ దివ్యముగను వ్రాసినాడు. ఇట్టిరమ్యతరమైన కథను కదిరీపతినాయకుడు విచిత్ర ముగ పరిణమింపజేసెను. ఎత్తుగడలో కథను బాగుగనే యారం భించెను. చపల యను వధువు సుగాత్రివలెనే భర్త యాదరమును పొందలేక పోయినది. కాని త్వరలోనే చపల జారిణిగా మారి పోవుట ఈ కథయొక్క దౌర్భాగ్యము. సమకాలిక రుచులకు లోగి కదిరీపతి యీ పుణ్యకథను అంకిటాలి కథగా నడిపించినాడు. ఈతడు ప్రౌఢరచన చేయగల కవీంద్రుడు కాని తరుచుహృద్య మైన సులభశైలినే యవలంబించెను. వాస్తవికవర్ణనము ఈతనికి కడుప్రీతి. స్త్రీపురుషహృదయభావముల నీతడు చక్కగా ఆకళింపు జేసుకొని వర్ణించును.

వచనవాఙ్మయవికాసము.

ఆంధ్రసాహిత్యము ప్రారంభించిన నాటినుండియు ప్రధా నముగ పద్యరీతిలోనే నడచినది. ప్రత్యేకముగ గ్రంథములనువ్రాయు నాచారము చిరకాలముపరకు లేకుండెను. వచనముయొక్క ప్రధా

నోద్దేశము సులభముగా విషయమును తెలియజేయుట. స్త్రీలు బాలురు పామరజనులు వచనమునే చక్కగా అర్థము చేసికొని యానందింప గలుగుదురు. నిత్యవ్యవహార మంతయు వచనములో జరిగితీరును. కావున జీవితమునందు పద్యమునకన్న గద్యకే ప్రముఖస్థానము కలదు. సాహిత్యక్షేత్రములో పద్యమే యెక్కువ రాణించు నని తలచి కాబోలు మనపూర్వమహాకవులు వచనము నకు ప్రత్యేకస్థాన మీయలేదు. అయినను గద్యరచన అతిప్రాచీన కాలమునుండియు జరుగుచునే యుండెడిది. నన్నయకు పూర్వము వెలసిన తూర్పుచాళుక్యశాసనములలో మొదటి తెలుగుగద్యరీతి కన్పించును. ఆకాలమున ప్రాకృతభాషాపదములు మిక్కుటముగా తెలుగుభాషలో కలసిపోవుటచే ఈ శాసనభాష మనకు సులభముగా నర్థముకాదు.

ఆంధ్రమహాభారతరచనయందు నన్నయభట్టారకుడు గద్యపద్యములకు ఇంచుమించు సమప్రాధాన్య మిచ్చెను. ఈతని వచనశైలి ప్రసన్నమై మృదుపదఘటితమై యుండును. కథను వేగముగ నడిపించుటకై నన్నపార్యుడు తరుచు వచనముల వ్రాయుచుండును. తిక్కనసోమయాజికి గద్యరచనపై నాదరము తక్కువ. తన మొదటిగ్రంథమైన నిర్వచనోత్తరరామాయణములో సోమయాజిగారు వచనమును పరిహరించెను. కాని మహాభారత రచనాసందర్భమున నన్నయమార్గమునే యవలంబించి వచనరచనను ఆదరించెను. ఈ మహాకవికి కందము, ఆటవెలది, తేటగీతి వంటి చిన్నపద్యములపై మిక్కిలి ప్రీతి· ఇవి వచనములంత తేలి

కగ నాతనికి నడచిపోవును. కావున తిక్కన గద్యస్థానములో చిన్నపద్యమునే విరివిగ ప్రయోగించెను. శివకవులు, పాల్కురికి సోమనాథునివంటి వారు, ప్రజాభ్యుదయదృష్టి గలవారైనను వచనకావ్యములను వెలయింపలేదు. వీరు ద్విపదకవిత్వము నాదరించినవారు. ద్విపదఛందస్సు వచనమువలె సులభముగ నడచును. వచనప్రయోజనము దీనిచేతనే సాధింపబడు నని వీరు తలచి యుందురు. ఎఱ్ఱాప్రగడకవిచంద్రుడు నన్నయవలె మృదుహృదయము గలవాడు. హరివంశములో నీతడు నన్నయరీతిని ప్రసన్నశైలిగల వచనములు వ్రాసెను.

ప్రాచీన వచననిర్మాతలలో పేర్కొనదగినవాడు కృష్ణమాచార్యులను వైష్ణవభక్తుడు. ఈయన రెండవప్రతాపరుద్రుని కాలములో నుండెను. కృష్ణమాచార్యులు విష్ణుస్తుతిపరముగా విన్నపములనువ్రాసెను. వీనిని 'సింహగిరి వచనములు' అనియు, కృష్ణమాచార్య సంకీర్తనము లనియు చెప్పుదురు. వచనములు, విన్నపములు, దేవతాస్తుతిపరములై ఒకటిరెండు నిమిషములు చదువదగినవై యుండును. కాని సర్వప్ప సిద్ధేశ్వరచరిత్రములో వచనభాగము విస్తారముగనే యున్నది. పూర్వకవులలో నాచన సోముడు గద్యమును పద్యముకన్న జటిలముగా వ్రాయుటకు త్రోవచూపెను. వచనము నీతడు కథను నడుపుటకుగాక కేవల వర్ణనాత్మక సందర్భములలో ప్రయోగించెను. ఇట్టి వర్ణనములలో శ్లేషను సాధించుట, శబ్దాలంకారచిత్రితముగా వ్రాయుట ఈతని

పద్ధతి. ఈ విధానమువలన వచనముయొక్క సారళ్యత, ప్రసన్నత లోపించి పద్యమే గద్యముకన్న మేలు అనిపించును. అనంతరకవులు వచనరచన విషయమై నాచనసోముననుకరింప జొచ్చిరి. మృదుపాకముగల గద్యముకరవయ్యెను. శ్రీనాథుడు మహావిద్వాంసుడై ప్రౌఢశైలిలో వ్రాయువాడైనను కొన్నిపట్టులలో చక్కని వచనములు గూర్చెను. పాత్రల సంభాషణమునకు వచన మనుకూలించు నని యీతడు గ్రహించెను. ప్రబంధకవులు వచననిర్మితియందు నాచనసోముని మార్గము నాదరించిరి. ప్రబంధములోని ఉద్యానవనవర్ణనములు, వెన్నెల విహారముల వర్ణనములు గద్యరూపములో నున్నపద్యము లనవలెను. ఇవి చక్కని లయగలిగి యుండును. ప్రబంధకవులలో శ్రీకృష్ణదేవరాయలును పింగళిసూరనయు వచనప్రయోజనమును గుర్తెరింగినవారు. రాయలు వచనమును ప్రౌఢముగను మృదువుగనుకూడ వ్రాయును. వచనమునకు హాస్యము ప్రాణము వంటిది. ఈ మనోజ్ఞగుణము రాయలయెడ కొంతవరకును, పింగళిసూరనలో ప్రస్ఫుటముగను గాన్పించును.

'శ్రీ వేంకటేశ్వరవచనములు' అను గద్యరూప సంకీర్తనములు వ్రాసినవాడు తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు. ఈతడు శ్రీకృష్ణదేవరాయలకు సమకాలికుడు. గేయరూప సంకీర్తనములు వ్రాసిన గొప్పభక్తుడు తాళ్ళపాక అన్నమాచార్యులతని తండ్రి. వేంకటేశ్వరవచనములు సింహగిరి నరహరివచనముల వలెనే భగవంతునకు భక్తుడు చేయువిన్నపములు. తాళ్ళపాక

తిరుమలాచార్యుడు శ్రీ వేంకటేశ్వరసన్నిధిని తన వచనములను తాళరాగసమన్వితముగ ఆలాపించి యుండును. ఇవి భక్తిభరితములై, ఆత్మనివేదనరూపములై, చక్కని భావములతో నొప్పారుచున్నవి. మచ్చునకు శ్రీవేంకటేశ్వరవచనములనుండి:- "శ్రీవేంకటగిరిదేవా! నా దేహంబు నీవుండెడి నిత్యనివాసంబు. నా జ్ఞానవిజ్ఞానంబులు నీ యుభయపార్శ్వంబుల దీపంబులు. నా ముక్కుజెఱ మలయూర్పులు నీ యిరుదెసలంబట్టెడి యాలవట్టంబులు. నా మనోరాగంబు నీకు జెందిరకావివలువ. నీకు మ్రొక్కనెత్తిన నా చేతులు రెండును మకరతోరణంబులు. నా భక్తి రేబ నీకు సింహాసనంబు....నీవు దేవుండవు. నేనర్చకుండను. ఈ రీతి నిత్యోత్సవంబు నాయందు సవధరింపవే శ్రీవేంకటేశ్వరా!"

పూర్వగ్రంథములకు వ్యాఖ్యానములు వివరణములుం వ్రాయునప్పుడు మనపూర్వులు వచనమును వాడుచుండిరి. ఎలకూచిబాలసరస్వతీమహోపాధ్యాయుడు ఆంధ్రశబ్దచింతామణికి వచనములో వివరణము వ్రాసెను. ద్వ్యర్థిప్రబంధములకు వ్యాఖ్యానములు వచనములో వ్రాయబడినవి. రాఘవపాండవీయమునకు పెద్దరామధీమణియు, హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు చిత్రకవియనంతుండును వచనములో వ్యాఖ్యలు నిర్మించిరి.

పదునేడవ శతాబ్ది రెండవభాగమునుండియు ఆంధ్ర సాహిత్యమునందు గద్యరచన యొక విశిష్ట కళగా నేర్పడినది. వచనగ్రంథములు దక్షిణదేశములో వెడలుట ప్రత్యేకవిషయము.

ఇచ్చట దక్షిణ దేశమనగా తెలుగునాయక రాజులు పరిపాలించిన తంజావూరు, మధుర, పుదుకోట మున్నగు ప్రాంతములు. దక్షిణాంధ్రకవులు శృంగారప్రబంధములు వ్రాసి ఆధునికుల విమర్శకు పాత్రులైరి. ఈ కళంకము తెనుగు గద్యసాహిత్యమునకు వారు చేసిన సేవచే విస్మృత మగుచున్నది. అన్యభాషా ప్రాంతములలో అనగా తమిళము, కన్నడము మాట్లాడబడు మండలములలో నివసించు ఆంధ్రులు తమ మాతృభాషను మరచిపోకుండ నిలబెట్ట గలిగినవారు దక్షిణాంధ్రకవులు. ఆ నాడు వీరు సులభశైలిగల పద్యకావ్యములను, అంతకన్నను సులభార్థబోధకములగు వచనకావ్యములను వ్రాయకున్నచో దక్షిణదేశమునకు వలసపోయిన ఆంధ్రకుటుంబములు తమ మాతృభాషను ఆంధ్రసంస్కృతిని మరచిపోయి యుందును. ఇట్లు గద్యకావ్యనిర్మాణ మానాడొక నిశిత జాతీయావసర మయ్యెను. దక్షిణదేశపు తెలుగుకవీశ్వరు లీయవసరమును గుర్తించి వచనప్రబంధరచన చేసి భాషకును ఆంధ్రజాతికిని మరువరాని సేవ చేసినవారైరి. కర్నాటక సాహిత్యముతో వీరికి గలిగిన పరిచయముగూడ వీరిని గద్యకావ్యరచనకు ప్రోత్సహించి యుండును. కన్నడభాషయందు ప్రాచీనకాలము నుండియు వచన రచన జరుగుచుండెడిది.

వీరశైవమును స్థాపించిన శ్రీ బసవేశ్వరుని వచనములు కన్నడభాషలో విశిష్టస్థానము వహించుచున్నవి. తెలుగులో మొదటిపర్యాయము విస్మృతగద్యరచన చేసిన కవులు మైసూరు రాజ్యములో వెలయుట గమనింపదగినది.

## కళువె వీరరాజు.

ఈతడు మహాభారతమును వచనములో వ్రాసెను. ఈ గ్రంథముయొక్క సభాభీష్మపర్వములు మాత్ర మిప్పుడు లభించుచున్నవి. వచనభారతకర్త యింటిపేరు 'కళువె' యని తెలియనచ్చుచున్నది. కళువె యనునది లేఖకప్రమాదమై యుండును. కళువె అను గ్రామము మైసూరు రాజ్యమందలి నంజనగూడకు సమీపమునందున్నట. కళువె వంశీయు లీగ్రామమునకు పరిపాలకులుగా నుండిరి. వీరరాజు యాదవవంశీయుడగు క్షత్రియుడు. ఈతనితండ్రి దొడ్డరాజు మైసూరు చిక్కదేవరాయలకడ దళవాయిగా నుండి పరాక్రమము నెరపెను. చిక్కదేవరాయలు మైసూరురాజ్యనిర్మాతలలో సమర్థతరుడు. ఈతడు క్రీ. శ. ౧౬౭౩ - ౧౭౦౪ వరకు రాజ్యముచేసినవాడు. వీరరాజుకూడ తండ్రి యనంతరము చిక్కరాయలకు మంత్రియు దండనాథుడుగను నుండెను. ఈకవి శూరుడగుటయేగాక భాషాసేవకుడై కర్ణాటసంస్కృతాంధ్రభాషలలో గ్రంథరచనచేయుట ముదావహము. వీరరాజు కన్నడభాషలలో రెండు వైద్యశాస్త్రగ్రంథముల రచించెను. ఆంధ్రవచనభారతము నీతడు కళువె గ్రామమందు వెలిసిన గోపాలకృష్ణదేవున కంకిత మొనర్చెను. తాను "శ్రీరామచంద్రచరణారవింద సేవాభినందనవరప్రసాదితగీర్వాణాంధ్రకర్ణాటకాదినానాభాషాకావ్యరచనాచతురు"డ ననిగద్యలో వర్ణించుకొనెను.

వీరరాజు రచించిన భారతము వ్యాసభారతమునకు సరియైన భాషాంతరీకరణము. శైలి మృదువై హృదయంగమముగ నున్నది. ఈ నాటి వచనమువలె కాక ఆనాటి కవులు దీర్ఘవచనములు వ్రాయుచుండిరి. పూర్ణానుస్వారముగల శబ్దరూపములు వారికి ప్రీతి. ఉదాహరణకు, "విజయశీలుండగు విజయుండు ఖాండవవనంబునం దగ్ని దేవువలన మయునకు భయంబు లేకుండునటుల వరంబిచ్చి తదనంతరంబు నెయ్యది యాచరించె." వర్ణనావసరములం దీతడు తన స్వతంత్రప్రతిభను చూపెట్టెను. కావేరీనదీవైభవమును దాని పరిసరములందలి ప్రకృతిశోభను వీరరాజు ముచ్చటగా వర్ణించెను. స్వదేశములో ప్రవహించునదిని వర్ణించి తన దేశాభిమానమును ప్రకటించు కొనెను.

కళువె వీరరాజునకు వచన భారత రచనమునందు తోడ్పడినవాడు తుపాకుల యనంతభూపాలుడు. ఈతడు చంద్రగిరి కృష్ణరాజుకుమారుడు. కావేరీతీరమున నీతడు చిన్నరాజుగా నుండినట్లు తోచును. అనంతభూపాలుడు రామాయణమును విష్ణుపురాణమును తెనుగు వచనకావ్యములుగ వ్రాసెను.

## నంజరాజు.

ఈతడు హాలాస్యమాహాత్మ్యమును వచనములో వ్రాసెను. కళువెవీరరాజునకు దేవరాజు నంజరాజు అనుకుమారులిరువురుండిరి. వీరిలో నంజరాజు తండ్రి యనంతరము ౧౭౩౯

ప్రాంతమున మైసూరుస్థలో దళవాయిగా నేర్పడెను. ఈతడు మంత్రిమాత్రుడై నను మైసూరురాజ్యాధికారము నంతను స్వహస్తగతము చేసుకొని సమర్థతతో పాలించెను. నంజరాజు తండ్రిని మించిన ప్రతిభావంతుడు. ఈతడు తెలుగులో హాలాస్య మాహాత్మ్యమును కన్నడములో భారతమును వ్రాసెను. ఈతని పేర సంస్కృతాంధ్ర కర్ణాటభాషాకృతులు పెక్కుగలవు. హాలాస్యమాహాత్మ్యము దక్షిణమధురాపురీమాహాత్మ్యమును దెలిపెడి శైవగ్రంథము. దీనిశైలి సలక్షణమై నాతికఠినముగ నున్నదని వీరేశలింగముపంతులుగారు ప్రశంసించిరి.

తెలుగువచనవాఙ్మయవిస్తారమునందు మధురప్రాంతపు కవులునిర్వహించిన పాత్రకూడ కొనియాడదగినది. "సత్యభామాసాంత్వనము" వ్రాసిన కామేశ్వరకవి "ధేనుకామాహాత్మ్య" మను వచనకావ్యమువ్రాసెను. ఈతనిపద్యశైలికన్న వచనరీతి సరళముగా నున్నది. మధురనాయకరాజైన విజయరంగ చొక్కనాథుడు సారస్వతప్రియుడు. ఈతడు "మాఘమాహాత్మ్యము" "శ్రీరంగమాహాత్మ్యము" అను పెద్దవచనగ్రంథములు తెనుగులో వ్రాసెను. ఈతని యాస్థానమునందే వెలసిన సముఖము వెంకటకృష్ణప్ప నాయుడు "జైమినిభారతము" "సారంగధర చరిత్రము" వచనములో రచించెను. "వీరరాజు భారతమునకు వలె" జైమినిభారతము"నకు ఆంధ్రవచనవాఙ్మయములో సముచిత గౌరవ స్థానము కలదు. వేంకటకృష్ణప్పకు అనుప్రాసతో కూడిన శైలియిష్టము.

రాయవాచక మను చిన్నవచనకావ్యము కృష్ణదేవరాయల యాస్థానవిశేషములను వర్ణించును. మధురరాజ్యస్థాపకుడైన విశ్వనాథనాయకునకు విజయనగర మందున్న యాతని ప్రతినిధి పంపించిన నివేదనరూపములో నిది యున్నది. ఆకాలపు రాజకీయ వ్యవహార శైలికి నిది చక్కని నిదర్శనము. చారిత్రకముగ నిది యుపయుక్తమైన మూలగ్రంథము.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## పదియవ ప్రకరణము.

## కొందరు తెలంగాణపు కవులు.

ఇదివరలో తెలంగాణపు కవులను కొందరిని గురించి ప్రశంస చేయనైనది. పాల్కురికిసోమనాథుడు, బమ్మెరపోతనామాత్యుడు, మడికిసింగన, గౌరనవంటివారు తమ జన్మచేతనో లేక తమ జీవితయాత్రచేతనో తెలంగాణమును పవిత్రము చేసిన వారు. ఈ ప్రాంతములో నివసించిన మరికొందరు తెలుగు కవులను గూర్చి వ్రాయుచున్నాము.

### చరిగొండ ధర్మన.

ఈ కవి చిత్రభారతమును వ్రాసెను. ఇతడు దీనిని చిత్తాపుఖానుమంత్రి యైన ఎమ్మెలపల్లి పెద్దామాత్యున కంకిత మిచ్చెను. ధర్మన్న నియోగిబ్రాహ్మణుడు. శ్రీ వీరేశలింగము పంతులుగారు చరిగొండధర్మననుగురించి వ్రాయుచునీతడు పదునారవశతాబ్దమందో పదునేడవ శతాబ్ద ప్రారంభముననో నుండియుండు నని వ్రాసియున్నారు. చిత్రభారతమును కృతి నొందిన పెద్దామాత్యుని యేలిక చిత్తాపుఖాను డని యీ గ్రంథములో పలుమార్లు చెప్పబడినది. ఈ చిత్తాపుఖానుని గురించి చారిత్రికాంశములు పంతులుగారి కాలములో వెలువడ లేదు, తరువాత కొంతకాలమునకు చిత్తాపుఖాను శాసన

మొకటి వరంగలుకోటలో దొరకినది. దీనిని శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు పరిశోధించిరి. ఈ శాసనమునుబట్టి చిత్తాపు ఖాను డను నాతడు ఆంధ్రవీరాగ్రణి యనియు, ఈతడు క్రీ. శ. ౧౫౦౪ ప్రాంతమున ఏకశిలానగర దుర్గమును తురుష్కులనుండి జయించి మహాప్రాభవముతో పరిపాలించె ననియు తెలియు చున్నది. మహమ్మదీయులచే విధ్వంస మొనర్పబడిన ఏకశిలాన గర దేవాలయముల నతడు పునరుద్ధరించి ప్రతిష్ఠచేసెను. ఓరు గల్లులోని పాంచాలీశ్వర దేవాలయమును, స్వయంభూదేవుని గుడిని చిత్తాపుఖానుడు బాగుచేసెను. పాకాలచెరువు నీతడు సుఘటితము చేసెను ‡ చిత్తాపుఖాను చరిత్రము వీరరసాత్మకమై యుత్తేజకరముగ నుండును. ఈతని మంత్రియైన ఎన్మలపల్లి పెద్దామాత్యుడే చిత్రభారతమును కృతినందెను. కావున చరి గొండ ధర్మనకవి పదునారవ శతాబ్ది ప్రారంభమునందే యుండి నట్లు చెప్పవచ్చును.

చిత్రభారతకథను తాను బ్రహ్మాండపురాణములో నుండి గైకొనినట్లు కవి చెప్పియున్నాడు. చిత్రభారతకథ, పేరునకు తగినట్లే, చిత్రముగా నున్నది. తుల్యుడను నొక మహాభాగుడు తపస్సుచేయు చుండును, ఇంద్రు డాతని తపోభంగము చేయుటకై

‡ చిత్తాపుఖానుని గురించి వివరములకై శ్రీ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారి చారిత్రికవ్యాసము చూడనగును. ఆం. పి. మాడపాటి హనుమంతరాయ షష్టిపూర్తి సంచిక పుటలు(౨౩౭_౨౪౦)

మన్మథుని, రంభను నియోగించును. రంభ తుల్యుని మోహింప జేయుటకై కామవికారములు సల్పుచుండగా ముని కోపించి యామెను గుఱ్ఱముకమ్మని శపించెను. రంభ గుఱ్ఱముగా మారి కుండిన నగరము నేలు చతుర్ధనుడను రాజుకడనుండెను. చతుర్ధన రాజా యశ్వము నధిరోహించి లోకాలోకపర్యంతము జూచి వచ్చెను. ఆతడు గృహోన్ముఖుడై యాకాశమున పోవుచుండగా నాతని గుఱ్ఱము నోటినుండి నురుగుజారి భూమిమీద యమునా నదిలో అర్ఘ్యము విడుచుచున్న శ్రీకృష్ణుని దోసిలిలో పడును. శ్రీకృష్ణు డీ యపచారమునకు కోపించి యట్లు చేసిన రాజును చక్రధారచే సంహరింతు నని ప్రతిజ్ఞ చేసెను. ఈ వార్తను నారదుడు చతుర్ధనరాజునకు చేరవేయగా నాతడు భయ పరీతుడై తనను కాపాడుటకై బ్రహ్మను, శివుని, యింద్రుని ప్రార్థించును. వారు శ్రీకృష్ణునినుండి యారాజును కాపాడుట తమ వలన కాదని చెప్పిరి. ఈ సందర్భములో కవి బాణాసుర వృత్తాంతమును పారిజాతాపహరణ కథను వర్ణించెను. చివరకు చతుర్ధనరాజు అర్జునుని శరణు జొచ్చెను. ఆతని శత్రు వెవరో కనుగొనకయే పార్థుడాతని కభయ మిచ్చి నిజము తెలిసికొని వెరగొందును. అయినను ప్రతిజ్ఞవీడక శ్రీకృష్ణునితో యుద్ధమునకే సిద్ధపడెను. యాదవపాండవ యుద్ధమునందు కౌరవులు పాండవుల పక్షమున నిలిచిరి. ఇట్లు మఱియొక కురుక్షేత్రసంగ్రామము ప్రాప్తించెను. ఉభయపక్షముల వీరులును సంగరమునకు వెడలునప్పటి దృశ్యములను ధర్మనకవి మహాభారతరీతిలో వీరరసవిజృంభణ

ముగా వర్ణించెను. చిత్రభారతయుద్ధముకూడ పదునెన్మిది దినములు నడచెను. ఇందును వ్యూహనిర్మాణము చెప్పబడినది. శ్రీకృష్ణుడు చక్రధారచే ధర్మరాజుతప్ప మిగిలిన పాండవులను కౌరవులను సంహరించి తిరిగి బ్రతికించెను. చరిగొండధర్మన కవిత్వము రసవంతముగానే యున్నది. మహాభారత వాతావరణము నీతడు తన కావ్యములో చక్కగా పొందుపరచెను. ఈతనికి చిత్రకథ యందే కాక చిత్రకవిత్వమునందుకూడ ప్రీతి మెండు. ఈ యాశ్వాసములలో యమకానుప్రాస చిత్రితముగా నీతడు వ్రాసెను. ఇట్టి శైలి పదునేడవశతాబ్దియందే వ్యాప్తికి వచ్చినది. అయినను చిత్తాపుఖాను ప్రశంసనుబట్టి ధర్మనకవి పదునారవశతాబ్దిముఖము నలంకరించెనని తలంపవలెను.

## పొన్నికంటి తెలగన.

ఈతడు, "యయాతిచరిత్రము" అను అచ్చతెనుగు ప్రబంధమును వ్రాసెను. అచ్చతెనుగు కావ్యములను వ్రాసినవారిలో నీతడు మొదటివాడు. పొన్నికంటి తెలగనార్యుడు బ్రాహ్మణుడు. తాను నివసించిన ప్రాంతము నీతడు కొసలనాడు అని వ్యవహరించెను. తెలగన్న తన కావ్యమును అమీనుఖాను అను మహమ్మదీయసర్దారుకు అంకితము చేసెను. ఒక ముసల్మానుప్రభువు కృతిభర్త యగుట, శుద్ధాంధ్రములోనుండుట అను రెండు విశిష్టలక్షణములు యయాతిచరిత్రకు పట్టినవి. రెండును సంతోషదాయకములు. అమీనుఖాను గోల్కొండసుల్తాను ఇబ్రాహీంకుతుబుషా

హాకు లోబడిన సామంత రాజు. ఈతనికి తెలంగాణములోని పొట్ల చెర్ల ముఖ్యపట్టణము. ఇది యిప్పటి పొట్లచెర్వు (పటన్‌చెరూ) గ్రామము కావచ్చును. దక్కను పరిపాలకులైన సుల్తానులలో కుతుబుషాహీ వంశమువారు మతసమరసభావమునకు కొంత వరకు పేరుగాంచిరి. ఈ వంశమువా రొక్కరుమాత్రమే దేశ భాషయైన తెలుగు నభిమానించి ఆంధ్రకవులను పోషించినట్లు నిదర్శనములు గలవు. అట్టివారిలో ఇబ్రాహీంకుతుబుషాహా పేరెన్నికగన్న వాడు. ఈతనిని మనవారు మల్కిభరాం అనియు ఇభరాంషాహా యనియు వ్యవహరించిరి. ఈతడు క్రీ. శ. ౧౫౫౦ —౧౫౮౧ల నడుమ పరిపాలన చేసెను. ఈతని సరదారుడైన అమీనుఖానుడును పొన్నికంటి తెలగనార్యుడును కూడ ఈ కాలమునం దుండినవారని చెప్పవచ్చును. అమీనుఖాను ప్రజా హితకార్యములెన్నియో చేసెనని తెలగనార్యుడు పొగడియు న్నాడు. పొట్లచెర్లలో నీతడొక మసీదు కట్టించెనట. పరమా త్మునిధామము చేరదలచినవారికీ మసీదు నిచ్చెనవలె నుండె నని కవి చక్కగానుత్ప్రేక్షించినాడు. అమీనుఖాను బ్రాహ్మణులబిడ్డ లకు వేడుకతో పెండ్లిండ్లు చేయించెడివాడట! ఈఖానుడు తనను గూడ పట్టి పెండ్లి చేయించునేమోయని జడిసి నిత్యబ్రహ్మచారి యైన హనుమంతుడు వనములకు పారిపోయెనట! అమీనుఖానుని భార్యలు కూడ పెక్కుప్రజాహితకార్యములు చేయుచుండిరట. వారిలో నొకసతీమణి బడేబీబీ యను నామె వాడలోని పిల్ల లందరకును నిత్యము పాలుపోసెడిగట. అత్తవారింటికి వెళ్ళు పడుచులకు కట్నము లిచ్చి పంపెడిది!

అచ్చ తెలుగును శుద్ధాంధ్రమని యందురు. తెలుగుభాష యందు తత్సమ, తద్భవ, దేశ్యములని శబ్దములు మూడు విధములు. వీనిలో తద్భవదేశ్యములను కలిపి అచ్చ తెలు గనుచున్నారు. ఆంధ్రభాషలో నొకప్పుడు దేశ్యశబ్దములే విస్తారముగను తత్సమ శబ్దములు తక్కువగను ఉండెను. ఇదిసహజమైన స్థితి. కాని సంస్కృతభాషాభిమానముగల మన కవులందరును గీర్వాణ భాషా శబ్దములను తమ గ్రంథములలో మిక్కుటముగ జొప్పించిరి. కాలక్రమమున నీ యాచారము స్థిరపడి తత్సమపదములు లేనిదే యెట్టి యుదాత్త భావమును ప్రకటింపలేని స్థితి యాంధ్ర భాషకు కలిగినది. అట్టియెడ నచ్చపుతెలుగు పదములతో సంపూర్ణ కావ్యము వ్రాయుట దుష్కరకార్యమను భావము బయలుదేరెను. రెండర్థముల కావ్యమువలెనే శుద్ధాంధ్రప్రబంధ నిర్మాణము అద్భుతావహ మనిపించెను. ఈ భావమును తెలగనార్యు డిట్లు ప్రకటించెను.

> "అచ్చ తెనుంగు పద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
> హెచ్చని యాడుచుందు రదియెన్నుచు బెద్దలు పొత్తమెల్ల ని
> ట్లచ్చతెనుంగున న్నొడువ నందులచంద మెఱుంగువారు నిన్
> మెచ్చరొ, యుబ్బురం బనరొ మేలనరో కొనియాడరో నినున్"

ఇట్టి నిబంధనలకు లోబడియు తెలగనార్యుడు చక్కని ప్రబంధమునే వ్రాసెను. సమయోచితమైన ప్రకృతి వర్ణనలను ప్రశంసనీయముగ చేసెను. యయాతి మహారాజుకథ మహా

భారతమునందును భాగవతమునందును కూడ కలదు. నన్నయ పోతనగార్లవంటి మహాకవుల లేఖిని చవిచూచిన కథను మరి యొక కవి అంతప్రతిభావంతముగ లిఖించుట పొసగదు. యయాతి చరిత్రయందు రసవంతములును భావస్ఫోరకములు నైన కథపట్టులు చాలగలవు. యయాతి శృంగారజీవితమును మాత్రమే తెలగ నార్యుడు స్వీకరించెను. ఇది ప్రబంధయుగమువారి అభినివేశ ములకుదగినట్లే యున్నది. శుద్ధాంధ్రమునందు కావ్యవర్ణనలకు చాలినంత పదజాలము లేకపోవుటచే తెలగనార్యుడు తద్భవ ములమీద నెక్కువ యాధారపడెను. ఈతని యచ్చతెనుగు కూర్పులు చమత్కారముగ నుండును. ఉదాహరణకు, 'కనువిను కవి నెలవు పుట్టువు'. కనువినుకవి అనగా చక్షుశ్శ్రవము, పాము; దాని నెలవు పుట్ట. అది పుట్టువు, జన్మస్థానముగా గలవాడు వాల్మీకి. ఒక నూతనసాహిత్య ప్రక్రియను ప్రచారములోనికి తెచ్చిన ప్రతిభావంతుడు పొన్నికంటి తెలగన.

### అద్దంకి గంగాధరుడు.

ఈ కవి తపతీసంవరణోపాఖ్యానము అను ప్రబంధమును వ్రాసి గోలకొండసుల్తాను ఇబ్రాహీంకుతుబుషాహాకు నంకితమొసం గెను. గంగాధరకవి నియోగిబ్రాహ్మణుడు. ఇబ్రాహీంషాహా చరిత్రము పొన్నికంటి తెలగనార్యుని జీవితసందర్భములో గొంతచెప్పబడినది. ఈతడు రాజ్యమునకు రాకముందు క్రూరు డగు అన్నకు వెరచి పారిపోయి విజయనగరరాజ్యమునందు తల దాచుకొనెను. విజయనగరమున అతిథిగానున్న కాలములో

ఇబ్రాహీంషాహాకు ఆంధ్రకవులతో పరిచయము గల్గెను. ఆంధ్ర భాషాభిమానము కలవాడయి తెలుగుకవులను చేరదీసెను. తాళికోటయుద్ధమునందీ సుల్తానుకూడ ప్రముఖపాత్ర వహించి తన కాతిథ్యమిచ్చిన విజయనగరమునెడ కృతఘ్నుడుగ ప్రవర్తించినను, ఈతడు మతపక్షపాతభూయిష్ఠుడుగాక ప్రజారంజకుడుగ నుండెను. అద్దంకిగంగాధరకవి యీతనికడనే కవీశ్వరుడుగ నుండి పై ప్రబంధమును వ్రాసెను. మల్కిభరాముచే నాదరింపబడిన మరియొక ఆంధ్రకవీశ్వరుడు గలడు. ఈతడు కందుకూరి రుద్రకవి. ఇతడు నిరంకుశోపాఖ్యానమను కావ్యమును సుగ్రీవవిజయమను యక్షగానమును రచించెను. ఇభరాంషా యితనికి చింతలపాలెము అను గ్రామము నగ్రహారముగ నిచ్చెను. ఆంధ్రకవీశ్వరులను పోషించుటచేతను సమరసభావముతో పరిపాలించుటచేతను ఇబ్రాహీంషాహా తెలుగువారి యాదరణకు పాత్రుడయ్యెను. అద్దంకిగంగాధరుడు ప్రౌఢకవి. తపతీసంవరణకథకు మూలము మహాభారతములో నున్నది. గంగాధరుని కవిత్వమునుగురించి వీరేశలింగంపంతులుగా రిట్లు వ్రాసిరి. "ఈ కవికృతమయిన తపతీసంవరణము సరసమయినదయి మంచికల్పనలు గలిగి దాదాపుగా వసుచరిత్రను బోలి వఱలుచున్నది."

### సారంగు తమ్మయ.

ఈ కవి వైజయంతీ విలాస మను శృంగారప్రబంధమును రచించెను. దీనికి విప్రనారాయణచరిత్ర యనుపేరుకూడ గలదు.

విప్రనారాయణుడను వైష్ణవభక్తుని చరిత్ర మిందు వర్ణితమైనది. ఈ భక్తుని "తొండరడిప్పొడియాళ్వారు" అని ద్రావిడములో వ్యవహరింతురు. సారంగుతమ్మకవి నియోగిబ్రాహ్మణుడు. ఈతడు మహమ్మదు కుతుబుషాహ కాలములో గోలకొండ కరణమైయుండెను. మహమ్మదుషా క్రీ. శ. ౧౫౮౧-౧౬౧౧ నడుమ గోలకొండరాజ్యము నేలెను. కావున సారంగుతమ్మ కవి యీ కాలమున నుండియుండును. సుల్తాను తనను రమ్మ ఁబొమ్మనునంత యాదరముతో చూచినట్లీతడు చెప్పుకొన్నాడు. ఈ కవి తన గ్రంథమును శ్రీరామాంకితముగ చెప్పెను. తమ్మ కవి వైష్ణవమత ప్రియుడు. ఈతని గురువు కందల అప్పలా చార్యులు. ఈ యాచార్యుడే తెనాలిరామకృష్ణుని పాండురంగ మహాత్మ్యమును కృతిగొనిన వేదాద్రిమంత్రికికూడ గురువుగ నుండెను. ఇట్లు సారంగుతమ్మకవి తెనాలి రామకృష్ణునకు సమ కాలికు డగుచున్నాడు.

విప్రనారాయణచరిత్రయందలి కథ మిక్కిలి యింపుగా నుండును. విప్రనారాయణుడు వైష్ణవబ్రహ్మచారి. ఈతడు విష్ణు ప్రసాదముచే జన్మించెనట. యౌవనము వచ్చినను ఈతడు స్త్రీ పరాఙ్ముఖుడై కామభోగముల పొంతబోక స్వాధ్యాయము నభ్యసించుచు వైష్ణవసేవ చేయుచు కాలము గడుపుచుండెను. శ్రీరంగక్షేత్రము కడ నీత డొక పుష్పోద్యానమును నాటించి యందలి పూవులతో భగవంతునకు మాలికలు గ్రుచ్చి సమ ర్పించుచు పవిత్రజీవితము గడుపుకొనుచుండెను. ఆతనిపై రాగ్య

మెట్టికసగా:- తన తోటలో స్త్రీలుచేయు దోహదములను కోరు వృక్షములను కూడ నాటించలేదట! ఇట్లుండ దేవదేవి యను వారవనిత శ్రీరంగేశ్వరుని మ్రోల నిత్యాభినయము చేసి వచ్చుచు విప్రనారాయణుని తోటజొచ్చెను. ఆ వైష్ణవబ్రహ్మచారి వైరాగ్యమును స్త్రీవిముఖత్వమును విని యామె అవిశ్వాసముతో నవ్వెను. విప్రనారాయణుని కాంతాపరాయణునిగ చేతు నని యామె ప్రతిజ్ఞ చేసెను.

తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుటకై దేవదేవి యెన్నియో మాయోపాయములను బన్నెను. తానొక వైష్ణవభక్తురాలనియు విప్రనారాయణునికి సేవలు చేయగోరుచుండెననియు, వేశ్యావృత్తివలన తనకు వైముఖ్యము కలిగెననియు ఆమె పలువిధముల నా ముగ్ధభక్తుని నమ్మించి యాతనికడ శుశ్రూషకు గుదిరెను. క్రమముగ తన ధూర్తవర్తనముచే నా మాయలాడి విప్రనారాయణుని హృదయమును కలచివైచి యాతని వ్రతభంగమును సాగించెను. భాగవతోత్తముడగు విప్రనారాయణుడు దేవదేవి కింకరుడై వేశ్యావాటికలో నివసింపజొచ్చెను. దేవదేవితల్లి దరిద్రుడైన వైష్ణవభక్తుని యిల్లు వెడలగొట్టెను. భక్తుని యిక్కట్టులను గాంచి శ్రీరంగేశుడు దయాసమేతుడయి, ఆలయమందలి స్వర్ణపాత్రమును విప్రనారాయణుడు పంపించినట్లు భోగముదానితల్లికి పంపించెను. బంగారుగిన్నె చూడగనే దాని ముఖము వికసించి విప్రనారాయణునకు సానియింట తిరిగి ప్రవేశము లభించెను. స్వామికోవెలలోని ధర్మపాత్ర పోయి

నందున రక్షకభటులు దానికై వెదకుచు విప్రనారాయణుని పట్టుకొనిరి. భక్తునకు దేశమునుండి వెడలగొట్టు శిక్షవిధింప బడెను. ఈ సమయమున శ్రీరంగేశుడు మరల భక్తున కడ్డుపడి యాతనిని దేశబహిష్కారమునుండి కాపాడెను.

సారంగుతమ్మయకవి భావబంధురము, సరసము నైన కవిత చెప్పగలవాడు. కథను సంభాషణరూపమున నడిపించి యాతడు తన శిల్పమును వెలయించెను. ఈతడు తన ప్రతిజ్ఞను గన్పర చుటకో యన్నట్లు కొన్ని యెడల మిగులప్రౌఢముగ వ్రాయును. వేశ్యాసంబంధమువలన కలుగు కీడును చూపించి నీతిబోధ చేయుట ఈ కావ్యోద్దేశము. కాని తమ్మయకవి చేసిన కొన్ని వర్ణనలు అవినీతికరముగా నున్నవి. పాత్రపోషణమునందు తమ్మయ కవి నేర్పును ప్రదర్శించెను.

## మల్లారెడ్డి.

ఈకవి షట్చక్రవర్తిచరిత్రము, శివధర్మోత్తరము, పద్మ పురాణమును రచించెను. ఈతడు రెడ్డికులమునకు చెందిన వాడు. మల్లారెడ్డి వంశీయులు తెలంగాణమునందలి మెదకు దుర్గమునకు సమీపమున నున్న బిక్కనవోలును రాజధానిగా చేసుకొని పాలించిరి, తన తండ్రి కాచరెడ్డిదేశాహి (దేశాయి కావచ్చును) యనియు, అన్నయగు కామరెడ్డి చౌదరి యనియు మల్లారెడ్డి పేర్కొనెను. వీరు గోలకొండ సుల్తానులకు లోబడి బిక్కనవోలు ప్రాంతమున ప్రభుత్వము వహించిరి. మల్లారెడ్డి

యనంతరులలో నొకడగు రాజన్న చౌదరి బిక్కనవోలును వీడి దోమకొండను తన రాజధానిగా చేసికొనెను. కావున ఈ వంశపు రాజులకు దోమకొండరాజు లని పేరు గల్గినది. మల్లా రెడ్డి పూర్వులలో కామినీడు అను వీరుడుండెను. ఈతని పేర నీవంశమునకు కామినేనివంశ మని వ్యవహారము గల్గెను. ఈ వంశములోని కాచరెడ్డి యనునాతడు మొదట కర్ణాటదేశము నందు రాయదుర్గము నేలుచుండెడివాడు. తరువాత సుల్తానుల యాహ్వానమున కృష్ణానదిని దాటివచ్చి మెతుకు దుర్గముక్రింద బిక్కనవోలు ముఖ్యపట్టణముగా రాజ్యమేలెనని శివధర్మోత్తరము చెప్పుచున్నది. మల్లారెడ్డి కుతుబుశాహి వంశీయుడగు ఇబ్రాహీంపాదుషా కాలములో నుండి యుండునని శ్రీ వీరేశలింగంపంతులుగారు చాటుపద్యముల సాయమున నూహించిరి. మల్లారెడ్డియన్న కామిరెడ్డి మహమ్మదుషాహవలన రాజచిహ్నములను బడసె నని శివధర్మోత్తరము నుడువుచున్నది. మహమ్మదుషాహ క్రీ. శ. ౧౫౮౦-౧౬౧౧ల నడుమ పరిపాలన చేసెను. కావున కామిరెడ్డియు మల్లారెడ్డియు పదునారవ శతాబ్దియంతమున నుండి యుందురు.

మల్లారెడ్డి శివధర్మోత్తరమునందు తనవంశప్రశస్తిని వివరముగ వర్ణించెను. ఈ కవికి గురుభక్తియు భ్రాతృభక్తియు మెండు. బంధుప్రీతి నిర్మలము. తనయన్నగార్లను, వదినెగార్లను ప్రీతిగౌరవములతో ప్రశంసించెను. ఈతని యగ్రజులు జంగమరెడ్డి, కామిరెడ్డి, ఎల్లారెడ్డిగార్లు. వేర్వేర కొనియాడదగినవారు.

వీరిలో కామిరెడ్డి † సూతసంహితను ఎల్లారెడ్డి బ్రహ్మోత్తర ఖండమును కృతినొందిరి. ఎల్లారెడ్డి స్వయము కవియై వాసిష్ఠ లైంగములను సిద్ధరామలింగ దేవునకు సమర్పితముగా రచించెను. ఈతడు బాలభారత కిరాతార్జునీయములను గూడ కృతి గైకొనెనట. మల్లారెడ్డియన్న కామిరెడ్డి పెక్కు ధర్మములను ప్రజోపయోగ కార్యములను గావించి ప్రశంసనీయుడయ్యెను. తన బందుగులందరి పేరట కామిరెడ్డి గ్రామములను నిర్మించి యచ్చటచ్చట చెరువులను పూదోటలను నెలకొల్పెను. ఈ వంశీయులు శివభక్తిపరాయణులు. బిక్కనవోలు సిద్ధరామేశ్వర దేవుడు వీరి కిష్టదైవము. మల్లారెడ్డి తన షట్చక్రవర్తి చరిత్రను సిద్ధరామ దేవుని పేర కృతి సమర్పించెను. శివధర్మోత్తరమును దేవతాపరముగను, భాతృఋణము తీర్చుకొనుటకై తన యన్న కామిరెడ్డి పేరను విరచించెను. మల్లారెడ్డి ప్రభువుల వంశమున బుట్టినను వినయపరుడుగ గాన్పించును. తన సోదరులను తనవితీర పొగడియు నీ మృదుకవి తననుగురించి యేమియు చెప్పుకొనలేదు.

---

† సూతసంహితను వ్రాసిన వాడు పట్టమట్ట సోమనాథకవి. ఇది బిక్కనవోలు కామిరెడ్డి కంకితమీయబడినది. కృతిపతియైన కామినేని కామిరెడ్డి యెప్పటివాడో తెలియదనియు, కవి గోదావరిమండలము వాడనియు వీరేశలింగము పంతులుగారు వ్రాసిరి. బిక్కనవోలు గోదావరి మండలము నందలి బిక్కవోలు గ్రామము కాదు. ఇది తెలంగాణములో మెదకు మండలములో నున్నది.

షట్చక్రవర్తి చరిత్రము మల్లారెడ్డి ప్రథమగ్రంథము. హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యుడు అను నార్గురుచక్రవర్తుల చరిత్రముల నిది వర్ణించును. ఈ కథలు పురాణప్రసిద్ధములు. వీటిని సంగ్రహము గను, కథావేగముతోను కవి రచించెను. ప్రబంధములం దుండ వలసిన వివిధవర్ణనముల నీతడు సందర్భానుసారముగ గూర్చి తన చాతుర్యమును ప్రకటించెను. రామరాజభూషణుని వసు చరిత్ర ప్రభావ మీ గ్రంథముపై మిక్కుటముగా గాన్పించును. అనంతరప్రబంధయుగము లోని కవులు పలువురు వసుచరిత్రనే యొరవడిగ పెట్టుకొని వ్రాయుచుండిరి. అదియే శృంగారరస ప్రాధాన్యము. అదియే మిశ్రకథావస్తు నియతి. గిరికావసురాజుల యచ్చులో పోసిన నాయికానాయకులు. రామరాజభూషణుని శ్లేషకవితా వాతావరణమునందే వీరందరును తమతమ సామర్థ్య ములను జట్టి సంచరించుచుండిరి. మల్లారెడ్డికి శ్లేషకవిత్వము మీదను శబ్దాలంకారచిత్రితరచనమీదను దృష్టి యధికము. ఈతని శ్లేషకవనము నాతికఠినమై చక్కని కల్పనలు గల్గి యున్నది. ఈతడు మంచి సంస్కృతాంధ్రపాండిత్యము గలవాడు. తన శబ్దశాస్త్రపరిచితిని చూపించుటకై వ్యాకరణ పదములను అలంకారములను, రీతులను కూడ శ్లేషలలో కూర్చి పద్యములు రచించెను.

శివధర్మోత్తరమును షట్చక్రవర్తిచరిత్ర యనంతర మీ కవి రచించెను. దీనికి మూలము స్కాందపురాణము. ఇది శివ

భక్తిపారమ్యమును ఉద్ఘోషించును. ఇందలి కవిత్వము షట్చక్రవర్తిచరిత్రకవిత్వమువలె శ్లేషఘటనామయము గాక సులభరీతిలో నున్నది. కాని దీనియందు కావ్యత్వమంతగా లేదు. శైవాచారములు, వేదాంతము, ధర్మములు, ప్రాయశ్చిత్తములు మున్నగువాటితో నిండి యున్నది. శివధర్మోత్తరములోని ఎనిమిదవయాశ్వాసమునందు గోవుల ప్రశంస వచ్చినది. ఈ భాగము మిక్కిలి హృద్యముగా నున్నది. మల్లారెడ్డి మృదుహృదయము గోవృషభపాలనమునందు వీక్షింపనగును. గోవుల నిర్మలనిరపాయజీవితమును కవి యిట్లు వర్ణించెను.

"వరవిపినాంతరంబు నిజవాసముఁ జేయుచు సర్వధారుణీ
ధరముల గడ్డిమేయుచును దాహము కాల్వలనీటఁ దీర్చుచుఁ
బరువుల మోయుచుఁ జగతిఁ బాప మణంచుచు గోవులుండు సు
స్థిరమతి గోరసంబులను జీవులు జీవితు లౌదు రెప్పుడుఁ"

గోరక్షణకై మల్లారెడ్డి హృదయము తపించును. గోష్ఠము లెట్లుండవలెనో, ఏయే ఋతువులలో గోవుల నెట్లు సంరక్షించవలెనో, యీ కవి వివరించెను. ఆవులు దురద పెట్టినప్పుడు గోకికొనుటకై కొట్టములో స్తంభము లేర్పాటు చేయవలెనని విధించిన యీతని గోశ్రద్ధ ప్రశంసనీయము. లేగలపాల విషయమై యీతడు చక్కని సూత్రము చేసెను. మల్లారెడ్డి యుత్తమ కృషీవలు డనిపించును.

మల్లారెడ్డి పద్మపురాణ మాతని శివధర్మోత్తరముకన్న

రసవంతముగనున్నది. ఇది యాతని పరిణతికావ్య మని తోఁచును. దీనిలో శ్లేషనిబంధనకై మల్లారెడ్డి యత్నింపలేదు. కవిత్వము సరళమై మృదుభావాన్వితమై జాలువారినది. మల్లారెడ్డియన్న కామిరెడ్డి పద్మపురాణోపరిభాగప్రసిద్ధశివరాఘవకథను వినుటకు కుతూహలియై యుండెను. ఇంతటకుతుబుషాహీ సంస్థానపండితుడైన గణేశపండితుడు కామిరెడ్డి యాస్థానమునకు వచ్చెను. పద్మపురాణాంతర్గత శివరాఘవకథను వ్రాయుటకు మల్లారెడ్డియే సమర్థు డని గణేశుడు నిర్ణయించి చెప్పెనట. బిక్కనవోలు రెడ్డిరాజులు శివభక్తిదీక్షితులు. కావున మల్లారెడ్డిగ్రంథములు చాలవరకు శివధర్మపరాయణములుగా నున్నవి. కవి యీ గ్రంథమును బిక్కనవోలు సిద్ధరామేశ్వరదేవునికే యంకిత మిచ్చెను. శివపూజామహత్త్వము, విభూతిధారణావశ్యకత, శివలింగపూజాక్రమము మొదలగు నంశము లిందువివరింపబడినవి. ఈ గ్రంథమునం దక్కడక్కడ రమణీయమైన కథలును గలవు. నాల్గవ యాశ్వాసమునందు రామాయణకథ చెప్పబడినది. వాల్మీకములో లేని కొన్ని విశేషము లిందు చేరినవి. ఈ గ్రంథశైలిని చూపుటకు తల్లిని గురించిన యీ పద్యము తెల్పుదును.

'ఆసరఁగ నూనె యంటి జలమారిచి యుగ్గిడి నిద్రఁబుచ్చి పై
నెడనెడఁ జన్నొసంగుచు ననేకవిధంబుల నెల్లపాటులుం
బడుచు దినంబు ప్రోదిగఁ గుమారుని సాదఁగ వేళపట్టునం
గడుపఁగఁ బవ్వళింపఁ బతిఁగూడి సుఖింపఁగ లేదు తల్లికిన్'.

## సురభి మాధవరాయలు.

జటప్రోలుసంస్థాన పూర్వప్రభువైన యీ కవి చంద్రికా పరిణయమును రచించెను. మాధవరాయకవి సురభిమల్ల భూపాలుని కుమారుడు. వీరిది రేచెర్లగోత్రము. ఈవంశోత్పత్తి యిట్లు చెప్పబడినది. విష్ణుపాదమునుండి పద్మనాయక కులము ప్రభవించెను. దానియందు సర్వజ్ఞసింగభూపాలుడు జనించెను. ఈ వంశపరంపరలోనే మనకవియైన మాధవరాయలు పుట్టెను. ఈ కవి తన వంశప్రశస్తిని పెక్కు పద్యములలో వర్ణించెను. కాని దానిలో చారిత్రికాంశము లెట్టివియు లేవు. కవి ప్రౌఢోక్తులే విశేషముగనున్నవి. కావున ఈ కవికాలనిర్ణయము సుకరముగా లేదు. మాధవరాయకవి ౧౬ వ శతాబ్ది నడుమ నున్నవాడని వీరేశలింగంపంతులుగా రూహించిరి. చంద్రికాపరిణయమును రచించిన మాధవరాయలు శ్రీకృష్ణదేవరాయల యల్లుడైన అళియ రామరాజువలన జటప్రోలుసంస్థానమును ౧౦౦౦ ఫసలీలో సంపాదించినట్లు ఈ గ్రంథమునకు పీఠిక రచించినవారు ప్రకటించిరి. చంద్రికాపరిణయము రామరాజభూషణుని వసుచరిత్రకు సమకాలమందు వెలసిన గ్రంథమని వీరిమతము. జటప్రోలుసంస్థాన రాజ్యము నీ మాధవరాయలే స్థాపించినట్లు గ్రంథమందెచ్చటను చెప్పబడలేదు. సభాసదు లీతని వంశవర్ణనము గావించు సందర్భమున మాధవరాయని పౌరుషాధికమును ప్రశంసించిరే గాని యాతడు రాజ్య సంస్థాపనము చేసినట్లు చెప్పలేదు. జటప్రోలురాజ్య సంస్థాపనము ౧౦౦౦ ఫసలీలో జరిగినదని యంగీకరించినను అది యళియరామ

రాజు కాలముకాదు. ఫసలీ ౧౦౦౦ క్రీ. శ ౧౫౯౧ కి సరిపడు చున్నది. అళియరామరాజు క్రీ. శ ౧౫౬౫ తాళికోటయుద్ధము నందు నిహతు డయ్యెను. కావున జటప్రోలురాజ్య మీవంశము వారికి లభించినది యళియరామరాజువలన కాకుండవలెను.

చంద్రికాపరిణయపీఠికలో నీయబడిన సురభివంశావళి యిట్లున్నది. సర్వజ్ఞసింగభూపాలుని వంశములో పెద్దనశౌరి పుట్టెను. ఈతనికుమారుడు మల్లభూపాలుడు. మల్లభూపాలుని కొడుకు మఱియొక మల్లక్షితిపుడు. ఈ రెండవమల్లభూపాలునకు "బింకోలుగండ"యను బిరుదుగలదు. బింకోలుగండమల్లభూజాని కుమారుడు మఱియొక మల్లప్రభువు. ఈతనిని ముమ్మడిమల్ల యని కవియే వ్యవహరించెను. ఈ ముమ్మడిమల్ల సూనుడు చంద్రికాపరిణయకావ్యకర్త మాధవరాయలు. రెండవమల్లభూపాలునకు గల 'బింకోలుగండ' బిరుదము పరిశీలింప దగినది. బింకోలు బిక్కనవోలు పట్టణమని యూహింపవలెను. షట్చక్రవర్తి చరిత్ర వ్రాసిన మల్లారెడ్డికవి సోదరులగు కామిరెడ్డి మొదలగు వారికీబిక్కనవోలు ముఖ్యపట్టణము, సురభి రెండవమల్లభూనాథు డేయుద్ధముననో బిక్కనవోలు రెడ్డిరాజులతో పోరి, వారి నోడించి యుండవచ్చును. బిక్కనవోలు రెడ్డిరాజులు గోల్కొండకుతుబుషాహీలకు మిత్రులుగ నుండిరి జటప్రోలు పద్మనాయకప్రభువులు ఈ కాలమున విజయనగరమునకు విహితులుగ నుండిరి. జటప్రోలు సంస్థానమువీరికి రామరాయలవలన లభించినట్లు చెప్పబడుట గమనింపదగినది. బిక్కనవోలు కామిరెడ్డి మహమ్మదుషాచే గౌరవ

చిహ్నములను బడసినవాడు. ఇట్లే యుభయసామంత రాజ్యము లకును తమ యేలికలమూలమున యుద్ధము తటస్థించి యుండును. ఈ సన్నివేశము క్రీ.శ. ౧౫౮౬-౧౬౧౪ల నడుమ విజయనగర చక్రవర్తిగా నుండిన వీరవేంకటపతిరాయల పాలనమున జరిగెను గోలుకొండనవాబు మహమ్మదుషాహా తనతండ్రి ఇబ్రాహీం షాహా నీతినే యవలంబించి విజయనగరమును కబళించుటకు యత్నించుచు పెనుగొండనుకూడ ముట్టడించెను. ఈ సంగ్రామ ములో తురుష్కులకు ఘనపరాజయము కలిగెను. మహమ్మదీ యులకును విజయనగరసామ్రాజ్యమునకును కృష్ణానది సరిహ ద్దుగా నంగీకరింపబడెను. మహద్ షాహాపక్షమున బిక్కనవోలు రెడ్లు యుద్ధములో పాల్గొని యుండుట సహజము. జటప్రోలు నాయకప్రభువు రెండవమల్లభూపు డీసంగ్రామమునందే బిక్క నవోలువారి నోడించి బింకోలుగండ బిరుదుచే భూషితుడై యుండును. ఈ సేవలను గుర్తించియే వీరవేంకటపతిరాయలు జటప్రోలు రాజ్యమును ఫసలీ ౧౦౦౦ అనగా క్రీ.శ. ౧౫౯౧ ప్రాంత మున బింకోలుగండ మల్లప్రభువుకు ప్రసాదించి యుండును. (విజయనగర దానశాసనములలో శాలివాహనశకము నుదహ రింపక ఫసలీసంవత్సరము లుదహరించు టాశ్చర్యకరము).

జటప్రోలురాజ్యమును మొదట సురభివంశీయులకు వాగ్దానము. చేసినవాడు అళియరామరాజై నచో ఆవాగ్దానము బింకోలుగండమల్లభూపాలుని తండ్రి ప్రథమ మల్లనికి జరిగియుం డవలెను. ఈ వాగ్దానము చేసినవాడళియరామరాజు కాదనియు

ఆతని తమ్ముడు తిరుమల దేవరాయని కుమారుడు రామరాజనియు తలచు టెక్కువ సమంజసముగ నుండును. తిరుమలరాయని కొడుకు మొదటి శ్రీరంగరాజు క్రీ.శ. ౧౫౭౨-౧౫౮౫ లనడుమ విజయనగరమును పాలించు కాలములో సామ్రాజ్యమునకు మహమ్మదీయులనుండి యొత్తిడిభరింపరానిదిగ నుండెను. ఆతని తమ్ముడు రామరాజు అన్న పరిపాలనాకాలములో రాజప్రతినిధిగ నుండెను. ఉత్తరమునుండి వచ్చు మహమ్మదీయుల కడ్డుగట్టుగా నిల్చుటకై కాబోలు శ్రీరంగరాయల యను మతితో రామరాజు జటప్రోలు ప్రాంతభూమిని పద్మనాయకులకు వాగ్దాన మిచ్చియుండును. పద్మనాయక వీరులును ప్రభుభక్తితో మెలగుచుండుటచే శ్రీరంగరాయల తమ్ముడు వీర వేంకటపతి రాయల కాలములో నీ వాగ్దానము స్థిరపరుపబడియుండును. పై చర్చవలన బింకోలుగండ బిరుదాంచితుడైన రెండవసురభిమల్లభూపాలుడు క్రీ.శ ౧౫౯౧ కాలమువాడని యూహింప వీలగుచున్నది. ఆతనికుమారుడు ముమ్మడిమల్లభూజాని కూడ యవనులతో పోరి ట్లు చంద్రికాపరిణయము వర్ణించుచున్నది. బింకోలుగండని మనుమడైనవాడును, చంద్రికాపరిణయకర్తయు నైన *సురభిమాధవరాయలు క్రీ. శ.

---

* జటప్రోలురాజ్యప్రదానము సురభిమాధవరాయలకే జరిగినచో నది క్రీ.శ ౧౬౧౭_౧౬౩౦ ల నడుమ విజయనగర సామ్రాజ్యావశిష్ట భాగమును పాలించిన రామదేవరాయల కాలమై యుండవలెను. ఇది ౧౦౦౦ఫసలీ కాదనుట తెల్లము. కాని ఈ కాలమునకు విజయనగరాధికారము మిక్కిలి సన్నగిల్లి యుండినది. కృష్ణానది కుత్తరమున రాజ్యప్రదానము చేయగల శక్తి రామదేవరాయల కుండుట సందేహాస్పదము.

౧౬౫౦ ప్రాంతమున నుండిగ్రంథరచన చేసియుండును. చంద్రికా పరిణయ శైలినిబట్టియు, భాష భావములనుబట్టియు నిది వసుచరిత్ర యొరవడిపై వ్రాయబడినగ్రంథమనుట స్పష్టము. ఇది రామరాజ భూషణునికి సమకాలమున వెలసిన దనుట కాధారము లేదు. శ్లేషయమకానుప్రాసరంజితమైన శైలిని విశేషప్రచారములోనికి దెచ్చినవాడు వసుచరిత్రకారుడు.

చంద్రికాపరిణయము వసుచరిత్రవలెనే వర్ణనాత్మకమైన ప్రౌఢప్రబంధము. కవి తన నిరంకుశశబ్దపాండిత్యము నిందులో వెలయించి దీని నొక పిల్లవసుచరిత్రగా దిద్దెను. సుచంద్రుడను రాజుకడకు శాండిల్యమహర్షి వచ్చి, తమిస్రుడను రాక్షసుడు తమ తపోభంగము చేయుచున్నాడనియు, వానిని సంహరింపవలె ననియు రాజును కోరెను. రాక్షసుని సంహరించుటకై సుచంద్రుడు హేమకూటపర్వతమునకు బోవుచు మార్గమున నొక సింహమును ఖండించెను. ఆ సింహము కిన్నరుని రూపునొంది తన పూర్వజన్మకథను వినిపించెను. వసంతుడను మహర్షి బ్రహ్మత్వమును పొందగోరి, గొప్పతపస్సు చేయుచుండెను. ఆ తపోవిఘ్నము నాపాదించుటకై బ్రహ్మదేవుడు చిత్రరేఖయను దేవవేశ్యను నియోగించెను. వసంతుని తపస్సు చెడగొట్టబోయి చిత్రరేఖ యాతని శాపమునకు గురియై మనుష్యలోకములో పాంచాల రాజకుమార్తె చంద్రికనామము ధరించి జన్మించెను. కిన్నరుని పలుకులమూలమున సుచంద్రునకు చంద్రికాకన్యపై వలపుగల్గెను. ఆమెయు నీతని గుణములు విని ముగ్ధురాలైయుండెను.

వసుచరిత్రయందు గిరికావసురాజులవలె చంద్రికాసుచంద్రులు ప్రణయవిరహదశ లనుభవింతురు. వసుచరిత్రలో లేని విశేషము చంద్రికాస్వయంవరము. నైషధకావ్యమునందు సరస్వతి వలె, చంద్రికా పరిణయమునందు పార్వతీదేవి సన్నిహితయై స్వయం వరమునకు వచ్చిన రాజులను వర్ణించి చెప్పును. ఇట్లు పలుప్రబంధములలో గల రమ్యరీతులను మాధవరాయకవి తన యద్వితీయగ్రంథములో సమకూర్చెను. శ్లేషకవితాప్రీతియం దీతని రామరాజభూషణుని తరువాత ప్రశంసింపవలెను, వసుచరిత్రకారుని భాషాపూర్ణవము, సంగీతానుకూలమైన పద్యరచన, ఔచిత్యపరిజ్ఞానము చంద్రికాపరిణయమందు లేవు. వసంతుని తపోభంగము చేయుటకై చిత్రరేఖను మన్మథుని నియోగించుపట్ల బ్రహ్మదేవు డాడినపల్కులు ఉదాత్తములుగ లేవు. శ్లేషకూర్పుట యందు రామరాజభూషణుడు సంస్కృతాంధ్రముల రెంటినికూడ వాడుకొనెను. మాధవరాయకవి శ్లేషకొరకై సంస్కృతమునే ప్రధానముగ నాశ్రయించెను. ఈ ప్రభుకవి వైదుష్య మద్భుతావహము!

## పరశురామపంతుల లింగమూర్తి.

ఈ మహాకవి "సీతారామాంజనేయసంవాదము" అను వేదాంతగ్రంథమును రచించి యాంధ్రులకు చిరపరిచితు డైనాడు. భక్తాగ్రేసరుడైన పోతనజన్మించిన గడ్డమీద లింగమూర్తి వంటి వేదాంతనిధి యవతరించుట యుక్తముగనే యున్నది. ఈ కవి నియోగిబ్రాహ్మణుడు, వరంగలునగరములో నొకభాగమైన

మట్టెవాడ యీతని నివాసస్థానము. ఏతద్వంశీయు లిప్పటికిని మట్టెవాడలో, లింగమూర్తిగారి పాదరజముచే పవిత్రమైన యింటియందే నివసించుచున్నారు. సీతారామాంజనేయ సంవాదము క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతమున రచింపబడి యుండునని శ్రీ శేషాద్రిరమణకవులు కొన్ని సాధనములతో నిర్ణయించిరి. ఈ కవివతంసుడు పోతనామాత్యుని యపరాంశమనుటకు కారణము కలదు. పోతనవలెనే యీతడును నవయౌవనములో శృంగారప్రాయమైన రతిమన్మథవిలాస మనెడు ప్రబంధమును వ్రాసెను. పోతనభోగినీదండకమును చెప్పెను. లింగమూర్తికవికి పోతనకువలెనే వైరాగ్యము,భక్తి,త్వరలోనే స్థిరపడి యాతనిజీవితమునకును కవితకును సార్థక్యమును గూర్చు సీతారామాంజనేయము నాతడు రచించి తరించెను.

లింగమూర్తి యీ వేదాంతప్రబంధమును తన గురువగు మహాదేవస్వామి పాదారవిందములకు గృతి యొసగ్చెను. తన గురువునే శ్రీరామపరబ్రహ్మముగా నీతడు దర్శించి గురుభక్తి పారవశ్యమును ప్రకటించుకొనెను. ప్రాచీనకవులలో నన్నెచోడు డొక్కడు తన గురువైన జంగమమల్లికార్జునయోగిని సాక్షాదీశ్వరునిగ నుతించెను. పూర్వమహాకవులను కావ్యారంభమున లింగమూర్తి స్తుతించెను.ఇంతటితో తనివి చెందక యీతడు చరాచర సర్వభూతములకును మ్రొక్కెను. దీని నాత డిట్లుసమర్థించెను. "బంగార మొక్కటయ్యును అనేకభూషణముల రూపము నొందుచున్నది. అట్లే పరమాత్మ డొక్కడయ్యును ప్రపంచము నిండి

నా నామహాభూతముల రూపమున భాసిల్లుచున్నాడు. కావున సర్వభూతములును ఈశ్వరరూపమై వందనీయము లగుచున్నవి" జీవబ్రహ్మైక వేదాంతమును విస్తరించుటకు పుట్టిన పుణ్యప్రబంధములో నీ యాచారము సమీచీనముగనే యున్నది. ఈ మహాకవి ముముక్షుజనహితంబుగా నొక్క ప్రబంధము వ్రాయ నిశ్చయించి యుండుసమయమున ఈతని యారాధ్య దైవమైన శ్రీరామచంద్రుడు మహాదేవ దేశికునిరూపమున సాక్షాత్కరించి ఇట్లా దేశించెను. "సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండ నైన నేన సచ్చిదానందస్వరూపప్రత్యగాత్ముండ వైన నీవు. ఈ యభేదవిజ్ఞానదృష్టిచేత నిరంతరంబు నన్నవలోకించుచు జీవన్ముక్తి సుఖంబనుభవింపుము. ఇప్పుడీవు బ్రహ్మాండపురాణంబునం దధ్యాత్మరామాయణం బుమామహేశ్వరసంవాదరూపంబై యొప్పు నందు శ్రీరామహృదయంబను నితిహాసంబు సీతారామాంజనేయసంవాదంబునఁ బ్రవర్తిల్లు నయ్యది సంక్షేపరూపంబు గావున నయ్యర్థంబు విస్తరించి యొక్క ప్రబంధంబుగా రచియించి నాపేర నంకితంబు సేయుము."

తిక్కనపోతనగార్ల దివ్యకృతులవలెనే సీతారామాంజనేయముకూడ భక్తిజ్ఞానవైరాగ్యములచే సముజ్జ్వలమైన వాతావరణములో జన్మించిన మహాగ్రంథము. ఈ వేదాంతప్రబంధము మూడుఆశ్వాసములలో నున్నది. అందు మొదటిదానియందు తారకయోగమును, రెండవదానియందు సాంఖ్యయోగమును, మూడవదానియందు అమనస్కయోగమును, వివరింపబడినవి.

సీతాదేవి యాంజనేయునకు తారకయోగ ముపదేశించును. జీవాత్మకును పరమాత్మకును ఐక్యానుసంధానము చేయుటే యోగ మనబడును. అది అభ్యాసయోగమనియు, జ్ఞానయోగము నియు రెండువిధములు. ప్రాణాయామము అభ్యాసయోగము. జ్ఞానయోగమునకే రాజయోగ మనియు పేరు. జీవబ్రహ్మైక్య జ్ఞానము నిచ్చు విజ్ఞానయోగమే రాజయోగము. తారకము మనశ్శుద్ధికారక మనియు, సాంఖ్యము ఆత్మస్వరూపవిచారక మనియు, అనుభవజ్ఞానము అమనస్కయోగ మనియు చెప్పబడి నది. తారకమునందు ప్రాణాయామవిధానము, యోగాభ్యాస క్రమము, ప్రణవనాదస్వరూపము మున్నగునవి విస్తరింపబడినవి. యోగసిద్ధుడైన పురుషుడు ముక్తికాంతాసంగమును ననుభవించుట ఈ కవి మిక్కిలిచమత్కారముగ వర్ణించినాడు. గహనమైన వేదాంతసూక్ష్మములను వివరించునప్పుడుకూడ ఈ కవీశ్వరుడు ఉత్తమప్రబంధవర్ణనధోరణిలో కవిత్వమును నడిపి ఆశ్చర్యానంద ముల గూర్చును. నిగూఢమైన తత్త్వభావనలు పామరులకుకూడ అర్థమగుటకై యీమహాకవి చక్కని యుపమానములను, రూపక ములను గూర్చి తన కవితకు వన్నె పెట్టుచుండును. అమనస్క యోగమును నిరూపించుచు మనస్సు లయించుటయే అమనస్క మని ప్రతిపాదించి దానిని సమర్థించుటకై మిక్కిలి హృద్యము లైన యుపమలను సంధించెను.

ఇనుఁ డస్తమించుతఱి నా
తనికిరణము లతనితోడఁ దగఁ జనుఁగి)

బెనుమానసంబు పొలిసిన
మునుకొని తద్గత వికారములు పొలియు గడున్.

చిత్తశాంతిగల మహాపురుషుని యానందమును లింగమూర్తికవి మహోన్నతభావములతోను కడు సులభమైన యుపమలతోను రూపించెను.

గాలిందూలిన వానచే దడిసినన్ గాఢాగ్నిచే గాలినన్
వ్యాలం బాత్మ విముక్తకంచుకముపై వ్యామోహముం దాల్పన
ట్లాల్రోలాంగముపై నిరూఢసుమతాహంకారము ల్లేక యా
త్మాలోకస్థితి నుండు బండితుడు నిత్యానందముం బొందుచున్.

ఇది వేదాంతగ్రంథమా లౌకికరసవిలసితమైన కావ్యమా యని భ్రమ తోచునంత శుద్ధకవితా ధోరణిలో నీ మహాకవి తన కృతి రచించెను. ఈయన తరుచు పోతన పద్యరీతుల ననుకరించుచుండును. తన సర్వంకషప్రజ్ఞ చూపుటకో యన్నట్లు ఏకాక్షర పద్యములను ఇతర చిత్రకవిత్వరీతులను లింగమూర్తికవి కూర్చెను. అద్వైతవేదాంతవాదులకు సీతారామాంజనేయము కల్పవృక్షము వంటిది. తత్త్వకవిత్వము పరశురామపంతులవంశమువారి సొమ్ముగా దోచును. లింగమూర్తిగారి కుమారుడు రామమూర్తికవి శుకచరిత్ర మను వేదాంతగ్రంథము వ్రాయుట గమనింపదగినది.

## మరింగంటి కవులు.

మరింగంటివారిది విద్వత్కుటుంబము. వీరు వైష్ణవులు. దేవరకొండసీమ వీరి నివాసస్థానము. మరింగంటివంశమునందు

గొప్ప విశిష్టాద్వైతాచార్యులు తరతరములుగ వెలసిరి. పాండిత్యమునందే కాక, కవిత్వమునందును ఈవంశమువారు ఘనత వహించిరి. మరింగంటికవుల రచనలు సలక్షణములయ్యు ప్రౌఢరీతిగల వగుటచే కాబోలు, విశేషప్రచారములోనికి రాలేదు. వీరి యింటిపేరు మొదట ఆసూరివా రనియు తరువాత మరింగంటి యను వ్యవహారముకూడ గల్గె ననియు చెప్పుచున్నారు. శ్రీరంగేశ్వరుని వాక్యమువలన ఈవంశీయులు మరింగంటివా రైరట. ఈ యంశము నీ వంశమందలి కవియు 'తాలాంకనందినీ పరిణయ కర్తయు నైన మరింగంటి నరసింహాచార్యు లిట్లు వివరించెను. శ్రీరామానుజాచార్యులవారును కురుశేఖరసాధుభట్టారకులవారును శ్రీరంగములోని రంగనాథుని సేవించుటకయి వెళ్లిరట. అప్పుడు రంగేశ్వరుడు యతిసత్తముని జూచి యిట్లుపలికెనట.

కంటిమి మిము కూరేశులఁ
గంటిమి మీ వెంటవచ్చు ఘను లెవరో మరిం
గంటి మని పల్కె నదిమా
కింటికి పేరంట నా మహిన్ రహి కెక్కెన్.

తాలాంకనందినీ పరిణయము.

మరింగంటికవులలో మొదట ప్రశస్తి వహించిన కవి దశరథరాజనందనచరిత్ర మను నిరోష్ఠ్యరామాయణమును రచించిన సింగరాచార్యులు. ఈయనకు "శతఘంటావధాన" బిరుదు

గలదు. సింగరాచార్యులు మల్కిభరాముచే మన్ననల నొందిన ట్లీ వంశీయుడును, శ్రీకృష్ణశతానందీయ గ్రంథకర్తయు నైన వేంకటనరసింహాచార్యులు తెల్పెను. కావున దశరథ రాజనందన చరిత్ర వ్రాసిన సింగరాచార్యకవి క్రీ. శ. ౧౬వ శతాబ్ది తృతీయ భాగమునం దున్నట్లు తేలుచున్నది. ఈతని కవిత్వము సలక్షణమై హృదయంగమముగ నున్న దని శ్రీ పిశేశలింగంపంతులు గారు ప్రశంసించిరి.

మరింగంటికోవలో జన్మించిన ‡ వేంకటనరసింహాచార్యు డనుకవి 'శ్రీకృష్ణశతానందీయము,' 'చిలువపడిగెరేనిపేరణము' అను కావ్యములు రచించెను. ఈతని గ్రంథము లముద్రితములు. ఈ కవి క్రీ. శ. ౧౭౭౦ ప్రాంతమున నున్నట్లూహింపబడుచున్నది.

శ్రీకృష్ణశతానందీయము భాగవతకథ ననుసరించి వెడలినది. శ్రీకృష్ణు డొకనాడు గొల్ల పిల్లలతో చల్దులనారగించుచుండగా గోవులు మేతకై దూరము పోయెను. శ్రీకృష్ణుని పరీక్షింపగోరి బ్రహ్మదేవుడు గోవులను, గోపబాలకులను మాయచే దాచి యుంచెను. నందనందనుడు పితామహుని వంచనమును దెలిసి కొని తానే యావులరూపమును, బాలకులరూపమును ధరించి ప్రతివిధానము చేసెను. ఈసందర్భమున శ్రీకృష్ణు డిట్లు తలపోసె నని భాగవతములోగలదు.

---

‡ ఈ కవి యునికినిగూర్చి లక్ష్మణరాయపరిశోధకమండలి (హైద్రాబాద) కార్యదర్శులైన శ్రీ ఆదిరాజు వీరభద్రరావుపంతులుగారి కృపివలన తెలియవచ్చినది.

వంచింపం బనిలేదు బ్రహ్మకిచటన్ వత్సంబులన్ బాలురన్
దాచించెం గనుఁ బ్రామి తన్ను మరలన్ వంచించుటాశ్చర్యమే
వంచింపన్ మనకేల తెచ్చుటకునై వల్దంచు బ్రహ్మాండముల్
వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై.

చతురాననుని తిరిగి వంచింపసమర్థుఁడయ్యు యశోదా తనూజుఁ డూరకుండెను. ఇది భాగవతకథ. ఈ భావమును చేకొని మంరిగంటి వేంకటనరసింహాచార్యుఁ డొక చమత్కారకల్పన చేసెను. బ్రహ్మకు గుణపాఠము నేర్పదలచి శ్రీకృష్ణుఁడు చతురాస్యనిరూపముదాల్చి సరస్వతికడనుండెనట. ఈ లోపల బ్రహ్మదేవుఁడు సత్యలోకమునకు పోగా నచ్చట కపటవేషధారియైన మరియొక బ్రహ్మ తన స్థానమునాక్రమించి యుండెను. ఇట్లు సత్యబ్రహ్మయు మాయబ్రహ్మయు సిద్ధరేర్పడి సరస్వతి మొదలగువా రాశ్చర్యమగ్నులయిరి. కళాపూర్ణోదయములోని సత్యరంభ, మాయరంభ, సత్యనలకూబరుఁడు మాయనలకూబరుఁడు వలె శ్రీకృష్ణశతానందీయమున నిద్దరు బ్రహ్మలు తారసిల్లిరి. అంత వారొండొరుల నధిక్షేపించుకొనుచు, తిట్టుకొనుచు వాదులాడుదురు. ఈ సన్నివేశము కడుహాస్యజనకముగ నుండును. ఇట్టి చమత్కారకల్పనకు పింగళిసూరనార్యుఁడు మరింగంటికవికి దారిచూపె ననుట విదితము.

ఈ కవిరచించిన 'చిలువపడిగె రేనిపేరణము' అచ్చతెనుగు కావ్యము. చిలువపడగఱేఁడు నాగకేతనుఁడైన దుర్యోధనుఁడు. ఈతని వివాహకథనము దీని విషయము.

మరింగంటివారిలో మరియొక సమర్థుడైనకవి వెలసెను. ఈతడు * 'తాలాంకనందినీ పరిణయము' వ్రాసిన నరసింహాచార్యులు. ఈ కావ్యము క్రీ. శ. ౧౭౭౦ ప్రాంతమున ముగింపబడెను. తాలాంకనందిని యనగా బలరామునికూతురు శశిరేఖ. పాండవులు వనవాసగతులైనప్పుడు సుభద్రయు అభిమన్యుడును ద్వారకలో నుండిరి. అభిమన్యునకును శశిరేఖకును అన్యోన్యప్రీతి యేర్పడెను. అన్నకుమార్తెను తన కొడుకునకు చేసుకొనవలెనని సుభద్ర యభిలషించుచుండెను. ఇట్టి సంబంధము ఆంధ్రకుటుంబీకులకు మిక్కిలి పరిచితమును, ప్రీతిదాయకమును గదా! బలరాముడు మొదట మేనల్లునకు కన్య నిచ్చుట కొడంబడెను. ఇంతలో కలహప్రియు డగు నారదమహాముని యడ్డుపడి పాండవులైశ్వర్యవిహీను లనియు దుర్యోధనుని సంబంధము కోరదగినదనియు నచ్చచెప్పి బలరాముని మనస్సు త్రిప్పెను. శశిరేఖను లక్ష్మణకుమారున కిచ్చి పెండ్లి చేయుటకు సర్వసన్నాహములును జరుగుచుండెను. అభిమానవతియైన సుభద్ర సోదరునితో నిష్ఠురములాడి పుట్టిల్లు విడిచి కుమారుని వెంటబెట్టుకొని పాండవు లున్న యడవికి బయలుదేరెను. ఆంధ్ర గృహస్థుల యిండ్లలో జరుగుచున్న వేశములను మనసునందుంచుకొని యీ భాగమును కవి మిక్కిలిహృదయంగమముగ

* ఈ యముద్రితగ్రంథమును గురించి శ్రీ ఆదిరాజువీరభద్రరావు పంతులుగారు "తెలంగాణపత్రిక"లో రెండు వ్యాసములు రచించి యున్నారు వీనిని చూడదగును. సంపు ౨ సంచికలు ౨౨, ౫౦.

వ్రాసెను. ఘటోత్కచున కీ ప్రణయభంగవృత్తాంతము తెలిసి యాతడు తన మాయాశక్తిచే శశిరేఖ నెత్తుకొనివచ్చి యభిమన్యునకు పెండ్లిచేయించును. ఈ కవి గడుసరిరచన చేయగలవాడు. సుభద్ర పలుకులను గనుడు:—

మాకుగల లేమి చూడకు
మా కురుపతి సంపదలకు నచ్చెరువడ కీ
చీకటి వెన్నెల కాదా
లోకుల సంపదలు క్షణములో చెడు పోవా.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## పదునొకండవ ప్రకరణము.

## పదునేడు పదునెనిమిదవ శతాబ్దులలోని

## కొందరు ప్రసిద్ధాంధ్ర కవులు.

### దామెర్ల వేంగళనాయకుడు.

ఈతనిని దామెర్ల వేంకటపతి యని వీరేశలింగం పంతులుగారు పేర్కొనిరి. ఈ కవి కృష్ణచరిత్రను, బహుళాశ్వ చరిత్రను రచించెను. వేంగళనాయకుడు వెలమ లనబడు పద్మనాయక కులములో జన్మించెను. కాకతీయుల కాలమునుండియు రెడ్లును, వెలమలును శౌర్యపరాక్రమశాలు రని కీర్తి వహించి యుండిరి. ఆంధ్ర దేశపు ఖడ్గహస్త మనదగినవారీ వీరకులముల వారు. రణాంగణమునందే కాక సాహిత్యాంగణమునందుకూడ రెడ్డివారును వెలమవారును అధినేతలై భాషాపోషకులుగను, స్వయముగ కవులై కృతికర్తలుగను పేరుపడసియుండుట తరుచు చెప్పబడినదే యున్నది. దామెర్ల వేంగళనాయకుని తండ్రి వేంకటాధీశుడు. ఈ వంశమువారు కాళహస్తిని పరిపాలించిరని పీఠికా రచయితలు పేర్కొనిరి. వేంకటగిరిప్రభువైన కస్తూరియాచమ నాయకుడు మన కవికి మేనత్త కొడుకు,

యాచమనాయకుడును అతనితండ్రి కస్తూరిరంగనాయకుడును శూరులై విజయనగరచక్రవర్తులకు నమ్మికైన సేనానులుగను సామంతులుగను ఉండిరి. క్రీ. శ. ౧౫౮౬–౧౬౧౪ ల నడుమ విజయనగరసింహాసనముపై నున్న వేంకటపతి రాయల మరణానంతరము సామ్రాజ్యములో విప్లవము లేవదీయబడెను. వేంకటపతిరాయల యన్నకొడుకు శ్రీరంగరాయలు రాజ్యమునకు వారసుడుగా నియమింపబడెను. కాని వేంకటపతి రాయలబావమరది జగ్గరాజును, మధురనాయకుడును పోర్చుగీసు వారును కలిసి తిరుగుబాటును గావించిరి. శ్రీరంగరాయలు పుత్రమిత్రులతో చంపబడెను. అతనిసుతులలో రామరాయడను బాలుడొక్కడే సంఘాతమరణమునుండి యాచమనాయకునిచే తప్పింపబడి కాపాడబడెను. తంజావూరు రఘునాథరాయలుకూడ ధర్మవారసుని పక్షము వహించి నిలచెను. ఇట్లేర్పడిన రెండు పక్షములకును తోపూరువద్ద ఘోరయుద్ధము జరిగి జగ్గరాజు మొదలగువారు పూర్తిగా నోడిరి. యాచమనాయని ఈ పౌరుష కార్యములను దామెర్ల వెంగళనాయకుడు ప్రశంసించియున్నాడు. తోపూరుయుద్ధము క్రి. శ. ౧౬౧౮ ప్రాంతమున నడచెను. కావున వెంగళనాయకుడు పదునేడవశతాబ్ది ప్రథమపాదమున నుండెనని చెప్పనగుచున్నది.

కృత్యారంభమునం దీ కవి, సుకవిస్తుతి కుకవినిందలను ఘటించియున్నాడు. ఈ కవి కొంత ఆత్మప్రశంస చేసుకొనెను. కాళిదాసాదులుతప్ప తనతో నితరులు రసవత్కవిత్వమున

ఘటింపలేరని వేంకటపతి వ్రాసుకొనెను. ఈతడు కడుసమర్థుడను టలో సందియములేదు, సంస్కృతాంధ్రములందు తనకు గల గాఢపాండిత్యము నీ కవి తరచు ప్రదర్శించినాడు. కావున ఈత నికావ్యము సామాన్యపాఠకుల కందుబాటులో లేదు. శ్లేష ఘ టనయం దీతనికి ప్రీతి యపారము. యమకాది శబ్దాలంకారము లమీద యమితమైన మమకారము. కథానిర్మాణమునం దీత డెట్టిప్రావీణ్యమును చూపలేదు. బహులాశ్వచరిత్రలో కథ యత్యల్పము. బహులాశ్వుడు విష్ణుభక్తుడు. ఆతనిభక్తిప్రపత్తు లను విని శ్రీకృష్ణు డాతనియింట విందారగింప బోవును. ఈ స్వల్పాంశమును పురస్కరించుకొని వేంకటపతి యైదాశ్వాసముల ప్రబంధమును నిర్మించెను. ప్రబంధములో నుండవలసిన వివిధవ ర్ణనముల నీతడు చక్కగా గూర్చెను. శ్రీకృష్ణుడు బహులాశ్వు నివాసమైన మిథిలకు పోవగా, ద్వారవతియందు గోపికలు విరహ పీడితలైరని వర్ణించి శృంగారవర్ణనముల కవకాశము కల్పించు కొనెను. బహులాశ్వుడు చేసినవిందును వర్ణించుచు ఆంధ్రరాజ కుటుంబములలోని భోజనమర్యాదల నన్నిటిని ఈ కవి ముచ్చట గూర్చునట్లు వర్ణించెను. కథాసంవిధానమును కల్పించుటయందు కొరవడిన ప్రజ్ఞ నీతడు వస్తుపరిశీలనమునందును వర్ణనములం దును చూపెట్టెను. వెంగళనాయకుడు రామభక్తుడు. తనగ్రంథ మును శ్రీరామభద్రుని ప్రేరణమున వ్రాసిన ట్లీతడు కావ్యారం భమున కల్పించియున్నాడు. ఈ కావ్యములో శ్రీరామచరిత్రకు ప్రసక్తి కల్పించుకొని తన రామభక్తిని వెలయించెను. బహు లాశ్వచరిత్రపంచమాశ్వాసమునందు కళానిధి యను వైశ్యకు

మారుని చరిత్రమును కవి చిత్రించెను. వేశ్యాసంగతిచే గలుగు ననర్థములను మనసుకెక్కునట్లీకథయం దుల్లేఖించియున్నాడు. కళానిధి తండ్రి రత్నాకరవైశ్యుని పిశునత్వమును, వర్తకులు చేయు మోసములను ఈ కవి పరిశీలనదృష్టితో తిలకించి వ్రాసెను. కళానిధివలచిన మణిమంజరి యను వారయువతి నృత్యప్రావీణ్యతను వర్ణించుచు తనకుగల నాట్యకళాపరిచయమును చక్కగా ప్రదర్శించెను. దామెర్ల వెంగళనాయకుడు లోకవృత్తపరిశీలనమునందును, కథ యను పునాది లేకుండగనే భావసౌధము నిర్మించుటయందును నిపుణుడు.

నవరము చిననారాయణనాయకుడు.

ఈ కవి కువలయాశ్వచరిత్రమును వ్రాసెను. దీని నాతడు తనపెంపుడుతండ్రియైన నారాయణరాజున కంకితమిచ్చెను. తన పూర్వులు సూర్యవంశక్షత్రియులైనట్లు చిననారాయణనాయకుడు గ్రంథపీఠికలో వర్ణించుకొనెను. ఈతని దత్తజనకుడు విజయనగరాధీశ్వరుడైన వీరవెంకటరాయభూపాలుని కరుణచే నిల నేలెనని చెప్పబడినది. ఈ కవి కాలమును గురించి వీరేశలింగముపంతులుగారు చర్చించుచు వీరవెంకటపతిరాయలు క్రీ.శ. ౧౫౮౦ ప్రాంతమున పరిపాలన చేసినవాడు గావున నవరము చిననారాయణనాయకుడు ౧౬వ శతాబ్ది చివరనుండుట నిశ్చయమని తెలిపిరి. వీరవెంకటరాయనితండ్రి శ్రీరంగరాజని కువలయాశ్వచరిత్ర పేర్కొనుచున్నది. ౧౫౮౦ ప్రాంతమున విజయనగరము నేలిన వెంకటపతిరాయలు, అళియరామరాజు

తమ్ముడు తిరుమలరాయలకుమారుడు. కావున కువలయాశ్వచరిత్ర పేర్కొన్న వీరవేంకటరాయ లీతడు కాడనియు, క్రీ.శ. ౧౬౩౦-౧౬౪౨ల నడుమ విజయనగరాధీశ్వరుడుగ నున్న * ముమ్మడి వేంకటపతిరాయ లనియు డాక్టరు నే. వేంకటరమణయ్యగా రూహించుచున్నారు. ఈ యూహయే సరియైనదని తోచుచున్నది. కువలయాశ్వచరిత్రకవి ౧౬౪౦-౫౦ల నడుమ జీవించి యుండును.

కువలయాశ్వచరిత్రము పింగళిసూరన కళాపూర్ణోదయముతరువాత ప్రశంసింపదగిన చక్కని కథాకావ్యము. చిననారాయణనాయకుడు మధురభావనలును, కల్పనలును కూర్పగల నిపుణకవి. ఈత డుత్తమ కవిత్వలక్షణముల నీరీతిని కావ్యారంభమున నుగ్గడించి ఆ యాదర్శము మేరకు రచించినవాడు.

'ఒకచో శబ్దసిగుంభనంబు లొకచోయుక్తిక్రియాగౌరవం
బొకచో సద్భుతజాతివార్త లొకచోనుజ్జృంభితత్తద్రస
ప్రకరంబుం గనిపించినన్మదికి సంభావింప నర్హంబుగా
కకటా యేమియులేని కబ్బ మది యాహ్లాదంబు గావించునే.'

మరియు నాశ్వాసాంతగద్యలలో "సంతతభారత భాగవతాది శ్రవణానంద" "జాతివార్తాకవిజనామోదసంధాయక" యని

* చూడు భారతి సంపుటము ౨౩ సంచి ౨. ౧౭వ శతాబ్ది నాటి ఆంధ్రవాఙ్మయవిశేషాలు.

తనకు విశేషణముల వైచికొనెను. వస్తుస్వభావవర్ణనమునందును అద్భుతకల్పనలు సన్నివేశములు గూర్చుటయందును చిననారాయణకవి తన నేర్పును విస్తారముగ చూపెను. ఈతని వస్తుపరిశీలనయు, సమకాలికజీవితపరిచయమును మిక్కిలి సంతోషము నాపాదించును.

కువలయాశ్వచరిత్రకథకు మూలము మార్కండేయపురాణము. చిననారాయణనాయకు డీకథలో కొన్ని మార్పులు చేసి ఇట్లు కల్పించెను. ఋతుధ్వజుడను రాజు అయోధ్యను పాలించుచుండెను. గాలవుడను మహర్షి యొకనాడొక సుందరాశ్వమును వెంటబెట్టుకొని ఋతుధ్వజునికడకు వచ్చి పాతాలకేతుడను రాక్షసునివలన తనయాశ్రమమునకు తపోవిఘ్నము కలుగుచున్నదనియు, వానిని సంహరింపవలెననియు రాజునుకోరెను. భూమినంతను చుట్టిరాగల జవబలముగలదియు కువలయాశ్వమను పేరుగలదియు నగు తన వెంటతెచ్చిన గుఱ్ఱమును రాజునకిచ్చి శత్రుసంహారమునకు పూనుమని చెప్పెను. ఋతుధ్వజుడు పాతాళకేతువుపై దండు వెడలెను. ఈ సందర్భమున కవి తన కాలమునందలి యుద్ధసన్నాహములను, స్కంధావారమునందలి సైనికజీవితమును ముచ్చటగా వర్ణించెను. కృష్ణదేవరాయలకువలె ఈ కవికిని వాస్తవికవర్ణనము చేయు శక్తియు, ప్రీతియు హెచ్చు. పాతాళకేతువు ఋతధ్వజునితో మైదానమునందు యుద్ధముచేసి యోడి దుర్గములోనికి పారిపోయెను. ఇచ్చట కోటముట్టడి యుద్ధపుమెలకువలను కవి చిత్రించెను. పాతాలకే

తువు నిహతుడయ్యెను. వానిని బందిఖానాలో చెరపెట్టబడియున్న మదాలసను ఋతుధ్వజుడు చూచి యామెను ప్రేమించెను. చెలికత్తెయగు కుండల మదాలసచరిత్రను సవిస్తరముగా చెప్పెను. మదాలస గంధర్వరాజుకూతురు. ఆమె భూలోక మండలి విశేషములను జూడవచ్చి యొకవనమునందు ఋతుధ్వజు నిగాంచి ప్రేమించెను. రాజామెను చూడలేదు. శృంగారకావ్య ములం దుండవలసిన విరహావర్ణనమును కవి మురిపెము గూర్చు కల్పనలతో వ్రాసెను. చిననారాయణనాయకుడు శృంగారము వెల్లివిరియదగు స్థలములందుకూడ ఔచిత్యమును ప్రశంసనీయ ముగా రక్షించెను. వివాహావిధులు శాస్త్రోక్తరీతిని సలుపక ఋతుధ్వజుడు మదాలసను కామింపరాదని కుండలచేత చెప్పిం చుట హర్షింపదగినది.

మదాలసను కుండలనుగొని ఋతుధ్వజుడుతననగరముచేరి వివాహాయత్నములో నుండెను. ఇంతలో పాతాళకేతునితమ్ముడు తాళకేతు డను వాడు తనయన్న చావుకు వగచి ఋతుధ్వజునిపై కసి తీర్చుకొనదలచెను. వాడొకమాయ మునియైవచ్చి తన తపో వనమును కాపాడు మని రాజును వేడగా నార్తరక్షణపరుడైన యాతడు తిరిగి గుఱ్ఱము నెక్కి వానివెంట బోయెను. ఋతుధ్వజు నొకసరోవరతీరమున విడిచి యాతని హారమును బుచ్చుకొని మాయచే నంతఃపురమును ప్రవేశించి కుండలను, మదాలసను అపహరించి గొనిపోయి చెరబెట్టెను. ఋతుధ్వజుడు వంచితుడై పురమునకు వచ్చి మదాలసను గోల్పోయి దుఃఖముగ్నుడయ్యెను.

ఆతని నేస్తకాండ్రు, నాగకుమారులు తమ తండ్రియైన అశ్వతరుని సమీపించి ఋతుధ్వజునకి సాయపడగోరిరి. అశ్వతరుడు పార్వతీశంకరులను సందర్శింపగా కైలాసముమీద సంగీతప్రశంస వచ్చెను. అశ్వతరుడు తన గానకళాప్రావీణ్యము నద్భుతముగా చూపి అంబికను మెప్పించెను. కళాపూర్ణోదయములో కూడ తుంబురునారదుల గానమాత్సర్యకథ రసవత్తరముగా నుండును. అశ్వతరునకు గౌరి వరమీయబోవగా సవతిపై ఈర్ష్యచే గంగ యడ్డువచ్చెను. శంకరుడడ్డుపడి మదాలస యశ్వతరునికడకు ముందుచేరు ననియు మరికొన్నిదినములకు కుండల లభించు ననియు వరమిచ్చెను. ఈశ్వరుని ప్రసాదముచే మదాలస యశ్వతరుని చేరియుండెను. నాగకుమారులు ఋతుధ్వజుని తోడుకొని వచ్చిరి. తన ప్రియకాంత జీవించె నను నాశ యాతనికి లేకుండెను.

తాళకేతువుకు తుదముట్టించుటయు, కుండలను దెచ్చుటయు మాత్రమవశిష్టముగా నుండెను.

ఈ కార్యములు సాధించుటకై కాబోలు తారాజయంతుల కథను కవి ప్రవేశపెట్టెను. కువలయాశ్వచరిత్రమందలి వృత్తాంతములలో నిదియొక్కటే అంత ఉదాత్తముగ లేనిది. తార దేవలోకమందలి వేశ్య. ఈమె మొదట జయంతుని ప్రేమించి తరువాత నలకూబరుని మోహములకు చిక్కెను. నలకూబరునికథలో కోడిపందెములను కవి చమత్కారముగా వర్ణించెను. ఎచ్చట

పట్టినను ఈ కవి వస్తుపరిశీలనము, భావనాశక్తి, సరసమైన సంస్కృతాంధ్రశైలి చవిగొల్పుచునే యుండును. పింగళిసూరన వలె ఈ కవియు సంభాషణముఖమున కథను నడిపించుటలో తన ప్రజ్ఞాకౌశల్యములను బాగుగా ప్రదర్శించెను. తారమూలమున జయంతనలకూబరులకు ద్వంద్వయుద్ధము పొసగెను. ఒక్కొక్క సన్నివేశమును బిగువుగ నడిపించి రసస్థాయికి తెచ్చి, మంచు విరిసినట్లు మెల్లగా దానిని విడదీయుటలో నవరముకవి నేర్పరి. జయంతనలకూబరుల ద్వంద్వయుద్ధవార్త మెల్లమెల్లగా పౌర వనితాలోకము గుసగుసలుపోయి బహిరంగమగుట ముచ్చటగా నుండును. బృహస్పతిశాపము వలనను బ్రహ్మ యాదేశమునను తాలకేతువు జయంతనలకూబరులచే సంహరింపబడెను. కుండల తిరిగివచ్చి మదాలసను కలిసికొనెను. మదాలసను ఋతుధ్వజుడు పరిణయమాడెను.

మదాలస మరణించినట్లును అశ్వతరు డామెవంటి స్త్రీని సృజియించి ఋతుధ్వజున కిచ్చినట్లును మార్కండేయపురాణములో నున్నకథ నీ కవి మార్చివ్రాసెను. కువలయాశ్వ చరిత్రమునందు కళాపూర్ణోదయపు నడక లెన్నియోగలవు. కథాసంవిధానమును కూర్చుటయందును, ఒకకథతో మరియొక కథను కొలికిపూసవలె నతుకుటయందును, చిననారాయణనాయ కుడు పింగళిసూరనకు సాటి రాగలడు. ఈతని కావ్యకథ కళా పూర్ణోదయకథయంతటి విస్తృతమైనదియు అల్లికచిక్కులు గల దియు కాదు. పాత్రలసంభాషణములు మంచినీళ్ళప్రాయముగా

జలజలప్రవహించు సెలయేళ్ళవలె పరుగెత్తును. పింగళిసూరన తరువాత నింతమధురకవి మరి యొకడు లేడు.

కూచిమంచి తిమ్మకవి.

పదునెనిమిదవశతాబ్ది మొదటి యర్ధభాగమునందు జీవించిన యీ కవిశేఖరుడు అనర్గళకవితాధార కలవాడై బహు గ్రంథములు రచించెను. రుక్మిణీపరిణయము రాజశేఖరవిలాసము సింహాచలమాహాత్మ్యము, నీలాసుందరీపరిణయము, అచ్చ తెనుగు రామాయణము, సారంగధరచరిత్రము, సాగరసంగమాహాత్మ్యము, సకలలక్షణసారసంగ్రహము, రసికజనమనోభిరామము, సర్పపురమహాత్మ్యము, శివలీలావిలాసము ఇవి కూచిమంచి తిమ్మకవికృత గ్రంథములు. ఈ కవి నియోగి బ్రాహ్మణుడు. గోదావరిమండలమునందలి పిఠాపురసంస్థానములోని కందరాడ గ్రామ మీతని నివాసస్థలము. ఈ గ్రామమున కీతడు కరణమని చెప్పుచున్నారు. కందరాడగ్రామము ఆకాలమున సైన్యములు రాకపోకలుచేయుమార్గమున నుండి యలజడి కలుగుచుండుటచే తిమ్మకవి దీనినివిడచి తత్సమీపమునందున్న చంద్రమపాలెము గ్రామములో నివాసమేర్పరచుకొనెను. ఈకవి మిక్కిలి బంధుప్రీతి గలవాడుగా కన్పించును. తనగ్రంథములన్నిటిలోను తన వంశబంధువులను పేర్కొనుచు వచ్చినాడు. చంద్రరేఖావిలాపము, సోమదేవరాజీయము లోనగు కావ్యములు రచించి ప్రసిద్ధివడసిన కూచిమంచిజగ్గకవి ఈతని తమ్ముడు. కూచిమంచితిమ్మకవి శివభక్తిమండితుడు. ఈతనిగురువు దెందులూరిలింగనారాధ్యుడు.

సర్పపురమాహాత్మ్యము నొక్కటి విడిచి తక్కిన గ్రంథములన్నిటిని ఈతడు పీఠికాపురమందు వెలసిన కుక్కుటేశ్వరస్వామికి కృతి సమర్పించెను. సర్పపురమాహాత్మ్యమును మాత్రము సర్పవరమందలి భావనారాయణస్వామి కంకిత మొనర్చెను. బహుకావ్యనిర్మాతయయ్యును తిమ్మకవి ధనలాభము నర్థించి తన కృతులను ప్రభువులకు కృతి నిడలేదు. నరస్తుతి తన కిష్టములేకుండుట సింహాచలమాహాత్మ్యములో కవి యిట్లు ప్రకటించెను.

నృపులకుఁ గావ్యం బొసగిన
నపవర్గం బిడఁగఁ గలరొ యటు గాకున్నన్
ద్విపతురగభూషణాంబర
తపనీయాదికము చేతఁ దనుపం గలరో.

అట్లయ్యును ఈ కాలమున పీఠికాపురము నేలినరావు మాధవనృపాలు డీతనికి కవిసార్వభౌమ బిరుద మిచ్చినట్లు రసికజనమనోభిరామములో కవి పేర్కొనెను. రుక్మిణీపరిణయము నందు పీఠికాపురమును తిమ్మకవి యభిమానముతో వర్ణించెను.

ఈ కవి మొదటిగ్రంథమగు రుక్మిణీపరిణయము శా. శ. ౧౬౩౭ అనగా క్రీ. శ. ౧౭౧౫వ సంవత్సరమునందు వ్రాయబడినది. ఈతని కడపటిగ్రంథమగు శివలీలావిలాసము క్రీ శ. ౧౭౫౬వ సంవత్సరమున సమాప్తమైనది. ఇట్లీతని సారస్వతజీవితము నలుబదిసంవత్సరములు నడచినది. రాజశేఖరవిలాసమునకే భల్లాణరాజచరిత్రమని పేరు. భల్లాణరాజు శివభక్తితత్పరుడు. జంగము

లేది యడిగినను ధనమైనను, రాజ్యమైనను, తుదకు భార్యనైనను వారికి సమర్పింతు నని యాతడు గురువుమ్రోల శపథము బూనెను. ఈశ్వరు డాతని దృఢదీక్షను పరీక్షింపదలచి మాయ జంగమువేషముతో భళ్ళాణరాజు నగరమునకు వచ్చెను. ఆత డనేకమంది మిండజంగములను సృష్టించి యూరియందలి వార కాంతలతో వారు విహరించున ట్లేర్పరచి తాను రాజును సంద ర్శించి తన కొక భోగకాంతను సమకూర్చుమని కోరెను. ఈ కోరిక యనుచితమని రాజు వారించినను జంగమయ్య వినక "కామిగానివాడు నిర్వాణకామిగాడ"ని కుతర్కముగా వాదించి మొండిపట్టు పట్టెను. ఈశ్వరవిలాసముచే నగరమునం దెచ్చటను వెలయాలు దొరకక పోవుటచే భళ్ళాణరాజు తన పట్టపురాణి యైన చల్లమాంబను జంగముని యభీష్టము తీర్ప నియోగించెను. శివు డాతని వ్రతనిశ్చయమున కై మెచ్చి చల్లమాంబచేతిలో శిశువుగా మారి యా భక్తదంపతుల ననుగ్రహించెను.

నీలాసుందరీపరిణయము, అచ్చ తెనుగు రామాయణము రెండును శుద్ధాంధ్రకృతులు. నీలాసుందరీపరిణయమును నీలపెం డ్లికథ యని కవి ముద్దుగా పేరిడెను. ఇది పలుకుసొంపులోను భావనైర్మల్యములోను, ముద్దులుమూటగట్టు చిన్న కావ్యము. ఇందలి యచ్చ తెలుగుపదములకూర్పు సుప్రసన్నమై సులభ ముగా నర్థప్రతీతిని గల్గించుచున్నది. ఇది లచ్చిమగనికత యని తిమ్మకవి వ్రాసెను. ఈ కవి శివభక్తుడైనను విష్ణునామము నుచ్చరింపని కేవలశైవుడు కాక యద్వైతిగా గన్పించుచున్నా

డు. మిథిలానగరమును ధర్మ్మడను రాజు పాలించుచుండెను. ఆతని రాజ్యములో కుంభకుడను గొల్లదొర కలడు. వాని పశుసంపద యెట్టిరైతుకైనను నోరూర చేయును. ఆతనికి సుందరియైన నీల యను కన్యకామణి జనించెను. శ్రీకృష్ణునితండ్రి నందుడు కుంభకునికి బావ యగును. ఒక బ్రాహ్మణునిప్రేరణచే కుంభకుడు తన చిన్నకుమార్తెను శ్రీకృష్ణునికిచ్చి పెండ్లిచేయ నమ్మతించెను. నీలాకృష్ణులు ఒండొరుల గుణసంపదను విని ప్రేమబద్ధులైరి ఇట్లుండ కుంభకునిగోష్ఠములో కొన్ని మదించినవృషభములు చెలరేగి గ్రామస్థులను మిక్కిలి బాధింప దొడగెను. వానిని బట్టింపుమని రాజు కుంభకుని శాసించెను. గొల్లలెవ్వరును ఆమదపుటెద్దులను బట్టలేకపోయిరి. దుష్టబలీవర్ధములను పట్టిన సాహసికునకు నీలనిచ్చి పెండ్లిచేతునని తండ్రి ప్రకటించెను. నీలకిది మనస్సంకట మయ్యెను. ఎట్టి మొరకు గొల్లచేతిలో తాను పడునో యని యామె విచారపడుచుండెను. ఈ కావ్యమునందలి విరహవర్ణనము తగిన హేతువు గలదగుటచే కడు సహజముగను, హృదయంగమముగను ఉన్నది. తుదకు శ్రీకృష్ణుడు మదవృషభములను సంహరించి నీలకన్యను పెండ్లియాడెను.

రసికజనమనోభిరామము శృంగారప్రధానమైన వర్ణనలు గల కావ్యము. స్త్రీసౌందర్యవర్ణన మెన్నిచమత్కారరీతులలో చేయదగునో అన్నిరీతులలో కవి రచించెను. అట్లయ్యును తిమ్మకవిసార్వభౌముడు నారీవర్ణనములలో అనౌచిత్యమునకు దిగలేదు. దక్షిణాంధ్రకవులవలె నిర్లజ్జాశృంగారము నీతడు చిత్రింపలేదు.

ఋతుధ్వజుడను రాజు సుశ్యామ యను గంధర్వకన్యను వనములో గాంచి మోహించి పెండ్లియాడుటయు, వారి కొకకుమార్తె పుట్టుటయు,నామె గౌతమఋషికి పరిణయమాడుటయు నిందలి కథాంశములు. భావములందును కథాసంవిధానమునందును నూతనత్వము గాన్పింపదు, బ్రహ్మపురాణము గత గోదావరీ ఖండమునందలి వృద్ధస్రవంతీసరిత్పతీసంగమమాహాత్మ్యకథ ఈ కావ్యమునకు మూలమని తిమ్మకవి గ్రంథాంతమున నుడివెను.

కూచిమంచి తిమ్మకవిసార్వభౌముడు అనంతరప్రబంధ యుగకవియైనను భావములందును శైలీగుణములందును ప్రాచీన కవులకు చేరికయైనవాడు. తన పాండిత్యప్రకర్షను చూపుటకు యచ్చటచ్చట శ్లేషపద్యములను గర్భకవిత్వమును యమకానుప్రాసచిత్రరచనమును చేసినవాడైనను మొత్తముమీద ఈతని కావ్యము లన్నియు ద్రాక్షాపాకములోనే వ్రాయబడి యాహ్లాద మొసగుచున్నవి. ఈతని మరియొక ప్రశంసార్హమైన గుణము నీతికిని సభ్యరుచికిని వెలిగాని మృదువర్ణనములను చేయుట. రసిక జనమనోభిరామమున వెన్నెలక్రీడలను వర్ణించుపట్ల జారిణీస్త్రీల ప్రశంస తెచ్చియు వారు అభాగ్యభాజనులని యీ కవి పలుకుట యుక్తముగా నున్నది. బహుకావ్యనిర్మాణధురీణుడయ్యును గర్వాంధులగు రాజుల నాశ్రయింపక ఆత్మగౌరవమును పాటించుకొనుచు శివారాధనముగ కవిత చెప్పినతిమ్మకవిచంద్రుడు ప్రాచీన కవిపంథనే నడచినవాడై గణుతికెక్కెను.

## ఏనుగు లక్ష్మణకవి.

ఈతడు విద్వాంసుడైన సరసకవి. అనేకకృతులను చేసినవాడు. రామేశ్వరమాహాత్మ్యము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణము, నృసింహదండకము, రామవిలాసము, విశ్వామిత్రచరిత్రము ననునవి ఏనుగు లక్ష్మణకవి రచనలు. ఈ కవి నియోగిబ్రాహ్మణుడు, గోదావరీమండల నివాసి. లక్ష్మణకవియు నాతనిపూర్వులును పెద్దాపురసంస్థానకవు లయి రాజసన్మానములనందినవారు. ఏనుగులక్ష్మణకవి కూచిమంచితిమ్మకవికి సమీపకాలమునం దుండినవాడు. ఈతడు తిమ్మకవిసార్వభౌముని ప్రశంసించుచు చెప్పినశ్లోకషట్కము చదువుదురు. లక్ష్మణకవి తన రామవిలాసకావ్యమును వత్సవాయగోపరాజున కంకిత మొసగెను. ఈ గోపరాజు క్రీ. శ. ౧౭౫౯ నుండి ౧౭౮౭ వ సంవత్సరమువరకు పెద్దాపురసంస్థాన మేలిన వత్సవాయతిమ్మజగపతిరాజుగారి దగ్గరబంధువు. ఏనుగు లక్ష్మణకవి ఈ తిమ్మజగపతిరాజుగారి కాలమునందును వారితండ్రియైన రాయజగపతిరాజుగారికాలమునందును ప్రసిద్ధికెక్కిన కవిశేఖరుడు. ఈయన తాతయైన మరియొక ఏనుగులక్ష్మణకవి రాయజగపతిరాజుగారి ముత్తాతయైన సార్వభౌమతిమ్మరాజుగారి కాలమునందు వర్ధిల్లి యాయనకు కృతులు సమర్పించెను. ఇట్లు ఏనుగులక్ష్మణార్యుని వంశము కవి పండితుల కూటమని చెప్పవచ్చును. పెద్దాపురసంస్థానాధిపతులైన వత్సవాయవారుకూడ స్వయముగ విద్వాంసులును గవులును నయి బుధుల నాదరించి కీర్తి గడించిరి. ఈ

వత్సవాయవారు తమది గుడిమెట్టచాగిపోతరాజు వంశమని చెప్పుకొనిరి. చాగిపోతరాజు కాకతీయులకాలములో క్రీ. శ. ౧.౨౩౦ ప్రాంతమువరకు నుండినవాడు.

ఏనుగు లక్ష్మణకవి తన రామేశ్వరమాహాత్మ్యమును గురజానపల్లి మల్లేశ్వర దేవునికి కృతి సమర్పించెను. గురుజానపల్లి తుల్యానదిసాగరసంగమము చేయుచోట నున్నదని కవి పేర్కొనెను. భద్రిరాజుమల్లమంత్రియు, కాకినాడస్థలపతి (కరణము కావచ్చును.) యగు నండూరి కామమంత్రియు స్కాందపురాణగత సేతుఖండమందలి రామేశ్వరమాహాత్మ్యమును ప్రబంధముగా వ్రాసి మల్లేశ్వరునికి కైంకర్య మొనర్పుటకై ఏనుగులక్ష్మణకవిని ప్రోత్సహించిరి. లక్ష్మణకవి శైలి ద్రాక్షాపాకము. అన్వయకాఠిన్యము ప్రౌఢదీర్ఘసమాసప్రాచుర్యము అరుదుగ నుండును. ఈ కావ్యశైలియునిట్లే యున్నది. కాని దీని యందు కథాకల్పన మేమియు లేదు. శ్రీరామచంద్రుడు సేతువువద్ద రామనాథలింగమును స్థాపించు వృత్తాంతమును, ఆక్షేత్రమాహాత్మ్యమును స్తుతించును.

ఏనుగు లక్ష్మణకవి మధురకీర్తికి నాలంబనమైనది యాతని సుభాషితరత్నావళి. ఇది భర్తృహరిసంస్కృత సుభాషితమున కాంధ్రీకరణము. భర్తృహరి సుభాషితము సంస్కృతభాషయందలి అద్వితీయమైన నీతిబోధక గ్రంథము. ఇందు నీతిశతకము, శృంగారశతకము, వైరాగ్యశతకము

అను మూడుపద్ధతు లున్నవి. దీనిని ముగ్గురు ఆంధ్రమహాకవులు తెనుగుసేయుట దీని జనరంజకత్వమునకు తార్కాణము. ఎలకూచిబాలసరస్వతీ మహోపాధ్యాయుడును, ఏనుగులక్ష్మణకవియు, పుష్పగిరి తిమ్మనకవియు భర్తృహరిసుభాషితము నాంధ్రీకరించిరి. పుష్పగిరితిమ్మన రచించిన నీతిశతకముమాత్రమే లభించుచున్నది. వీరిలో ఏనుగులక్ష్మణార్యుని తెనుగుసేతయే లలితపదఘటితమై మూలానుసారియై హృదయంగమముగ నున్నదని వీరేశలింగ ముపంతులుగారు ప్రశంసించియున్నారు. పుష్పగిరి తిమ్మన రచనకూడ సరసముగను జాతీయముగను ఉన్నది. ఒక్కొక్కచో నీతడు మూలాతిశాయిగా రచించి తన కవిత్వవైభవమును చూపినాడు.

బాలసరస్వతి యాంధ్రీకరణము విద్వత్కవిత్వముగా నున్నది. బాలసరస్వతి 'దీనిని సురభిమల్లానీతివాచస్పతీ' యను మకుటముతో వ్రాసెను. ఇట్లు సంబోధింపబడిన సురభిమల్ల భూపాలుడు జటప్రోలుసంస్థానాధిపతి యని చెప్పుచున్నారు. ఇది యిట్లైనను కావచ్చును. జటప్రోలుసంస్థానేశ్వరులలో మల్ల భూపాలనామాంకితులు ముగ్గురు కానవచ్చుచున్నారు. బాల సరస్వతి క్రీ.శ.౧౬౦౦ ప్రాంతమున యాంధ్రశబ్దచింతామణి వ్రాయు చుండినవాడు. ఈ కాలమందుండిన మల్లభూపాలుడు చంద్రికా పరిణయ ప్రబంధమును వ్రాసిన సురభిమాధవరాయలవారి తండ్రి యైన ముమ్మడిమల్లావనీశుడు గావచ్చును. ఎలకూచి బాలసరస్వతి తానొక చంద్రికాపరిణయకావ్యమును వ్రాసెను. కాని ఈతని

చంద్రికాపరిణయకథ సురభిమాధవరాయలవారి ప్రబంధకథకన్న భిన్నముగా నున్నది. బాలసరస్వతి కావ్యమునందు కాశిరాజు కూతురైన చంద్రికను భీముడు వివాహమాడినకథ వర్ణింపబడినది.

ఏనుగులక్ష్మణకవి సుభాషితరత్నావళిని పెద్దాడసోమశంకరదేవున కంకితముగా రచించెను. ఈతడు తన పద్యములకు మకుటనియమము పెట్టుకొనక, సంస్కృతశ్లోకభావముల కనువగునట్లు చిన్నవియు పెద్దవియు నగు తెనుగుపద్యములలో వ్రాసెను. పుష్పగిరితిమ్మనకూడ శివాంకితముగనే తన నీతిశతకమును వెలయించెను. దీనిని చంపకమాలాపరంపరలో చెప్పితి నని యాతడు వచించెను. ఇందు నుత్పలమాలలుకూడ నున్నవి. ఇట్టి నియమముపెట్టుకొన్నవాడగుటచేత తిమ్మనార్యుడు మూలమందు చిన్నశ్లోకమున్నను చంపకమాల పద్యమునకు సరిపడునట్లు భావమునుపెంచి వ్రాయవలసినవా డయ్యెను. ఈ ముగ్గురి యాంధ్రీకరణరీతిని చూపుటకై మూలశ్లోకమునొక్కటియు, దానికి సరిపడు తెనుగు పద్యములును చూపబడుచున్నవి.

భర్తృహరినీతిశతకము. దైవపద్ధతి:—

విరమ విరమాయాసాదస్మాద్దురధ్యవసాయతో
విపదిమహతాం ధైర్యధ్వంసంయదీక్షితుమీహసే
అయిజడవిధే! కల్పాపాయేఽప్యపేత నిజక్రమాః
కులశిఖరిణః క్షుద్రానైతేనవాజలరాశయః

"అమలజ్ఞానుని వెఱ్ఱిదైవము వృథాయాసంబుచేఁ జిత్తదో
షము పొందించుట కాపద ల్సలిపిన న్నల్పంగనీ కల్పనా
శమనం దేని కలంగునా యతఁడు నిస్సారంబులౌ సప్తశై
లములు న్వారిధులుంబలెన్ సురభిమల్లా! నీతివాచస్పతీ!

ఎలకూచి బాలసరస్వతి.

దొసఁగులు వచ్చువేళ గుణధుర్యుల ధైర్యగుణంబు సర్వముం
బస చెడునట్లు చూచెదవు పాపపుదైవమ! యీ దురాగ్రహ
వ్యసనము మానుమాను ప్రళయంబున వీతనిజక్రమంబులై
పసిచెడవించుకంతయును సాగరముల్ కులపర్వతంబులున్.

ఏనుగు లక్ష్మణకవి.

చెడుపనులూని యే యలఁతఁ జెందెద వీ యడియాస మానుమో
జడవిధి! యాపదల్ పెనిచి సాధుల ధైర్య మడంపఁ బూనినన్
జెడ దది కల్పసంక్షయవిశీర్ణనిజక్రమపర్వతంబులో
యడఁపఁగ నింకఁ జేయఁగ న వార్యపయోధులో యామహాత్మకుల్

పుష్పగిరి తిమ్మనార్యుఁడు.

కంకంటి పాపరాజు.

ఈతఁడు విష్ణుమాయావిలాసనాటక మను యక్షగానమును రచించి ఉత్తరరామాయణమును నాంధ్రీకరించెను. కంకంటిపాపరాజు ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. అఖిలరాజాధిరాజాస్థానములం దార్వేలవారు కవులుగను స్వామికార్యఘటనాధురీణులుగను ప్రశస్తి వహించిరని యీతఁడు కావ్యారంభమున నుతించెను.

తాను గణితశాస్త్రమునందు ప్రవీణుడైనట్లు పాపరాజు శ్వాసాంతగద్యలలో వర్ణించుకొనెను. ఈతని నివాసస్థానము నెల్లూరుమండలము ఈ కవి పదునెనిమదవ శతాబ్దాంతమున నుండి కావ్యరచన చేసినట్లు వీరేశలింగంపంతులుగారు వ్రాసిరి. ఈ సమయముననే నెల్లూరుమండలము మోడేగుంటగ్రామమున పుష్పగిరి తిమ్మనార్యుడను కవిశేఖరు డుండెను. దశావతారచరిత్ర వ్రాసిన ధరణిదేవుల రామమంత్రియు వీరికిసమకాలికుడే. పుష్పగిరితిమ్మకవి తనకు సహాధ్యాయుడని కంకంటిపాపరాజు గ్రంథారంభమున పేర్కొనుచు, అర్జునునకు శ్రీకృష్ణుడు తోడైనట్లాతడు తనకు సహాయముగా కృతి రచింపబూనితి నని తెలిపెను. * పుష్పగిరి తిమ్మన, కంకంటిపాపరాజు, ధరణిదేవుల రామమంత్రిగారలు ముగ్గురును పదునేడవ శతాబ్దికి చెందినవారని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగా రభిప్రాయపడుచున్నారు. ఉత్తరరామాయణమును కంకంటిపాపరాజు స్వయముగా వ్రాయలేదనియు, ఈతని మిత్రుడగు పుష్పగిరి తిమ్మకవి రచించి, పాపరాజువద్ద తానంతకుముందు గైకొన్న ఋణము తీర్చుకొనుటకై యుత్తర రామాయణము నాతనిపేర వెలయించెననియు వాడుకగలదు. తిమ్మకవికృత సమీరకుమారవిజయములోని పద్యముల వంటివి కొన్ని యుత్తరరామాయణమునం దున్నను ఈ కావ్యముల శైలియు రచనారీతులును భిన్నముగా నున్నవి. కావున ఉత్తర

---

* వ్యాసము ౧౪వశతాబ్దినాటి ఆంధ్రవాఙ్మయవిశేషాలు. భారతి సంపు ౨౩ సంచి ౨. ఈ యూహను సమర్థించు సాధనములను వీరిచ్చట వివరింపలేదు. మరెచ్చటనైన విశదీకరించిరేమో.

రామాయణము కంకంటిపాపరాజకృతమనియే తలంపవలెను.

పాపరాజు ప్రబంధనిర్మాణకుతూహలియై యుండి, తండ్రి తనకుమార్తెకు వరు నన్వేషించునట్లు, తన కృతికన్యకు భర్తగా దగినవా డెవ్వడని యోజించుచుండెనట. అంతట నీతని యిష్టదైవతమగు మదనగోపాలస్వామి కవికి స్వప్నమున సాక్షాత్కరించి యాతని ప్రబంధము తన కంకితమిమ్మని యాదేశించెను. కవి యిదివరలో రచించిన విష్ణుమాయావిలాస యక్షగానముకూడ మదనగోపాలస్వామికే కృతి సమర్పించెను. ఉత్తరరామాయణ కథను తిక్కనసోమయాజి మున్నె విరచించియుండగా తాను తిరుగ నావృత్తాంతమునే వ్రాయనేలయని ప్రశ్నించుకొనుచు, శ్రీరామచంద్రునిపుణ్య చరిత్ర మెవ్వరెన్ని విధముల ప్రబంధీకరించినను సరసముగనే యుండునని పాపరాజు వినతిచేసెను. మరియు నాతడిట్లు తనప్రయత్నమును సమర్థించుకొనెను.

'మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుడు చారు కవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించెనేనియుజ్ఞా
వాని వివేక మేమిటికి వానికవిత్వమహత్వమేటికిన్.

తిక్కనామాత్యుడు నిర్వచనోత్తరరామాయణమును సంగ్రహముగ వ్రాసెను. పాపరాజు ప్రబంధమును సువిస్తరముగను వివిధ వర్ణనావిభాసితముగను సర్వాంగసుందరముగను రచించి తరించెను. ఈతని కవిత్వమునందు కొన్ని లక్షణదోషములున్న నివయు

రేఫఱకారములకు ప్రాసమైత్రి పాటించెననియు చెప్పుదురు. అయి నను ఈతని యమృతభారాప్రవాహమువంటి కవిత్వలహరిలో నివి యంతగా పాటింపవలసినవి కావు.

ఉత్తరరామాయణము రావణకుంభకర్ణాదుల పూర్వ వృత్తాంతములును, శ్రీరామచంద్రుని పట్టాభిషేకానంతరజీవిత వృత్తాంతమును వర్ణించుచున్నది. ఇట్లిది శ్రీమద్రామాయణము లో లేని విశేషాంశములను పూరించుటకై వెడలినది. వాల్మీకి రామాయణములో కేవలక్రూరులుగను రాక్షసులుగను కన్పించు రావణాదు లుత్తరరామాయణమునందు సహజమనుష్యచరిత్రల తో ప్రత్యక్ష మగుదురు. వీరికిని రాగద్వేషములు కలవు. వీరి యందును ప్రేమింపదగిన కొన్ని గుణములు కాన్పించును. సుమాలి యను దానవేశ్వరుడు తన పుత్రితో సంభాషించుచు నెల్ల గృహస్థులకును గల్గుభావనలను ప్రకటించినాడు.

'కమలదళాక్షి! కూఁతు నిల గాంచుట చేలగు నైన నొక్క పె
క్షమున విచారహేతు వని కాంచెద నెట్లగు నన్నఁ దల్లివం
శము గురువన్వయంబు పతిసంతతి కన్య దురాత్మురాలైన యొ
ప్పమి యపకీర్తియుం సకలబాంధవనిందయు నొందుఁ గావునన్'

ఈ సుమాలి రావణునిమాతామహుఁడు, దశకంఠుడు కూడ బంధుప్రీతిగలవాఁడుగా చిత్రింపబడెను. ఈతనికి సోదరీ ప్రేమ మెండు. పరకాంతాపరత్వమే దశగ్రీవుని యుదాత్త సాహసచరిత్రకు గొప్పకళంకము. శ్రీరామచంద్రుని యుత్తర

చరిత్రము సీతారాముల శృంగారవిహారములతో నారంభించు చున్నది. సీతాదేవికి గలిగిన జనాపవాదమును ఆమె వన వాసగమనమును ఈ మహాకవి మిక్కిలి జాలిగా వర్ణించెను. కడపటిదగు నష్టమాశ్వాసమునందు శ్రీరాముని యశ్వమేధము, కుశలవులు యాగశాలలో రామాయణమును గానముచేయుట, రాముని ప్రార్థనపై వాల్మీకి మహర్షి సీతను గొనివచ్చుట, నిండు సభలో సీత భూగర్భమును ప్రవేశించుట, రాముని హృద యావేదము లోనగు కథలు గలవు. పాపరాజు కవిత్వ మీ ఘట్టములందు కరుణరసభరితమయి నిండుయేరువలె యడ్డంకులు లేక ప్రవహించినది. గ్రంథారంభమునం దీతడు శబ్దాలంకార ప్రీతిని రచనలో విస్తారముగా చూపినాడు. పాదయమక మీతనికి అప్రియత్నముగ దొరలును. కాని పోనుపోను శబ్ద చిత్రముపై ప్రీతిని తగ్గించుకుని కేవల రసాత్మకమైన శైలి నీత డుపచరించెను. తిక్కనామాత్యుని తెన్నుల నీతడు బహుధా యనుకరించెను. కాని భావసంగ్రహము తిక్కనకు సహజమైనట్లే భావవివృతి పాపరాజునకు నైజగుణము. ఈతని కావ్యమునందు కందములు తక్కువ. వృత్తములు చిత్తజల్లు వలె వర్షించినాడు. శైలియందు సంస్కృతభాగ మెక్కువ. అచ్చతెలుగు నుడికారమునుకూడ రమ్యముగ గూర్చుటలో నేర్పరి. వెన్నెలకంటిసూరకవి రచించిన విష్ణుపురాణము తరువాత కంకంటిపాపరాజు ఉత్తరరామాయణమే రసవత్తరమైన పురాణకావ్యము. ఇది ప్రబంధరీతిలో వ్రాయబడిన పురాణము.

## మంగళగిరి ఆనందకవి.

ఈ కవి వేదాంతరసాయన మను ప్రబంధమును రచించి నిడిమామిళ్ళదాసామాత్యుని కంకితము చేసెను. మంగళగిరియా నందకవి క్రైస్తవమత మవలంబించిన నియోగిబ్రాహ్మణుడు. కృతి పతియైన దాసామాత్యుడుకూడ క్రైస్తవమత మవలంబిచినవాడే. దాసామాత్యుని యన్న రాజప్పను వర్ణించుచు నాతడు కర్ణాటక నవాబగు మహమ్మదలీఖానుచే మన్ననల నొందెనని కవి నుడి వెను. ఈ మహమ్మదలీ క్రీ.శ.౧౭౪౯ తరువాత సింహాసనమునకు వచ్చెను. కావున మంగళగిరి యానందకవి ౧౭౫౦ తరువాత నుండి యుండును. కృతినాయకుడైన దాసామాత్యుడు కృష్ణాజిల్లా బందరునగరమునం దుండినవాడు.

ఈ కవిని గురించి యాంధ్రకవులచరిత్రమునందు వీరేశ లింగముపంతులుగా రిట్లు వ్రాసియున్నారు. "ఇతడు లాక్షణి కాగ్రగణ్యుడయిన ప్రబంధకవి. పేరునుబట్టి తోచున ట్లిది వేదాంతగ్రంథముగాక, మతస్థాపకుడయిన యేసుక్రీస్తుయొక్క చరిత్రముగా నున్నది. ఈ పుస్తకము నిర్దుష్టమయి మృదుమధుర మైన ప్రబంధపాకమున జేయబడి యున్నది. ఇందలి వర్ణన లేవిషయమునను బూర్వప్రబంధములలోని వర్ణనములకు దీసిపోవు.

## పింగళి ఎల్లనార్యుడు.

క్రైస్తవమతమునకు సంబంధించిన కావ్యమును వ్రాసిన మరియొకకవి ఈ పింగళి ఎల్లనార్యుడు. ఈతడు సర్వేశ్వర

మాహాత్మ్యశ్రీ మను మఱియొక పేరుగల తోభ్యచరిత్రమును రచించెను. ఈతఁడు శైవనియోగి బ్రాహ్మణుఁడు. ఈతని గురువు ఇవ్వటూరి శరభనారాధ్యుఁడు. కృష్ణామండల మీతని నివాసము. సర్వేశ్వరమాహాత్మ్యము నీతఁడు తుమ్మరాయపరెడ్డి ప్రేరణముచే వ్రాసెను. ఈకవి పదునేడవ శతాబ్దమధ్యమున నుండియుండును. ఈతని కవిత్వము మృదుమధురపాకము గలదయి హృద్యముగా నున్నదని వీరేశలింగముపంతులుగారు నుడివిరి.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## పంద్రెండవ ప్రకరణము.

## ఆంధ్రకవయిత్రులు.

### మొల్ల.

తెలుగులో కవనము చెప్పనేర్చి గ్రంథరచన చేసినవారిలో నీమె ప్రాచీనతమురాలుగా గాన్పించును. ఈమె రామాయణమును రచించెను. దీనికి మొల్లరామాయణ మను ప్రసిద్ధి కలిగినది. మొల్ల తండ్రిపేరు ఆతుకూరు కేసనసెట్టి. ఈమె కులములచే కుమ్మరివనిత యని చెప్పుచుందురు. తనతండ్రి శివభక్తిరతుడనియు గురులింగజంగమార్చనపరు డనియు మొల్ల వచించెను. ఈమెకూడ శివభక్తురాలుగా కాన్పించును. శ్రీశైల మల్లికార్జున దేవు నీమె స్తుతించినవిధానము బాగున్నది.

శ్రీనగమందిరుం డమరసేవితుఁ డర్థశశాంకమౌళి స
న్మౌనిమనఃపయోజదిననాయకుఁ డబ్జభవామరేశ్వర
ధ్యానలసత్ప్రసన్నుఁ డతిధన్యుఁడు శేషవిభూషణుండు వి
ద్యానిధి మల్లికార్జునుఁడు తా నిడుమాకు శుభంబు లొప్పఁగన్.

గోపవరపు శ్రీకంఠమల్లేశు వరముచేత తాను కవిత్వము చెప్పనేర్చితి నని మొల్ల చెప్పుకొన్నది. గోపవరము నెల్లూరు

మండలములోని దని వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. మొల్ల జీవించిన కాల మిది యని చెప్పుటకు తగినసాధనము లీమె కావ్యములో లేవు. ఈమె తన రామాయణమును శ్రీరాముని కంకిత మొనర్చి ధన్యత గాంచినది. పూర్వాంధ్రకవులలో నన్నయ, తిక్కన, భీమన, నాచన, సోమన, రంగనాథ, శ్రీనాథు లను స్తుతించినది. ప్రబంధకవులను పేర్కొనకపోవుటచే మొల్ల శ్రీకృష్ణదేవరాయల కాలమున నుండియుండు నని వీరేశలింగము పంతులుగా రూహించిరి. తెలుగు కవిత్వము తేటమాటలతో నుండవలె ననియు పలుహాదికటుసంస్కృతశబ్దముల ప్రాచుర్యము కాదనియు నీమె పలికినది. ఈపద్యభావము అల్లసానిపెద్దన పేరున వినవచ్చు ఉత్పలమాలిక "పూంతమెఱుంగులున్ పసను పూపబెడంగులు చూపునట్టి యా కైతలు" అనుదాని భావము ననుసరించుచున్నది. కావున మొల్ల యల్లసానిపెద్దనతరువాత నైన యుండియుండవచ్చును.

మొల్లసతి మిక్కిలివినయము గలది. తనకు నిఘంటువులు అలంకారవ్యాకరణాదిగ్రంథములు తెలియవనియు మల్లేశ్వర స్వామి ప్రసాదముచే కవిత్వ మలవడెననియు వినమ్రతతో విన్న వించినది. రామచంద్రుడు తనను కవిత్వము చెప్పుమని ప్రేరే పించగా నిహపరసాధనముకై రామాయణము వ్రాయుదునని నుడివినది. మరియు తెలుగుకవిత్వమున కేయేలక్షణము లుండ దగునో మొల్ల చక్కగా వివరించినది. తెలుగుకవిత్వము ధ్వని ప్రధానమై తేటతెలుగుమాటలలో నుండవలెననియు, కఠిన

సంస్కృతపదము లొప్పవనియు నీమ చాటెను. సంస్కృత గ్రంథములను తెనుగుచేయువారు దుర్గ్రాహ్యమైన సంస్కృత శబ్దములనే తిరిగి గుప్పించి తమపాండిత్యప్రకర్ష చూపబోవుట రుచిదోష మనియు అట్టి రచన యింపుగాదనియు మొల్ల ధైర్యముతో పలికెను. నెల్లూరుకవియైన తిక్కనామాత్యుడు తన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో కవిత్వమునుగురించి తన భావములను విస్తరించి చెప్పెను. అట్లే నెల్లూరుమండల కవయిత్రియగు మొల్లకూడ ఉత్తమకవితాలక్షణములను విస్తరించి పేర్కొన్నది. వ్యంగ్యార్థ ప్రతిపాదకమైన శబ్దములు సామెతలు కూర్చి చెప్పినకవిత్వము చెవులకు విందై యుండునని యీమె అభిప్రాయము. చదువగనే హృదయంగమమైన అర్థమును ప్రసాదించెడిదే అచ్చపుకవిత్వమని మొల్ల చెప్పినమాటలు ప్రశంసనీయములు.

తేనెసోఁక నోరు తీయన యగురీతి
తోడ నర్థమెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగచెవిటివారి ముచ్చటగును.

రామాయణము లిదివరలోనుండగా తా నొకక్రొత్త రామాయణము వ్రాయనేల యని ప్రశ్నించుకొనుచు, మొల్ల చేసినవిజ్ఞప్తి యుచితముగా నున్నది. శ్రీరామునిచరిత్రము భుక్తి ముక్తి సాధన మని యీమె విశ్వసించినది. వారాంగనయొకతె తన

చిలుకకు రాముని పేరుపెట్టి పిలిచినంతనే పుణ్యలోకము చూర గొన్నదట. కావున రామచరిత కథనము మోక్షహేతువని మొల్ల తలంచినది. అజ్ఞులై కొల్చినవారిని విజ్ఞులై కొల్చిన వారినికూడ శ్రీరామచంద్రపరబ్రహ్మము తరింపజేయుననియు ముక్తికి భక్తియే మూలము కాని విద్యాధిక్యత గాదనియు నీ కవయిత్రి యుద్ఘోషించినది. మరియు రామగుణస్తుతిచేసిన తాను చిల్లరరాజలోకమును బొగడజాలనని తీవిత్రోపల్కి తన కావ్య మును శ్రీరామాంకితము చేసినది.

మొల్ల తాను విద్వాంసురాలుగానని సవినయముగా చెప్పుకొన్నదైనను ఈమెకు పాండిత్యలోప మెంతమాత్రమును లేదు. ఆకాలపు కవులందరివలెనే ఈమెయు ప్రౌఢముగ కవిత రచింపగలదు. సాకేతపురవర్ణనమునందీలక్షణము చూడనగును. ఇందు సులభశ్లేషార్థములనుగూడ నీమె నిపుణముగా పొదిగినది. ఈమెతరువాతవచ్చిన తరిగొండవెంకమాంబవలె గాక, మొల్ల కవయిత్రి ప్రబంధరీతి వర్ణనలు చేసినది. స్త్రీసౌందర్యవర్ణనలో కచకుచాదిశబ్దములను పరిహరింపలేదు. అయినను స్త్రీసహజమైన సభ్యతారుచియు జౌచిత్యమును ఈమె చక్కగనే పాటించినది. ప్రాచీనాంధ్రకవులకావ్యముల నీమె శ్రద్ధతో పఠించినదివోలె గాన్పించును. అయోధ్యాకాండము నారంభములోనే సందర్భము కల్పించుకొని ప్రకృతివర్ణనము నీమె మనోజ్ఞముగా చేసినది. సం ధ్యాకాలవర్ణన, జారచోరవిహారములు, చంద్రికావిలసనము, చకోరములవెన్నెలమురుపులు మున్నగునవి రమ్యభావములతో

గూడి యున్నవి. చకోరపక్షులు వెన్నెలమెసవుట నీమె తిక్కన వద్ద నేర్చుకొని యుండును. నిర్వచనోత్తర రామాయణములో నిట్టి వర్ణనలుగలవు. రామాయణప్రబంధమును మొల్ల శరవేగముతో నడిపించినది. మొదటినాల్గుకాండలును కడుచిన్నవై సెలయేళ్ళ వలె జిలిబిలినాదముతో చురుకుగా సాగిపోయినవి. మంథరా వృత్తాంతము నీమె ప్రవేశపెట్టలేదు. సీత చెరపోయినప్పుడు రాముని దుఃఖము నీమె కరుణతో చిత్రించినది. ఈమె స్త్రీ హృదయమంతయు నీపట్టున వెల్లివిరిసినది. ఇచ్చట మొల్లకవిత్వము కడునున్నితమై మృదువై మధురమై యొప్పారినది. సుందర కాండము యుద్ధకాండము నీమె కొంచెము విస్తృతముగ వ్రాసినది. హనుమంతుడు సీతాదేవిని తనవీపెక్కించుకొని పోవుదునని యామెతో పల్కగా సీత యిచ్చినసమాధానము మిక్కిలి బాగున్నది. అట్లుచేసినచో రావణునికన్న రాముడే పెద్దదొంగయని లోకులాడుకొందురని చెప్పి సీత హనుమంతుని వారించినది. కాలనేమివృత్తాంతమును మొల్ల కొంచెముదీర్ఘముగా వర్ణించినది. భావములందును భాషయందును ప్రశంసనీయమైన మార్దవమును చిందించుచు అబలకవిత్వము దుర్బలకవిత్వము కాదని మొల్లసతి నిరూపించినది.

## రంగాజమ్మ.

ఈమె మన్నారుదాసవిలాసనాటకము అనబడు యక్షగానమును రచించెను. ఉషాపరిణయమున్నారు దాసవిలాసప్రబంధములుకూడ తానువ్రాసినట్లీమె చెప్పుకొన్నది. పసుపులేటి వెంకటాద్రి

యీమె తండ్రి. తల్లి మంగమాంబ. తంజాపుర విజయరాఘవ నాయకుడు డీమెను కనకాభిషేకముచే గౌరవించెను. రఘునాథ నాయకుని కుమారుడైన యీ విజయరాఘవనాయకుడు క్రీ. శ. ౧౬౩౩నుండి౧౬౭౩ వరకు తంజావూరు రాజ్యమును పాలించి మధురచొక్కనాథునితో యుద్ధమునందు నిహతుడయ్యెను. ఈతడు రాజ్యపాలనమందసమర్థుడై భోగపరాయణుడై యుండెను. విజయరాఘవుడు సంగీతసాహిత్యప్రియుడు. తండ్రియైనరఘునాథుడు సంగీతవిద్యను ప్రోత్సహించియుండగా పుత్రుడైన విజయరాఘవ నాయకుడు నాట్యకళ నభిమానించి దాని నభివృద్ధికి తెచ్చెను. ఆ కాలపు నాటకస్వరూపమైన యక్షగానము విజయరాఘవుని కాలములో మహోన్నతస్థితికి వచ్చెను.

నాయకరాజయుగములో సాహిత్యరంగమునందు స్త్రీలు ప్రముఖ స్థానము వహించుట గమనించదగిన యంశము. రఘునాథునివిద్వత్సభలో కవులతోపాటు కవయిత్రులును విరాజిల్లిరి. రామభద్రాంబయను కవయిత్రి రఘునాథుని చరిత్రమును వర్ణించుచు "రఘునాథాభ్యుదయము" అను సంస్కృత కావ్యము వ్రాసెను. మధురవాణి యను కవయిత్రి రఘునాథుడువ్రాసిన రామాయణమును సంస్కృతీకరించి యాతనిమన్నన బడసెను. మన్నారుదాసవిలాసయక్షగానమును రచించిన రంగాజమ్మకూడ మంచివిదుషీమణి. ఈమె చిత్రవిచిత్రసాహిత్యగోష్ఠులందు నిష్ణాతురాలు. "అతులితాష్టభాషాకవితాసర్వంకష" యని గద్యలో తననుగూర్చి చెప్పుకొన్నది. దీనికి తార్కాణముగా మన్నారు

దాసవిలాసమునందు సంస్కృతప్రాకృతములలోను అరవము నందునుకూడ తనకుగల పాండిత్యమును చూపినది.

యక్షగానము ప్రాచీనాంధ్రనాటకస్వరూపము. ఇది విశేషముగా సంగీతనాట్యప్రచురమై యుండెను. నాట్యసంగీత సాహిత్యముల కానాడు మిక్కుటమైన యాదరణ లభించెను. ఈ మూడుకళలను గర్భీకరించుకొని బయిలువెడలిన సాహిత్యప్రక్రియ యక్షగానము. ప్రబంధరచన సర్వసామాన్యమైన యుగములో వెడలిన వగుటచే, యక్షగానములమీద ప్రబంధప్రభావము మెండుగా కన్పించును. మన్నారుదాసవిలాస మనగా విజయ రాఘవనాయకవిలాసము. విజయరాఘవుడు మన్నారుదేవుని భక్తుడు. ఈ యక్షగానములో కథాంశ మంతగాలేదు. కావేరీ తీరస్థమైన చోళదేశమును తంజాపురమును కవయిత్రిప్రబంధరీతిలో వర్ణించినది. విజయరాఘవనాయకుడు రాజగోపాలస్వామి రథో త్సవమునకై వెడలును. స్వామియుత్సవము చూడవచ్చినకాంతలు విజయరాఘవుని జూచి మోహము చెందిరి. వారిలో కాంతి మతియను రాజకన్య విజయరాఘవుని వలచి విరహాతురయై శృంగారవేదనలకు లోనగును. పూర్వవిరహవర్ణనమంతయు ప్రబంధసంప్రదాయములో నున్నది. కాంతిమతిచెలికత్తె విజయ రాఘవునికడకు ప్రేమరాయభారమునడుపును. రాజగోపాలస్వామి భార్య చెంగమలదేవి ఎఱుకసానియై వచ్చి కాంతిమతి ధైర్యము తూలిపోకుండ సోదిచెప్పి ప్రోత్సహించును. విజయరాఘవుని గురువగు తిరుమల శ్రీనివాసతాతాచార్యులవారి ప్రయత్నముచే

కాంతిమతీవిజయరాఘవుల కళ్యాణము కొనసాగును.

మన్నారుదాసవిలాసమునందు నాటకత్వముకన్న ప్రబంధత్వమే ఎక్కువగా గోచరించును. ఇందు సందర్భోచితమైన లఘుహాస్యమును కవయిత్రి ప్రవేశపెట్టినది. గొల్లలహాస్యము, పండితుల యన్యోన్య విద్యామాత్సర్యము, విజయరాఘవుని పెండ్లిలో బ్రాహ్మణులు సంభావనకై తగవులాడుట మున్నగునవి నవ్వు పుట్టించును. సమకాలిక సాంఘిక జీవితము మన్నారుదాసవిలాసమునందు బాగుగ ప్రతిఫలించినది. ఆయా పాత్రములను ప్రవేశపెట్టునప్పుడు రంగాజమ్మ వారి వేషధారణమును వివరముగ వర్ణించును. వర్తమానాంగ్లనాటకములందు ఈ మర్యాద పాటింపబడుచున్నది. నగరాధికార్లను నగరియన్నగార్లని పిలుచుచుండిరి. వీరిసంభాషణము అరవభాషలో నున్నది. అట్లే కటికి వారిమాటలును కరణికుల నివేదనలును ద్రావిడభాషలో రంగాజమ్మ రచించినది. ఈకాలము స్త్రీలు రాజకీయోద్యోగములందు నియుక్తలగుచుండిరనుటకు నిదర్శనము గలదు. రాజగోపాలస్వామి రథోత్సవశ్రీముఖమును విజయరాఘవనాయకుడు తన చెంతనున్న 'రాయసము తోయజముఖి, అంపిచ్చెనట. ఈమె వ్రాతకత్తె యన్నమాట. నాయకయుగమునందు వేశ్యలు కళాసిద్ధులై యుండిరి. స్వామిరథోత్సవమునందు వీరు పదములుపాడుచు నృత్యము సేయుచుండిరి. విజయరాఘవుని కళ్యాణమునందు పురస్త్రీలు సువ్విపదములను, ధవళాలు శోభనములును పాడిరి. మరియొక్క విశేషమేమన, కాంతిమతియు విజయరాఘవుడును పరిణయానంతరము జోడుగూడి సభవారు మెచ్చ

నట్లు నటించిరట. తరువాత కాంతిమతి పదకేళిక వినిపించుచు నటించెను. ఉన్నతకుటుంబములవారును, గౌరవనీయులైన వారును కూడ సభలలో నృత్యముచేయుట ఆకాలమున సదాచారముగనే పరిగణించుచుండిరని దీనినిబట్టి చెప్పవచ్చును. దంపతులు బాలబాలిక లైనపుడు వారు నృత్యముచేయలేరు. గాన వారినెత్తుకొని బందుగులో లేక వంట్రబ్రాహ్మణులో నృత్యమాడు చుండుట అతిబాల్యవివాహములలో గన్పట్టును. దీనిని దండాడింపు లందురు. రంగాజమ్మ కవిత్వము విద్వత్సంప్రదాయములో నుండును. శృంగార మీమె కభిమానరసము. "శృంగారరసతరంగితపదకవిత్వమహనీయస్ఫూర్తి" యని తనను వర్ణించుకొన్నది. కాంతిమతిని యత్తవారింటికి పంపునప్పటి దృశ్యము సకరుణముగా నున్నది. తండ్రి యిట్లు నుడువుచున్నాడు.

మమత నేసాకినమంద కేలమునఁ
గమలాక్షి చెల్లుబడిగానుండునెపుడు
నేర్పునేరము లెల్లనీ వె సైరింపుచు,
నోర్పుతో నేలుకోవోయయ్య మాసుతను

ముద్దుపళని

ఈమె రాధికాసాంత్వనము అను శృంగారప్రబంధమును వ్రాసెను. ముద్దుపళని తన వంశక్రమము నిట్లు చెప్పుకొనెను. శూద్రకులములో యాదయపుట్టెను. ఈతనికి ముద్దుతంజనాయకి, ముత్యాలును గలిగిరి. తంజనాయకి యనునామె వీరిని పెంచు

కొనెను. ముత్యాలుకు పోటి వధూటియందు ఘనకవయిత్రియగు ముద్దుపళనియు తదితరసంతానమును గల్గెను. ముద్దుపళని తంజావూరు ప్రతాపసింహమహారాజుచే "చామీకరాంబరాభరణాదులు" బహుమతిగా నొంది యాతనిమన్నన పడసినది. ప్రతాపసింహుడు తంజావూరు రాజ్యమును క్రీ. శ. ౧౭౩౯--౬౩ల నడుమ పాలించెను. కావున ముద్దుపళని యీ కాలమున నుండెనని చెప్పవచ్చును. తంజావూరునాయక రాజ్యము క్రీ. శ. ౧౬౭౪ ప్రాంతమున మధురనాయక రాజుల కోడి యస్తమించెను. సత్యభామాసాంత్వనమును కృతిగొన్న ముద్దళఘురి(మధురచొక్కనాథుని తమ్ముడు) తంజావూరును స్వల్పకాలము పాలించెను. రాయసము వెంకన్న యను నియోగిబ్రాహ్మణుడు అస్తమించిన పూర్వనాయక రాజుల రాజ్యమును నిలబెట్టుటకై యత్నించి కృతకృత్యుడయ్యెను. ఈ కార్యము నందితనికి ఏకోజీ యను బిజాపూరు మహారాష్ట్రసేనాని తన సైన్యములతో తోడ్పడెను. ఏకోజీకి వెంకోజీ యని మఱియొక పేరు. ఈతడు ఛత్రపతిశివాజీ మహారాజు సవతితమ్ముడు. రాయసము వెంకన్న కుట్రల ఫలితముగా ఏకోజీ తంజావూరురాజ్యము నాక్రమించుకొని మరియొక నూతనవంశపరిపాలనము నారంభించెను. తంజావూరు మహారాష్ట్రరాజులు క్రీ.శ. ౧౬౭౬నుండి౧౮౫౫ వరకును ప్రభుత్వము వహించిరి. వీరు తమకు పూర్వులైన నాయక రాజుల సత్సంప్రదాయములనే యనుసరించుచు సంస్కృతాంధ్రభాషలను పోషించి కీర్తి గడించిరి. ఈ వంశమువారు చేసిన శాశ్వత

యశస్కరమైన పనులలో తంజాపూరు సరస్వతీమహాలుగ్రంథాలయమును స్థాపించి వృద్ధినొందించుట ముఖ్యమైయున్నది. మహారాష్ట్ర రాజులు ఆంధ్రకవుల కాశ్రయమిచ్చుట ప్రశంసనీయము. వీరిలో ముద్దుపళనిని గౌరవించిన ప్రతాపసింహమహారాజు విద్యాశౌర్యములచేత పొగడదగినవాడు.

ముద్దుపళని వారకాంత యను ప్రథగలదు. అది నిజమైయుండును. కాని యీ వంశమువారు వృత్తిచేకలిగిన కళంకమును యీవిచేతను విద్యాభ్యాసంగముచే తనకళా ప్రకర్షచేతను మఱపింపజాలిరి. ముత్యాలునుపెంచిన ముద్దుతంజనాయకికూతురు రామామణి దానముచేతను కళాఘనతచేతను పేరొందినదట. ఈమె తనపేర రామాంబాగ్రహారమును నిర్మించెను. దేవాలయముకట్టించి శివప్రతిష్ఠచేసెను. సేతుమార్గమునందు గొప్పతటాకము త్రవ్వించెను. గండరకోటలో నిత్యాన్నదానసత్రము వేయించెను. ముద్దుపళనికూడ నీకోవలో వెలసిన దగుటచే వితరణప్రీతియు ఆస్తికబుద్ధియు కలిగియుండెను. ఈమె భక్తితో రామకోటి వ్రాయించెను. విద్వచ్ఛ్రేణికి ధనములిచ్చి వారిని [illegible]యించెను. కృతులువ్రాసి కృతులు గైకొనెనట. ఈమె గురువు తిరుమలతాతాచార్య వంశీయుడగు వీరరాఘవదేశికుడు. నృత్యము గానము సాహిత్యము అను కళాత్రయమును ముద్దుపళని వంశమువారు తమ స్వంతకాణాచిగా దక్కించుకొనిరి. ఈమె తననృత్యకౌశల్యము నిట్లు పొగిడించుకొన్నది.

"నటియింప నేర్తువు నవరసంబులనాటి
తగురంభ యనిమిషత్వము వహింప"

ముద్దు తంజనాయకియు రామామణియుకూడ నృత్య సంగీతము లందు మిన్నలని విశేషముగా పొగడబడిరి. ఇట్లు బహుకళానిధానమైన ముద్దుపళని కావ్యము వ్రాయబూనుట సొంపుగనే యున్నది. ఈమెకు చక్కని పాండిత్య మలవడినది. సులభశ్లేషరీతినిగూడ నీమె కవనము చెప్పగలదు. ముచ్చట గొలుపు తెలుగునుడికారము సరసపదజాలము మిక్కిలిసున్నితమైనభావములు భావమార్దవము నలిగిపోకుండ వాసింపజేయగల రచనావిధానము ఇవి ముద్దుపళని కళారీతులు. ఈమెకావ్యపు పూదోటయందు మురిపెమైన అచ్చతెలుగు పదములెన్నియో వింతవింతహొయలుతో గులుకుచుండును. శృంగారముచే జీవించిన ముద్దుపళని శృంగారమును కావ్యములోనికి వడియగట్టుట యందు గొప్పవిజయమును సాధించినది.

రాధికాసాంత్వనము శిరీషకోమలమైన కావ్యము. దీని యందు నైతికౌన్నత్యమును భావదార్ఢ్యమును లేవని చెప్పవలయును. ప్రబంధనిర్మాణాభిలాష గలిగియున్న ముద్దుపళనికి చిన్నకృష్ణుడు శృంగారరూపముతో కలయందు గాన్పించి రాధికాసాంత్వనమును తనపేర చెప్పుమని యాదేశించెను. బాలకృష్ణున కంకితముగ నీమె యీ శృంగారకావ్యమును రచించెను. శ్రీకృష్ణున కిళాకన్యతో పరిణయము జరిగెను. రాధ చిన్ననాటినుండియు శ్రీకృష్ణునకు శృంగారజీవితమర్మముల నభ్య

సింపజేయుచు నాతనిమీద వలపుదగిలి యుండెను. ఇళతోఁగూడి శ్రీకృష్ణుడు అత్తవారింటి కేగెను. రాధకు కృష్ణవిరహము సహింప రానిదయ్యెను. కృష్ణసౌందర్యమును తమ రహశ్శృంగారమును తలపోసికొని రాధ పరిపరివిధముల కుములును. ఆమె తన చిలుకను శ్రీకృష్ణునికడకు సందేశముపై బంపును. అచ్చట శ్రీకృష్ణుడుకూడ రాధను విడనాడినందులకు విరహబాధ నొందు చుండును. ఎట్టకేల కాతడు రాధను చూడవచ్చి యామె విర హోపశమనమునకై కాళ్ళమీదపడును. ఇదియే రాధికాసాంత్వ నము. ఈ శృంగారవర్ణనములందు ముద్దుపళని నందితిమ్మ నార్యుని పారిజాతాపహరణరీతులను మనసునం దుంచుకొనెను. పారిజాతాపహరణమునందు సతీశృంగారము సభ్యరుచితోఁ ప్రదర్శింపబడినది. రాధికాసాంత్వనము నిషిద్ధశృంగారమున కుదా హరణము. స్త్రీహృదయభావములను మిక్కిలి సున్నితముగా ముద్దుపళని చిత్రించినది. కాని పాలలోఉప్పురాయి పడినట్లు నీతిరాహిత్యము ఈమెకావ్యమునకు పెద్దకళంకముగా నున్నది. పచ్చివలపును సిగ్గులజ్జగా నీమె విస్తరించి వ్రాసి తా నొక స్త్రీ యనుభావమును విస్మరించినది. దక్షిణదేశపు తెలుగువాఙ్మయ ములో నీలోపము సర్వసాధారణము. ముద్దుపళని రచనా మాధుర్యము మాత్రము ప్రశంసనీయము. ఈమె చక్కని లోకోక్తులను కుప్పలుగా వాడి తనపద్యములకు మెఱుగుపెట్టి నది. ఈమెశైలి కుదాహరణముగా నీపద్యము చూపవచ్చును.

"శౌరిని బిల్వఁగాఁ జనిన చక్కనికీర మదేలరాదో, సు
దారినిఁజిన్నదో నడుమఁదారెనొ చేరెనొ లేదొ గోపికా
జారుని గాన్చెనో కనదొ, చక్కఁగ నావెత విన్నవించెనో
సారెకు లేక శౌరి నుడి చక్కెరయుక్కెర మెక్కి చిక్కెనో"

తరిగొండ వేంకమాంబ.

ఈ కవయిత్రి శ్రీ వేంకటాచలమాహాత్మ్యమును, జ్ఞాన వాసిష్ఠరామాయణమును రాజయోగసారమును, రచించి కీర్తి గాంచెను. తరిగొండ వేంకమ్మ నందవరీకబ్రాహ్మణస్త్రీ. ఈమె తండ్రి కృష్ణయామాత్యుడు. ఈమె క్రీ.శ.౧౮౪౦లో జీవించి యున్నట్లు బ్రౌ౯దొరగారు తమ నిఘంటువులో వ్రాసిరి. తరి గొండగ్రామము కడపమండలములో నున్నది. వేంకమాంబ తనగ్రంథములను శ్రీ తరిగొండనృసింహస్వామి కంకితముచేసి ధన్యురాలైనది. ఈమె గురువు సుబ్రహ్మణ్యుడు. వేంకమాంబ మంచివిద్వాంసురాలు. ఈమె రచించినగ్రంథములు తరుచు వేదాంతపరములు. శైలి కడుమృదువుగను హృదయంగమము గను నుండును. అక్కడక్కడ నీమె వ్యాకరణనియమముల నుల్లంఘించినది. సంభాషణశైలికి వీలైనంతదగ్గరగ వ్రాయు నుద్దేశముతో నీమె యట్లొనర్చియుండును.

వేంకటాచలమాహాత్మ్యము వెంకటగిరి ప్రాశస్త్యమును వర్ణించు పద్యకావ్యము. ఇష్టదేవతాస్తుతిని వేంకమాంబ సభక్తికముగ రచించినది. కావ్యమునందు శృంగారము వర్ణించు

సందర్భము వచ్చినను తాను శృంగారవర్ణన చేయలేనని శ్రీ కృష్ణునికి విన్నవించుట యెంతయు సముచితముగ నున్నది.

"శృంగారాకృతితోడ వచ్చి పదముల్ శృంగారసారంబుతో
డం గూఢంబుగఁ జెప్పు నీవనఁగ నట్లేఁ జెప్ప లేనన్నన
ముంగోపంబునఁ జూచి లేచియటనే మ్రొక్కంగ మన్నించి త
చ్ఛృంగారోక్తులు తానె పల్కకొనునా శ్రీకృష్ణు సేవించెదన్"

శృంగారముపేర అసభ్యవర్ణనలు చేయజాలనని వేంకమాంబ చెప్పినమాటలను తనకావ్యములో నక్షరాలపాటించినది. ఈమె కావ్యములో అనుచితమైన వర్ణనలు లేవు. ఈమె మంచిపాండిత్యము గలదైనను వినయపరురాలు. పండితులు తన కావ్యమునాదరింతురుగాక యని వేడుచు నిట్లు నివేదించినది.

పండితాగ్రణులార ప్రజలార యిప్పుడు నా
బాలభాష కసూయ పడక వినుడు
తల్లిదండ్రులు చిన్నపిల్లలపల్కుల
కానంద మొందెడు నట్లు యిందు
మీరు నా తప్పొప్పు లేరీతిగా నైన
గేలిసేయక చిత్తగింపవలయు
నాంధ్రగీర్వాణమహాకృతులుండఁగా
నిప్పు డీకృతి విన నేల యనక

భక్ష్యములు మెక్కి యాకల బచ్చడికొను
నంజుకొనిన విధంబున నా ప్రబంధ
మాలకింతు రటంచుఁ బేరాసచేత
నేను రచియింతు దీని మన్నించి గనుడు.

తాను విద్యాధికురాలు గానని మరియొకపద్యములో వినయముతో పలికినది.

నా చిన్ననాట నోనామాలునైన నా
చార్యులచేత నేఁ జదువలేదు
పరగ ఛందస్సుతోఁ బద్యములనైన
నిక్కంబుగా నేను నేర్వలేదు.

భక్తియోగక్రమమున నాంధ్రభాషలో గావ్యము వ్రాయుట తన యాశయమని వేంకమాంబ ప్రకటించినది. ఇంతకుముందీమె భాగవతము ద్వాదశస్కంధములును ద్విపదలలో రచించినట్లు వేంకటాచలమాహాత్మ్యములో బేర్కొన్నది. సంస్కృతవరాహ' భవిష్యోత్తర పద్మపురాణములలో వచ్చిన వేంకటాచలమాహాత్మ్యప్రశంసలు మూలముగా గొని యీమె తనప్రబంధమును వ్రాసినది. వేంకటాద్రిప్రభావము నుగ్గడించుటకు చెప్పబడిన మాధవుడను బ్రాహ్మణయువకునికథ హృదయంగమముగ నున్నది. క్షేత్రమాహాత్మ్యమును ప్రశంసించుటకై పురాణములు విచిత్ర కథలను కల్పించుచుండును. సత్కులీనుడైన బ్రాహ్మణకుమారుడండును. ఆతడు యౌవనమదముచే చేయరాని పాపములు-

జారచోరత్వాదులు- చేయును. అంతటిపాపములు చేసియు జీవితాంతమందొక పుణ్యక్షేత్రమును సందర్శింప తత్ప్రభావముచే పాపవిముక్తు డగును. క్షేత్రమాహాత్మ్యకథ లన్నియు నీరీతిగనే యుండును. మాధవు డను విప్రుడును ఇట్టి వాడే. ఈ సందర్భములో పురుషులైన కవులైనచో మాధవుని శృంగారవిహారములను పచ్చిపచ్చిగా వర్ణించి యుందురు. మాధవుడు చండాలకన్యను కామించెను. తరిగొండ వేంకమాంబ ఈ కథాభాగమును గొప్ప నేర్పుతోను ఔచితీపరిజ్ఞానముతోను వ్రాసి పురుషకవులకు చక్కని త్రోవచూపినది.

వేంకటాచలమాహాత్మ్యములోని పద్మావతీశ్రీనివాసుల వివాహవృత్తాంత మెంతయు రమణీయముగ నున్నది. వేంకటాచలదేవు డగు శ్రీనివాసుడు నారాయణవనపుర రాజకుమార్తెయైన పద్మావతిని ప్రేమించును. శ్రీనివాసుడు మాయామానుష లీలను విడంబించును. ప్రథమసందర్శనమునందే తనను వరింపుమని శ్రీనివాసుడు పద్మావతిని నిర్బంధించును. ధైర్యశాలియైన పద్మావతి రాచబిడ్డ గనుక యాతని ప్రార్థనలకు లొంగక శ్రీనివాసుని రాళ్ళతో కొట్టించి తరిమి వేయును. శ్రీనివాసు డెఱుకసాని వేషముతో రాజాంతఃపురమునకు బోవుట కడు సహజముగా వర్ణింపబడినది. ఎఱుకసానిమాటలను వేంకమాంబ చక్కగా వివరించినది. శ్రీనివాసునకును ఆతనిప్రథమభార్యయగు లక్ష్మీదేవికిని గలిగిన వివాదము, వారొండొరుల నెడబాసి యొంటరితనము ననుభవించుట మొదలగు కథయంతయు జాలిగొల్పుచు మిక్కిలి

హృద్యముగా నున్నది. స్త్రీహృదయాంతరాళమందలి సున్నిత భావములను, స్త్రీల యాత్మాభిమానమును, ఆత్మగోపనమును వేంకమాంబ గొప్ప సమర్థతతోను సరసముగను చిత్రించినది. శ్రీనివాసుని ద్వితీయవివాహసందర్భమున లక్ష్మీదేవి యనుభవించిన విచిత్రబాధాకరమైనభావములను వేంకమాంబ నిపుణతతో వర్ణించినది.

జ్ఞానవాసిష్ఠము ద్విపదకావ్యము. మడికిసింగన యను పూర్వకవి ఈ గ్రంథమునే పద్యరూపమున వ్రాసెను. ఆత్మ తరియించుటకొరకు తానీ రామాయణమును వ్రాయుచున్నానని వేంకమాంబ గ్రంథారంభమున చెప్పినది. వైరాగ్యమును ప్రబోధించునట్టివియు, ఆత్మానాత్మవివేకమును బోధించునట్టివియు కథ లెన్నియో ఈకావ్యమునందు కలవు. కఠిన వేదాంతభావములను గూడ వేంకమాంబ కడుమృదువుగను సులభార్థబోధకముగను వ్రాసినది. ఔచిత్యమునందును భావమార్దవమునందును భక్తివైరాగ్యములందును తరిగొండ వేంకమాంబ మనప్రాచీనకవులకు తీసిపోని యుత్తమకవయిత్రి.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

పదుమూడవ ప్రకరణము.

## చారిత్రక కావ్యములు.

చరిత్రదృష్టితో ప్రత్యేకముగ వెడలిన కావ్యములు పూర్వాంధ్రసాహిత్యములో తక్కువగా నున్నవి. చరిత్రరచనను గురించి ఈ నాడు గల విమర్శకదృష్టి యా నాడుండెడిది కాదు. అయినను ఆంధ్ర దేశచరిత్ర వ్రాయుటకు సాధనములను పరిగణించు నపుడు శిలాతామ్రశాసనముల తరువాత ఆంధ్ర కావ్యములనే లెక్కించవలెను. కావ్యపీఠికలు చరిత్రకారుల కత్యంతోపయుక్తములుగా నున్నవి. పూర్వకవిస్తుతి, కృతిపతివంశవర్ణనము, కవి ప్రశంస మొదలగుముఖ్యాంశములుగల్గి యీ పీఠికలు విశ్వసనీయమైన చరిత్రసాధనము లగుచున్నవి. ఆశ్వాసాంతసంభోధన పద్యములును, గద్యలునుకూడ ఇట్లే కొన్నియపూర్వవిషయములను సూచించునవిగ నుండును. కృత్యవతరణికపద్యములు కృతిభర్తను ప్రశంసించుటకు వ్రాయబడినవగుటచే వీనిలో అతిశయోక్తులు మెండుగా నుండును. పరిశీలకుడైనచారిత్రకు డిట్టి సందర్భములను శాసనసహాయముతో విమర్శించి సత్యాంశములను క్రోడీకరించును. కొందరుకవులు పూర్వరాజవంశములప్రశస్తిని వ్రాయవలెనను సదుద్దేశముతో గ్రంథములు కూర్చిరి. కాని శాస్త్రీయమైన చరిత్రరచనాసూత్రములు ప్రచారమునకు రాని

యా కాలములో అభూతములు నద్భుతములైన విషయములు కూడ సత్యాంశములుగనే విశ్వసింపబడెడివి. కావున నిట్టి కావ్యము లున్నవియున్నట్లుగా చరిత్రరచనకు తోడ్పడవు. ఈ రీతి గ్రంథములు వ్రాసినవారిని పేర్కొన నగుచున్నది.

## కాసె సర్వప్ప.

ఈతడు సిద్ధేశ్వరచరిత్ర యని ప్రసిద్ధిగాంచిన చారిత్రక కావ్యమును వ్రాసెను. దీనికే ప్రతాపచరిత్ర యనియు, కాకతీయ రాజవంశావళియనియు పేర్లు. కాసెసర్వప్ప శైవుడైన నియోగి బ్రాహ్మణుడు. బొలికొండసీమలోని చెరువుపల్లి యాతని నివాస స్థానము. అనుమకొండవాసియైన ముదిగొండ దమ్మన్న తన కుమార్తెను కాసె సర్వప్పకిచ్చి పెండ్లిచేసి యాతనికనుమకొండలో నుద్యోగమిప్పించెనట. సర్వప్ప అనుమకొండలోనుండి సిద్ధేశ్వరుని మాహాత్మ్యము వర్ణించు నీ గ్రంథము వ్రాసెను. ఈ కవికాలము తెలియబడలేదు. ఈతని గ్రంథము మిక్కిలిపురాతనమైనదనియు; ఈ కవి ప్రతాపరుద్రునియనంతరమున గొంతకాలమైనతరువాత నుండె ననియు వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. సిద్ధేశ్వర చరిత్రలో వర్ణింపబడిన యంశములు కొన్ని అత్యంతప్రాచీనము లనుట నిజమే కాని దీనిని రచించిన సర్వప్ప అంత ప్రాచీనుడుగా కనబడడు. కాకతీయరాజుల ప్రతాపాధికమును వర్ణించుపట్లనీతడు విజయనగరమును పలుమార్లు పేర్కొనెను. వీరు జయించినవిజ యనగరరాజు నృసింహావిజయరాయ లని సిద్ధేశ్వరచరిత్ర చెప్పు చున్నది. విజయనగరము నేలినవారిలో నరసింహానామాంకితులు

ముగ్గురు కలరు. సాళువనరసింహరాయలు, తుళువనరసరాజు, శ్రీకృష్ణదేవరాయలవారి యన్న వీరనరసింహరాయలు అనువారు. వీరిలో కడపటివాడగు వీరనరసింహరాయలు క్రీ.శ౧౫౦౪-౦౯ సంవత్సరముల నడుమ విజయనగరసింహాసనమునం దుండెను. కావున కాసె సర్వప్ప ౧౬ శతాబ్దారంభముననుండె నని చెప్పవచ్చును. ఈ యంశమునే మరొకవిధమున సమర్థింప వచ్చును. ప్రతాపరుద్రచక్రవర్తి యాస్థానమందలి కవులను చెప్పుచు రామాయణమును వ్రాసిన కుమ్మరిమొల్లనుకూడ నీత డుదహరించెను. కుమ్మరిమొల్ల రామాయణమును వ్రాసి ప్రతాపరుద్రున కంకితమీయదలచి వచ్చె ననియు, ఆస్థానమందలి బ్రాహ్మణకవులు శూద్రకవిత్వ మని యాపెగ్రంథము నాక్షేపించి రనియు, రాజు మాత్రము మొల్లకవిత్వముకు కొంతవిని యామెకు పల్లకిని, నగరినిత్యజీవితమును కట్టడి చేసెననియు సిద్ధేశ్వరచరిత్ర వర్ణించుచున్నది. దీనినిబట్టికూడ కాసె సర్వప్ప ౧౬ శతాబ్ది ప్రారంభముననో మధ్యయందో ఉండె నని నిర్ణయింపవలెను. కుమ్మరిమొల్ల కవయిత్రి శ్రీకృష్ణదేవరాయలకు కొంచెముముందుగనో సమీపకాలమునందో యుండినది.

కాకతీయవంశావళినివర్ణించుటకు కాసె సర్వప్ప ప్రథముడు కాకపోవచ్చును. ఏకామ్రనాథుడు చెప్పిన కథ ననుసరించి, నాగనాథుని యనుమతివడసి తానీ వృత్తాంతము వ్రాయుచున్నట్లీత డు చెప్పుకొనెను. నాగనాథు డీతనిగురువు కావచ్చును. బ్రతుకుకొరకై నూతనకథలను వ్రాసి బ్రతిమాలి కృతు లిచ్చుట

కన్న పూర్వరాజన్యులచరితలు నుతించుట మేలని తా నట్లు చేసితి నని సర్వప్ప గ్రథరచనమును సమర్థించుకొనెను. కాని సర్వప్పకు తరువాత ఇన్నూరుసంవత్సరముల కుండిన కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయ మనుకావ్యము వ్రాయుచు సిద్ధేశ్వర చరిత్రమునందలి కథలనే వాడుకొనెను.

సిద్ధేశ్వరచరిత్రము కొంతభాగము ద్విపదలోను, కొంత భాగము వచనములోను వ్రాయబడినది. గ్రంథమునందు తప్పులు కుప్పలుగా నున్నవి. కవిత్వము ప్రౌఢమైనదికాదు. వచనభాగము ద్విపదలకన్న రమణీయముగా నున్నది. అనుమకొండపద్మాక్షి దేవళమున కెదురుగ, గుట్టకు సమీపమున సిద్ధేశ్వరుని యాలయ మిప్పటికిని విలసిల్లుచున్నది. ఈశ్వరుడును పార్వతియు కైలాసము నవీడి సిద్ధేశ్వరుడుగా పద్మాక్షిగా నవతరించినగాథతో నీ కావ్య మారంభించుచున్నది. చంద్రవంశమందు విష్ణువర్ధనరాజుతమ్ముడు సోమదేవరాజు దాయాదులనుండి విడివడి గోదావరిను తరించి నిజభుజబలముచే రాజ్యము స్థాపించెను. ఈతనివంశపరంపరలో మరియొక సోమదేవరాజు జనించి కందారము రాజధానిగా నేలెను. ఈతనికిని కటకము నేలిన బల్లహునకును యుద్ధముపొసగి సోమదేవరాజునిహతు డయ్యెను. ఆతనిభార్య సిరియాలదేవి గర్భవతిగానుండి అనుమకొండకు పారిపోయి, ఎఱుకదేవరాజు శరణువేడెను. కాని యా రాజు సాహసించి యామె కాశ్రయ మీయలేకపోయెను. మాధవశర్మ యను బ్రాహ్మణు డామెను తనయింట దాచెను. ఈమెకు పుట్టినకుమారుడు మాధవవర్మ

నామధేయుడు తేజస్వియై కటకబల్లహు నోడించి ఎఱుకదేవ రాజురాజ్యము నాక్రమించుకొనెను. మాధవవర్మరాజు పద్మాక్షి దేవి యనుగ్రహము వడసినవాడు. ఈ రాజు శా.శ.౨౩౦ సంవత్సరమున రాజ్యారూఢు డైనట్లు సిద్ధేశ్వరచరిత్ర నుడువుచున్నది. ఇదియెంతవరకు చరిత్రసత్యమో విచారింపవలెను.

ఆంధ్రదేశము నేలిన ప్రాచీనరాజవంశములలో ఆనందగోత్రీకులైన రాజు లొకరు. వీరిరాజధాని కందరపురము. సోమదేవరా జీకందరపుర రాజవంశమునకు చెందినవాడుకావచ్చును. ఆనందగోత్రీకులకును పల్లవులకును ఆంధ్రదేశపు టాధిపత్యమునకై పోరాటము సాగుచుండెడిది. పై కథలోని కటకము ధాన్యకటకముగను బల్లహుడు పల్లవరాజనియు నూహింపవచ్చును. ఆంధ్రశాతవాహనులతరువాత ధాన్యకటకనగరము పల్లవరాజప్రతినిధులకు ముఖ్యస్థానముగ నుండెను. మాధవవర్మ వంశపరంపరలో భువనైకమల్లుడు, ఆతనికొడుకు త్రిభువనమల్లుడును వెలసిరి. వీరు కాకతిప్రోలరాజు కాకతిచేతరాజులుగా కన్పట్టుదురు. కాకతీయులు మొదట పశ్చిమచాళుక్యులకు సామంతులై యా చక్రవర్తులబిరుదనామములనే తాముసు ధరించుచుండిరి. త్రిభువనమల్లునికొడుకు కాకతిప్రోలరాజని సిద్ధేశ్వరచరిత్రయే చెప్పుచున్నది. ఇతడు రెండవప్రోలరాజని యూహింపవలెను. కాకతివంశప్రభ యీతనికాలమునుండియు దుర్నిరీక్ష్యముగా నుండినది. కాకతీయరాజులందరును కటకబల్లహుని జయించి రని కవి చెప్పినమాటలలోచరిత్రసత్యము కానరాదు. ప్రోలరాజు ఓరు

గల్లుపట్టణమును స్థాపించెను. ఇది శా. శ ౯౯౦ అనగా క్రీ. శ. ౧౦౬౮ ప్రాంతమున జరిగినట్లు తెలియుచున్నది. ప్రోలరాజు కుమాళ్ళు రుద్రదేవుడు, మహాదేవుడు. మహాదేవుడు దేవగిరివారితో కలిసి యున్నపై కుట్రలు పన్నుచుండిన ట్లీగ్రంథము చెప్పుచున్నది. గణపతిదేవుడు రుద్రదేవునికుమారు డని తోచునట్లు సిద్ధేశ్వర చరిత్ర చెప్పుచున్నది. తిక్కనసోమయాజి నెల్లూరునుండి వచ్చి గణపతిదేవుని సందర్శించె ననుకథ దీనిలో కలదు. మనుమసిద్ధి రాజుసహాయమునకై గణపతిదేవుడు సైన్యములనంపి యాతని రాజ్యమును సాధించిపెట్టెను. రుద్రమదేవి గణపతిదేవునిభార్య యని కంఠోక్తిగా చెప్పబడినది. ఈమె దేవగిరియాదవుల ఇంటి కన్యయని ఈగ్రంథాభిప్రాయము. రుద్రమ్మకూతురు ముమ్మక్క గణపతిదేవుని యల్లుడు చాళుక్యవీరభద్రుడు. కాని సర్వప్ప కాకతీయరాజులకు సమీపకాలమునం దున్నవా డయినచో నిట్లు పొరపడి యుండడు. ముమ్మక్క కుమారులు ప్రతాపరుద్రుడు, అన్నమదేవుడు అని చెప్పబడినది. అన్నమదేవుడు ప్రతాప రుద్రుని పినతల్లిపెనిమిటి యని ఇతరగ్రంథాధారములవలన తెలియుచున్నది.

ప్రతాపరుద్రునిచరిత్రము సవిస్తరముగ వర్ణింపబడినది. దీనిలో అద్భుతాంశములు, మాహాత్మ్యములు, పుక్కిటిపురాణములు మెండుగా నున్నవి. ఓరుగల్లునగరవైభవము, అచ్చట నుండు దేవాలయములు, పట్టణములోని వివిధవర్ణములవారి గృహసంఖ్య, ప్రతాపరుద్రుని ముఖ్యోద్యోగులు మొదలగు

సంశములపై ముచ్చటగొలుపు వివరము లెన్నియో గలవు. ఆ కాలపు కవులలో ప్రసిద్ధికెక్కినవారు పాల్కురికిసోమనాథుడు, శాకల్యమల్లికార్జునభట్టు, భాస్కరుడు, రంగనాథుడు, కృష్ణమాచార్యులను వైష్ణవభక్తుడు మొదలగువారు. ప్రతాపరుద్రుని మంత్రులలో పాలకుర్తిసూరప్ప యను నాత డుండుట గమనింపదగినది. పాల్కురికిసోమనాథుని పండితారాధ్యచరిత్రశ్రోతయైన పాల్కురికిసూరనామాత్యుడుప్రతాపరుద్రునిమంత్రియైనసూరప్ప కావచ్చును. ఆరాధ్యచరిత్ర నీతడు ప్రతాపరుద్రున కెరుకపరచినట్లు సిద్ధేస్వరచరిత్ర వర్ణించుచున్నది. గణతిదేవుని కాలమునుండియు శివదేవయ్యగారు కాకతీయుల సచివుడుగానుండెనట. ఈతనిప్రభావమాశ్చర్యకరముగా వర్ణింపబడినది. ప్రతాపరుద్రుడు నగరరక్షణభారమును పద్మనాయకవీరులపై బెట్టి వారిని మిక్కిలి సన్మానించెను. ఈ చక్రవర్తి సేనాధీశులలో అశ్వదళమున కధిపతి సాహిణిమారయయు, నవలక్షధనుర్ధరుల కధిపతి కొలిపాకసీదయయు పేర్కొనబడిరి. భాస్కరరామాయణములో కొన్ని భాగములు సాహిణిమారయకు సంకితము లయిన ట్లిదివరలో చదివినాము.

కాకతీయరాజ్యావసానదశను సిద్ధేశ్వరచరిత్రము శ్రద్ధతో వర్ణించినది. ఈ సామ్రాజ్య మస్తమించుట భగవదిచ్ఛ యను నట్లు శకునములుగాన్పించెను. తురుష్కులు మారువేషములతో ఓరుగల్లునసంచరించుచుండిరి. పద్మనాయకుల కీయబడిన ప్రాముఖ్యతకు ఇతరనాయక కులములవా రసూయపడినట్లు సూచనలు

గలవు. మహమ్మదీయు లేడుసార్లు నగరమును ముట్టడించియు ప్రతాపరుద్రుని పరాక్రమజంఝామారుతమునకు దూదిపింజలవలె నెగసిపోయిరి. కాని పద్మాక్షీదేవి కాకతీయవంశమునకిచ్చిన సహస్రవర్షపరిమితినిండెనట. కడపటి యుద్ధమునందు ఆంధ్రచక్రవర్తి చెరపెట్టబడెను. ఈ రణమునందు ప్రతాపుని సేనానియగు తేరాలబూచారెడ్డి యనువాడు వహించినపాత్ర సందేహాస్పదముగా నున్నది. ఇతడును మరికొందరును ఉల్లూఖానువద్ద లంచములుతిసిరేమో. ప్రతాపరుద్రుడు డిల్లీసుల్తానుచే సగౌరవముగ బందివిముక్తుడయి గోదావరీగర్భమునం దైక్యము చెందెనని సిద్ధేశ్వరచరిత్ర చెప్పుచున్నది. కాసె సర్వప్ప సమర్థుడగు కవికాకపోయినను మహోన్నతవిషయమును చేబట్టినవాడగుటచే స్మరింపదగియున్నాడు.

## అందుగుల వెంకయ్య.

ఈ కవి రామరాజీయ మను నామాంతరముగల నరపతి విజయమును వ్రాసి ఆర్వీటికోదండరామరాజున కంకిత మిచ్చెను. అందుగులవెంకయ్య నియోగిబ్రాహ్మణుడు. కృతిపతియైన ఆర్వీటికోదండరామరాజు కృష్ణదేవరాయల అల్లుడైన అళియరామరాయల మనుమని మనుమడు. అళియరామరాజు క్రీ.శ ౧౫౬౫లో తాళికోట యుద్ధమునందు నిహతుడయ్యెను. ఈ యుద్ధకాలమున కాతడు కడువృద్ధు డని పోర్చుగీసువారి వ్రాతలవలన తెలియవచ్చుచున్నది. కావున ఆతడప్పటికే మనుమలను మునిమనుమలను ఎత్తియుండును. ఇతని వంశీయుడైన కోదండరామ

రాజు క్రీ. శ. ౧౬౩౦ ప్రాంతమున నుండి నరపతివిజయమును కృతినొంది యుండవచ్చును. ఈ కావ్యమునకు మొదట పీఠిక వ్రాసిన గస్టవ్ ఆపర్టుదొరగారు నరపతివిజయము అళియరామరాజున కంకిత మీయబడెనని వ్రాసిరి. కాని ఇది సరికాదు. ఆర్వీటివంశక్రమము అళియరామరాజుతరువాత నైదు తరముల వరకును నరపతివిజయములో వర్ణింపబడినది. కావున నిది యళియరామరాజుకాలములో వెలసినది కాదనుటయే నిశ్చయము. రామరాజభూషణునివంటి ప్రసిద్ధమహాకవి యుండగా నాతనిని విడచి యప్రసిద్ధుడగు అందుగుల వెంకయ్యనుండి యళియరామరాజు కృతినందుకొనె ననుట విశ్వసనీయము కాదు.

నరపతివిజయము ఆర్వీటివంశముయొక్క శౌర్యవైభవ ప్రాభవములను వర్ణించుటకు పుట్టినకావ్యము. ఆ కాలమున విజయనగరాధీశులకు నరపతు లనియు, బహామనీసుల్తానులకు అశ్వపతు లనియు, కటకరాజేంద్రులకు గజపతు లనియు బిరుదు చెల్లుచుండెను. విజయనగరమువారు పదాతిసైన్యము నందును, సుల్తానులు గుఱ్ఱపుదళమునందును, ఓఢ్రపతులు ఏనుగుబలము నందును ఘనులగుటచే వీరికీ సంకేతము కలిగెనని చెప్పుదురు. తుళువవంశములో నత్యంతసమర్థుడైన శ్రీకృష్ణదేవరాయల తరువాత విజయనగరభాగ్యవిధాతలు ఆర్వీటివంశమువారు. సాళువవంశపువారి కాలమునుండియు నార్వీటివారు విజయనగరచక్రవర్తులకు కార్యఖడ్గములందు తోడ్పడుచుండిరి.

ఆర్వీటివంశావళిని చంద్రునివద్దనుండి వెంకయ్యయారంభించి వీరు చంద్రవంశపుక్షత్రియు లనుభావమును గనబరచెను. ఈ వంశచరిత్రము సామాన్యముగ తాతపిన్నమరాజుతో మొదలిడుచున్నది. తాతపిన్నమరాజు అన్వయములో ప్రసిద్ధుడైన యార్వీటిబుక్కరాజు జన్మించెను. ఈతడు పరాక్రమవంతుడై సాళువనరసింహరాజున కండయైయుండెను. ఈతనిబిరుదుగద్య ఇట్లున్నది. "జయ జయ, స్వస్తి శ్రీ సంతత వేంకటాచలపతిచరణారవింద సేవాకందళితసామ్రాజ్యసుఖోపభోగ, సాళువనరసింహరాయరాజ్యప్రతిష్ఠాపనాచార్య" ఇత్యాది. ఆ యా వీరుల సాహసవిక్రమాదులను బట్టి వారు బిరుదుగద్యములలో వర్ణించుచుండిరి. వీనియందు కొన్ని యతిశయోక్తు లున్నను మొత్తముమీద చరిత్రపరిశోధకుల కివి యమూల్యసాధనములుగా నుపకరించును. బుక్కరాజుమనుమనికొడుకు జగద్విఖ్యాతప్రాభవశాలియైన అళియరామరాయలు.

రామరాయలతండ్రి శ్రీరంగరాజు. రామరాయలతమ్ములు తిరుమలరాయలు, వేంకటాద్రి. ఈ యన్నదమ్ములు ముగ్గురును దుర్నిరీక్ష్యప్రతాపవంతులై విజయనగరసామ్రాజ్యము నమోఘముగ శాసించి సామ్రాజ్యశత్రువులైన మహమ్మదీయసుల్తానులతో నిరంతరయుద్ధములు చేసి విజయము నందుచు వచ్చిరి. రామరాయలు క్రీ. శ. ౧౫౪౨లో సదాశివరాయలను విజయనగరసింహాసనముమీద ప్రతిష్ఠించి రాజ్యాధికారమును తానే వహించుచు ౧౫౬౫లో తాళికోటయుద్ధమునందు మరణించు

వరకును నిర్నిరోధచక్రవర్తియై తేజరిల్లెను. ఈ మహావీరుని విజయ ప్రశస్తి కడుదీర్ఘమై యాతని యసంఖ్యాకవిజయముల నుగ్గడించు చున్నది. "జయజయ స్వస్తి. రణరంగరామ భద్ర, కళ్యాణపుర వరాధీశ్వర, త్రిభువనబిరుదుల వెన్నుసమ్మెట, విజయనగరసింహాస నాధీశ్వర గుత్తిదుర్గనిర్భేదన, ఆదవని దుర్గాపహరణ, పెను గొండదుర్గసాధక, రాచూరురాజ్యహరణధుర్య, బెడదకోట నగరసింహాసంహాసన, కలుబరగికోటపాటనధుర్య, నగరసమాక్ర మణధీర, పానగంటిదుర్గపాటనధుర్య" ఇత్యాది. అళియరామ రాయలు రక్షసతగడి (తాళికోట) సంగ్రామమునందు వీరస్వర్గమలంకరించిన వృత్తాంతమును నరపతివిజయము చెప్ప లేదు. నాయకుని యభ్యుదయమునే కవి వర్ణించునుగాని యాతనిమరణమును చెప్పుట మనయాచారము కాదుగదా!

అళియరామరాజు మరణానంతర మీతనిపెద్దతమ్ముడు తిరుమలరాయలు విజయనగరసింహాసనము నధిష్ఠించి యార్వీటి చక్రవర్తుల పరంపరనారంభించెను. వీరు గొప్పశూరులయ్యు సామ్రాజ్యపతనకాలమునందు రాజదండమును వహించినవారగు టచే నంతగా శోభిల్లకపోయిరి. తిరుమలరాయల కడపటి కుమా రుడు వీరవేంకటపతిరాయల కాలములో నాతడు సుల్తానుల యౌద్ధత్యమును నిలవరించగల్గుటచే సామ్రాజ్యము మరియొక వెలుగు వెలిగెను. ఈతడు గోలకొండవారిని నిబ్బరముగ నోడించి ఉభయరాజ్యములకును కృష్ణానదిని సరిహద్దుగా స్థాపించగలిగెను.

వేంకటపతిరాయల యనంతరులు సమర్థులు కాకపోవుటచే తిరిగి సామ్రాజ్యము విచ్ఛిన్నము గాజొచ్చెను.

నరపతివిజయమును కృతిపొందిన కోదండరామరాజు సామ్రాజ్యావసానదశయం దున్నవాడు. కవి యాతనిని విశేషముగ భూషించెను, కాని ఈతడు సాధించిన ప్రసిద్ధవిజయము లేవియు లేవు. ఈతనికాలమునందే కాబోలు మైసూరు ప్రాంతము స్వతంత్రతకై యత్నింపజొచ్చెను. కోదండరామరాజు మైసూరువారిని ఆననపురియుద్ధములో నోడించెనట. రామరాజీయకావ్యము చరిత్రకారుల కత్యంతోపయుక్తమైన గ్రంథము. అందుగుల వెంకయ్య చేసిన వంశప్రశస్తి చాల వరకు సత్యమేయని ఇతరాధారములవలన తెలియవచ్చుచున్నది. ఇది చారిత్రకకావ్యమైనను ఇందలి కవిత్వము మిక్కిలి సరసముగ నున్నది. ఈ కవి చిత్రకవిత్వమునందు తనకుగల నేర్పును ప్రదర్శించుటకై పద్యగర్భగతపద్యములను వ్రాసినను మొత్తముమీద రమ్యమైన శైలి నవలంబించినాడు.

ఈతని కవితాధార చూపుటకై ఈ క్రిందిపద్యము చాలును.

"రారాజే యభిమానశీలుఁడు, సుభద్రానాథుడే ధన్వి, కం
సారిప్రోద్భవుఁడే సురూపి, రవిజుఁడే యత్యుగ్రతేజుండు, మం
దారక్ష్మారుహమే ప్రదాత, విధుఁడే నందత్కళారాశి, మా
శ్రీరంగాధిపురామరాజమహిభృచ్ఛ్రీతాంశు వర్ణించుచోన్.

## కుమారధూర్జటి.

కృష్ణరాయవిజయ మను కావ్యము వ్రాసిన యీతఁడు శ్రీకృష్ణదేవరాయల యాస్థాన ములోనుండిన శ్రీకాళహస్తి మాహాత్మ్యమును వ్రాసినధూర్జటికి పౌత్రుని వంశమువాఁడు. శ్రీకృష్ణరాయవిజయము శ్రీకృష్ణదేవరాయల ఘనతను వర్ణించు చారిత్రక కావ్యము. దీనినిరచించుటకుముందు ఈ కవి సావిత్రీ చరిత్రము,ఇందుమతీవివాహము మొదలగు గ్రంథములు చేసెను. పెదధూర్జటినుండి వేరుచేయుటకై యీతనిని కుమారధూర్జటి యనియందురు. ఈతనినామధేయము వేంకటార్యుఁడు. ఈతఁడు పాకనాటార్వేల శాఖకుచెందిన నియోగిబ్రాహ్మణుఁడు. కాళహస్తినివాసి. జ్ఞానప్రసూనాంబికాదేవి యనుగ్రహముచే తనకు కవిత్వప్రాప్తి కలిగెనని యీతఁడు చెప్పుకొనెను. తాను ధూర్జటి పౌత్రుఁడ నని వెంకటార్యుఁడు వర్ణించుకొనెను.మరియొకపద్యమునందు ధూర్జటి తనపెదతాతయైనట్లు సూచించెను. కృష్ణరాయవిజయమును కృతిపొందిన యార్వీటి చినవెంకటరాజు కవితో నిట్లనెను.

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కెట్లుగల్గె నీ
యతులితమాధురీమహిమ నా మును మీపెదతాత చాలస
న్నుతిఁగనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభన్ విను మీవునట్ల మ
త్కృతబహుమానవైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్"

పెదతాతయనగా తాతయన్నగారు కావలెను. కాని పెదధూర్జటియు కుమారధూర్జటియు తాతమనుమలంత సన్ని

హితకాలములో నున్నట్లు కాన్పింపదు. కుమారధూర్జటి క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతమున నుండినవాడనియు, ఈతడు తనగ్రంథమును ఆకువీటిరాజయిన చినవేంకటాద్రి ప్రేరణపై వ్రాసె ననియు వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. ఆకవీటి చినవేంకటాద్రి పింగళిసూరనచే రాఘవపాండవీయమును చెప్పించిన యాకువీటి పెదవేంకటాద్రి తమ్ముడై యుండునని పంతులుగారు తలచి నట్లున్నది.

కృష్ణరాయవిజయమును ప్రోత్సహించినయాతడు యాకువీటిచినవేంకటాద్రియైనచో పంతులుగారి నిర్ణయము సముచితముగ నుండియుండును. కాని వేంకటామాత్యుకవిని ప్రేరేపించినవాడు అరివీటిచినవేంకటరాయడు. ఆకువీటిచినవేంకటాద్రియు ఆరవీటిచినవేంకటరాయడును ఒకరుకాదు. కృష్ణరాయవిజయమును చెప్పించిన యాతనియింటిపేరు ఆర్వీటివారని కవియొక పద్యములో ప్రాసస్థానమునందే ప్రయోగించెను.

"నిర్వాణప్రదదివ్యనామ..............................
యార్వీట్యన్వయ చిన్నవేంకటధరాధ్యక్షుర్చితాంఘ్రిద్వయా"

ఈయిరువుర తండ్రులపేర్లును భిన్నముగా నున్నవి. ఆకువీటిపెదవేంకటాద్రిగారల తండ్రిపేరు మీసాలతిమ్మశౌరి. కృష్ణరాయవిజయమును ప్రోత్సహించిన యార్వీటిచినవేంకటరాయని తండ్రి కోదండరామరాజు. తల్లి నాంచారమ్మ. నాంచారమ్మ భర్తయైన కోదండరామరాజు అళియరామరాజు ముసిమనిమనుమడు.

అందుగుల వెంకయ్య రచించిన రామరాజీయము ను కృతి పొందిన వాడీతడే. వెంకయ్యకవి క్రీ.శ. ౧౬౫౦ ప్రాంతమున నుండియుండు నని వీరేశలింగముపంతులుగారే వ్రాసిరి. నరపతివిజయకృతిపతి క్రీ.శ. ౧౬౩౦ ప్రాంతమున నుండియుండు నని ఇదివరలో వ్రాసితిని. కావున ఈతనికుమారుడైన చినవేంకటరాయడును, ఆతని మన్ననలను పొందిన కుమారధూర్జటియు ౧౬౫౦ ప్రాంతమున నుండియుందురు. ఈ పరిగణనమునుబట్టి పెదధూర్జటికిని కుమార ధూర్జటికిని నడుమ నూటముప్పది సంవత్సరముల వ్యవధి కాన్పించు చున్నది. కావున వేంకటామాత్యకవి ధూర్జటిపౌత్రుడనట ఔప చారికముగమాత్రమే గ్రహింపవలసియుండును. "మునుమీపెద తాత"యని చెప్పినదానిలో దీర్ఘభూతకాలమే సూచితమైన దని యెంచవలెను. మనలో తాతపేరు మనుమనికుంచుట యాచార ముగాన పెదధూర్జటిమనుమ డొకధూర్జటి యుండెననియు నాతడే కుమారధూర్జటితాత యనియు నూహింపవలెను. కాళహస్తీశ్వర శతకమును వ్రాసిన ధూర్జటియెవ్వరో నిర్ణయము కాలేదు. శతక కర్త ప్రబంధకర్తయైన ధూర్జటిమనుమడో? కుమారధూర్జటి శైలియు చిత్రకవిత్వప్రీతియు నాతడు పదునేడవశతాబ్దపు కవియనుటనే సమర్థించును.

కృష్ణరాయవిజయము అరవీటి చినవేంకటరాజు ప్రేరణచే శ్రీరామాంకితముగా వ్రాయబడినది. నరపతివిజయములో నున్నంతవిస్తరముగను సప్రమాణముగను చారిత్రకాంశములు దీనిలో లేకున్నను శ్రీకృష్ణదేవరాయలవారి పరిపాలనావిశేష

ములు దీనిలో చక్కగా వర్ణింపబడినవి. రాయవాచక మనబడు వచనచరిత్రగ్రంథము నిదివరలో పేర్కొని యున్నాను. అందలి యంశములే కృష్ణరాయవిజయమందును గానవచ్చుచున్నవి. ఇవి యొకదానినొకటి చూచి వెడలిన గ్రంథములుగా తోచును. విద్యానగరనిర్మాణవృత్తాంతముతో కృష్ణరాయవిజయ మారంభమగుచున్నది. విజయనగరంపువైభవము నీ కవి ముచ్చటగా వర్ణించెను. తాళికోటయుద్ధానంతరము ఈ మహానగరము జీర్ణావస్థలో నుండుటచే కుమారధూర్జటిచేసిన వర్ణనము నాతడు వినినయంశములపై నాధారపడి వ్రాసినది కావచ్చును. మహమ్మదీయులువిజయనగరమును దోచుకొనుట వాస్తవమే యైనను దానిని వారు నేలమట్టము చేసిరనుట యతిశయోక్తి యనియు ఆనగరరాజము నిజముగా నిర్జనము కాలేదనియు, తాళికోట యుద్ధము తరువాత చాలసంవత్సరములవరకుకూడ నదివర్తక సరళికిమూలముగా నుండెననియు "ఫాదరుహేరాస్సు" పండితుడు వ్రాసెను. నరపతివిజయమును కృతిపొందిన కోదండరామరాజు తమ్ముడు తిమ్మరాజు విజయనగరములోని విరూపాక్షదేవుని యాలయమును పునరుద్ధరించెనట. విజయనగరము నిర్మానుష్యమైనచో నిది జరిగియుండదని "హేరాసు" దొరవ్రాసినది యుక్తముగనే ఉన్నది.

తుళువనరసరాయలతరువాత కృష్ణదేవరాయలే రాజ్యమునకు వచ్చినట్లు కుమారధూర్జటి వ్రాసెను. కాని కృష్ణరాయలకు ముందాతని సవతియన్న వీరనరసింహరాయలు నాలుగు

సంవత్సరములు రాజ్యము చేసెను. రాజ్యమునకు వచ్చిన వెంటనే కృష్ణరాయలు విజయనగరముయొక్క ఆర్థికస్థితిని సమూలముగ పరీక్షించి లెక్కలను తెప్పించెనట. తరువాత నాతనిదృష్టి సైన్యముపై ప్రసరించి దానియందు కట్టుదిట్టములు చేసెను. ఈ కార్యవిధానములందు మంత్రితిమ్మరసు రాయలవారికి బాసటగా నుండెను. ఇట్లు సామ్రాజ్యముయొక్క అంతర్వ్యవస్థను దిట్టముచేసి కృష్ణరాయలు దిగ్విజయమునకై వెడలెను. ఉమ్మత్తూరు శివసముద్రము పాలించు గంగరాజులజయించి దక్షిణమున శత్రువులు లేకుండచేసికొని చక్రవర్తి మహమ్మదీయ సుల్తానులపై దాడివెడలెను. రాయలు రాయచూరు ముదగల్లు కోటలను స్వాధీనము చేసికొనెనట, కృష్ణానదివద్ద మహమ్మదీయుల సంయుక్తసైన్యసముద్రము నవలీలగా నోడించి తరమివేయుట లోనగు వీరకార్యములను కుమారధూర్జటి ఆంధ్రులుచదివి గర్వించదగినట్లు వ్రాసినాడు. తరువాత కటకవిజయమును, కటకాధిపతికూతురగు తుక్కాదేవిని కృష్ణరాయలు పెండ్లియాడుటయు జరిగినది. ఈయుదనుకల్పించుకొని ప్రబంధోచితవర్ణనములన్నిటిని కుమారధూర్జటి నెరపెను. ఈతని శైలి నాతికఠినమై వీరరసవర్ణనమునకు తగునట్లు చేవగలిగి యొప్పారినది. పురాణపురుషులనువిడచి శుద్ధాంధ్రవీరులనే కావ్యవర్ణనీయులుగా గ్రహించిన యీకవి దేశాభిమానము పొగడదగినది.

## దిట్టకవి నారాయణకవి.

ఈతడు బొబ్బిలియుద్ధ వృత్తాంతమును రంగరాయచరిత్ర యను పేర మూడాశ్వాసముల ప్రబంధముగ రచించెను. చరిత్రదృష్టితో చూచినచో బొబ్బిలియుద్ధ మొక చిన్న సంఘటనము. స్థానిక చరిత్రయందుమాత్రమే దీనికి ప్రాధాన్యత కలదు. అయినను ఇది వీరరసాత్మకమైన కావ్యమై ఉన్నంతలో స్వల్పచరిత్రాంశములను ప్రకటించుచుండుటచే ఆదరణీయమగుచున్నది. దిట్టకవి నారాయణకవి నియోగిబ్రాహ్మణుడు. ఈతడీకావ్యమును బెల్లముకొండదుర్గాధిపతియు పద్మనాయకవంశజుడు నగు మల్రాజు రామారాయనింగారి కంకిత మిచ్చెను. * కవి తాను శ్రీరామభక్తుడ నని చెప్పుకొనెను. బొబ్బిలియుద్ధము క్రీ. శ. ౧౭౫౭ సంవత్సరమున జరిగినది. దీనిని కావ్యములో వర్ణించిన దిట్టకవి నారాయణకవి ౧౮౭౦ ప్రాంతమున నుండెనని వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి.

ఆంధ్రులు ప్రాచీనకాలమునుండియు వీరవ్రతప్రియులు. వీరగాథలయందు వారికి ప్రీతిమెండు. కావుననే మహాభారతము మనకు జాతీయకావ్యమైనది. భారతముతరువాత నాంధ్రుల హృదయముల నాకట్టినవీరకథ పల్నాటివీరచరిత్ర. ఆంధ్రదేశములో నాబాలగోపాలమునకును పరిచితమైన మరియొక శౌర్యకథనము బొబ్బిలియుద్ధము. ఆంధ్రవీరుల పౌరుషకలాపమునందు

---

* ఇష్టదేవతాస్తుతిలో నారాయణకవి ఈపూరీపురవీరభద్రుని స్తుతించెను. ఈపూరుగ్రామ మెచ్చటిదో తెలియరాలేదు.

మహాభారతరణశూరుల సత్యపరాక్రమము ననుసంధించుకొనుట మనవారి కిష్టము. బొబ్బిలియుద్ధమునందు పాల్గొనిన వెలమ వీరులు ఆంధ్రుల నిశ్చలనిష్కళంకితపవిత్రమమునకు అజరామర మైన కీర్తిని సంపాదించి పెట్టిరి. వారిరంగస్థలము చిన్నదే కావచ్చు. "చిన్నచేతిదివ్వె పెద్దగా వెలుగదా" యని వేమన్న పలికినాడు. మల్రాజు రామారాయనింగారు దిట్టకవి నారాయణ కవిని సంభావించి యిట్లు పలికెను.

> భారతయుద్ధమట్టు లతిభాసురతం గనుపట్టుచు న్మహా
> వీరరసప్రధానమయి వేడుక నించెడు రావువారి దు
> ర్వారరణప్రసంగ మతిరమ్యతరం బదిగద్యపద్యసం
> భారయుతంబుగా నొక ప్రబంధ మొనర్పు మదంకితంబుగన్.

కవికిగూడ నిది యభిమతము. ప్రస్తుతకాలమందలి మహా వీరుల చరిత్రను ప్రబంధింపవలయునని యాతడును కుతూహలము తోనున్నట్లీ క్రిందివాక్యములు తెల్పుచున్నవి. "ఇదానీంతనమహా వీరపురుషపౌరుషరసానుబంధబంధురంబగు నొక్క ప్రబంధంబు రచియింపగోరి యున్నసమయంబున" బొబ్బిలియుద్ధచరిత్ర వర్ణింపు మని కృతిపతికోరెను.

రంగరాయచరిత్రమునందు బొబ్బిలిసంస్థానచరిత్ర సంగ్రహముగ చెప్పబడినది. శ్రీకరము పరమపవిత్రము నగు విష్ణు పాదమునుండి పద్మనాయకకులము జన్మించెను. వేంకటగిరి సం స్థానాధిపతులగు రావువారు వీరిలో సర్వమాన్యపీఠస్థులై నెగ

డిరి. అనపోతానాయుడు సర్వజ్ఞసింగభూపాలుర కీర్తి యుగ్గడింప బడినది. రావువారిలో అనపోతవిభు డారవవాడనియు, రసార్ణవ సుధాకరకర్తయగు సింగభూపాలుడు పదియవవాడనియు రంగ రాయచరిత్ర నుడువుచున్నది. వేంకటగిరిభూపతులలో పదునైదవవాడగు పెదరాయనింగారు బొబ్బిలికోటను స్థాపించిరి. ఆకాలమునందు శ్రీకాకుళము సర్కారునకు షేర్ మహమ్మదుఖానుడు మొగలాయీల ప్రతినిధిగా నుండెను. § విజయనగరసంస్థానమునకు మూలపురుషుడైన మాధవవర్మ రాజును వేంకటగిరిపెద్దారాయడును, షేరుమహమ్మదుఖానునకు యుద్ధములలో తోడ్పడుచుండిరి. పెద్దారాయనింగారు తమ సేవలకు ప్రతిఫలముగ పాదుషాలనుండి రాజామును సంస్థానముగా బడసి నూతనదుర్గమునొకదానిని నిర్మించి షేరుమహమ్మదుఖాను గౌరవార్థము కాబోలు దానికి బెబ్బులి యని పేరిడిరి. ఇదియే బొబ్బిలి యాయెనందురు. సంస్థానము నిచ్చునప్పుడే పెద్దరాయనింగారికి వంశక్రమాగతముగా రాజాబహాదరు మొదలగు బిరుదులును, తెల్లజెండా నవుబత్తు మున్నగు రాజచిహ్నములును పాదుషావలన లభించెను. ఉత్తరసర్కారులు (ఈపదము నారాయణకవిది) యుద్ధపుసందడి దక్కి శాంతించినతరువాత పెద్దారాయనింగారు పితృపైతామహరాజ్యమయిన వేంకటగిరికి తరలిపోవుచు తమ కుమారుడు లింగపరాయని తమ నూతనరాజ్యమునందు నెల

§ ఈ విజయనగరము విశాఖపట్టణమండలములో నున్నది. హంపి విజయనగరము వేరు.

కొల్చిరి. లింగపరాయడుకూడ శ్రీకాకుళపు మహమ్మదీయ రాజ ప్రతినిధికి ముఖ్యస్నేహితుడుగ నుండెను. తురక సేనానికుమారు డొకమారు శత్రువులవలన చెరబెట్టబడగా లింగపరాయడు వారు అతనిని విడిపించిరి. కృతజ్ఞతాబద్ధుడగు శ్రీకాకుళఫౌజు దారుడు హైదరాబాదు నిజాంవారికి నీ వెలమప్రభువు పరాక్ర మాదికమును శ్రుతిపరచగా నిజాంగారు బొబ్బిలివారికి 'రంగా రావు' అను వంశక్రమాగతమైన బిరుదు ప్రసాదించిరి. మరియు నొకరాత్రిలో బొబ్బిలివా రెంతదేశ మాక్రమించగలరో అంత దేశము వారికి రాజ్యముగా నిచ్చెనట. ఇట్లు రంగారా వనునది బిరుద మని తెలియుచున్నది. బొబ్బిలి యుద్ధము జరుగునాటికి ప్రభువుగానున్నవారు శ్రీ గోపాలకృష్ణరంగారావుగారు. వీరి తమ్ముడు వేంగళ్రాయుడు. ఈ యన్నదమ్ము లిర్వురును కుమార పరాక్రములు. రంగారావుగారి శీలము పాండవాగ్రజుని శీలము వలె సత్యశాంతతావిభూషిత మైనది.

ఈకాలమున విజయనగరమున కేలికయగు విజయరామ రాజుగారు బొబ్బిలివారి శౌర్యవైభవప్రాభవములకు వెరచి వారి నెట్లైనను చిత్తు చేయవలెనని పన్నాగములు పన్నుచుండిరి. హైద రాబాదు నవాబగు నిజామల్లీఖానుగారు ఫ్రెంచివీరుడగు బుస్సీకి కళింగసర్కార్లనిచ్చి, "ఉద్ధతలములుక్కగజఫరుజంగుసిపహాసర దారుగా రనెడి దొడ్డకితాబు లిచ్చి "పంపగా నాతడు రాజమ హేంద్రవరమువచ్చి కోటిలింగక్షేత్రముకడ దండువిడిసెను. హైదరుజంగను యవనుడు బుస్సీకి మంత్రిదండనాథుడుగా

నుండెను. అట్లు మకాము చేసిన ఫ్రెంచి సేనాని కళింగసర్కార్లలో నున్న రాజులందరిని దర్శనమునకై రమ్మని తాకీదులు పంపెను. రాజశాసనమందుకొని కిమిడి పట్టణాధీశ్వరుడైన నారాయణదేవుడును నరసరాజును గొలుగొండ మన్నెరాజును బూసీ సందర్శనార్థము వచ్చిరి. నలువదివేల సైన్యములతో భూమిబ్రద్దలగునట్లు భయంకరాటోపముతో విజయరామరాజుగారు వచ్చి ఫ్రెంచినాయకుని కొలువు చేసికొనిరి. బొబ్బిలిరంగారావుగారు మాత్రము రాలేదు. బొబ్బిలివారు రాకుండుటకు కారణము రంగరాయచరిత్రవలన విశదమగుటలేదు. శ్రీకాకుళపుసర్కారును ఫ్రెంచివారు విజయరామరాజుగారికి కౌలుగా నిత్తురని విని తన భావిస్థితికి లోటువచ్చునని వెరచి రంగారావుగారు రాలేదని వీరేశలింగము పంతులుగారు వివరించిరి. విజయరామరాజుగారు హైదరుజంగు నాశ్రయించి పండ్రెండు లక్షలు లంచమిచ్చుటకు వాగ్దానముచేసి ప్రసన్నుని గావించుకొని బొబ్బిలివారికి విరుద్ధముగ కొండెములు చెప్పి యాఖానుని ఆగ్రహావిష్టునిచేసెను. శ్రీకాకుళపు సర్కారును తన కిప్పించుటకును బొబ్బిలిగడీలో తన్ను పట్టాభిషిక్తుని చేయుటకును వాగ్దానము గొనెను.

ఈ వార్తలు పొక్కి బొబ్బిలిరంగారావుగారు ప్రతివిధానమాలోచించిరి. బందరు పురాధినేతయగు గోరుందొరయు, ఆయనవద్దనున్న మద్దాల రెడ్డినాయుడును తమకు హితులగుటచే నా దొరవద్దనుండి మూసాబూసీకి సిఫారసు ఉత్తరమును గొని వచ్చుటకై మంతెనబుచ్చనయను నాతని పంపిరి. ఈలోపులో

హైదరుజంగు ప్రేరణపై పరాసువారును విజయనగరసైన్యములును
రాజమహేంద్రవరమునుండి కదలి పెద్దాపురముమీదుగా కసిం
కోట చేరిరి. బందరునుండి గోరుందొరపంపిన మర్కైను అను పరాసు
నాయకుడును మంతెనబుచ్చనయు గోరుందొరయుత్తరముతో
బూసీని కసింకోటవద్ద దర్శించిరి. విజయరామరాజుకును బొబ్బి
లివారికిని ప్రాతపగలు కలవని తెలిసికొని రంగారావుగారిని
శిక్షించు నుద్దేశమున బుస్సీ తాత్కాలికముగా విడిచి సైన్య
ములను బొబ్బిలిమార్గమునగాక సికాకోళమునకుతిన్నగా నడుపు
మని హైదరుజంగున కాజ్ఞయిచ్చెను. బొబ్బిలి వినాశనమున
కుద్దేశించిన తమతంత్రమిట్లు విఘాతమగునని ఖానుడును రాజును
చకితులైరి. రంగారావుగారివద్దనుండి ద్రవ్యములాగుటయే తన
యభిప్రాయమని చెప్పి తురుష్కుడు బుస్సీని యూరడించి
బొబ్బిలివారిని సందర్శనమునకై రమ్మని తీక్ష్ణముగ వార్తపంపెను.
దామెర్లదమ్మన్నను రంగారావుగారు హైదరుజంగు కడకంపి
వాని దయసంపాదించుటకై సగౌరవముగ యత్నించిరి. కాని
ధనాశావిష్టుడును విజయరామరాజుగారి జేబులోనున్నవాడును
అగు నాఖానుడు బొబ్బిలి వారు కోటవిడిచి పోవలసినదని పరుష
ముగా సమాధానమిడెను. శత్రుసైన్యములు కసింకోటనుండి
యొడ్డాదిమీదుగా దేవులపల్లి చెంత దిగిరి. ముసల్మానుసైన్య
ములు బొబ్బిలి సరిహద్దులకు వచ్చిన వార్త విని రంగారావుగారు
చెలికాని వెంకయ్యగారిచే తిరిగి రాయబారము నడిపిరి. వలసి
నంతధనమిచ్చుట కొడబడిరి. తాబట్టినకుందేటికిమూడేకాళ్లను

పట్టుదలగల హైదరుజంగు మెత్తబడక బొబ్బిలివారు పుత్రమిత్ర కళత్రములతో కోటవిడిచిపోవలసిన దని తిరిగి యాజ్ఞాపించెను. విజయరామరాజు సైన్యములుతప్ప మిగిలిన పరాసుమున్సల్మాను సైన్యములు కోటలోనికి రావచ్చుననియు, అట్లైనచో రంగారావుగారు తాత్కాలికముగ కోటవెడలి బయటనుందురనియు చెలికానివెంకయ్యగారు సూచించిన సామమార్గముకూడ ఖానునకు సమ్మతి గాలేదు. విఫలప్రయత్నుడై వెంకయ్యగారు వెడలిపోయి యుద్ధము తప్పదనియు బలవంతులును అగ్నేయాస్త్ర సమృద్ధులునగు పరాసువారితో తలపడి సంఘాతమరణము నొందుటకన్న స్త్రీబాలవృద్ధులనురక్షించుకొనుటకై కోటను త్యజించుటయే నీతిమార్గమనియు రంగారావుగారికి నుపన్యసించిరి. కాని యా వీరాగ్రణి చలించకయిట్లు పలికెను.

వేపిఁజేపట్టి గజరాజు విడిచినట్ల
గత్వరములైన ప్రాణముల్ గాచికొనుట
కాపృగాం కార్క-తారాగ్రహంబుగాగ
వెలయు సత్కీర్తి గోల్పోవు వెట్టి గలఁడె.

మూసాబూసీకి బొబ్బిలివారిపై క్రోధము రెప్పించిన మరియొక సన్నిహితకారణమును వీరేశలింగముపంతులుగారు వివరించిరి. రంగారావుగారి యనుమతిపై కొందరు ఫ్రెంచివారిసైనికులు బొబ్బిలిరాజ్యముమీదుగా పోవుచుండగా, పొరపాటుననో మరేకారణముననో బొబ్బిలిసైనికులు వారిమీదపడి సంహరించిరట. హతశేషు లీవార్తను బుస్సీకి వినిపింపగా నాతడు నిజానిజము

లారయు నోపికలేక బొబ్బిలికోటను విధ్వంస మొనర్చుటకై యాజ్ఞపాలించెను. ఈ యుద్ధక్రమమును దిట్టకవి నారాయణకవి మహాభారత యుద్ధమువలె వీరరసోచితముగ వర్ణించెను. శత్రుపక్షమున లాసుఖాను, చంద్రాల్మహమ్మదు, సిద్ధీబిలాలు మొదలగు రణధుర్యులుండిరి. వెలమవీరులవంక కాకర్లపూడి వెంకటరాజు, ఇనుగంటిధర్మారాయుడు, చెలికానివెంకయ్యగారు, దామెర్లధర్మారాయుడువంటి వీరరసమూర్తులు నిలిచిరి. ఈ ధారుణసంగ్రామాగ్ని క్రీ.శ. ౧౭౫౭ సంవత్సరము జనవరి ౨౪ తేదీ సూర్యోదయమున నారంభించి భానుడస్తంగతుడగు లోపల అపారజననష్టముతో నిరపరాధుల రక్తవాహినులతో చల్లారినది. ప్రాతఃకాలమున కలకలలాడుచుండిన బొబ్బిలి నగరము సాయంకాలమునకు దహ్యమానశ్మశానమయ్యెను. నారాయణకవి రచన పుష్టిగలిగి యున్నది. ఈతఁడాకాలమున తెనుగులో ప్రవేశించిన ఉరుదుభాషాపదములను విస్తారముగా వాడి కావ్యశైలి కొకవింత రీతి నాపాదించియున్నాడు.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## పదునాల్గవ ప్రకరణము.

### యక్షగానములు. *

యక్షగానము లనగా సంగీతప్రాధాన్యముగల నాటకము. తెలుగులోని పూర్వనాటకస్వరూపము యక్షగానములు. వీటిని యక్షగాననాటకము లనుటయు, యక్షగానప్రబంధము లనుటయు కూడ గలదు. ఈ తెగరచనలో నాటకలక్షణమైన సంభాషణములును ప్రబంధలక్షణమైన వర్ణనములును గూడ ఉండును. కావున నీ రెండుపేరులును వీటికి చెల్లుచుండినవి. యక్షగానముల కీ పేరెట్లు వచ్చినది? ఇవి ఏ నాటినుండి మనభాషలో వెలసినవి? యను ప్రశ్నలు జనించును. యక్షులచే గానముతో కూడుకొనునట్లు ఆడబడునాటకము లని ఈ పదమున కర్థము చెప్పవచ్చును. యక్షు లనగా జక్కులవాండ్రు అనబడు నొక తెగవారు. వీరివృత్తి చిన్నచిన్ననాటకములను సంగీతబాహుళ్యముగా ప్రదర్శించి జనులను రంజింపజేసి ధనార్జనము

---

* యక్షగానముల పుట్టుపూర్వోత్తరములనుగురించి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవవిజయయక్షగానమునకు వ్రాసిన అమూల్యమైన పీఠిక చదువుకొనదగును.

చేయుట. యక్షశబ్దమునుండి పుట్టినదే జక్కులవాడు అను పదము. ఈ జక్కులవాండ్రు యక్షకిన్నరకింపురుషాది దేవజాతులలోని వారు కాకపోవచ్చును. వృత్తిచేతనే వీరు యక్షులు, జక్కులును అయిరని ఊహింపవలెను. తాము ప్రదర్శించు నాటకములలో వీరు వివిధపాత్రధారణము చేయుచు ఒకప్పుడు యక్షులుగను మరొకప్పుడు దేవతలుగను వేషములు వేసు కొనుచుండుటచే వీరికి యక్షులు, జక్కులు అను సంజ్ఞ యేర్పడి యుండును. క్రమముగ నది వీరికులనామముగా స్థిరపడెను. జక్కులతెగ చిరకాలమునుండియు ఈ వృత్తిలో నున్నట్లు గాన్పించును. ఒకానొక రాష్ట్రకూటశాసనములో జక్కులప్రశంస వచ్చినది. క్రీడాభిరామములో శ్రీనాథమహాకవి జక్కులస్త్రీని వర్ణించి యున్నాడు.

నాటకప్రదర్శనము తెలుగుదేశములో ప్రాచీనకాలము నుండియు కొద్దికొద్దిగా జరుగుచునే యుండెడిది. పాల్కురికిసోమనాథుని పండితారాధ్యచరిత్రములో ఆ కాలపు రూపకప్రదర్శన రీతులు కొన్ని వర్ణింపబడినవి. వీనిలో వీధినాటకములు, తోలుబొమ్మలాటలు, గంధర్వయక్షవిద్యాధరుల వేషములుదాల్చి నటకులాడుట మొదలగునవి ప్రశంసింపబడినవి. రూపకావిర్భావములో మొదటిదశ కురవంజులు వెడలుట.

కురవంజి, కొరవంజి అను పదమునకు అర్థము కురవలను ఆటవికుల నృత్యవిధానము. కురవలు కోయజాతికి చెందినవారు. వీరు నృత్యప్రియులు. నృత్యముచేయునప్పుడు వీరు వేయు అంగలు

గంతులు, అంజె అనబడినవి. కురవలు నృత్యముచేయురీతి కురవంజి యనబరగినది. పర్వతప్రాంతములందు నివసించు కురవలు మొదలగునాటవికజాతివారు యాత్రాసందర్భములలో ప్రేక్షకుల ముందు తమ నృత్యములు చూపి డబ్బుగడించుకొనుట యాచారము. మొదటమొదట ఈ నృత్తము అంగవిన్యాసరూపముగామాత్ర ముండెడిది, పాటపద్యములు లేకుండెడివి. కొంతకాలమునకు చిన్న గేయములు పాడుచు వీరు నృత్యము చేయుట కలవడిరి. దీనిపరిణామదశలో వేషధారణము, లఘురూపకముల నాడుటయు నేర్పడినవి. ఈ దశలను ఉద్దేశించియే కాబోలు దశరూపకమునందు నృత్తనృత్యనాట్యములను మూడు అవస్థలను ధనంజయుడు నిరూపించెను. నృత్తము కేవలము తాళలయాన్విత మనియు, నృత్యము పదార్థాభినయాత్మక మనియు, నాట్యము వాక్యార్థాభినయాత్మక మనియు నాతడు నిర్దేశించెను. నాట్యమే రూపకములకు బీజమైనది.

కురవలనాటకములు రూపకనిర్మాణములో ప్రథమప్రజాయత్నము లగుటచే నివి అసంస్కృతములైయుండుట సహజము. వీనిలో ఇద్దరుపాత్ర లుండును. సింగి, సింగడు అనబడు వీరు సంస్కృతనాటకములలోని నటీసూత్రధారులవలె భార్యాభర్తలు. వీరి నాటకకథలు పర్వతారణ్యజీవితమునకు సంబంధించినవి. నృసింహస్వామి చెంచుపడతిని పెండ్లాడు కథ వంటివి వీరి నాటకముసందితివృత్తములు. నాటకప్రదర్శనమునందు హాస్యమునకు ప్రముఖస్థానము కలదు. అది లేనిదే పామరులగు ప్రేక్షకులను

రంజింపచేయుట కష్టము పామరులకే కాదు. పండితులకును విద్యాధికులకును గూడ హాస్యము ప్రీతిదాయకమే. కురవనాటకములో హాస్యసందర్భములకై మూడవపాత్ర యొకడు 'కోణంగి' యను పేర ప్రత్యక్షమయ్యెను. ఈతడు సంస్కృత నాటకములలోని విదూషకుడు. కురవంజులలో మొదట నృత్యము విస్తారముగను, గేయము తక్కువగను ఉండెడిది. క్రమముగా గేయభాగము వృద్ధినొంది యీ ప్రదర్శనములు సంగీతప్రధానము లైనవి. ఇట్టి కురవంజులు ఆటవికులమూలమున పట్టణములకు ప్రాకి నగరకవులు కురవంజులవంటి రచనలు చేయసాగిరి. వీటిని ప్రదర్శించువారు జక్కులుగనుక నివి యక్షగానము లనుపేరు దాల్చెను.

కురవంజులు అనాగరకులైన యాటవికుల దృశ్యకావ్య రీతులు. యక్షగానములు సభ్యులైన కవుల దృశ్యరచనలు. యక్షగానములలో నృత్య భాగము సన్నగిల్లినది. గేయభాగము ప్రాధాన్యత వహించినది. కథావస్తువులలోకూడ మార్పు గలిగినది. పురాణప్రసిద్ధములైన కథలు నలహరిశ్చంద్రాదులకథలు, రామాయణమహాభారతములు, యక్షగానములలోని ఇతివృత్తము లైనవి. కురవంజులలో రెండుమూడుపాత్ర లుండగా యక్షగానములలో అనేకపాత్రలు ప్రవేశపెట్టుట జరిగినది. హాస్యము యక్షగానములలో కూడ తలచూపినది. యక్షగానములలో కథను కలుపుటకు వచనములుండును. అప్పుడు దశరథు డేమనుచున్నాడు. ఈరీతి వాక్యములను సూత్రధారుడు చదువును. వచనవాక్యములు,

వర్ణనములు యక్షగానములలో ఎక్కువగా కన్పించును. ఒకపాత్ర ప్రవేశించునప్పుడు ఆ పాత్రవేషధారణమును అలంకారములను కవి వర్ణించును. ఇట్లు వర్ణింపబడినపాత్రలు ప్రవేశించి తమయాటపాటలను ప్రదర్శింతురు. కవివాక్యములు స్వల్పముగనుండి వర్ణనములు తక్కువగా నున్న యక్షగానములు నాటకత్వమునకు దగ్గరగా నుండును. వర్ణనాభాగము విస్తారముగా గలవి ప్రబంధములవలె నుండును. యక్షగానములలో ద్విపదలు, సీసపద్యములు, కందములు మొదలగువానితోపాటు ఆయాతాళములకు అనువుగ కూర్చబడిన గేయము లుండును. దరువులనబడు గేయములు తరచుగా నుండును. యక్షగానములలో దేశిరచనలు విరివిగా ప్రవేశించినవి. ఏలలు, జోలలు,సువ్వాలలు,ధవళములు శోభనములు, కందార్థములు,చందమామసుద్దులు,అల్లోనేరేళ్ళు, తుమ్మెదపదములవంటి వెన్నియో మధురకవితాఫణితులు గాన్పించును. వీనిలో అంకభజనము అక్కడక్కడమాత్రము కనబడును. శ్రీ త్యాగరాయలవారు వ్రాసిన ప్రహ్లాదభక్తివిజయనాటకములో అంకవిభజన మున్నది. యక్షగానములవంటివే అయిన దృశ్యరచనలు మనభాషలో కలవు. వీటిని వీధినాటకములు వీధిభాగవతములు అందురు. ఇందు భక్తిశృంగారములకు అగ్రస్థాన మీయబడును. ఈ భాగవతకథలలో పారిజాతాపహరణవృత్తాంతము ఎక్కువ ప్రజాదరణమును బడసినది. భాగవతప్రదర్శనమునందు కూచిపూడిభాగవతులకు విశిష్టగౌరవస్థానము గలదు. వీరి నృత్యము సశాస్త్రీయమై భరతకళాసంప్రదాయమున

కతువ్యక్త మోదాహరణమై భావభరితమై యొప్పుచున్నది. కూచిపూడివారిలో స్త్రీపాత్రములను పురుషులే ధరించి నటింతురు. కిరాతార్జునీయము, గరుడాచలము, త్రిపురసంహారము పార్వతీపరిణయము, గంగాగౌరీవిలాసము ఇట్లెన్నియో యక్షగానకథలు ప్రచారములో నున్నవి.

కొన్ని యక్షగాననాటకములను బరిశీలించినచో వాటిని స్థానలక్షణములు గుణావగుణములు తెల్లమగును.

సుగ్రీవ విజయము.

ఇంతవరకు దొరకిన యక్షగానములలో సుగ్రీవవిజయము ప్రాచీనముగా దోచును. దీనిని రచించినవాడు కందుకూరిరుద్రకవి. నిరంకుశోపాఖ్యానము ప్రబంధమును వ్రాసిన యీతడు ౧౬వ శతాబ్దియంతమం దుండెనని చెప్పనైనది. రామాయణకథలో సుగ్రీవవృత్తాంతము మంచికథాఘట్టము. హనుమంతుడు రామలక్ష్మణులను ప్రథమమున సందర్శించుటతో నిది యారంభించి వాలివధ, సుగ్రీవపట్టాభిషేకముతో సమాప్తమగును. సప్తతాళభంజనము, దుందుభికాయము నెగదన్నుట, వాలిసుగ్రీవులయుద్ధము, రాముడు చెట్టు నుండి వాలినిగూల్చుట మొదలగు కథలు రామాయణమునం దున్నట్లే యున్నవి. ఇందులో తారవాలివధకై దుఃఖించి శ్రీరాముని దూఱుభాగము మిక్కిలి చైతన్యవంతమై యున్నది. తారమాటలు:—

"ఆలి చెఱఁగొని పోయినట్టి దశాస్యుఁడుండఁగ నిర్నిమిత్తము
వాలి నేటికి జంపితివి రఘువంశతిలకా
ఇట్టి సాహసకర్మ మెచటికి నేఁగె భరతుఁడు నీను వెడలఁగఁ
గొట్టి రాజ్యము పుచ్చుకొన్నెడఁ గువలయేశా"

ఈ యక్షగానము వీరకరుణారసభరితము. ఇందు ద్విపదలు, వచనములు, దరువులు, అర్థచంద్రికలు, ఆట. జంపె, త్రిపుట తాళములు ,ఏలలు మొదలగు దేశిరచనలు గలవు. కొరవంజులలోనుండి పుట్టిన వగుటచే యక్షగానములందు వాటిచిహ్నములుగా చెంచెతలు ఎఱుకసానివంటి పాత్రలు వచ్చుచుండును. వాలివధానంతరము సుగ్రీవుడు శ్రీరామునకు గానుక లర్పింపబోవు సమయమున "అగ్గిరిప్రాంతమున నున్న చెంచెతలు ఏలలు పాడిరట యెటువలెను"

"రాతినాతిఁ జేసి పురా
రాతిచేతి విల్లువిఱిచి
భూతలేంద్రులెల్ల మెచ్చఁగా —ఓ రామచంద్ర
సీతను వివాహమాడవా"

## మన్నారుదాసవిలసనాటకము.

ఈ యక్షగానమును విజయరాఘవనాయకుని ప్రియురాలైన రంగాజమ్మ వ్రాసినట్లు చెప్పనైనది. ఆంధ్రసాహిత్యసతికి దక్షిణదేశము కై సేసిన యలంకరణములలో యక్షగానము మిన్నయైనది. మధురతంజావూరుల ఆస్థానములలో పెక్కు యక్ష

గానములు వెలసి ప్రదర్శింప బడుచుండెడివి. నాటినుండియు యక్షగానములు విరివిగ వెడలినవి. రంగాజమ్మకృతియందు కథా చమత్కృతికన్న వర్ణనావైచిత్ర్యము మెండు. ఇది యక్షగాన ప్రబంధ మని చెప్పవలెను. రంగాజమ్మ విదుషీమణి యగుటచే ప్రౌఢప్రబంధవర్ణనములను తననాటకములో చక్కగా పొదిగినది. సుగ్రీవవిజయమునందువలె కథావేగము స్ఫుటరేఖలుగల పాత్ర నిర్మాణము, భావముల చురుకుదనము మన్నారుదాసనాటకములో లేవు. ప్రబంధరసవాహినివలె దీనియందలి రసముకూడ ఒయ్యారముగ హంసగమనముతో నడచినది.

## ప్రహ్లాదభక్త విజయము.

ప్రహ్లాదభక్తవిజయము, నౌకాచరిత్ర, ఈ యక్షగానప్రబంధములను రచించిన మహనీయుడు శ్రీ త్యాగరాజస్వామి. శ్రీ త్యాగరాజులవారు భక్తాగ్రేసరుడు, సంగీతసార్వభౌముడు. ఈయన క్రీ. శ. ౧౮౪౭ వరకు జీవించి యుండెనని తెలియుచున్నది. ప్రహ్లాదభక్తవిజయము లో కోత్తర భావములు గల్గి భక్తి పారవశ్యమును బ్రహ్మానందసాక్షాత్కారమును చిత్రించు సంగీతనాటకము. ఇట్టిది రచించుట "అనుగడ్డనకుమాధవానుచింతనను ధామా ధుర్యమున మేను మరచు" శ్రీ త్యాగరాజస్వామి కే చెల్లినది. త్యాగరాయలవారు దానిని ఇష్టదేవతాస్తుతితో నారంభించిరి. పూర్వకవిస్తుతికి బదులు పూర్వభక్తవరేణ్యులైన తులసీదాసును, భద్రాద్రి శ్రీరామదాసును స్వామి కొనియాడెను. మరియు పాండురంగ నామదేవ, జ్ఞానదేవ, జయదేవతుకారామ శ్రీనారాయణతీర్థాదిభగ

వర్ధాసుల స్మరించెను. ఈ నాటకము శ్రీరామాంకితము. దీని యందు జ్ఞాన, వైరాగ్య, విజ్ఞాన, సద్భక్తి భావము లుండునని స్వామి వచించెను.

నాటకారంభమునందు ప్రస్తావన గలదు. ద్వారికుడును సూత్రధారియు సంభాషింతురు. సభాసదులు చైత్రోత్సవమునందు సమావేశమయి త్యాగరాజకృతమయి, ఇహపర సాధకమైన ప్రహ్లాదభక్తవిజయమును ప్రదర్శింపు మని సూత్రధారునాదే శించిరని చెప్పబడినది. ప్రహ్లాదవిజయమనగా హిరణ్యకశిపుసంహా రవృత్తాంత మని సామాన్యముగ తోచును. కాని త్యాగయ్యగారు కథను వేరొకవిధముగా కల్పించిరి. హిరణ్యకశిపుడు బాలుడైన ప్రహ్లాదుని నాగపాశములతో కట్టించి సముద్రములో త్రోయించెను. సముద్రుడు ప్రహ్లాదుడు భక్తుడని యెరిగినవాడగుటచే నాతని కపకృతిచేయక ఒడ్డునకు తెచ్చి విడచి మహావిభవముతో నారాధించును. ప్రహ్లాదుడు శ్రీహరిదర్శనమునకై వేగిరపడుచు రమారమణసందర్శనోపాయము దెల్పుమని సముద్రమహారాజును ప్రార్థించును.

దనుజబాధల నెల్ల దలచను భోగ
ధనసంపదలకు చెయిదాచను నా
మనసున హరిని నే మానను నా
కనులార నాథుని గనదెల్పుము నాతో

అని ప్రహ్లాదుడు వేడుకొనును. ఆత్మార్పణమే షోడశోపచారములుగ చేసి భగవంతుని సేవించుమని సముద్రుడుపదేశించును. ప్రహ్లాదు డట్లుచేసి నిరంతర ధ్యానసమాధులచేతను సాంద్రభక్తి వేదనచేతను శ్రీహరిసాక్షాత్కారము ననుభవించును. ఇదియే యాతనివిజయము. ఇది మైదంకములనాటకము. సముద్రుడు, ప్రహ్లాదుడు, నారదుడు, శ్రీమన్నారాయణుడు రమాదేవి పాత్రలు. వీరిలో ప్రహ్లాదు డేకైకపాత్ర యని చెప్పినను ఒప్పుగనే యుండును. మిగిలినవారు తటస్థులు. ఇది రసానందసౌభాగ్యముగల నాటకము. కథావేగము కార్యపరంపరయు నిందులేవు.

## నౌకావిజయము.

నౌకావిజయము ప్రహ్లాదనాటకముకన్న రసనిర్భరమైన చిన్ననాటిక. భక్తిశృంగారము దీనిలోని రసము. గోపికలు బాలకృష్ణునితో యమునానదియందు నౌకావిహారము సల్పుట దీనిలోని కథావిషయము.యమునానదినేగాదు. భవసాగరమును తరింపజేయగల నావికుడు శ్రీకృష్ణు డని ప్రతిపాదించుట త్యాగరాజులవారి దివ్యసందేశము. గోపతరుణులు లావణ్యగర్వముచే శ్రీకృష్ణుని అవహేళనచేసి తరువాత పశ్చాత్తాపముచెందుదురు. శ్రీకృష్ణుని కారోపింపబడు గోపికావస్త్రాపహరణకథను త్యాగరాజులవా రీనాటకములో వేరొకవిధముగా కల్పించి ఈ గాథయందలి ధూర్తశృంగారకళంకమును తొలగించిన విధము అద్భుతము. సౌందర్యగర్వితులైన గొల్లపడుచులను శ్రీకృష్ణపరమాత్మ పరీక్షించ దలచెను. చూచుచుండగనే యమునా

నదియందు గాలివానయు అంధకారమును ఆవరించెను. ఓడ యలలతాకుడున నిలువజాల కుండెను, ఇంతలో నౌకకు అడుగు భాగమున రంధ్రమేర్పడి నీరు పడవలోనికి నెక్కుచుండెను. గోపికలు స్త్రీసహజమైన కాతరభావముతో భయపడజొచ్చిరి. ఓడ మునిగిపోకుండ కాపాడుటకై మీ కంచుకములను విప్పి నౌకారంధ్రములు కప్పుడని భగవంతుడు ఉపాయముదెల్పెను. ఆర్తిచేకుఁగు గోపికలు సిగ్గువిడిచి యట్లు చేసిరి. కాని రంధ్రము పూడలేదు. గోపయువతుల ఆరాటము హెచ్చెను. ఈ మారు మీ కట్టినచీరలు విడిచి నౌకారంధ్రమును గప్పుడని శ్రీకృష్ణుడు చెప్పెను. దేహాభిమానమును విడిచి గోపికలు దీని కివి ఒడబడిరి. అప్పటికిని నీరుకట్టలేదు. గోపికలు ఆపన్నలై యుండి కృష్ణుని రక్షింపుమని యాక్రోశించిరి. భగవంతుడు ఆర్తత్రాణపరాయణు డగుటచే వారినుద్ధరించెను. మానినులకు సిగ్గుకన్న ప్రాణాధికమైన భావము లేదు. దీనికిని గూడ భగవంతుని సాన్నిధ్యమున ప్రయోజనము లేదనుటయే నౌకాచరిత్రముయొక్క పరమార్థముగా దోచును. త్యాగరాయలవారి నాటకములు రసప్రధానములు దివ్యగానములచే నివి పవిత్రములైనవి.

## లేపాక్షీరామాయణము

ప్రాచీనయక్షగానములలో నిది యుత్తమోత్తమముగా కాన్పించుచున్నది. దీనిని రచించినకవి నామధేయము కాని

కాలముగాని సరిగా తెలియరాలేదు. ఈతడు బ్రాహ్మణుడు. కృష్ణనాటకము, శివనాటకము, నాట్యప్రదీపము మొదలగు గ్రంథముల రచించితినని చెప్పుకొనెను. ప్రబంధములందువలె నిష్టదేవతాప్రార్థనము, గురువందనము, పూర్వకవిస్తుతి, ఆత్మవంశావతారము నిందు గలవు. లేపాక్షి శ్రీహరి కంకితముగా నీ యక్షగానమును కవి రచించెను. దీనిలోని ప్రతిగేయము చివర లేపాక్షిహరి సంకీర్తన ముండును. దరువులు, గేయములు, వచనములు, పద్యములు ఇతరయక్షగానములందువలెనేయున్నవి. ఈకవి నాటకనిర్మాణకళయందు ప్రవీణుడని యొప్పుకొనవలెను. సమగ్రరామాయణకథను మూడురాత్రులలో నాటకమాడుటకు వీలగున ట్లీకవి రచించెను. మొదటిరాత్రికథలో శ్రీరాముడు భరతునకు పాదుక లిచ్చిపంపువరకును గల వృత్తాంతము లున్నవి. రెండవనాటికథలో లంకపై దండయాత్రవరకు నడచిన యంశము లున్నవి. మూడవరాత్రికథ యుద్ధకాండ కథ గల్గినది. ఇట్లు చక్కగా విషయవిభాగము చేసి ఈ కవి మరికొన్ని మెళకువలను చూపెట్టెను. ఇతర యక్షగానములలో కథాభాగము తక్కువ; ప్రబంధరీతివర్ణన లెక్కువ. కావున అవి శ్రవ్యకావ్యములవలె నుండును. లేపాక్షి రామాయణనాటకము అచ్చపు దృశ్యప్రబంధము. ఇందులో వర్ణనలు విస్తారముగా లేవు. కథావేగమునకును పాత్రసంభాషణమునకును ఈ కవి ప్రాధాన్యత నొసగి దీని నాటకీయతను పెంపొందించినాడు. వచనభాగ మెక్కువగా నుండుట దీనియుత్తమలక్షణము. చిన్న

చిన్నపద్యములు కీర్తనలు ఉన్నను అవి కథావేగము నడ్డగింపక దానికి సహాకారములుగానున్నవి. కావున ప్రదర్శనసమయమం దీరామనాటకము బాగుగా రక్తికట్టును. దీనిలో హాస్యము లేదు. కాని ఆలోపమును వీరకరుణారసములు చక్కగా కప్పి వేయుచున్నవి. దీనిలో అంకవిభజనము రంగవిభజనములేదు. రంగవిభాగము చేయుట పూర్వనాటకములలో నెచ్చటను లేదు. అయోధ్యనుండి మిథిలకు మిథిలాపురమునుండి అయోధ్య కును రంగము కడువేగముతో మారిపోవుచుండును. ప్రదర్శన యోగ్యములైన కథాంశములను సేకరించుటలో ఈకవి ప్రశంస నీయమైన కౌశలమును చూపినాడు.

### ధేనుకొండవిరాటపర్వనాటకము.

ఇది భారతకథాత్మకమైన చక్కని యక్షగానము. దీనిని రచించినకవి వేంకటదాసు. ధేనుకొండలో వెలసిన శ్రీకృష్ణమూర్తికి దీనిని కృతిసమర్పించెను. ధేనుకొండ కుండికానదిప్రాంత మున్నదట. ఈ కవి తిక్కనసోమయాజి విరాటపర్వమును శ్రద్ధతో చదివి యందలి భావములను, కొంతవరకు భాషను కూడ అనుకరించి యుత్తమశైలిని గూర్చుకొనెను. భారత పద్యములను సందర్భో చితముగ తనరచనలో పొదిగికొనెను వచనరచన సలక్షణమై యుత్తమ భావసమన్వితమైయున్నది. ఈయక్షగానము మూడు భాగములలోనున్న దక్షిణగోగ్రహణకథవరకు మాత్రమే కవి ఈ నాటకమును రచించెను. ఉత్తరగోగ్రహణము నేలనోవ్రాయ లేదు. భారతచ్ఛాయలు దీనిలో బాగుగా కుదురుకొన్నవి.

## హరిశ్చంద్రమహారాజు చరిత్రము

ఈ యక్షగాననాటకము చేసినకవి వల్లెము పాపకవి. ఈతనితండ్రి నరసింహకవికి చింతలపల్లి నృసింహకవి యాంధ్రభాషాకవిత్వముసేర్పెనట చింతలపల్లి వంశమునందు సత్కవులు పలువురు నెలిసిరి. చింతలపల్లి వీరరాఘవు డనుకవి మధుర వాణీవిలాస మను ప్రబంధమును రచించె ననియు ఆతడు పదునెనిమిదవశతాబ్దమధ్యమున నుండెననియు వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. చింతలపల్లి నృసింహకవి ఈ వంశములోనివాడు కావచ్చును. వల్లెము పాపకవి ౧౭ వ శతాబ్దప్రారంభమున నుండియుండును. ఉత్తరములు బట్వాడా చేయు టపాశాఖ దేశములో సర్వసామాన్యమైన కాలములో నీత డుండియుండును. ఈ యక్షగానములో హరిశ్చంద్రమహారాజునకు ఆతనివనపాలకులు టపాపంపినట్లు కవి కల్పించియున్నాడు. ఈ నాటకమును కవి తిమ్మాజిపేట వీరభద్రేశ్వరున కంకితముగా చెప్పెను. తనకు పోషకులైన సంపన్నులకొందరి నీతడు పేర్కొనెను. తిమ్మాజిపేట మిడిజిల్లిమల్లయసెట్టి కవికి నాశ్రయమిచ్చియుండును. అట్లే వనపర్తి సీమయందలి రామకృష్ణాపురములో నుండిన బుక్కాలక్ష్మయ్య కుమారులను పార్వతీస్తుతిలో కవి పేర్కొనెను. లోకరేవుపురమునుగూడ ప్రసక్తి తెచ్చెను.

ఈ యక్షగానములో సూత్రధారుడు కన్పట్టును. నాటకము చూడవచ్చిన సభవారిని 'సభాకైవారము' అను పేర

భూషించుట ఈ నాటకమందలి విశేషము. హరిశ్చంద్రవృత్తాంతమును గౌరవద్విపదలోను, శంకరకవి కంచిపిరశరభకవులు ప్రబంధముగను ఇదివరలో వెలయించి యుండిరి. పాపకవి ఈ మూలగ్రంథములనే యనుసరించెను. ఇందును దరువులు, కీర్తనలు వచనములుగలవు. దరువుల యర్థము విశదీకరించుటకై ఈకవి వచనముల వ్రాయుచుండును. ఈతనికి వాక్యాంతము నందనుప్రాసము గూర్చుట ఇష్టము. 'ఇంతీ వలరాజదంతీ. ఆయాపాత్రలు ప్రవేశించునప్పుడు ఇతరులు వారిని నిర్దేశించుటకు బదులుగా పాత్రలుప్రవేశించి 'నేను హరిశ్చంద్రమహారాజును' అనురీతిని ఆత్మపరిచయము గావించుకొనును.

## సారంగధర చరిత్రము

ఈ యక్షగానమును కృష్ణకవిరచించి భద్రాద్రిరఘురామున కంకితమర్పించెను. ఈతని కవిత్వములో తప్పులు చాలగలవు. నాటకమునకు జీవనమనదగిన వచనములనీతడు తక్కువగా వ్రాసెను. పద్యములు గేయములు సంభాషణలో కూడ నమర్చుట యొకలోపము. సారంగధరచరిత్రమును చేమకూర వేంకటకవి ఇదివరలో వ్రాసెను. దాని ననుసరించి వెడలినదే యీ యక్షగానము. రాజరాజనరేంద్రుడు హస్తినాపురము నేలిన రాజని యీ కవి స్వంతకల్పనము చేసెను. కథాప్రారంభమునందు కథాసంక్షేపము నితడు రచించెను. సారంగధరుని

చిత్రపటమునుజూచి చిత్రాంగి యాతనిని ప్రేమించుటయు చిత్రాంగిపటమును జూచి రాజరాజా మెను మోహించి తానే పెండ్లియాడదలచి తన ఖడ్గమును వివాహమునకు పంపుటయు నిందలి కథావిధానము.

పదునేడుపదునెనిమిదవశతాబ్దములలో యక్షగానములు శరపరంపరగ వెడలినవి. ప్రసిద్ధపురాణకథ లన్నియు యక్షగాననాటకములుగా రూపొందింపబడినవి. ఉదాత్తసాహిత్యమునందు వీని కంతగొప్పస్థానము లేకపోయినను జనరంజకత్వమునందు వీటి కివియేసాటి. వీనిలోని భావములు, భాష, ఛందస్సులు దేశి యగుటచే జనసామాన్యము ఈ రచనలను విస్తారముగా చదివి యానందించును. పల్లెటూళ్ళలో ఈనాటికిని యక్షగాననాటకములను సంచారశీలురైన నటబృందమువారు ప్రదర్శించుచుందురు. ఇవి గేయబాహుళ్యము కలవగుటచేత సంగీతప్రియులగు జనులను బాగుగా నాకర్షించును. ఆధునిక యుగములో వెడలిన పెక్కుగొప్పనాటకములు, హరిశ్చంద్ర సారంగధర మున్నగునవి,యక్షగానముల సంస్కారముచే నేర్పడిన వని చెప్పినను ఒప్పును. ఆంధ్రనాటకవాఙ్మయవిస్తారమునందు యక్షగాన నిర్మాణకళను పరిశీలించుట ఆవశ్యకము. కురవంజులు నృత్తప్రధానములుగను, యక్షగానములు గేయబాహుళ్యముగుమ, నేటినాటకములు నాట్యరంజితములుగను ఉండుట గమనింప దగినది.

# ఆంధ్రసాహిత్య చరిత్రసంగ్రహము

## పదునైదవ ప్రకరణము

### శతకములు

ఆంధ్రసాహిత్యములో శతకములకు విస్తారమైన ప్రచారముకలదు. బాలురు, వృద్ధులు, స్త్రీలు లోనగువారందరును శతకములను చదువుచుందురు. జీవితములోని ఏదోయొక సన్నివేశమునకో భావమునకో దృష్టాంతము కాగల పద్యములు వీనిలో తరుచు వచ్చుచుండును. కావున శతకపద్యములు జనుల జిహ్వాగ్రములపై నాట్యమాడుచుండును. శతకముల ముఖ్య లక్షణములను కొన్నిటిని పరిగణింతము (౧) ఇవి గ్రంథవిస్తరమునందు చిన్నవి. పురాణములవలెను, ప్రబంధములవలెను శతకములు దీర్ఘరచనలు కావు శతకము అనగా నూరుపద్యముల హారమని చెప్పవచ్చును. సామాన్యముగ శతకములలో నూటయెనిమిది పద్యము లుండుట వాడుక. దీనికి కారణము నిట్లూహింపదగును. మనపూజావిధానమునందు భగవంతుని అష్టోత్తర శతనామములచే స్తుతించుట యాచారము. భగవంతుని నామములవలెనే ఈశ్వరస్తవము చేయు పద్యములుకూడ అష్టోత్తర శత ముండవలెనను సంప్రదాయ మేర్పడియుండును. కొన్ని

శతకములు నూటికితక్కువపద్యములు కలిగినవికూడ నున్నవి. (౨) శతకములలో సాధారణముగ వృత్తనియమమో పదస్థ నియమమో పాటింపబడుట గలదు. ప్రబంధములలోను పురాణములలోను కవి యిట్టి నియమము పెట్టుకొనక ఇష్టము వచ్చిన పద్యములను సందర్భోచితముగ వ్రాయును. శతకకవి చంపకమాలతోనో, సీసముతోనో, కందముతోనో లేక మరియొక ఛందస్సుతోనో శతకము నారంభించినచో తుదవరకు దానినే నడుపుచుండును. ఒకే ఛందస్సులో కావ్యమందలి యొకసర్గయంతయు వ్రాయుట సంస్కృతకవులలో గానవచ్చును. (౩) ఆంధ్ర శతకములకు సామాన్యముగ మకుటనియమ ముండును. సుమతీ, వేమా, దాశరథీ, వృషాధిపా మొదలగు సంబోధనములతో కవి రచించును. ఇవియే మకుటము లగుచున్నవి. సంస్కృతము నందలి శతకములకు మకుటనియమము సాధారణముగ లేదు. (౪) శతకము కావ్యముకాదు. కావున దీనిలో ఇతివృత్తము అనగా కథావస్తువు ఒకటిగా నుండదు. కథాసూత్ర మొక్కటియే యుండవలె నను మర్యాద శతకములకు వర్తింపదు. అనేక కథావస్తువులను కవి తనశతకములో దృష్టాంతరూపమున నుదహరించును, కాని రసభావానుసారముగ వానిని విస్తరించి వ్రాయుట యాతని యుద్దేశముకాదు. (౫) కావుననే శతకములలో అష్టాదశకావ్యవర్ణన లుండవు. ప్రకృతివర్ణనకుకూడ వీనిలో తావులేదు. మానవస్వభావము – దైవపద్ధతి – ఈ రెండుమాత్రమే కవిదృష్టి నాకర్షించును. (౬) శతకములు కావ్యములు కావు గనుక వీని

యందు రసపోషణవిధి యంతగా నుండదు. శతకములో రసమే లేదని చెప్పుటకు బొత్తిగా వలనుపడదు. ఇచ్చటకూడ శృంగార మున్నది. అక్కడక్కడ హాస్య మున్నది. భక్తిభావమునకు శతకములం దగ్రస్థాన మీయబడుచున్నది. నీతిని బోధించుట శతకముల ప్రధానకర్తవ్యముగా నెంచబడినది. మనుష్యజీవితమును పరిశీలించి యందలిలోపములను గుర్తించి మనజనకు ఉత్తమ నీతిమార్గమును ప్రదర్శించుటకు శతకకవి యత్నించును. ఇట్టితడెంతయో సంఘోపకారి యగుచున్నాడు. (౭) శైలిపాటవము నందు శతకములు కావ్యములతో తులతూగలేకపోయినను, వీటి యందును భావోన్నతమైన గొప్పరచనాశక్తి యున్నది. పూర్వ కవులశతకము లన్నియు మనకు దొరకుటలేదు. కాని ప్రతి కవియు తనకవిత్వప్రారంభదశయందు శతకరచనకు యత్నించి యుండునని యూహింపవచ్చును. కావ్యకర్తలుగా తెలియబడని కవిపుంగవు లెందరో మనకు శతకముల మూలమున తెలియ వచ్చుచున్నారు. శతకనిర్మాణమునం దొక్కొక్కప్పుడు కవులు స్వతంత్రించి వ్యవహారభాషాప్రయోగమును చేయుటకూడ కలదు. మొత్తముమీద శతకములశైలి మిక్కిలి జనరంజక ముగను,చాలవరకు సులభముగను ఉండునని చెప్పుట యుచితము. (౮) శతకములు భావప్రధానములు. భావములు రెండువిధముల నుండవచ్చును. బహిర్వస్తుగతములు, ఆత్మగతములు అని ద్వివిధములుగా నుండును. మనుష్యసామాన్యమైన భావములు; వ్యక్తులకు ప్రత్యేకమైన భావములు. వీనినిబట్టి కవిత్వమును బహిర్వ

స్తువిషయ మనియు ఆత్మపర మనియు ఇరుతెరగుల విభాగము చేయవచ్చును. వీనినే ఆంగ్లపరిభాషలో Objective poetry అనియు Subjective poetry అనియు చెప్పుదురు. ఈ రెండుశాఖలలో మొదటిదైన బహిర్వస్తువిషయకవిత్వమునకే ప్రాచుర్యమెక్కువ. ఈ రీతిరచనయందు కవి తనకంటె భిన్నమైన మనుష్యప్రకృతిని మనుష్యేతరప్రకృతిని ఉద్దేశించి కవిత్వము వ్రాయును. రెండవదైన ఆత్మపరకవిత్వశాఖయందు కవి తనను కావ్యవస్తువుగా తీసికొనుచున్నాడు. అనగా ఆతడు తన ప్రత్యేకభావములను, తనయొక్క ఆశలను, ఆశయములను, నిరాశలను, సుఖజనిత సంతోషమును, దుఃఖప్రభవమైన నిర్వేదమును కవితాసామగ్రిగ నుపయోగించుకొను చున్నాడు. కావున దీనిని ఆత్మపర కవిత్వమనుట సముచితము. శతకసాహిత్యమునందు ఆత్మపరమైన కవిత్వము తరుచు కాన్పించుచుండును. శతకకవి ఆత్మపరిశీలనము ఆత్మవిమర్శనము చేసికొనుచు భగవంతునకు విన్నపము చేయుచుండుట మనము గమనింతుము. ఈ భాగములు మిక్కిలి రమ్యములుగను ఉత్తేజకరములుగను ఉండును. కవి తనహృదయపరీక్ష గావించుకొనుచుండగా మనహృదయము విప్పి చెప్పుచున్నంత సన్నిహితభావము మనకు గల్గి కవితో మనము సమైక్యత నొందగల్గుచున్నాము.

శతకరీతి యాంధ్రసాహిత్యములో కడుప్రాచీనకాలమునుండియు వ్యాప్తిలో నున్నట్లు తోచును. శాతవాహ

నాంధ్రుల కాలములో కూర్చబడిన గాథా సప్తశతి కొన్ని శృంగారశతకముల కలయిక అని చెప్పవచ్చును. ఇది ప్రాకృతభాషలో నున్నది. తెనుగున రచియింపబడినవానిలో మల్లికార్జునపండితారాధ్యుని శివతత్త్వసారము క్రీ. శ. పండ్రెండవశతాబ్దమున వెలసినది. ఇందు సాధారణశతకసంఖ్యను మించిన పద్యము లున్నవి. అయినను శివస్తుతిపరమైన యీ గ్రంథము శతకలక్షణములనే కలిగియున్నది. ఆంధ్రశతకవాఙ్మయములో కొన్ని ముఖ్యవిభాగములను గుర్తింపవచ్చును. (౧) భక్తిశతకములు. ఇవి కవియొక్క అభీష్టదేవతాస్తుతిరూపమున నుండును. (౨) కొన్ని శతకములలో కవి రాజస్తుతిని ప్రయోగించును (౩) వేదాంతశతకములు. వీనిలో తత్త్వవిషయములు వర్ణింపబడును. (౪) నీతిశతకములు.

భక్తిశతకములు శతకనియమములకు పూర్తిగా సరిపడుచు వెడలిన యుత్తమప్రాచీన శతకము 'సర్వేశ్వరశతకము' దీనిని యథావాక్కులఅన్నమయ్యకవి రచించెను. ఈతడు శివకవి. ఈ శతకము నీతడు శా. శ. ౧౧౬౪కు సరియగు క్రీ. శ. ౧౨౪౨లో రచించెను. యథావాక్కులఅన్నమయ్య గోదావరి మండలములోని పట్టిసక్షేత్రమునందలి వీరభద్రస్వామి భక్తుడనియు, ఆతడు శ్రీశైలమును వ్రాసెననియు చెప్పబడుచున్నది. సర్వేశ్వరశతకము శివభక్తిని ప్రతిపాదించు గొప్పశతకము. చక్కనిభావములు అలంకారములు గలిగి సులభశైలితో నొప్పారుచున్నది. ఈతని భావములు స్వతంత్రములై యున్నవి.

"భవదీయార్చన సేయుచోఁ బ్రథమపుష్పం బెన్న సత్యంబు, రెం
డవపుష్పంబు దయాగుణం బతివిశిష్టం బేకసిద్ధాసమో
త్సవసంపత్తి తృతీయపుష్ప మది భాస్వద్భక్తిసంయుక్తయో
గవిధానం బవిలేని పూజలు మహిం గైకోవు సర్వేశ్వరా"

శివకవిశ్రేష్ఠుడును మహావిద్వాంసుడు నగు పాల్కురికి సోమనాథుడు 'వృషాధిపశతకము' వ్రాసెను. వీరశైవ మత స్థాపకుడైన శ్రీ బసవేశ్వరుని సంబోధించుచు అనర్గళమైన కవితాధారతోను భక్త్యావేశముతోను చెప్పిన శతకమిది. శ్రీ బసవేశ్వరుడు నందీశ్వరుని యవతారమని శైవులు విశ్వసింతురు. సోమనాథు డీపద్యములలో బసవేశ్వరుని మహిమను వర్ణించుచు సందర్భానుసారముగ అన్యమతనిరసనముకూడ సూచించినాడు. సంస్కృతాంధ్రములందే కాక కన్నడమహారాష్ట్రభాషలందును మణిప్రవాళశైలియందును తనకుగల ప్రజ్ఞను చూపుటకై సోమకవి తత్తద్భాషలలో నొక్కొకపద్యము రచించెను. శైవ మత ప్రచారమునందు పేర్వడసిన భక్తుల మాహాత్మ్యచర్యలను గూడ నీ శతకమునందు కవి ప్రశంసించెను. సోమనాథకవి 'చెన్నమల్లుసీసములు' అను పేర ముప్పదిరెండు సీసపద్యములు' శతకరీతిలో రచించెను. ఇవి వీరశైవసిద్ధాంతమును బోధించు పద్యరత్నములు గొప్పయురవడిశైలిలో నడచినవి. శివసాయుజ్యపు టాలోకనమున వ్రాయబడిన వగుటచే కాబోలు సోమకవీంద్రుని చిత్తశాంతిని గంభీరవైరాగ్యభావమును చెన్నమల్లు సీసములు ప్రదర్శించుచున్నవి.

ద్విపదరచనమునందువలెనే శతకనిర్మాణమునందును శివకవులు మార్గదర్శకులైరి. భక్తిభరితమైన హృదయభావములను వెల్లివిరియించుటకు సాధనము సిద్ధింపగనే పలువురాంధ్రకవులు శతకములను గూర్పజొచ్చిరి. కావ్యవాఙ్మయమువలన తెలియరాని కవిశ్రేష్ఠు లెందరో మనకు శతకములమూలమున తెలియవచ్చుచున్నారు. విష్ణుభక్తిప్రబోధకములైన శతకములలో 'దేవకీనందనశతకము' ప్రాచీనమైనదిగా గన్పించుచున్నది. దీనికర్త పేరు శతకమునందు లేదు. జక్కనవిక్రమార్క చరిత్రమును కృతిపొందిన వెన్నెలకంటిసిద్ధనమంత్రి తండ్రి జన్నమంత్రి కలడు. ఈతనిని ప్రశంసించుచు జన్నమంత్రి "పరమ హృద్యంబైన పద్యశతంబున, దేవకీతనయు విధేయుఁజేసె" అని జక్కనవ్రాయుటచే, ఈ మంత్రిసత్తముఁడే దేవకీనందన శతకమును చెప్పియుండునని యూహింపబడినది. జన్నమంత్రి విజయనగర చక్రవర్తులకడ మంత్రియై పదునేనవశతాబ్దిప్రారంభమున నుండినవాడు. దేవకీనందనశతకము చక్కనిసమాసగుంఫనము, సరళమైనభాషభావములు కలిగి జనరంజకముగ నున్నది. భాషాభిమానులందరకును పరిచితమగు నీ క్రిందిపద్యము దేవకీనందన శతకములోనిదే

"అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపై గుచేలునిపైఁ నందవ్రజస్త్రీలపైఁ
బరఁగం గల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ, హరి, కృష్ణా, దేవకీనందనా"

‘నారాయణశతకము’ వ్రాసిన కవిపేరు తెలియరాలేదు. ఈ శతకములోని పద్యమును క్రీ. శ. ౧౬వ శతాబ్ది ప్రారంభమునుండి, లాక్షణికకవియైన వెల్లంకి తాతంభట్టు తన కవిలోకచింతామణిలో ఉదాహరణమునకై తీసికొనెను. కావున నారాయణశతక మంతకుపూర్వమే వ్యాప్తిలో నుండినదని విశ్వసింపనగును. శ్రీమన్నారాయణుని మహిమయు శ్రీకృష్ణుని బాల్యలీలలును ముద్దులుగులుకు పద్యములలో కవివర్ణించెను.

శ్రీరామచంద్రచరణాంకితముగా వెలసిన శతకములలో ప్రాచీనమైనది ‘ఒంటిమిట్టరఘువీరశతకము.’ దీనిని రచించిన కవివతంసుడు అయ్యలరాజు రామభద్రకవి తాతయో పెదతాతయో అయియుండును. రామాభ్యుదయప్రబంధముయొక్క గద్యలో రామభద్రకవి యీ శతకప్రశంసచేసెను. ఇది శ్రీమదొంటిమిట్టరఘువీరశతకనిర్మాణకర్తర, జగదేకఖ్యాతి ధుర్యయ్యలరాజుతిప్పయమనీషిపర్వతాభిధానపౌత్ర” అని వ్రాసికొనెను. కావున ఈ శతకము శ్రీకృష్ణదేవరాయల కాలమునకు ముందే వెలసినది. ఒంటిమిట్టరఘువీరశతకము రసవత్తరమైన రచన గలది. నాతికఠినములైన సమాసములు, చక్కని శబ్దార్థాలంకారములు, అనర్గళధారాశుద్ధి దీనికి వన్నె పెట్టుచున్నవి.

మును నాకెన్నఁడు దోసముల్ గలవు నా మొఱ్ఱాలకన్ భయంబందకే
మనినన్ గాలునిపోటుబంటులిక నన్నేపేరు నాపేరు పె

ట్టినవానికి బరలోకదూరుఁ డని పట్టెదెట్లు పొందంచు బో
రన రమ్మా యిపు డడ్డగింప, రఘువీరా! జానకీనాయకా".

శతకకవి తాను భగవంతుని సన్నిధియందున్నట్లే యెంచు కొని హృదయగతభావములను చాటుమాటులేక నివేదించు కొనును. ఆత్మవిమర్శనము, పాపములు చేసితినని యనుతాప బుద్ధితో వేడుకొనుట శతకములందు తరుచు కాననగును. కావ్య మర్మములు లేక శుద్ధమనస్సునుండి ప్రవహించు భావపరంపరను చూడదలచినచో శతకములనే చదువవలెను. వీనియం దచ్చ టచ్చట గ్రామ్యకవిసమ్మతములు కాని శబ్దప్రయోగము లుం డును. రాజసభాంతరాళములందు పండితదిగ్గజముల సమక్ష మున చదువుట కుద్దేశింపబడినవి కావు శతకములు. అవి ఇష్ట దైవముముందు కవులుచేయు ఆత్మనివేదనములు. భగవంతున కును భక్తునకును నడుమ నడచిన గుప్తసంభాషణములు. వానిలో మనోనైర్మల్యమును ఆత్మీయతయు ప్రధానములు గాని పాండిత్యము కాదు. కావున శతకకవి ధారానుకూల ముగ వ్యవహారభాషాప్రయోగములను వాడుకొనుట కలదు. ప్రబంధములందలి భాష సభావాణి. శతకములభాష గృహ వాణి. శతకములు గుప్తకావ్యములగుటచే వీనియందు కవి ఆత్మవిమర్శనమువలె రాజవిమర్శనముకూడ చేయును.

తెలుగునందలి భక్తిశతకములలో శ్రీకాళహస్తీశ్వర శతకమును దాశరథిశతకమును అగ్రగణ్యములు. నిర్వ్యాజభక్తి

యు, మొగమోడని యాత్మవిమర్శనము, పర్వతాగ్రమునుండి పడు నదీప్రవాహమువంటి వేగపాతము కల భావనలు ఈ రెండుశతకముల కొక గొప్పవిశిష్టత నాపాదించుచున్నవి. శ్రీకాళహస్తీశ్వరశతకము వ్రాసిన కవిపేరు శతకమునందు చెప్పబడలేదు. శ్రీకాళహస్తిమాహాత్మ్యమును వ్రాసిన మహాకవి ధూర్జటియో యాతనివంశీయులో ఈ శతకమును వ్రాసియుందురు. ధారాశుద్ధియు, భావపటిమయు తిలకించినచో ధూర్జటియే దీనిని వ్రాసియుండు నను నభిప్రాయము బలపడును. ఈ శతకములో పలుమార్లు కవి తనదోషములను నివేదించుకొని యాత్మప్రక్షాళనము చేసికొనెను. రాజులను తీవ్రముగా నిరసించెను.

'కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు, వక్షోజముల్
రాయన్రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయంబాయెను, బట్టగట్టెఁ దల. చెప్పన్ రోత సంసారమేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా'

రాజుల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నం
భోజాక్షీ చతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తింబొందితే జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా'

దాశరథిశతకమును వ్రాసిన కంచెర్లగోపన్నమంత్రి క్రీ.శ ౧౬౭౨–౮౭ వరకు గోలకొండరాజ్యమును పాలించిన అబుల్

హసన్ తానీషా కాలములో నుండెను. తానీషామంత్రులైన యక్కన్న మాదన్న గార్లకు గోపన్న మేనల్లుఁడు. ఈతని నివాస స్థలము కంభముమెట్టువద్ది నేలకొండపల్లి గ్రామము. గోపన్న మంత్రియే భద్రాద్రిరామస్వామిభక్తుఁడై రామదాసని పేరు పొందెను. రామభక్తిసామ్రాజ్యము ననుభవించుచు ఈతఁడు చెప్పిన దాశరథిశతకము నిరర్గళకవితాధారయు వైరాగ్యసంపత్తియు గలిగి యాంధ్రశతకములకు మకుటాయమానముగ నున్నది. ఈతని భక్తికల్పనలు క్రొంగ్రొత్తలు, శబ్దాలంకారచమత్కృతి నిరుపమానము. తరువాతి శతకకవులు పలువురు దాశరథిశతకము ననుకరింప యత్నించుటయే దీని ప్రాశస్త్యతకు తార్కాణము. దీనియందలి ప్రతిపద్యమును భక్తిని వైరాగ్యమును వర్ణించుచుండును

చిక్కనిపాలపై మిసిమిఁ జెందిన మీఁగడ పంచదారతో
మెక్కినభంగి మీవిమల మేచకరూపసుధారసంబు నా
మక్కువపళ్ళెరంబున సమాహితదాస్య మనేటిదోయిటన్
దక్కెనటంచు జుఱ్ఱెదను దాశరథీ కరుణాపయోనిధీ!

భక్తిరసోద్బోధకములగు శతకములలో నింకను పేర్కొనదగినవి రమాధీశశతకము, రంగశాయిశతకము, వసుదేవనందన శతకము, సూర్యనారాయణశతకము, మొదలగునవి. శతకపద్యములు పిన్నపెద్దలందరును చదువుకొనుచుందురు. ఇప్పటికి ఒక తరము వెనుకటివరకును వీధిబడులలో శతకములే పాఠ్యపుస్తక

ములుగ నుపకరించెడివి. బాలబాలికలకు మిక్కిలి ప్రీతిదాయక మైన 'కృష్ణశతకము'ను వ్రాసినకవి నృసింహకవి. ఈ కవి జీవించినకాలము తెలియరాదు. శ్రీకృష్ణుని బాల్యలీలలును మహిమయు కడుసులభమైన రమ్యశైలిలో నిందు వర్ణింపబడినవి.

దేవేంద్రుఁ డలుకతోడను
వావిరిగా ఱాళ్లవాన వడిగురియింపన్
గోవర్ధనగిరి యెత్తితి
గోవుల గోపకులఁగాచు కోఅక్కైకృష్ణా.

గిరులందు మేరువౌదువు
సురలందును నింద్రుఁడౌదు చుక్కలయందున్
బరమాత్మ చంద్రుఁడౌదువు
నరులందును నృపతివౌదు నయముగఁ గృష్ణా

తెలంగాణవాసులైన కవులు కొన్ని మంచి శతకములను చెప్పిరి. రావూరిసంజీవకవి కొలనుపాక వీరనారాయణదేవుని స్తుతించుచు 'వీరనారాయణశతకము'ను రచించెను. కొలనుపాక ఆదికాలమునందు జైనక్షేత్రమై తరువాత శివకేశవాలయముల తో నిండిగొప్పపుణ్యప్రదేశముగ పరిగణింపబడుచున్నది. వీరనారాయణశతకము సీసపద్యములలో వ్రాయబడినది. కవి దీనిని క్రీ.శ. ౧౭౩౧లో రచించెను. తెలంగాణమునందలి మరియొక ప్రాచీనపుణ్యక్షేత్రము ధర్మపురి. శేషప్ప లేక శేషాచలదాసు అను కవిపుంగవుడు ధర్మపురీనృసింహదేవుని కంకితముగా 'నృకే

సరిశతకము’ ‘నరసింహశతకము’ను ప్రవచించెను. ధర్మపురి రామాయణము నితడే రచించె నని చెప్పుచున్నారు. ఈ కవి పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున నుండియుండును. నృకేసరి శతకము భక్తివైరాగ్యములను కవియొక్క ఆత్మవేదనను చక్కగా హృదయంగమముగా రూపించుచున్నది.

ఓనరకేసరీ! యనగ నోయని పల్కవిదేమి మాటమా
త్రానికి నోచనాయిపుడు దాసునిమీఁద మఱింతకోపమే
పూనితి వెందుకయ్యదయపుట్టదు నే నపరాధి నంచు, హా
మానవదేల మచ్చరము మాధవ ధర్మపురీనృకేసరీ

‘లక్ష్మీశతకము’ వ్రాసిన పరవస్తుమునినాథకవి తెలంగాణ నివాసి యని శ్రీ శేషాద్రిరమణకవు లూహించిరి. ఈ కవికాలము తెలియదు. లక్ష్మీశతకము చిన్నపద్యములలో రచింపబడిన మనోహరమైన శతకము. లక్ష్మీదేవినిస్తుతించిన శతక మిది యొక్కటియే కాన్పించినది.

నీవుగలచోటు సరసము
నీవును లేనట్టి చోటు నీరసము జగ
త్పావని! పరిలసదనుకం
పావని! రదవసనజితజపావని లక్ష్మి!

‘యాదగిరీంద్రశతకము’ రచించిన తిరుపాయవేంకటకవి యాఘునికుడు యాదగిరి భువనగిరిదుర్గమునకు సమీపమున నున్న నృసింహక్షేత్రము.

శతకకవిత్వమునకు భిక్షపెట్టినవారు శివకవులైనను శ్రీకాళహస్తీశ్వరశతకము తరువాత ప్రసిద్ధశివశతకములు వెలసినట్లు గాన్పించదు. కాలము తెలియని యొకశివకవి 'శివశతకము'ను కందపద్యములలో వ్రాసి భగవంతునకు సమర్పించెను. ఇందు శివుడే పరదైవమని కవి ప్రతిపాదించెను. శివగణభక్తులమహిమలు సంగ్రహముగ వర్ణింపబడినవి. కుక్కుటేశ్వర, రామలింగేశ్వర శతకములు శివునిసంబోధించుచున్నను నీతిప్రధానమైన శతకములు. దిట్టకవినారాయణకవి కుమారుడు రామచంద్రకవి 'మహిషాసురమర్దనిశతకము' వ్రాసి యొప్పించెను. ఈతని కవనము ధారాశుద్ధికలిగి రసవంతముగా నున్నది.

అర్వాచీనమైన దైనను మాతృభక్తి నుద్బోధించు 'మాతృశతకము' మిక్కిలి ప్రశంసనీయము. "మాతృదేవోభవ" యను ఉపనిషద్వాక్యము మేరకు కన్నతల్లినే యిష్టదైవతముగా నెంచి శతకముసమర్పించిన కవివతంసుడు మాతూరి అప్పావు మొదలి. ఈతడు పందొమ్మిదవశతాబ్దినడుమ నుండెను. మీనాక్షిభక్తుడైన యీతడు మధురమండలవాసి కావచ్చును. ప్రేమమయి యగు జనని యొక్క పుత్రముఖసందర్శనవాంఛను సుతశ్రేయోభిలాషను రసవత్తరకవిత్వములో సవిస్తరముగ వర్ణించి ఈ కవి ధన్యుడైనాడు. ఇందలి మొదటిపద్యము.

'శ్రీపతియైనగాని విధుశేఖరుడైన త్రిశూలపాణియై
నా పరమేష్ఠియైన గణనాయకుడైన, రమామృడానులై

నా పలుకుంబోలంతి యయినా పరిరక్షణ కార్యసత్క్రియో
ద్దీపనబోధనోక్తులను దెల్పను తల్లినిబోలరెవ్వరుౘ'

## వ్యాజస్తుతిశతకములు.

భక్తిశతకములలోనే అంతర్భూతము లగుచు భగవన్ను తియందొక క్రొత్తమార్గము నవలంబించినవి వ్యాజస్తుతిశతకములు. పైకినిందగా కనవచ్చి పర్యవసానమునందు స్తుతిగను, పైకి స్తుతిగ కానుపించి పర్యవసానమునందు నిందగను అభివ్యక్తమగుట వ్యాజస్తుతి యనబడు అలంకారము. ఇట్టిశతకములందు కవి ఇష్టదైవము నాక్షేపించుట, చురుకుమాటలచే నెత్తిపొడుచుట భంగించుట జరుగును. కర్తవ్యవిరతుడై యున్న యాదేవుని ప్రబోధించి కార్యశీలుడవు కమ్మని ప్రార్థించుటయే భక్తుని యుద్దేశము. ఇట్లు కొంతసేపు వాగ్బాణములచే నొప్పించి భక్తుడైన కవి క్షమాపణము వేడుకొనును. వ్యాజస్తుతిశతకము సాహిత్యప్రియులకే కాక చారిత్రకులకుకూడ మిక్కిలి ప్రయోజనవంతములుగా నున్నవి. దేశోపద్రవము సంభవించి ప్రజాఘోష మిన్నుముట్టినప్పుడు భక్తుడైన కవి భగవంతుని ఆక్షేపవాక్యములచే హెచ్చరించి జనుల యార్తిని తీర్పుమని ప్రబోధించును. ఆ యా సందర్భములలో కొన్ని ముఖ్యచరిత్రాంశములు బహిర్గతము లగుచున్నవి. ఇట్టియుభయప్రయోజనములుగల శతకములలో మొట్టమొదట చెప్పదగినది.

* సింహాద్రినారసింహశతకము.

దీనిని రచించినకవి గోగులపాటికూర్మనాథుడు. సింహాద్రి పుణ్యక్షేత్రము విశాఖపట్టణమండలమునం దున్నది. కవి యీ మండలమువాడే కావచ్చును. ఈతడు క్రీ.శ. ౧౭౫౦ ప్రాంతమున నుండియుండును. పదునెనిమిదవశతాబ్ది, మొగలాయిసామ్రాజ్య మస్తమించి పాశ్చాత్యులు హిందూదేశమునందాధిపత్యమునకై తమలోతాము, దేశీయరాజులతోను నిత్యయుద్ధములు సాగించుకాలము. తురుష్కుల రాజ్యభ్రంశ మగుచుండినను దేశపీడనము కావింపగల శక్తి యింకను నశింపలేదు. ఆంధ్రదేశము యవనుల దురాగతములకు గురియై ఘోషించుచుండెను. దేవాలయములను గూల్చుట, స్త్రీలను చెరబట్టుట, గ్రామములను దహించుట, వారికి నిత్యక్రీడ లయ్యెను. ఇట్టి విప్లవకాలమునం దొకతూరి యవనదండు సింహాద్రిక్షేత్రము కొల్లగొట్టుటకై ఎగబడెను. ఆలయోపద్రవమును చూచి కూర్మనాథకవి స్వామిసన్నిధానమునందు నిలబడి నిందాస్తుతులచే సింహాద్రినరసింహుని ప్రబోధించి క్షేత్రమును ప్రజలను కాపాడవేమని వేడుకొనెను. ఈ శతకము ప్రజాదుఃఖవ్యధితమైన కవి హృదయాంతరాళమునుండి వచ్చిన దగుటచే గొప్పయుడివడియు ధారాశుద్ధియు కలిగి

* వ్యాజస్తుతి శతకములు అవి పుట్టిన కాలముయొక్క రాజకీయ సాంఘికచరిత్రపై యెట్టి ప్రకాశమును కల్పించుచున్నవో మ. రా. శ్రీ. సురవరము ప్రతాపరెడ్డిగారు చక్కగా వివరించినారు. చూడు వ్యాసము 'ఆంధ్రులసాంఘికజీవనము' మా. హనుమంతరాయ షష్టిపూర్తిసంచిక.

యున్నది. చక్కని యుక్తులు, సామెతలు, ఎత్తిపొడుపుమాటలు కవి ప్రయోగించెను. ఆంధ్రదేశముయొక్క ఆనాటిఖిన్నదశ కడుపు తరుగుకు పోవును!

యవనేశుధాటికి నదలి సర్వస్వమ్ము
విడిచి మందిరములు వెడలువారు
వెడలియు దలదాచ వెరవేమి గానక
నడవుల నిడుమలఁ బడెడువారుఁ
బడియు నెచ్చటకూడుఁ బట్టఁ గానక తమ
శిశువులతో వెతఁ జెందువారుఁ
జెంది డెందముగుందఁ గాంక్షితకత నభి
మానార్థులై ఖేద మూనువారు
వైరి యొక్కొక్క భార్యతో నవనిప్రజలు
అష్టమహిషులపై పదియారు వేల
సతులతో నీవు వలస కెచ్చటికరగెదు
వైరివరరంహ! సింహాద్రి నారసింహ!

భక్తుని యాక్రోశమును సింహాద్రియప్పన్న మన్నించి కందిరీగల రూపమున ప్రత్యక్షమై మున్కురసైన్యములను కుట్టి చెల్లాచెదరు గావించి యాలయమును కాపాడెనట.

భద్రగిరిశతకము.

ఈ శతకము రచించినవాడు భల్లాపేరయ్యకవి. ఇదియు నిందాస్తుతులతో నున్న మంచిశతకము. గోలకొండరాజ్యవినాశ

సమునందు ఔరంగజేబుకుతోడ్పడిన ఇబ్రాహీముఖాను డనువాని బంటయిన ధంసాయను తురుష్కుడు వరంగల్లుకు నాతిదూరము లో నున్న వేల్పుకొండపై దుర్గములు నిర్మించి తెలుగుదేశము నాక్రమించుచు పెక్కుదురాగతములు గావించెను. ఈ యవనుడు భద్రాద్రిని ముట్టడించి ప్రజలను పలుహింసలను పెట్టెను. తురుష్కుడు శ్రీరాముని విగ్రహములను ధ్వంసము చేయునేమో యని భయపడి యాలయపుపూజారులు స్వామివారిని పోలవరమునకు పడవలపై గొనిపోయి సురక్షితము చేసిరి. అష్టకష్టములు పడుచున్న ప్రజలను విడిచి పెట్టి స్వస్థలము వీడి తురకసరదారుకు భయపడి పలాయనము చిత్తగించుట రాక్షససంహారము చేసిన శ్రీరామునివంటి మహాధన్వికి అపకీర్తియని పేరయ్యకవి నిందాస్తుతులతో నిష్ఠురములాడి ప్రబోధించెను ధంసాదుర్గయములకు దేశద్రోహులైన కొందరు *స్వదేశసంస్థానాధిపతులు తోడ్పడినట్లు కవి సూచించి యున్నాడు. ధనాఢ్యులైన మరి కొందరు ప్రభుకుటుంబములవారు, సెట్టిపల్లివారు, అశ్వారాయుడు (పాల్వంచప్రభువు?) మొదలగువారు దేశరక్షణము సేయుచు యుద్ధమునందుమడిసిరి. భద్రగిరిశతకమువలన తెలియనగు చరిత్రాంశములు చాలకలవు. శ్రీరాములవారు ఐదుసంవత్సరములు పోలవరములో ప్రవాసముచేసి విజయనగరపు పూసపాటివిజయరామరాజు సీతారామరాజు గార్ల సహాయమున తిరిగి భద్రగిరికి వేంచేసినట్లు పేరయ్యావర్ణించెను. శతకము ౭౧, ౭౨

---

* ఇట్టివారిని కవిశతకము౮౦వపద్యములో పేర్కొన్నాడు.

పద్యములలో శ్రీరామునకు గోరుందొర సుగ్రీవునివంటివాఁడని వర్ణించుటచేతను, ఇంగిరీజుల ప్రాపకమునకై రాముఁడు తాప త్రయ పడుచు న్నట్లు వర్ణించుటచేతను ధంసా దుర్ణయములు మొదటినిజాముల కాలములో జరిగియుండె నని యూహింప వలెను. ఈ కాలము నందే ఫ్రెంచివారును ఇంగ్లీషువారును ప్రముఖత్వము వహింపజొచ్చిరి.

## ఆంధ్రనాయక శతకము.

దీనిని రచించినవాఁడు కాసులపురుషోత్తమకవి. ఈతఁడు క్రీ. శ. ౧౭౯౧ ప్రాంతమున చల్లపల్లిసంస్థానమునేలిన రాజా అంకినీడువారి యాస్థానకవి. కృష్ణానదీతీరమునందు శ్రీకాకుళ గ్రామమున ఆంధ్రవిష్ణువు ప్రాచీనదేవాలయము కలదు. ఇచ్చటి దేవుఁడే కృష్ణదేవరాయలవారిని ఆముక్తమాల్యద రచించుటకు శాసించెను. ఆంధ్రవిష్ణువు దేవాలయము కృష్ణానదివెల్లువలకు పడిపోయి శిథిలమై పూజలు ఉత్సవములు లేక శోభావిహీనమై పడియుండెను. దీనిని చూచి కాసులపురుషోత్తమకవి శోకించి యాలయమును పునరుద్ధరించుకొనలేని అసమర్థుడవా యని దేవుని నిందాస్తుతులతో ప్రబోధించెను. ఆంధ్రవిష్ణువే ఆంధ్రనాయక స్వామి. విష్ణుమూర్తి యవతారచర్యలను దుడుకు చేష్టలుగా కల్పించి కవి యుపాలంభన చేయును.

కల్లరుల్గాని ప్రేపల్లెవారందఱు
హర్షింప నచట నీ యాటసాగె;

మధురాపురీవరమనుజు లామోదించి
మన్నింప నచట నీ మాటసాగె;

శతకాంతమున దేవుని నిందించిన తన తప్పుకావు మని సకరుణముగ వేడికొనును. పురుషోత్తమకవి శతకమునాలించిభక్తి ప్రేరితులైన చల్లపల్లిరాజుగారు ఆంధ్రనాయకస్వామియాలయ పునర్నిర్మాణమునకు పూనుకొనిరట. ఈ శతకము సీసపద్యము లలో నున్నది. శైలి మృదుమధురమై జాతీయములతోను లోకోక్తులతోను మెరుగెక్కి కవిత్వము చదువుటకుచవులూరు చున్నది. కాసులపురుషోత్తమకవి మానసబోధశతకము, హంస లదీవిగోపాలశతకము, భక్తకల్పద్రుమశతకము కూడ రచించెను.

మట్టపల్లినృసింహశతకము, వెంకటాచలవిహారశతకము, రామలింగేశశతకము లోనగునవికూడనిట్లే దేశపరిస్థితులను ప్రతి బింబించుచున్నవి.

వేదాంతశతకములు.

భక్తిశతకముల తరువాత ప్రసిద్ధికెక్కినవి తత్త్వబోధకము లైన శతకములు. భక్తిశతకములందే కొంతవరకు తత్త్వచింతన యు, వైరాగ్యప్రబోధమును జరుగును. ఆముష్మికచింతగల కొందరు కవిపతంసులు జటిలములైన వేదాంతార్థములను సర్వ జనసులభముగ లోకానుగ్రహబుద్ధితో వ్రాయదలచిరి. వైరాగ్య మును కల్గించుటకై జీవితము నిస్సారమనియు, ఐహికసుఖములు

క్షణికములనియు, స్త్రీలు పురుషులకు బంధకారణము లనియు ప్రవచించుట వేదాంతశతకముల పద్ధతి. పిండోత్పత్తి మొదలు కొని జగత్సృష్టివిధానము మాయానిరూపణము, దృగ్దృశ్యవివేకము, రాజయోగము లోనగు గహనవేదాంతార్థములు వీనిలో చర్చింపబడును. చెప్పునది వేదాంతమైనను చక్కని దృష్టాంతములు, సామెతలు, సరళమైనశైలి వీనికి వన్నెపెట్టు చుండుటచే మోక్షార్థులగు జనములయందు తత్త్వశతకములు విశేషవ్యాప్తి గాంచియున్నవి.

వేదాంతశతకములలో నారాయణశతకము ప్రాచీనమైనదిగ గాన్పించును. దీనినిరచించినకవి పేరుగాని కాలముకాని తెలియరాదు. ఇది గేయరూపమున నున్నది. అద్వైతసంప్రదాయార్థములను మిక్కిలి సులభశైలిలో నిది వివరించుచున్నది. భగవద్గీత మొదలగు గ్రంథభావములు దీనిలో చక్కగా పొదుగబడినవి. తోటవేంకటనరసింహకవి రచించిన 'రామరామ' శతకము కూడ గేయమై పాడుట కనుకూలముగ నున్నది. ఇందు జగత్తత్త్వము సాంఖ్యసిద్ధాంతానుసారముగ సులభశైలిలో చెప్పబడినది. పరమానందయతీంద్రుడు వ్రాసిన 'శివముకుందశతకము' సంపఁగిమన్నశతకము వేదాంతకవిత్వములో నున్నతస్థాన మలంకరింపదగినవి. పరమానందయతి ౧౮ వ శతాబ్ది చివరనుండినవాడుగా తోచును. శివముకుందశతకము శివకేశవులొక్కరే యను ఉత్తమభావమును నెలార్చినది. సంపఁగిమన్నశతకము అద్వైత వే

దాంతభావములను మృదుమధుర శైలిలో చెప్పెను. ఇది దురాచారములను దాంభిక వేషములను నిరసించి సత్త్వప్రధానమైన నీతివర్తనము ముక్తినొందగోరువాని కావశ్యకమని చక్కగా ప్రతిపాదించుచున్నది.

సన్న్యాసుల మని సాస్త్రో
పన్యాసము సేయ నందు ఫలమేమి? మన
స్సన్న్యాసము దొరకని యా
సన్న్యాసము కూటికన్న సంపఁగిమన్నా.

'సదానంద యోగిశతకము' తత్త్వబోధకమైన మంచిశతకము. దీనిని రచించినకవి సదానందయోగి. ఈతని పద్యములు వేమనశతకపద్యములవంటి భావములతో నలరారుచున్నవి. సదానందయోగి వేమనకు కొంచెమీవలివాడు కావచ్చును. ఈతడును మతముపేరట దాంభికాచారములను వేషములను వేయువారిని నిశితముగ విమర్శించెను. విగ్రహారాధనము ముక్తి మార్గము కాదని ఈతడు వచించెను.

ఱాళ్ళఁజేసిన వొకకొన్ని రాగికొన్ని
మ్రానఁజేసిన వొకకొన్ని మంటిఁగొన్ని
యిట్టి దేవుళ్ళు ముక్తియు నెట్లునేర్చు
నవ్యతరభోగి శ్రీ సదానందయోగి.

తాడేపల్లి పానకాలరాయకవి 'మానసబోధశతకము 'చిత్తబోధ శతకము' రచించెను. ఈతడు ౧౯వ శతాబ్దిలో నుండియుం

డును. మానసబోధశతకము కేవల.భగవచ్చింతనాపరమై వైరాగ్యబోధకమై భక్తిభరితమై రాజిల్లుచున్నది. ఇందలి కవిత్వము, దృష్టాంతరామణీయకత మేలైనవి.

'ఇటునటు పాలుదాగివి పరువెత్తుటకంటెను నిల్చినీరు గొ్రె
లుటకడు మేలు మే లనెడు లోకహితోక్తి గణించి చాలమి
క్కుటమగు కర్మబంధముల గాసిల కచ్యుతు చేరమంటి వే
సట ఒడ కింకలైన మనసా! హరిపాదము లాశ్రయింపుమా.

### నీతిశతకములు.

భక్తిశతకములు వేదాంతశతకములును ముముక్షువుల కుపకరించుచున్నవి. నీతిశతకములు లోకజ్ఞానమును ఇహజీవితమును పురస్కరించుకొని రచింపబడిన వగుటచే జనులందరికిని ఉపయోగకరములుగ నున్నవి. వీనిలో నెత్తుకొనబడని జీవితసమస్య యుండదు. అట్టి సమస్యను గూర్చి తనయభిప్రాయమును ఖండితముగ చెప్పుటకును శతకకవి సంశయింపడు. సాధారణముగ నీతిశతకములలో నుండు విషయము లిట్లుండును. (౧) రాజనీతి-రాజధర్మములు, ప్రజారక్షణ, సేవకధర్మములు (౨) సంసారనీతి మాతాపితృపుత్రసంబంధములు, అనుకూలవతియగు భార్య, పరస్త్రీలయెడవర్తన, స్త్రీధర్మములు, స్త్రీలయెడ ఆ నాటిపురుషులదృష్టి వారకాంతలు (౩) బాలబాలికలకు నీతులు (౪) మానవుని నైతికవర్తనము, సత్యము, దయ, దానము, లోభిత్వము, శౌర్యము (౫)

ద్వంద్వములు. సిరి, దారిద్ర్యము, భాగ్యము, దురదృష్టము విధికృతము, మానవప్రయత్నము(౬) లోకవృత్తము,సంఘవిమర్శ చుట్టములు, ఆశ్రితులు, అర్థార్జనము, సమకాలికజీవితము, విషయసంపద,విషయబాహుళ్యమును బట్టియే నీతిశతకములు సర్వజనపఠనీయములుగా నున్నవని చెప్పవచ్చును.

ముక్కునకు ముత్యమువలె శతకవాఙ్మయమున కలంకారప్రాయమైనది 'సుమతిశతకము.' నీతిశతకములలో నిది మిక్కిలి ప్రాచీనమైనది. ఈ యత్యుత్తమశతకమును వ్రాసినకవిపేరు నిశ్చయముగ తెలియవచ్చుటలేదు. ౧౩వ శతాబ్దియందున్న భద్రభూపాలుడు (బద్దెనకవి) తానొక సుమతిశతకము వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. భీమకవి సుమతిశతకము రచించినట్లు కూచిమంచితిమ్మకవిసార్వభౌముని సర్వలక్షణసారసంగ్రహమునం దుదహరింపబడినది. ఎవరువ్రాసినను బాలురనుండి వృద్ధులవరకును అశేషజనాదరణము పొందినది సుమతిశతకమే. ఇందలి నీతులు సమయోచితములై బాలురుకూడ తెలిసికొని యానందింపగల మృదుమధురభాషలో కూర్చబడినవి. అజ్ఞాతకర్తృకమై గొప్ప ప్రశస్తిగలనీతిశతకము భాస్కరశతకము. మారన వేంకయ్య యను కవి దీనిని రచించెనని కొందరు తలచుచున్నారు. ఈ కవి కాలమును దెలియదు. అప్పకవి గ్రంథమునందు భాస్కరశతకపద్యము లుద్ధరింపబడుటచే నది ౧౭వ శతాబ్దికి ముందే ప్రసిద్ధి వహిం

వహించినదని చెప్పవచ్చును. భాస్కరశతకము నాతిప్రౌఢమైన శైలిలో ప్రతిపద్యదృష్టాంతములతో నొప్పుచున్నది. ఈ శతకము వ్రాసినకవి పురుషకారముకన్న అదృష్టము, భాగ్యము, కర్మము బలీయములని విశ్వసించినవాడు. సుమతిశతకము రచించినకవి ఇంతకన్న ఆత్మప్రత్యయము గలవాడు. మిడిమేలపుదొరలగొల్చుట కన్న మడిమన్నుకొని బ్రతుకుట మేలని యాతడు చాటెను.

శరభాంకలింగశతకమును వ్రాసిన కవిపేరును కాలమును నిశ్చయముగ తెలియవు. రెండవప్రతాపరుద్రుని మంత్రియైన శరభాంకు డొకడు కలడు. కాని యీ శతక మీతడు రచించిన దని చెప్పుట కాధారములు లేవు. శరభాంకుని చాటుధార యొకటి ౧౫౬౦ ప్రాంతమున నున్న లింగమగుంట తిమ్మనకవి సులక్షణసారములో నుదాహృత మైనది. కావున శరభాంకలింగశతక మింతకుపూర్వము పుట్టినది కావలెను. ఇందమూల్యములగు నీతిపద్యములు గలవు. శివభక్తుల ప్రశంసయు కొంతగలదు. మూఢనమ్మకములను శకునములందు విశ్వాసమునీత డిట్లు విమర్శించినాడు.

'కలలకుఁ జింతయేల తన కడ్డమువచ్చిన పిల్లికోసమై
యలమటయేల తుమ్మిరని యాపదయేల, యనేక కీడులే
దొలగక కంటిమంచు మది దోఁచక నిల్పి కృశింపనేల పో
తెలియఁగలేరు మానవుల తిక్కకు వేఱొక మందుగల్గునా?
మెలఁగక వ్రాయు బ్రహ్మలిపి మిథ్యయె యోశరభాంకలింగమా!

మధ్యయుగపు నీతిశతకములలో వేంకటేశ శతకము ఉత్తమమైనది. దీనిని రచించినకవివతంసుడు తాళ్ళపాకయన్నమాచార్యుని కుమారుడైన పెదతిరుమలార్యుడు. ఈ కవి ౧౫వ శతాబ్దియంతమునను ౧౬వశతాబ్దిపూర్వభాగమునను నుండెను. తాళ్ళపాకవంశమువారు తిరుపతివేంకటేశ్వరస్వామి యాస్థానమున సంకీర్తనాచార్యులుగా నుండి పెక్కుకృతులను, గేయములను, యక్షగానములను, శతకములను రచించిరి. భక్తిప్రధానముగ వెడలినదైనను వేంకటేశ శతకమునందు రాజనీతియు లౌకికనీతులును సవిస్తరముగ చెప్పబడినవి. సీసపద్యములలో నున్న దీనిశైలి సులభమై భావగంభీరమై యొప్పినది. అనంతరకాలమునందు వెలసిన కుక్కుటేశ్వర రామలింగేశశతకములలోని నీతిపద్ధతి కిది ఒరవడియైనది.

నీతిబోధకమై హాస్యరసముతో చెంగలించు 'చంద్రశేఖర శతకము' చదువదగినది. దీని రచయిత పేరుగాని కాలముగాని తెలియవు. గుంటూరుమండలమునందలి మంగళగిరి దేవుని జాతరలో జరుగు పామరజనుల ప్రసంగముల నిది హాస్యరీతిలో అనుకరించుచున్నది. పినాసివాడైన పామరజనుడు విద్వాంసులను కళాభిజ్ఞులను అవహేళనచేయు పద్ధతి నీశతకము నవ్వుపుట్టునట్లు వర్ణించినది. గ్రామీణులసంభాషణరీతిని కవి యనుకరించుట చమత్కారముగ నున్నది. వైదికాగ్నుల పవిత్రత యెరుగని జానపదు డొకడు త్రేతాగ్నులనుండి చుట్టనిప్పు తెమ్మని యాచించునట!

సీ. దగిడీక బావల పసిద్ది సరే పొగనిప్పుకంట సో
మాదుగు లింటిపోయి బతిమాలితి మూడు నెగళ్ళు మందు తై
లేదని తిట్టె పాపపు కలిగ్గము యింతపరాక దాట్లో యీ
రాదట యం దరిసహ్యులు దురాత్ములు మూర్ఖులు చంద్రశేఖరా

కూచిమంచితిమ్మకవి తన కుక్కుటేశ్వరశతకములో ఈ రీతి పద్యరచనను కొంత యనుకరించెను.

వరాహగిరికొండరాజామాత్యుడు రచించిన "జగన్నాయక శతకము" మనోహరమైన నీతి శతకము. ఈ కవికాలము నిశ్చయముగా తెలియదు. ఈ శతకము వరాహగిరిజగన్నాథస్వామి కంకిత మీయబడిన దగుటచేత కవి విశాఖపట్టణమండలమువాడని తోచును. భాస్కరశతకమువలె నిదియు ప్రతిపద్యదృష్టాంతములతో నలరారుచున్నది. శైలి ధారాళమై కాఠిన్యములేక యున్నది. నీతులు కడుహృద్యములై యున్నవి. ఉత్తమతరగతి నీతిశతకములలో పేర్కొనదగినది కుక్కుటేశ్వరశతకము. అడిదము సూరకవిరచితమైన 'రామలింగేశశతకము' వంకాయలపాటి వేంకటకవికృతమైన 'మదనగోపాలశతకము' లోనగునవి.

బాలబాలికలకు చక్కని నీతిబోధ సేయునవి 'కుమారశతకము' 'కుమారీశతకము'. ఇవి యాధునికకవులు రచించినవి. గృహిణీధర్మములను నారీశీలమును ఉగ్గడించుచు వ్రాయబడిన 'మానినీశతకము' కూడ ఆధునికమైనను ఉత్తమ ప్రాచీనసంప్రదాయములో నున్నది.

## వేమనపద్యములు.

వేమనపద్యములు మూడునాలుగు వేలసంఖ్యలో ముద్రితములై యున్నవి. వీనిలో కొన్ని ప్రక్షిప్తము లుండినను ఆశ్చర్యములేదు. ఇట్లీపద్యములు శతకపరిగణనము క్రిందికి రాకపోయినను వేమనసూక్తులు తదితరశతకలక్షణములకు సరిపడుచున్నవి. వేమన యొకప్రత్యేకశతకమును గాని గ్రంథమును గాని వ్రాయఁబూనినవాఁడు కాఁడు. జీవితయాత్ర సాగినకొలఁదిని ఆతని యపారానుభవమునకును నిశితపరిశీలనమునకును తగిలిన యంశములపై నప్పుటప్పుట నాతఁడు సూత్రప్రాయమైన పద్యములను చెప్పుచు వచ్చెను. వాని నాతనిభక్తులును అనుయాయులును సేకరించిరి. ఈ పద్యములలో కొన్ని ముఖ్యవిభాగములను గుర్తింపవచ్చును (౧)సామాన్యనీతులు (౨) మతాచారవిమర్శనము (3)సంఘవిమర్శనము (౪) వేదాంతపరములు. శతకము లన్నిటను ఈయంశములు ఈషద్భేదములతో కాన్పించుచుండును.

వేమన ఏకాలపువాఁడో నిష్కర్షగ చెప్పుట కాధారములు తక్కువ. వేమనపద్యములకు ఆంగ్లానువాదము చేసి ఆంధ్రసాహిత్యమునందే కాక ప్రపంచసాహిత్యమునందుకూడ వీనికి స్థానముచేకూర్చిన మహనీయుఁడు ఛార్లెసుఫిలిప్‌బ్రౌన్‌దొరగారు. వేమన ౧౭వ శతాబ్దియంతమున నుండెనని ఈయన మతము. వేమన యొకపద్యములో గుంటుపల్లిముత్తమంత్రిని ప్రశంసించెను. ఈ మంత్రి యన్నదానమునకు ప్రసిద్ధికెక్కెనట. గుంటుపల్లిముత్త

మంత్రి గోలకొండనవాబగు మహామ్మదల్లీపాదుషా యధికారము క్రింద కొండవీటిసీమకు అవిూనుగా నియమింపబడిన వాడు. ఈతడు క్రీ.శ ౧౬౨౬లో స్వర్గస్థుడైనట్లు చాటుపద్యము గలదు. ముక్త్యమంత్రిని ప్రశంసించిన వేమన ౧౭వ శతాబ్ది చివర నుండవచ్చును. వేమనయోగిని గురించి సమగ్రకృషిచేసి * గ్రంథమువ్రాసిన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఈతడు ౧౫వ శతాబ్దిపూర్వభాగమునం దుండి వాడని నిర్ణయించిరి.

వేమన రెడ్డికులమువాడు కావచ్చును. తనది కాపుకులమని యొకపద్యములో వేమన నుడివెను. ఈతడు కొండవీటి సీమయందు జనించి పశ్చిమాంధ్రదేశములో విశేషకాలము సంచారము చేసెను. అవసానమునందు పామూరువద్ద కొండగుహలో ప్రవేశించి తిరిగి వెడలలేదని చెప్పుదురు. వేమన జీవితము ఆతనిపద్యములలో ప్రతిఫలించిన తీరునుబట్టి చూచినచో, ఆతడు సంపన్నగృహస్థుల యింట పుట్టి, సంసారవిషమ తరంగములచే, కొట్టబడినవాడై, క్రమముగ విరక్తుడై వైరాగ్యమునంది యోగము నభ్యసించి తత్త్వజ్ఞాన శిఖరము నధిరోహించి విశ్రమించెను. ఈతని జీవితమునందు వలెనే కవిత్వమునందును ముఖ్య లక్షణములు భావతీవ్రత, నిష్ఠురసత్యభాషణము అని చెప్పనగును. ఈతని జీవితకాలములో ఆంధ్రదేశము విచిత్రమత సాంఘికపరిణామముల కాకర మయ్యెను. రాజకీయ చక్రము

---

* "వేమన". ఆంధ్రవిశ్వకళాపరిషత్తుచే ప్రకటితము.

కూడ విచిత్రపరిభ్రమణములకు లోనగుచుండెను. మొగలాయీలయు, వారిసామంతులగు దక్షిణదేశపు నవాబులయొక్కయు దర్పము సన్నగిల్లుచుండెను. విదేశీయులగు పరాసువారును ఆంగ్లేయులును బుడతకీచులు ఓలాందువారును దేశములో పలుకుబడికై పెనగులాడుచుండిరి. కాని వీరిని గురించి వేమన ప్రశంసించినట్లు కనబడదు. హిందూమతము తనతొంటినైర్మల్యమును తత్త్వవికాసమును గోల్పోయి శుష్కదాంభికాచారములే మతస్థానము నాక్రమించెను. హిందూమతములోని ప్రధాన శాఖలవారైన శైవులు వైష్ణవులు అద్వైతులు తత్త్వచింతనము నందుకన్న మతవిడంబనమునందు శ్రద్ధ ఎక్కువ చూపుచుండిరి. విద్యాధికులైన వారికీ పతనము సంభవించుటచే పామరజనులు సత్యమతానుష్ఠానము తెలియనివారై మూఢాచారములకు నమ్మకములకును పాల్పడి జడవిగ్రహారాధన వ్యగ్రులై యుండిరి. ఇట్లు స్వధర్మబలము లేని హిందూప్రజానీకమును మతాంతరముల కాకర్షించుట కడు సులభముగా నుండెను.

ఈ యాపదనుండి హిందూసంఘము నుద్ధరించినవారిలో వేమనయోగివంటి తత్త్వప్రచారకులు చిరస్మరణీయులు. రామదాసువంటి భక్తులుకూడ పేర్కొనదగినవారే. వేమనచిన్ననాట శివభక్తుడై యుండెను. స్వతంత్రాలోచన చేయగలిగిన తరువాత అతడు శివకేశవభేదమును త్యజించెను. ఈతడు అద్వైతసిద్ధాంతమును తన పద్యములమూలమున ప్రచారము చేసెను. గ్రంథములలో నద్వైతమును చదువుటతో తృప్తిపడక స్వాను

భవముచే అద్వైతానందము ననుభవించిన యోగీంద్రుడు వేమన. అద్వైతసాధనమున కీతడు యోగము నాశ్రయించెను. హఠయోగమును వేమన నిరసించెను. రాజయోగమే ముక్తి పథమని యాతడు చాటెను. ఇట్లు తాను తరించి లోకము నుద్ధరింప దలచినవాడై వేమన సత్యసిద్ధాంతములను ప్రవచించెను. ఈ కార్యమునందాతడు మతాచార్యులను పేరు పెట్టుకొని ధనాకర్షణము చేయుటయే వృత్తిగా గలవారినందరిని విమర్శించెను. ఒకప్పుడు సత్యమైన ఆగ్రహము కలవాడై అట్టి వంచకులను నోరార తిట్టెను. అన్యాయమును కైతవమును సహింపలేకుండుట వేమన యోగీంద్రుని గొప్పస్వభావము. అతడు బ్రాహ్మణులను కఠినముగా విమర్శించెను. వేదములను ప్రశ్నించెను. జంగములను వైష్ణవాచార్యులను మొగమోడక తెగడెను. కాని వేమన రచనములందలి యొక గొప్పరసాయనము ఈ గంటులను మాన్పగల్గియున్నది. అది యాతని హాస్య చమత్కృతి. సంఘవిమర్శనమునకును సంఘోద్ధరణమునకును హాస్యప్రయోజనమును గుర్తించిన మహామేధావి వేమన యని చెప్పవచ్చును. వేమన పద్యములు చాలభాగము ఆటవెలదులు తిక్కనకు కందమువలె వేమనకు ఆటవెలది యభిమాన పద్యము. ఈ చిన్న పద్యసహాయముతో నాతడు చురుకైన భావములను గూర్చి కపటమును దాంభికమును సన్నకోత కోయును. ఈతని యుపమానములు సహజములై నిత్యజీవితవిషయములై యుండును. ప్రౌఢసంస్కృతశైలి లేకుండగనే ఆంధ్రభాష సూక్ష్మాతిసూక్ష్మ భావముల నెట్లు ప్రకటింపగలదో వేమనయోగి రుచి చూపించినాడు.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## పదునారవ ప్రకరణము.

### గేయములు

ఆంధ్రసాహిత్యమునందు ప్రత్యేకముగ ప్రజాశాఖయని చెప్పదగినది గేయరచనలు. పురాణములు ప్రబంధములు మొదలగునవి శిష్టవాఙ్మయ మని చెప్పదగినవి. శిష్టవాఙ్మయము. నాగరకులలోను పండితలోకమునందును పుట్టి ప్రచారములో నున్నది. గేయరచనలు చాలవరకు ప్రజాసామాన్యమునందు పుట్టి వారిలో ప్రచారమునంది జీవించియున్నది. కావున వీటికి జానపదగీతములు, పల్లెటూరిపాటలు, ప్రజాసాహిత్యము ఇటువంటి పేర్లు చెల్లుచున్నవి. ఆంధ్రమునందలి గేయరచన లన్నియు ముద్రితములు కాలేదు. ఇవి ప్రజలనోటనే వినబడుచున్నవి. కొందరు పూర్వ లాక్షణికులు ఈ పాటలను మధురకవితారీతులని వ్యవహరించిరి. అయినను వీనికి ఉదాత్తసాహిత్యములో స్థానము దొరకలేదు. మధురకవిత్వమునందు కళికలు, ఉత్కళికలు, ఉదాహరణములు, గీతప్రబంధములు, యక్షగానములు, దరువులు, ఏలలు, ధవళములు, మంగళహారతులు, జోలపాటలు, చందమామసుద్దులు మొదలగు గేయరచనలు చేరియున్నవి.

ఇవి ప్రధానముగ దేశిరచనలు. పాటలలోని ఛందస్సును భాషయు అచ్చపు తెలుగుదనముతో పరిమళించుచుండును. సాహిత్యముయొక్క ప్రధాన లక్షణములు రెండు. ఆనందమును కల్గించుట, సదుపదేశము నిచ్చుట. ఈ రెండుప్రయోజనములును ప్రజాసాహిత్య శాఖయందు చక్కగా కుదురుకొన్నవి. ప్రజాగీతములు వ్రాసిన కవులపేర్లు తరుచు తెలియరావు. ఈ గేయముల కాలనిర్ణయము చేయుటకూడ సాధ్యముకాదు.

గీతికారచన కడు ప్రాచీనకాలమునుండియు జరుగుచుండినదని యూహింపవచ్చును. భాషయందైనను ప్రజాగీతములు ముందుజనించును, శిష్టసాహిత్యము నాగరకత యభివృద్ధి నొందినతరువాత ప్రభవించును. ప్రజలు తమకు పరిచితమైన వీరకరుణాత్మక వృత్తాంతములను కథలుగా పాడుకొనుట సాధారణవిషయము. వీనిలో రసవంతమైన వానిని సంస్కరించి శిష్టకవులు కావ్యరచన చేయుట చూడనగును. అతిపురాతనమైన గేయము లెన్నియో మనపురాణములలోనికెక్కినవి. మహాభారతమునందలి అసంఖ్యాకములైన ఉపాఖ్యానములకు ప్రజాగీతములే మాతృకలని విమర్శకులు తలచుచున్నారు. బసవపురాణము వ్రాయుచు, పురాతనభక్తుల గీతములే తనగ్రంథమునకు మూలమైనట్లు పాల్కురికిసోమనాథుడు సూచించియున్నాడు. హిమవత్పర్వతముమీద ఎఱుకస్త్రీలు గానగీతములు పాడుచుండినట్లు నన్నెచోడుడు కుమారసంభవములో వర్ణించెను. నూతు

లనుండి ఏతములు తోలువారు గీతము లాలపించుకొనుచున్నట్లు ఆముక్తమాల్యదలో చిత్రింపబడినది.

పదములు, కథలు అని గేయములలో రెండువిభాగములు కన్పించును. చిన్నచిన్నగీతములు పదము లనబడు చున్నవి. దీర్ఘరచనముగలవి కథలుగా తెలియనగును. కథలను చెప్పుట గ్రామీణులలో ఒకప్రత్యేకకళగా పరిగణింపబడుచున్నది. శారద కాండ్రు, పిచ్చుకుంటులు మున్నగువారు వీరకరుణాత్మకకథలను సంగీతముతోను కొంచెము నృత్యముతోను విన్పింతురు. పూర్వ మీవిద్య జక్కులవారిచేత నున్నట్లు శ్రీనాథుని క్రీడాభిరామము వలన తెలియవచ్చును. పాటలకు పల్లవివలెనే కథలకుకూడ ఆలాపనచరణ ముండును. 'తందానతానే-తానేతందాన' 'రామరామరామ రామారామా' 'మేల్మేలుతమ్ముడా రంభలా లీతమ్ముడా' ఈ విధముగా అర్థముకల్గియు అర్థములేకయు కూడ పాడబడుచుండును. ప్రజాగీతములు వ్రాసిన కవుల నామములు తెలియరావని మీద చెప్పబడినది. పదమునకు అసలు కవియే లేడని కొందరు పాశ్చాత్యవిమర్శకులు వివరించిరి. కవిలేకుండ పదముగాని కథగాని పుట్టుట యెట్లని సందేహము కలుగును. దానికి వాదిసమాధాన మిది. పురాతనసంఘమునందు జనులంద రును పండుగలకో జాతరలకో ఒకస్థలమున సమావేశ మగుచుం డిరి. వారిచిత్తవృత్తు లప్పుడు ఆనందమయముగా నుండును. అట్లు కూడిన జనులతో తెలివిగలవా డొకడు సర్వజనులకును పరిచిత మైన యొకప్రసిద్ధకథను పుచ్చుకొని సులభఛందస్సులో పాడుట

ఆరంభించును. వానితోపాటు మిగిలినవారును ఆడుచు పాడుచు క్రొత్తచరణములను తమకు తోచినట్లు అల్లుచుందురు. ఈ విధముగ అప్రయత్నముగ సర్వజనుల నోళ్ళనుండి వెడలినదగుటచే అది ప్రజాగీత మగుచున్నది. ఏ ప్రత్యేకకవియు దీనిని రచించి యుండలేదు. ఈ గేయములు ఆనోటఆనోట పడి పెద్దవగుచు సంస్కరింపబడుచు ప్రజాసాహిత్యములో నంతర్భూతము లగును.

చెప్పుకోదగిన సాహిత్యసంస్కారము లేని ప్రజాకవుల ముఖమున వెలువడిన వగుటచే ఈ పాటలయందు పృథ్వీగంధము అచ్చముగా వాసించును. ప్రజాగీతములందు ప్రయత్నపూర్వకమైన కావ్యశిల్ప మేమియు నుండదు. అలంకార బాహుళ్యము కాని, వర్ణనాచమత్కృతులు కాని యుండవు. ప్రజాకవి మనుష్య జీవితమును మాత్రమే తన గేయమునందు చిత్రించును. ప్రకృతివర్ణనలు, ఉత్ప్రేక్షాతిశయోక్తులు ఆతని సరళసహజస్వభావమునకు విరుద్ధములు. తెలుగులోని గేయసాహిత్యమంతయు పల్లెటూరు కవులు రచించినదికాదు. పరిణతప్రజ్ఞులైన కవిశేఖరులు కూడ గేయరచనయందు పాల్గొని యుండుట ఆంధ్రభాష యదృష్టము. వీరికృతులయందు కవితాశిల్పము గోచరించును. ఈ లక్షణమునుబట్టి గేయములను శిల్పసహితము లనియు శిల్పరహితము లనియు రెండువిధముల చెప్పవచ్చును. ప్రజాగీతములందు కూడ రసము లన్నియు పోషింపబడును. వీరకరుణరసములకు ప్రాధాన్యము లభించును. భక్తిరసభరితములైన గేయములు తెలుగులో అసంఖ్యాకములుగ గలవు. శృంగారము హాస్యము ఎడనెడ

తగులుచుండును. అద్భుతరసమును చిత్రించుట ప్రజాకవికి కడు ప్రీతి. ఆతని ముగ్ధహృదయము అద్భుతవృత్తాంతములకు మంచి నీటికి చేపవలె ఎదురీదును. కథల యందీగుణము చక్కగా స్ఫురించును. అద్భుతములే కాక శకునములు, వానివలన కలుగు దుష్ఫలితములును వర్ణించుట ప్రజాకవికి మిక్కిలి ఇష్టము. తన కథాగమనమునకు వీనిని అనువుపరచుకొనుటలో ఆతని నేర్పు ప్రశంసావహము. దుఃఖాంతకథనమునకు తెలుగునందు ప్రజాకవులే మార్గదర్శకు లని చెప్పనగును.

## భక్తిగీతములు.

భక్తిగీతములను రచించినవారిలో ఇప్పటికి తెలిసినంత వరకు తాళ్ళపాక అన్నమాచార్యుడు ప్రాచీనుడుగ కాన్పించుచున్నాడు. భక్తిగీతములను సంకీర్తనము లందురు. అన్నమాచార్యుడు క్రీ. శ. ౧౪౨౪-౧౫౦౩ నడుమజీవించినవాడు. ఈయన గొప్ప వైష్ణవభక్తుడు. తిరుపతి శ్రీవేంకటేశ్వరస్వామి ఆతని దైవము. అన్నమాచార్యుడును ఆతనిసంతతివారును తిరుపతిక్షేత్రమున సంకీర్తనాచార్యులుగ నుండుచువచ్చిరి. స్వామిసన్నిధిని అన్నమాచార్యుడు భక్తిశృంగారరసములతో చిన్నిలు గేయములను వ్రాసి పాడి కైంకర్యము చేసెడివాడు. తాళ్ళపాకవారి సంకీర్తనములు రాగిరేకులమీద చెక్కబడి తిరుపతిదేవస్థానమునందు నిక్షేపింపబడియున్నవి. అన్నమాచార్యుని గేయములందు ఆ మహనీయుని కాలపు వృత్తాంతములు తెలియవచ్చును. విజయనగరచక్రవర్తి

యైన సాళువనరసింహరాయలు ఈ వైష్ణవభక్తుని గేయములను విని యాతనిని గౌరవించెను. ద్రవిడకర్ణాటాంధ్రభాషలలో ప్రథమ సంకీర్తనకారుడు అన్నమాచార్యుడే. కావున ఈతనికి 'పదకవితా పితామహుడు' అను బిరుదు కల్గెను. ఈ యాచార్యునిభావము లుదారములు. రచన మృదుమధురము. సమయోచితముగ నీతుల వ్యవహారికభాషారూపములను కూడ తన గేయములలో వాడెను. నిక్కపు వైష్ణవు డెట్టివాడని అన్నమాచార్యు డాలపించిన గీతము భావభరితముగా నున్నది.

మదమత్సరము లేక మనసు పేదైపోక
పదరిన యాసలవాఁడు వో వైష్ణవుఁడు ॥మద॥
ఇటునటుఁ దిరుగాడి యేమైనాఁ జెడినాడి
పెట్టిరంటా బోయరంటా బెక్కులాడి
ఎట్టివారినైనా దూఱి యెవ్వరినైనాఁ జేరి
వట్టియాసలఁ బడనివాఁడు వో వైష్ణవుఁడు ॥మద॥

భక్తిజ్ఞానవైరాగ్యసంభరితములైన కీర్తనములు వ్రాసి ప్రజాహృదయములో స్థాన మేర్పరచుకొనినవాడు రామదాసు. కంచర్లగోపన్న యను పేరుతో దాశరథిశతకమును వ్రాసిన వాడీమహాభక్తుడే. రామదాసుచరిత్రమును, అతనికిని తానీషాకును గల సంబంధములును ఆంధ్రులకు చిరపరిచితము. రామదాసుకీర్తనములు ఆబాలగోప విదితములు. ఈ గేయములలోని భాష

సరళమై వన్నెలు చిన్నెలు లేనిదయ్యునుజడహృదయమునుకూడ నంచలింపచేయు శక్తిగలిగి యున్నది.

"శ్రీరామనామం మరువాం మరువాం
సిద్ధము యమునికి వెరువాం వెరువాం
నారాయణుని మేము నమ్మేం నమ్మేం
నరనాథులను మేము నమ్మాం నమ్మాం"

'మువ్వగోపాలపదములు' వ్రాసిన క్షేత్రయ్యయు, భక్తా, గ్రేసరుడైన త్యాగరాజస్వామియు గొప్ప సంగీతజ్ఞులు. క్షేత్రయ్య పదునేడవశతాబ్దమునందుండి అనేక రాజాస్థానములను సందర్శించి గౌరవము బడసెను. మువ్వగోపాలపదములు భక్తిశృంగారమునకు లక్ష్యములు, ఈ పదములందలి భాష మిక్కిలి కోమలముగ నున్నది. అన్నమాచార్యుని భక్తిసంకీర్తనపథమున నడచిన త్యాగయ్య వ్రాసిన పాటలు ద్రవిడకర్ణాటాంధ్రకీర్తనవాఙ్మయమునకు మేలుబంతులు. త్యాగరాజకీర్తనములందు గొప్ప సంగీతలయజ్ఞానమేకాక చక్కని సాహిత్యలక్షణములును ఇమిడియున్నవని తజ్ఞులు చెప్పుచున్నారు.

## వీరగీతములు.

వీనినే కథలని పేర్కొందురు. మనపూర్వసాహిత్యము సంస్కృతపురాణముల ఆధీకరణములతోను. శృంగార రససమృద్ధి కల ప్రబంధములతోను నిండియున్నది. వీరరసాత్మక కావ్యములు తక్కువ. అందులోను జాతీయవీరుల

పరాక్రమచర్యలను చిత్రించు రచనలు అత్యల్పము. కావ్యవాఙ్మయమునందలి ఈ గొప్పలోపమును ఆంధ్ర గేయకవులు పూరించిరి. ఈ యంశమునందు మన ప్రజాకవులు మిక్కిలి కొనియాడదగినవారు. తెలుగు వీరకావ్యములలో మొదటిది 'పల్నాటివీరచరిత్ర'. కాటమరాజుకథ యొకటి వినవచ్చుచున్నది. పల్నాటివీరచరిత్రము మహాకవి శ్రీనాథుని పేర వినవచ్చుచున్నది. ఉద్దండపండితుడైన శ్రీనాథుడు ప్రజాసాహిత్యమువంకనుమరలి పల్నాటివీరుల యశోగానము చేయుట ముదావహము. కవి దీనిని తన చిన్ననాట రచించియుండును. అప్పటి కీతడు పల్లెటూరుకవిగనే యుండి పల్నాటిలో సంచారము చేయుచు వీరరసాత్మకమైన ఈ కథను వ్రాయదలచి యుండును. శ్రీనాథుడు వీరచరిత్రమునంతయు పూర్తిగ వ్రాసియుండడు. మల్లయ్య, కొండయ్య అను మరియిరువుర కవిత్వముకూడ పల్నాటి వీరచరిత్రయందు గాన్పించుచున్నది. రచనాప్రాగల్భ్యముగూడ వైవిధ్యమును సూచించుచున్నది. వీరచరిత్రములో వేర్వేరు భాగములు కలవు. రాజులపుట్టుక, కోళ్ళపోరు, కనమనేని యుద్ధము, మందపోటు, రాయబారము, బాలునికథ, కొమ్మరాజుకథ, బ్రహ్మనాయుని విరుగు వంటివి కలవు. వీనిలో బాలచంద్రయుద్ధము శ్రీనాథకృతమని తోచును. శ్రీనాథుని శైలిపాటవము. శిల్పరీతులు దీనియందు చక్కగ గోచరించును. వీరచరిత్రము ద్విపద, మంజరీద్విపదలలో వ్రాయబడినది. పల్నాటి యుద్ధము క్రీ. శ. ౧౧౮౨ ప్రాంతమున జరిగి నట్లూహింపబడి

నది. మహాభారతకథాచ్ఛాయలు దీనిలో అచ్చొత్తినట్లు కాన్పిం చును. భారతవీరులు కురుక్షేత్రసంగ్రామమునందువలె ఆంధ్రవీరులు కారెంపూడి క్షేత్రమునందు శుద్ధపరాక్రమమును నెరపి అజరామరకీర్తి గడించుకొనిరి. ఈ జాతీయసమరమును గీతిబద్ధము చేసి శ్రీనాధుడు ప్రజాకవియు విద్వత్కవియుకూడ నైనాడు.

## పెద్దబొబ్బిలి రాజుకథ.

ఇది యజ్ఞాతనామకుడైన ధన్యప్రజాకవి యొకడు వ్రాసిన వీరగీతము. ఫ్రెంచివారును విజయనగరపురాజైన విజయరామరాజు మున్నగువారును ౧౭౫౭వ సంవత్సరమున బొబ్బిలిని ధ్వంసము చేసినకథ ఇందువర్ణితమైనది. వీరకథలలో బొబ్బిలిపాట మిక్కిలి జనాకర్షకముగా నున్నది. దిట్టకవినారాయణకవి బొబ్బిలివృత్తాంతమును 'రంగరాయచరిత్ర' అను కావ్యముగా వ్రాసెను. బొబ్బిలివారికిని విజయనగరమునకును వైరము పెరుగుటకు రెండు ప్రత్యక్షకారణములు. బొబ్బిలిపాటలో వివరింపబడినవి. కోళ్ళపందెమొక కారణము. ప్రజాకవి కోళ్ళపోరాటమును నిజానుభవముతో చక్కగా చిత్రించెను. రెండవది; ఫ్రెంచివారితో వ్యవహరించుటలో తనకు సహాయము కమ్మని విజయరామరాజు బొబ్బిలికి ఉత్తరము వ్రాసెను. కాని వేంగళరాయుడు అనాలోచితముగ ఈ రాయభారమును త్రోసిపుచ్చెను. దిట్టకవినారాయణకవి ఈ యంశముల పేర్కొనలేదు. మరియు, బూసీని తూర్పుదేశముపోవనిచ్చుటకు హైదరాబాదు నిజామల్లీఖానుడు వెనుదీసినట్లును, వారి నాతడు నమ్మకదుబాసిలక్ష్మణునివెంట బంపినట్లు

ను పాటలో వర్ణితమైనది. నారాయణకవి దీనిని చెప్పలేదు. యుద్ధవర్ణనమునందు రంగరాయచరిత్రకన్న బొబ్బిలిపాట కడు వాస్తవికముగా నున్నది. ఇక్కడ ప్రబంధాతిశయోక్తులు ఉత్ప్రేక్షలు లేవు. బొబ్బిలి యశేషజనముయొక్క కఠోరదీక్షయు భయంకరశౌర్యమును పాటలో ఒడలు జలదరించునట్లు కూర్పబడినవి. బొబ్బిలివీరు లందరినోటను ఒకటే వీరనినాదము!

"రామరామ యనంత కాలము రాజ్యమేల లేము
జగము యుండువరకు మనము ఉండబోతామా"

క్రూరుడును భీరువును అగు హైదరుజంగు ఎప్పుడును ఒకటే దేవురింత

"జయించలేము జయించలేము ప్రాంచిదొరగారు
రెండుపుట్లనల్లము చుకు ఉత్తరు వియ్యండి"

బొబ్బిలిస్త్రీల యద్భుతశౌర్యమును ప్రజాకవి మరువలేదు. భేరీరామక్క యను వైశ్యసతితోటి యాడువాండ్రను రణమునకు తేజపరచిన విధము అవర్ణనీయము. రాణిమల్లమ్మ విజయరాజునకు పంపిన సందేశము కన్నుల నీరు తెచ్చుచున్నది. ఈ యంశములు రంగరాయచరిత్రలో లేవు.

దేసింగురాజుకథ.

ఇదియు బొబ్బిలిపాటవలె చక్కని వీరగీతము. దీనిని వ్రాసినకవిపేరు తెలియదు. తాను నెల్లూరుపురవాసుడ నని

మాత్రముచెప్పుకొనెను. బొబ్బిలిపాట వ్రాసిన కవికంటె ఈతడు విద్వాంసుడు. భాషాజ్ఞానము సముచితముగ కలవాడు. దేసింగు మహారాజుకథ స్వర్గములో ఇంద్రనారదసంవాదరూపమున చెప్పుటయు, సంస్కృతసమాసములు ప్రయోగించుచు 'ద్రుహిణపుత్రుడు' వంటి అప్రసిద్ధపదములను వాడుటయు చూడ ఈ కవి పామరుడు కాడని చెప్పవచ్చును. ఈతడు ఆధునికు డనికూడ చెప్పవలసియున్నది. నెంబరు, ఫైర్ ఫైర్ (Fire) సిగ్నల్, మేజరువంటి ఆంగ్లభాషా పదములను గీతములో వాడియున్నాడు. అయినను బొబ్బిలిపాట యొరవడిగా పెట్టుకొని వీరవాతావరణ మును సమర్థతతో కల్పించినాడు. ఈ కథ చెంజీకోటకు సంబంధించినది. చెంజీని పరిపాలించు దేసింగురాజు గొప్ప పరాక్రమశాలి. ఆర్కాటునవాబగు సాదుల్లాఖాను డీతనిని కప్పముకట్టుమని నిర్బంధించెను. దేసింగురాజు నిరాకరించుటచే ఆర్కాటు సైన్యములు చెంజీపై యుద్ధమునకు వెడలెను. ఈ దండయాత్ర యందు పలువురు హిందూసామంతరాజులు ఆర్కాటునవాబు పక్షమున నుండిరి. వేంకటగిరిప్రభువగు బంగారునాయుడు వీరిలో నొకడు. ఈ మిత్రకూటమునకును దేసింగిరాజుకును శంకరాభరణ నదియొద్దున సంకులసమరము జరిగి శుద్ధవీరుడగు దేసింగుమహారాజు మరణించెను. ఈ కథలో ఒకవిశేషాంశ మున్నది. మహమ్మదుఖానుడను తురకసరదారుడు రాజా దేసింగు మిత్రుడై యుండి యాతనిపక్షమున పోరి యసువులుబాసెను. మహమ్మదీయులును హిందువులును మిత్రులవలె సంచరించుట ప్రజాగీతములలో తరుచు

వచ్చుచుండును. ఇది యొక కవిసమయముగా నేర్పడి సందర్భ మున్నప్పుడును లేనప్పుడును కూడ కథానాయకులకు తురక స్నేహితు లుండుట వర్ణింపబడును. బంగారుతిమ్మరాజు కథలో ఆతనికి యవనమిత్రు లుండిరి. ఆర్కాటునవాబులు ౧౮వ శతాబ్దినడుమ ప్రాభవమువహించి యుండిరి. కావున దేశింగురాజు వృత్తాంతము ౧౮వ శతాబ్దములోనడచె ననియు, దీనికి సంబంధించిన పాట ౧౯వ శతాబ్దములో పుట్టె ననియు, తలప వచ్చును.

## బంగారుతిమ్మరాజుకథ

దీనినిరచించిన కవినామము కాని కాలముకాని తెలియదు. ఈకథ వెనుకనున్న చారిత్రకాంశములును స్ఫుటముగా తెలియ వచ్చుటలేదు. ఇది బొత్తుగా పుక్కిటిపురాణము కాకపోవచ్చును. ఒకానొక రాయలవారు పెనుగొండ ఏలుచుండెను. ఈ రాయల ఏడుగురుఅన్నదమ్ములకు సంతానములేదు.ఎట్టకేలకు రాయల తమ్ములలో ఒకడును శేషుపట్నము, చెంగల్పట్టు ఏలుచున్న రఘుపతిరాజుకు బంగారుతిమ్మరాజు పుట్టెను. రాయలభోగవనిత రంగసాని. దీనితమ్ముడు నవరమునారప్ప. నారప్పతండ్రిని శేషు పట్టణమువారు అవమానించి చంపిరి. ఈ పగతీర్చుకొనుటకై రంగసానియు దానితమ్ముడును కుట్రపన్ని బంగారుతిమ్మరాజును పెనుగొండకు రప్పింపుమని రాయలను వేడి యొప్పించిరి. తండ్రియు తల్లియు వలదని చెప్పుచున్నను బంగారుతిమ్మరాజు పెనుగొండకు

ప్రయాణ మయ్యెను. ప్రయాణసమయమున తిమ్మరాజు సతీమణికి ఎన్నియో అమంగళములు తోచెను. ఈ కథయందు దైవకృత ముపై ప్రజలకుగల గాఢవిశ్వాసము చక్కగా వర్ణింపబడినది.

> "పెనిమిటిమాట విన్నతోడనే పట్టపుదేవికి। రామరామ
> నుదుటనున్న కుంకుమబొట్టు నేలవ్రాలింది। రామ
> కాలిని వున్నా వెండి మట్టెలు బ్రద్దలు అయినాయి
> చేతిన వున్నా గాజులు చిట్లిపోయినాయి — రామరామ"

తిమ్మరాజు శకునములను అలక్ష్యము చేసి పెనుగొండకు వెళ్ళెను. పెనుగొండలో నుండగా తిమ్మరాజు తనను బలవంతముగ కామించె నని రంగసాని కథపన్ని రాజుతో కొండెము చెప్పెను. తిమ్మరాజు తిరుపతికి వెడలిపోయెను. రాయలసైన్యము ఆతనిని చుట్టుముట్టి తిరుపతివద్ద గొప్పయుద్ధము జరిగి తిమ్మరాజు నిహతు డయ్యెను. ఈ కథలలో వాస్తవిక వాతావరణము కల్పించుటకై మజిలీలను వర్ణించుట యొకవిశేషము. ఈపథకము బొబ్బిలిపాటలో మొదట వేయబడినది. తిమ్మరాజుకథలోని మజిలీలు శేషుపట్నమునుండి చెంగల్పట్టు, దానినుండి అనంతగిరి, తరువాత శివకంచి, విష్ణుకంచి, తిరుపతి, పెద్దాడ, పెనుగొండ.

తెలంగాణమునందలి ప్రజాకవులు రసవంతములైన వీర గీతములను కొన్నిటిని రచించిరి. వీనిలో * 'సర్వాయిపాపడికథ.

---

* సర్వాయిపాపడి చరిత్రవిశేషములను శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'అసాదృతవాఙ్మయము' అను వ్యాసములో చక్కగా వివరించి యున్నారు. చూడు "అమరావతీ స్తూపము ఇతర వ్యాసములు."

ప్రశస్తమైనది. గవుండ్లసర్వాయి కుమారుడైన పాపడు దానికథా నాయకుడు. ఔరంగజేబు రాజ్యాంతకాలమున నీతడుండెను. ఈతడు కల్లుగీసికొని జీవించుటతో నారంభించి సాహసికవృత్తి గలవాడై శూరుడై సైన్యములగూర్చుకొని కోటలుగట్టి ఓరుగల్లు గోలకొండ మొదలగు దుర్గములను దోచుకొనుచు చిన్న పాళెగాడుగా స్థిరపడెను. భోనగిరి పరగణాలోని షాహాపురము, తాటికొండ దుర్గముల నీతడు కట్టి తన సైన్యముల నచ్చట నిలిపి చుట్టుపట్లదేశమున కుపద్రవము కల్గించుచు మహామ్మదీయ సేనాపతులకు ప్రక్కలో బల్లెముగ నుండెను. సర్వాయిపాపని పౌరుష మెంతభయావహ మైనదో క్రిందిపంక్తులు చూపును.

"అబ్బా అబ్బా పాపనియొక్క పేరుచెప్పితే
ఊరకపిచ్చిక పొలము బారదు
పొట్టిపిచ్చుక పూరు చేరదు
పసిబిడ్డలు పాలుతాగరు గా - వాడిపేరంటే
గట్టాలు గుగ్గిళ్ళు తినవూ - వాడిపేరంటే
గోల్కొండ బస్తీ లోణుకు
నెల్లూరు బస్తీ లోణుకు

సముద్రపుపొంగువలె పొర్లివచ్చిన సర్వాయిపాపడి సాహసజీవితము వీరమరణముతో చల్లారినది. తెలంగాణమున ప్రచారములోనున్న వీరకథలు ఇంకనుగలవు. ఆరెమరాఠీలకథ, బలుగూరి కొండయ్యకథ, సదాశివరెడ్డిపాట వీనిలో పేర్కొనదగినవి.

## జాలికథలు

### బాలనాగమ్మకథ.

కథాగేయములలో కరుణరసప్రధానమైనవియు చాల కలవు. వీనిలో ప్రథమగణ్యమైనది 'బాలనాగమ్మకథ'. ఆంధ్రగేయసాహిత్యములో శ్రేష్ఠతమమైన ఈ కథ ప్రపంచవాఙ్మయములో అగ్రస్థానము పొందదగినది. అచ్చపు ప్రజాగీతమైన దీని కర్త పేరుకాని కాలముకాని తెలియవు. బాలనాగమ్మకథలోని స్మృతులు చారిత్రకవీధులలో దూరదూరము అస్పష్టధ్వనులతో వినవచ్చుచున్నవి. అతిమనోహరమైన పురాతన వాతావరణము దీని నావరించి దీనికి పురాణగాథల ప్రతిపత్తిని కల్గించుచున్నది. బాలనాగమ్మ అత్తవారియూరైన పానుగంటిపురము తెలంగాణములో నల్లగొండసమీపమున నిప్పటికిని సామాన్య గ్రామముగా నిలిచియున్నది. మహబూబునగరము జిల్లాలో మరియొక పానుగల్లు కలదనియు అదియే బాలనాగమ్మ యూరనియు కొందరు చెప్పుదురు. ఎట్లైనను కాకతీయులకాలములో ఒకపానుగల్లు ప్రసిద్ధపట్టణమై యుండెనట. చరిత్రాంశము. శైవమతము ఆకాలములో గొప్ప వ్యాప్తియందుండెను. బాలనాగమ్మను చెరగొనిపోయిన ఫకీరు జంగమురూపములో వచ్చుట గమనింపదగినది. ఈ గాథయందు రెండుభాగములు కలవు. వానిలో పూర్వభాగమే ప్రాచీనతమమైన కథాభాగము. ఉత్తరభాగమునందు మౌలాలినివాసియైన ఫకీరు చర్యలున్నవి. మహమ్మదీయులు మొట్టమొ

దట ఆంధ్ర దేశములో స్థావర మేర్పరచుకొన్న కాలమును వారి విషయమై ప్రజలలో వ్యాపించిన అద్భుతభయసందేహములును ఫకీరువృత్తాంతములో రూపొందినవి. బాలనాగమ్మకథ ఇట్లు క్రమాభివృద్ధినొంది సర్వాతిశాయియైన ప్రజాగేయమైనది. పూర్వభాగ మంతయు కరుణాత్మకప్రపంచము. బాలనాగమ్మ తల్లి భూలక్ష్మీదేవి సంతానములేక వ్రతములు సల్పుటయు, ఏడుగురుబాలికలు జనించినంతనే ఆమె శేషునకు ఆహార మగుటయు ఈ గాథను వినుచున్నప్పుడు నిర్జీవశిలలుకూడ వాపోవుచున్నచో అతిశయోక్తి యుండదు. ఈ గేయము పాడిన కవి వాల్మీకివలె శ్రోతలను పాఠకులను ఏడ్పింపగలడు. ఈతని లోకజ్ఞతయు అసాధారణము. సందర్భోచితముగ పాత్రలముఖమున నీకవి పల్కించినపలుకులు హృదయమునకు బాణములవలె తాకును. పిల్లలు లేక దుఃఖించు భూలక్ష్మీదేవి వాక్యములు:—

"ఎక్కేటందుకు పల్లకీలు గలవు
ఏలేటందుకు భూములు గలవండి
సంతు లేనివారి యిండ్లు—కందులుకొట్టిన కళ్ళము."

నాగేంద్రునితో భూలక్ష్మమ్మ మాటలు:—

నామరణానికి నేను కర్తనయ్యా
ఒకరిమరణము నాకు యెందు కేమి'

ఆసన్నమరణమైన భూలక్ష్మమ్మ తనబిడ్డలకు మారుతల్లి వచ్చునని చింతించుట.

'నేనుగట్టిగా చస్తేనమ్మయ్యా — మీతండ్రియునవా భోజరాజు మారుపెండ్లి యాడుతాడే రాజు — మారుతల్లి వో గట్టిగవస్తుంది బిడ్డలకయిన అన్నము పెట్టదు — బిడ్డలకయిన నీళ్లుపొయ్యాదేమి వట్టిండ(కట్టుళ్ళ?) మారయినకన్నతల్లి మేలు—మారుతల్లికి కన్న తల్లి మేలు.

లక్ష్మమ్మకథ.

మిక్కిలి జాలికొల్పు కథలలో లక్ష్మమ్మకథయొకటి. ఈ కథావృత్తాంతము అర్వాచీనకాలమునందే జరిగియుండును. దీనిని వ్రాసినకవి చెన్నపుర నివాసి యగు కాకర్లరాజు వుటిగంటివీరయ్యదేవర యట. లక్ష్మమ్మ గారు మహా పతివ్రత. ఈమె కమ్మవారి యింటిబిడ్డ. పల్నాటిలోని దుగ్గిగ్రామ మీమె పుట్టిన యూరు. లింగాలపురవాసి యైన చిరుమామిళ్ళ వెంకయ్య ఈమెను పెండ్లియాడెను. బాల్యమునుండియు లక్ష్మమ్మ దైవభక్తియు నియమనిష్ఠలును గల సాత్వికురాలు. తల్లిదండ్రు లీమెను విడిచియుండలేక అల్లుని యిల్లరిక ముంచుకొనిరి. లక్ష్మమ్మ కొక కూతురు పుట్టినతరువాత భర్త యేకారణముననో ఈమెపై నలిగి రహస్యముగ కోత వెట్టుచుండెను. కొన్నిదినముల కాతడు లింగాలపురమునకు వెళ్ళిపోయెను. పతిపరాయణయైన లక్ష్మమ్మగారు అత్తవారింటికి వెడలెను. అత్తింట కాలువెట్టగనే ఆమె

యక్కడ తులసికోట వేయించెను. అత్తయాడుబిడ్డలు లక్ష్మమ్మ ను ఈర్ష్యతో చూచుచుండిరి. లక్ష్మమ్మ చిన్నికూతురు పార్వతమ్మను ఆడుబిడ్డకొడుకునకు పెండ్లిచేయగోరిరి. అంతకుముందే లక్ష్మమ్మయన్నగారికీ బాలిక నిచ్చుటకు మాటలు నడచియుండెను. కావున లక్ష్మమ్మగారు సమాధానము చెప్పలేక పోయెను. ఈ క్రోధమును మనస్సులో పెట్టుకొని అత్తయాడుబిడ్డలు లక్ష్మమ్మను రాచపనుల పెట్టుచుండిరి. సాధ్వియైన లక్ష్మమ్మ పల్లెత్తి మాట యనలేదు. చివరకు అత్తఆడుబిడ్డలు లక్ష్మమ్మపై జారత్వనేరమును మోపి భర్తచే ఆమెను హింసాపూర్వకముగ చంపించిరి. ఈ దుఃఖగాథను వ్రాసినకవి బాలనాగమ్మకవియంత నేర్పరి కాకుగాని మొత్తము మీద లోకజ్ఞత వ్రాసెను. దీనియందు వచనభాగమే యెక్కువగా నున్నది.

## చిన్నమ్మకథ.

ఇది యొకజాలిగొల్పుకథ. వెంగళ్వరాజు అనువాతడు దీనిని చేసెను. లక్ష్మమ్మకథను చూచి యిది వెడలినట్లు తోచును. లక్ష్మమ్మచరిత్రచే కమ్మవారికి గలిగినప్రతిష్ఠను చిన్నమ్మకథచే రెడ్డివారికి కలుగ చేయుట కవి యాశయమై యుండును. చిన్నమ్మ పాకనాటిరెడ్ల కులస్థురాలు. పాగొండపట్టణ మీమెతల్లిగారి యూరు. శీలము వారియింటి ఆడుబిడ్డ చిన్నమ్మ. వోలుకొండ రాఘవరెడ్డి కుమారుడు వెంగళరెడ్డి యీమెను పెండ్లాడెను. చిన్నమ్మ ఆబాల్యసిద్ధముగ విష్ణుభక్తురాలు. ఈమె అత్తవారు

శివభక్తిగలవారు. అత్తింట కాలుపెట్టిననాటినుండియు వారీమెను విష్ణుపూజవిడచి శివపూజ చేయుమని నిర్బంధింపదొడగిరి. స్థిరచిత్తురాలైన చిన్నమ్మ ఇందుకొడబడలేదు. అత్తమామ చిన్నమ్మను పలువిధముల బాధింపజొచ్చిరి. భర్త యొకమొరటు మానిసి. కాకులలోకోవెలవలె మెలగుచు చిన్నమ్మ వారు పెట్టిన హింసలను సహించుకొనుచుండెను. ఈమెయారాధ్య దైవము మద్దులేటిస్వామి. భక్తురాలైన చిన్నమ్మను స్వామి యెల్లపుడు వెంటనంటియుండుచు కంటికి రెప్పవలె కాచుచుండెను. చిన్నమ్మచే ఎన్నియో మహాత్మ్యములను చేయించెను. ప్రహ్లాదుని వలె చిన్నమ్మయు అత్తవారుచేయు కఠినపరీక్షలను విష్ణుభక్తి సామర్థ్యముచే తరించెను. ఈ కథయందు పేర్కొనబడిన ఇతర స్థలములు నల్లమలకొండలు, కదిరికొండ, పాలేరు, తిరుపళ్ళూరు రాఘవస్వామి మొదలగువానిని బట్టి ఇది నెల్లూరుప్రాంతమున పుట్టినకథ యని యూహింప వీలగుచున్నది. దీనియందును వచనభాగము విస్తారముగ నున్నది.

## ధర్మాంగదచరిత్ర.

పాముపాట యని దీనికి మరియొక పేరు. దీనిని రచించిన ఈపూరినారాయణరాజు, పూసపాటివిజయరామగజపతి రాజుగారు విజయనగరమున రాజ్యము చేయుచుండగా వర్ధిల్లెను. కవి యాధునికుడు. పాముపాట కడుపురాతనమైనకథగాతోచును. కాశ్మీర దేశము నేలిన ధర్మాంగదరాజు భార్య అర్మలిదేవి కడుపున

పాముపుట్టెను. ఆ పుట్టినది మగపిల్లవాడని మంత్రులు చాటింపించిరి. ఈ మోసమట్లేనిలిచి శేషకుమారునకు పెండ్లి కాలము వచ్చెను. ఘూర్జరరాజకన్యను త్రైలోక్యసుందరిని వంచనచే కత్తికి భాషికముగట్టుపరిణయము చేసిరి. సుందరి యత్తవారింటికి వచ్చి చాలకాలమువరకు భర్తముఖమును సుఖమును ఎరుగక, గుండెనిబ్బరముచేసికొని నా భర్తనుచూపుమని యత్తను ప్రార్థించెను. నీ భర్త యితడేయని పాములబుట్టను ముందు పెట్టెను. సుందరి నిర్ఘాంతపడి చేసినమోసమునకు బిట్టువగచెను. అయినను పతివ్రతాతిలకమైన ఆమె తనభర్తయైన పామును నెత్తిన పెట్టుకొని తీర్థయాత్రలు సేవించుచు కన్నకన్న పుణ్యజలములందును గ్రుంకుచుండెను. ఎచ్చటను ఆమెకు విజయసిద్ధి కాలేదు. ఎట్టకేలకు త్రైలోక్యసుందరి ఆంధ్రదేశపు ప్రాచీనపుణ్యక్షేత్రమైన ధర్మపురి సమీపమున గంగ (అనగా గోదావరి) యందు బ్రహ్మగుండమున మునుగగా ఆమెభర్తకు పామురూపము పోయి నవమన్మథాకారము కలిగెను. ధర్మపురీనృసింహుని ఆ నూతన దంపతులు సేవించిరి. ఇట్లీకథ ధర్మపురీక్షేత్రమహిమను ప్రశంసించుటకు పుట్టినదని చెప్పదగును. ధర్మాంగదచరిత్ర వ్రాసినకవి కొన్నిఘట్టములలో ప్రబంధపు పోకిళ్ళు పోయినను సరసముగనే రచించినాడు. ఈతడు లోకవృత్తము నెరిగినవాడే.

అత్తకును శాంతంబు - కత్తికిని మెత్తన
కలదంటె యిలలోన - కలికిరో వినవె''

## కాంభోజరాజుకథ.

ఇది అద్భుతరసమున కాకరమగు ప్రాచీనకథ. బాలనాగమ్మ వృత్తాంతము ఆంధ్ర శైవులలో పుట్టిపెరిగినట్లే, కాంభోజరాజుకథ కర్ణాట శైవులలో పుట్టినదిగా కాన్పించును. దీనిని రచించినకవి జంగముసుబ్బయ దేవర. ఈ కథలన్నిటియందును శివభక్తితో పాటు నాగుమయ్య ప్రాధాన్యతయు నుండుట గమనింపదగినది. సర్పపూజ యాంధ్ర దేశములో కడుపురాతనమునుండియు జరుగుచుండెను. ఈ కథలో దీర్ఘ వచనభాగములు కలవు.

## కామమ్మకథ.

ఉత్తమశీలము, త్యాగము, పాతివ్రత్యము మొదలగు సద్గుణములు తక్కువకులములవారియందు కూడ నుండునని కామమ్మకథ నిదర్శన మిచ్చుచున్నది. కథావృత్తాంతము ఆంగ్లేయులీదేశమును పాలించిన మొదటిదినములకు సంబంధించినది. బెస్తకులమునందు పుట్టిన కామమ్మ ఉత్తమగుణసమన్వితురాలు. ఈమె భర్త మారయ్య దొరలవద్ద కొలువు చేయుచు జ్వరపడి మరణించెను. కామమ్మ సహగమనము చేయదలచెను. ఆనాటికప్పుడే 'సతి' యాచారము నిషేధింపబడి యుండెను. కామమ్మ సహగమనమునకు అనుజ్ఞకొరకై కాకినాడ కలెక్టరుదొరగారిని వేడెను. అగ్నిగుండము చొరవలదు. మారుమనవు చేసుకొనుమని దొరగారామెకు హితము చెప్పిరి. శీలవంతురాలైన కామమ్మ ఆగ్రహముతో దీనిని నిరసించి, చెన్నపట్టణము వెళ్ళి

పెద్దదొరలనుండి కాబోలు అగ్నిప్రవేశమున కనుజ్ఞ తెచ్చుకొనెను.

## తత్త్వములు.

ప్రజానీకమునందు తత్త్వవిచారమును పెంపొందించుటకై ప్రజాకవులు గేయరీతి నవలంబించిరి. భారతీయుల అత్యున్నత వేదాంత భావనలను గీతములమూలమున సామాన్యప్రజల కందించిన జిజ్ఞాసువులు వీరు. పూర్వవేదాంతార్థములను వివరించుటతో తృప్తిపడక నూతన తత్త్వార్థములను చింతించి ప్రతిపాదించ గల సాహసికులు ఆంధ్రప్రజాకవులలో పెక్కురు గలరు. వీరిలో వేమన యోగిని గురించి ఇదివరలో చెప్పనైనది.

### పోతులూరివీరబ్రహ్మము.

ఈతడు జాతిచే కంసాలి. ఇతనికాలము సుమారు పదునేడవశతాబ్ది మధ్యభాగము. కర్నూలుమండలము బనగానపల్లెలో నీతనిబాల్యము పసువులకాచుటయందు గడచినది. ఈతడు విగ్రహారాధనలు జాతరలు జాతిభేదములు మొదలగువానిని ఖండించి ప్రజలకు హితోపదేశము చేసెను. వీరబ్రహ్మము సాక్షాత్తుగ శివునియావతారమని ప్రజలు విశ్వసించిరి. వేమనయోగివలె ఈతడును అద్వైతవేదాంతార్థములనే బోధించెను. తత్త్వప్రచారమునం దీత డవలంబించినపద్ధతి జనాకర్షకమైనది. నిత్యజీవితము నందలి యంశములను పురస్కరించుకొని రూపకములసృష్టించుచు

సులభమార్గములో గహనతత్త్వార్థములను బోధించును బ్రహ్మముగారిబోధనలకు కాలజ్ఞానతత్త్వములు అని పేరు. వీనినే వచనములనుటయు కలదు. పైకి సులభముగ కనుబడుచున్నను ఈ తత్త్వములందు గూఢార్థములును గుహ్యయోగమును నిలీనమై యున్నవి. బ్రహ్మముగారి తత్త్వమొకటి.

* "చెడుగుడాడెనే బ్రహ్మం బలిగుడాడెనే చెడుగుడు గుడుగుడు గుహ్యనాదం,కలుషబిందుల,కనులగూడుక ॥చెడు॥ ముప్పదిరెండక్షరములలో మేలైన దొక యక్షరంబుతో,కొగుబి కొగుబి గుబికొ కూయుచు,నాల్గుముఖములనలుగుర తరిమి,పదిదిక్కులకు పరుగెత్తించి,చెట్టుకొట్టంగా పాలుకారగా చెడు॥ చండతేజమై నిండుపౌర్ణమి, పండువెన్నెల ప్రబలికాయగ, ఆకటి ముగ్గురు యీకటి నలుగురు, నడుమనొకవృద్ధి జడసాంపుతో నిలిచి సోహం సోహం బని చెంగట బలుకుచు ॥చెడు॥

పోతులూరివీరబ్రహ్మంగారి శిష్యులలో మహమ్మదీయులుకూడ నుండుట విశేషము. వీరిలో దూదేకులసిద్ధయ్యగారు తత్త్వములు రచించెను. తనకులమును గూర్చి తిరస్కారముగా అడిగిన వారి నుద్దేశించి సిద్ధయ్యగారు చెప్పినతత్త్వము.

* ప్రజాసాహిత్యము చాలవరకు తప్పులతడకలుగా ముద్రితమైనది. అందును కాలజ్ఞానతత్త్వములు మొదలగు గూఢవేదాంతార్థప్రతిపాదకములైనవి మరియు దోషభూయిష్ఠముగా కన్పించుచున్నవి. కావున వీనియందు పాఠశుద్ధి విచారణీయము.

"ఏకుల మని నను వివరమడిగితే। యేమని తెల్పుదులోకులకూ, పలుగాకులకూ, దుర్మార్గులకూ యీదుష్టులకు ॥ఏ॥ ఫాలభాగమున యాలలు పాడుచు భావము గన్నది నా కులము ॥ఏ॥ ఇంటిలోపలను ఇల్లుగట్టుకొని మంటలోపల రాట్నంబట్టుక। కంటిలోపల కదురుబెట్టుకొని ముక్కులోపల యేకుబెట్టుకొని। చెవులో బారా చేరిక తీసుక। నారాయణ యను వరము తీసుకొని। అష్టాక్షరియను తడికె వేసుకొని। పంచాక్షరి యను పంచ దీసుకొని। తధిమి తధిమిగుబ దెబగుబ దెబ। ఏకినకుల మే మా కులము ॥ఏ॥ ఏకిన ఏకులు పీకిన పింజెలు లోకమంత నొక పాకము చేసుక। వేకిన కులమే మా కులము ॥ఏ॥

వైరాగ్యజ్ఞానదాయకము లైన తత్వములు వ్రాసిన వారు హరిదాసులు పెక్కుమంది గలరు. ఏగంటిలక్ష్మప్పగారు, నాసరయ్యగారు, పీరుమహమ్మద్‌హుస్సేనుదాసుగారు, నరసింహదాసుగారు, పీరుమొహియుద్దీనుగారు —వీరు రచించినతత్వములు గంభీరార్థబోధకములై మర్మకవిత్వపు తునుక లై యున్నవి. కాకినాడవాస్తవ్యుడైన యడ్లరామదాసుగారు ఆధునికుడుగా తోచును. ఈయన కీర్తనలు తత్వములును ప్రజలలో వ్యాపించి యున్నవి. చిత్తసంస్కారము కల్గించుటయందును, భాషాప్రాశస్త్యమునందును ఇవి పోతులూరివీరబ్రహ్మముగారును వారిశిష్యగణమును వ్రాసినతత్వములతో తులతూగ జాలవు.

## స్త్రీలపాటలు.

స్త్రీవిజ్ఞాన మంతయు వారిపాటలలో నెలకొనియున్నది. అక్షరాస్యలు సాధారణముగ మనస్త్రీలకు తెలియని పురాణ

గాథలుకాని తత్వభావములుకాని లేవనియే చెప్పవచ్చును. ఈ నిరక్షరాస్యసంస్కృతి కంతకును మూలము స్త్రీలపాటలు. జీవిత సమస్యలపై నారీదృక్పథము వేరు. పురుషులదృక్పథము వేరు. శిష్టవాఙ్మయము పురుషులచే పురుషదృష్టితో వ్రాయబడినది. దీనిలో స్త్రీహృదయముపట్టుబడుట కష్టము. మహిళలయాంతర్యమును సానుభూతితో కనిపెట్టుటకును చిత్రించుటకును కవులంతగా శ్రద్ధవహించలేదు. అప్పుడు స్త్రీజీవితమును తెలిసికొనుటకు పాటలే మనకు సాయపడుచున్నవి. నారీమూర్తి కారుణ్యమయి. ఈ భావము స్త్రీలపాటలలోనే చక్కగా కనబడును.

స్త్రీలపాటలు అనేకసందర్భముల కనవురగ నుండు నట్లు కూర్చబడినవి. వీనిలో వేడుకపాటలు ముఖ్యమైనవి. పెండ్లి, దానికి సంబంధించిన తంతు అంతయు స్త్రీల ప్రమేయము. పసుపుకొట్టుముదగ్గరనుంచి అప్పగింతలవరకు నడుచు ప్రతికలాపమునకును స్త్రీలు లలితశృంగారమనోజ్ఞములైన పాటలు, పాడుచుందురు. వీనిలో మంగళహారతులు, నలుగుల పాటలు అలకపాటలు, వియ్యాలవారిమీద హాస్యపుపాటలు, బూజముబంతులు మొదలగునవి చేరును. ఇంకను శోభనపుపాటలు, తలుపులదగ్గరపాటలు నర్మగర్భముగ రమ్యముగ నుండును. ఈ పాటలలో నాయికానాయకులు సాధారణముగ దేవతాదంపతులుగా నుందురు. కేవలము లౌకికదంపతులమీద పాటకూర్చుట భావ్యముకాదని యుద్దేశమై యుండును. శివుడుపార్వతి, లక్ష్మీనారాయణులు, కృష్ణుడు ఆతనిభార్యలు, సీతారాములు--వీరు ఆదర్శదంపతులు. సీతా

కల్యాణము, శాంతకల్యాణము, శశిరేఖపెండ్లి పాటలవంటివి పేరునకు పూర్వకథలైనను నిజముగ కవి తెలుగుదంపతుల వివాహపు ముచ్చటలే. నారీజీవితమందలి రమ్యాదుఃఖము ను భావలహరిపై మోసి తెచ్చునవి అప్పగింతపాటలు. కాళిదాసు శాకుంతలమందలి కణ్వమహర్షి మొదలుకొని ఈ నాటిగృహస్థుపరకును కన్నబిడ్డల నత్తవారి కప్పగించుచు కన్నీరు తుడుచుకొనని వారుండరు. ఆంధ్రకావ్యములలో కూడ కవులు ఇటువంటిఘట్టములలో మిక్కిలి కరుణాత్మకముగ వ్రాయుట పరిపాటి. "కుమార్తెను అత్తవారింటికి పంపెడిపాట.":—

"సెలవిచ్చి మాయమ్మ—సెలవిచ్చినామమ్మ
చెలగి మీయత్తింట-బుద్ధిగా నుండమ్మ
ఎవ్వరేమాడిన ఎదురాడ కమ్మా
నాతోటి చేసిన మంకుపోకల్ల
ఎరుగనిఅత్తింట్లో చేయబోకమ్మా
అరటాకువంటిది ఆడజన్మంబు

సంసారమధువును స్త్రీలకు విషప్రాయముగ చేయగలిగిన సన్ని వేశములు కలవు. ప్రాణసమానుడైదభర్తతో రవరపలు పొడముట యొకటి. సవతిదాపురించుట రెండవది. 'సీతాఅమ్మవారి అలక' అను పాటలో భార్యాభర్తల చిటిపొటికలహములు చమత్కారముగా చిత్రింపబడినవి. "గంగాగౌరీసంవాదము" సవతులకయ్యముల కుదాహరణము. మనసంసారములందలి

వివాదములలో భార్యతగినంతయరణము తేలేదని భర్త వేధించుట యొక ముఖ్యాంశము. ఈ భావమును మనసు నందుంచుకొని యొక లోకజ్ఞుడు 'సుభద్రసారె' యనుపాటను వ్రాసెను.

అర్జునుడు సుభద్రతో అనును:—

పున్నమ్మినాడైనా బూరె లొండుకొని
పురుషుడ రమ్మన్ని పిలువరు మీవాళ్ళు
పరకటపత్తి వండిన్నాడైనా
పచ్చాకమ్మలజట్ట పెట్టరు మీవాళ్ళు

సుభద్ర:—

మావాళ్ళు పేదవాళ్ళు మాకేమి గలదు
పెట్టగలచోటైన పెండ్లాడరాదా
ఇవ్వాగలచోటైన వియ్యామందగ రాదా.

తనమాటకుప్రతిసమాధాన మిచ్చిన నేరమునకై అర్జునుడు సుభద్రను పాంకోళ్ళతో తన్నెనట! ఈ గృహకలహము ఆంధ్ర కుటుంబములనుండి ప్రతిధ్వనియే!

సంసారసమస్యలటుంచి విజ్ఞానదాయకములైన పాటలును స్త్రీలకొరకు అసంఖ్యాకములుగ నున్నవి. రామాయణము సంపూర్ణముగను, భారతములోని విరాటపర్వము మున్నగు ఘట్టములును సుదీర్ఘమైన పాటలుగ వెలసియున్నవి. శ్రీకృష్ణజీవిత

మును గురించి శ్రీకృష్ణునిచల్దులు, చిలుకరాయబారము, సత్యభామసరసము వంటి పాటలు పాడబడుచున్నవి. ఇవికాక ప్రహ్లాదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము, సురాభాండేశ్వరము, చెంచులక్ష్మి పెండ్లి, పాముపాట మొదలగు రసవంతములును జ్ఞానదాయకములునైన పాటలు స్త్రీలు పాడుదురు. పిల్లలభారమంతయు ఆమెవారిమీదనే నిలచియున్నది. ఈ పనిని వారు చక్కగా నిర్వహించగల్గుటకు తోడ్పడు ముద్దులుమూటగట్టు పాటలున్నవి. జోలపాటలు, లాలిపాటలు, గుమ్మడుపాట ఇటువంటివి. వాల్మీకియాశ్రమమునందున్న సీతాదేవి పోరుపెట్టుచున్న తనకుమారులనూరడించునట్లు పాడబడుపాట హృదయమును ద్రవింపచేయునది. "ఏడువకు రఘుకుమార! ఏడువకు తండ్రీ, ఏడిస్తే నిన్నెవ్వరెత్తుకొను వారు". పురుషులనువలెనే నారీలోకమును కలవరపెట్టు వేదాంతవిషయములను గూర్చి స్త్రీల కెన్నియో పాటలు వ్రాయబడినవి. భగవద్గీతయంతయు పాటరూపములోనికి మార్చబడియున్నది. స్త్రీలుకూడ "సోఽహంసోఽహం బనియనుమా। అంతరాత్మలో నిసుగనుమా" అని పాడుచు తమ తత్త్వపిపాసను చల్లార్చుకొనుచుందురు. ఇట్లు గేయవాఙ్మయము మన ప్రజానీకమునందు సంస్కృతిని విజ్ఞానమును తరతరములుగ నిలువబెట్టుకొని వచ్చుచు వారిజీవితమునకు వెలుగునిచ్చుచున్నది.

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

## పదునేడవ ప్రకరణము.

## సింహావలోకనము.

ఆంధ్ర, తెనుఁగు, తెలుఁగు, శబ్దముల పుట్టుపూర్వోత్తరములను చర్చించి వాని ప్రాచీనత నిరూపించినాము. ఎల్లవారికిని ఆనందమును ఉపదేశమును ఈయఁగల రచనలు కావ్యములు లేక సాహిత్యము అనబడును. ఆంధ్రులు ఉత్తరాది నుండి వచ్చియుందు రనియు వీరిభాష ఒకానొక ప్రాకృత భేద మనియు చెప్పనైనది. ఆంధ్రుల ప్రాచీనకావ్య నిర్మాణ యత్నములు ప్రాకృతముగా గాన్పించుచున్నవి. బృహత్కథ, గాథాసప్తశతి, కాతంత్రవ్యాకరణము ఇవి ప్రాచీనాంధ్రుల రచనలుగా తోఁచుచున్నవి. ఆంధ్రశాతవాహనుల కాలమునుండి తూర్పు చాళుక్యుల కాలమువరకు ఆంధ్రప్రాకృతమును తెనుగుభాషయు ఒకదానితో నొకటి అల్లుకొని పోవుచున్న రీతి ఆకాలపు శాసనములలో గనవచ్చును. ఆంధ్రభాషాసుందరి బాల్యమనోజ్ఞతను చూపు కావ్యములు దొరకుట లేదు. పదునొకొండవశతాబ్దములో రాజరాజనరేంద్రుని యాస్థానమున నన్నయభట్టారక ముఖమున ఆంధ్రమహాభారత రూపమున తెనుఁగు మచ్చెకంటి ఘుణఘుణఘుణ నాదముతో

తెరుమరుగు వెడలి వచ్చినది. నాటినుండి నేటివరకును ఆ దివ్య నృత్యభంగిమములు ఆంధ్రులకన్నులకు పండువు చేయుచునే యున్నవి.

నన్నయ తిక్కనల నడిమికాలమున ఆంధ్ర శైవసాహిత్యము తలచూపెను. నన్నెచోడుడు, మల్లికార్జున పండితారాధ్యులు శివకవుల మార్గమును స్థాపించిరి. ఇంతలో కాకతి గణపతిదేవచక్రవర్తికి సమకాలికుడై కవిబ్రహ్మ తిక్కనసోమయాజి అవతరించి ఆంధ్రమహాభారత నిర్మాణదీక్షను కడముట్ట నిర్వహించెను. తిక్కనామాత్యునకును ఎఱ్ఱాప్రగడకును నడిమికాలమున ప్రసిద్ధ ద్విపదకవులు పాల్కురికి సోమనాథుడును, గోనబుద్ధారెడ్డియు వెలసిరి. సోమనాథుడు బసవపురాణము మొదలగు గొప్ప శైవసాహిత్యపర్వతములను ద్రొల్లించెను. రంగనాథ రామాయణమును బుద్ధారెడ్డి కుహూకరించెను. భాస్కరరామాయణముకూడ వాల్మీకిజాడలలో నిప్పుడే నడచెను. నన్నయతిక్కనల పరమభక్తుడైన ఎఱ్ఱాప్రగడకవి, వారు విడిచిపెట్టిన భారతారణ్యపర్వశేషమును పూర్తిచేసికొని హరివంశమును సమగ్రముగ వ్రాసి కవిత్రయమువారి కీర్తిని శాశ్వతముగ స్థాపించెను. ఎఱ్ఱనకు సమకాలికులైన వెన్నెలకంటివారి గ్రంథములు తెలియరావు

నాచనసోమనాథుడు ఉత్తరహరివంశమహాకావ్యమును వ్రాసిననన్నెచోడుడు చల్లినప్రబంధాంకురములను పోషించెను.

శ్రీనాథయుగము పలువురు గొప్పకవులను మనకు ప్రసాదించినది. ఈయుగనాయకుడైన శ్రీనాథు డసాధారణమేధావంతుడైన మహాకవి. భక్తాగ్రేసరుడును భాగవతకర్తయునైనబమ్మెరపోతరాజుగారును ద్విపదకవియైన గౌరనయు, జక్కన, అనంతామాత్యుడును శ్రీనాథునితో సమకాలికులు. పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు నందిమల్లయ ఘంటసింగయ కవి ద్వయమును, విష్ణుపురాణకవి వెన్నెలకంటి సూరనామాత్యుడును ప్రబంధచంద్రోదయమునకు పూర్వము వెలసిన చుక్కలు. పదునారవశతాబ్ది తెరను తొలగించుకొని ఆంధ్రసరస్వతి పురాణమను అవకుంఠమును విడచి ప్రబంధమను జిలుగుమెఱుగు మేల్ముసుగుతో ఎదుట నిలచెను. బీజప్రాయమైన ఒక చిన్న పూర్వకథను చేబట్టి దానిని సర్వాంగసుందరముగ దిద్ది వ్రాయుట ప్రబంధరీతి. దీనిని తెచ్చిపెట్టిన అల్లసానిపెద్దన నందితిమ్మనలు శ్రీకృష్ణదేవరాయచక్రవర్తి మన్నన లందినకవులు. రాయలు స్వయముగ సాహితీసమరాంగణసార్వభౌముడు. వీరికి సన్నిహితకాలములో కవితాపట్టభద్రులైన పింగళిసూరనమహాకవియు రామరాజభూషణుడును అనన్యసామాన్యప్రజ్ఞావంతులు. ద్వ్యర్థికావ్యనిర్మాతలు. పాండిత్యముతోపాటు నూతన కథాకల్పనాచణుడైనవాడు పింగళిసూరనామాత్యుడు. అచ్చతెలుగుకావ్యము వ్రాయదగునను చిత్రపుటూహ తెలంగాణమునందు పొన్నగంటి తెలగనకు తట్టినది. తరువాత నిది యొకకావ్యప్రజ్ఞ కాజొచ్చినది.

పాండురంగమాహాత్మ్య కవి తెనాలి రామకృష్ణుడు పదునారవ శతాబ్ది చీరకొంగున ముడివేసికొనబడిన మాణిక్యము.

పదునేడుపదునెనిమిదవశతాబ్దములకు అనంతరప్రబంధ యుగ మని సంకేతముచేయనైనది. ఈకాలమున క్రొంగ్రొత్త కావ్యపు పోకడలు అంతగా లేకపోయినను, కవులు నిరంతరకవితావ్యవసాయము చేయుచునే యుండిరి. విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్న మగుచుండగా ఆంధ్రసరస్వతి తంజావూరు మధుర మైసూరు రాజ్యములలో, అజ్ఞాతవాసము గడపవలసి వచ్చెను. వచనవాఙ్మయము, శృంగారప్రబంధము ఇవి దక్షిణ దేశపు తెలుగుకవులు భాషకర్పించిన ఉపాయనము. ఈ కాలమున పురుషులతోపాటు స్త్రీలు కావ్యరచనయందు పోటీ చేయుట విశేషము. ఆంధ్రములో చారిత్రక కావ్యములు లేని లోపమును కొందరు పూరించిరి. ఈ యుగము మనకు ప్రసాదించిన కావ్యరీతులలో 'యక్షగానములు' అనబడు నాటకములు ప్రత్యేకప్రాధాన్యత కలిగియున్నవి. శతకరచనము ప్రాచీన కాలమునుండియు నడుచుచున్నదైనను ఈ రెండుశతాబ్దములందును విస్తారమైన యాదరముపొంది, అసంఖ్యాకకృతులను మనకొసగినది. ఆంధ్రకవిత్వ మీనాడు రాజాంతఃపురములో మెలగుట మానుకొన్నది. ఆంధ్రదేశముయొక్క ఏయొకమూలనో వాసనలు వెదజల్లుట చాలదని నిశ్చయించుకొన్నదివలె తెలుగుసీమ నాలుగుచెరగులనుండియు కావ్యకుసుమములను పూయించినది.

ఆంధ్రభారతి, నేను అగ్రవర్ణముల వారికిగాని నగరవాసులకుగాని ప్రత్యేకసొత్తును కానని ఘోషించుటకో యనునట్లు ప్రజాకవుల రసనాగ్రముల నిలచి గేయమధువును జాలువారించినది. గేయ వాఙ్మయనిర్మాతలలో మహాపండితులు, గొప్ప సంగీతవేత్తలు, తత్త్వచింతనాపరాయణులు, పాండిత్యగ్రంథ మెరుగక స్వచ్ఛ నిర్మలహృదయులైన ప్రజాకవులునుఉన్నారు. ఈ విధముగ పందొమ్మిదవ శతాబ్దమున ఆంగ్లేయులపాలనము మనదేశము లో స్థిరపడువరకును ఆంధ్రభాషాస్రవంతి ప్రవహించినది. కాకతీయుల అస్తమయముతో మనదేశమునం దారంభించిన మునలాంను ప్రభుత్వములు కొన్ని శతాబ్దము లాంధ్రదేశమును పాలించినను పాలితప్రజల సాహిత్యవికాసమునకు వారి తోడ్పాటేమియు కాన్పింపదు. గోల్కొండ గోరంత అండయయ్యెను. మహమ్మదీయుల సాహిత్యప్రభావముకూడ ఆంధ్రసాహిత్యముపై మృగ్యమే. కొన్ని హిందుస్థానీ పదములుమాత్రము మునల్మాను రాజరిక చిహ్నములుగ మనభాషలో నిలిచిపోయినవి!

ఆంధ్ర సాహిత్య వికాసమును ప్రారంభమునుండి ౧౮ వ శతాబ్దితుదవరకు వివరింపనైనది. ౧౯వ శతాబ్దినుండి ఆంధ్ర సాహిత్యము నూతనమైన విశాలరంగమున బహుభంగుల విహరింపజొచ్చినది. దీనికి చిన్నయసూరి, కందుకూరివీరేశలింగము, కొమర్రాజులక్ష్మణరావు, తిరుపతివేంకటకవులు మొదలగు మహనీయులు నాయకులు. అప్పటినుండి నేటివరకు జరిగిన సాహిత్యాభివృద్ధిని రెండవభాగములో నివేదించుకొందుము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౩ | తెలుఁగువారుండు దేశముకనుక | (విడిచిచదువవలెను.) |
| ౧౫ | ౧౫ | ఉదంతునికథ | ఉదంకునికథ. |
| ౧౫ | ౧౮ | దీర్ఘవర్ణము॰లు | దీర్ఘ వర్ణనములు. |
| ౨౦ | ౨ | శ్రీ నన్నెచోడుడు | నన్నెచోడుడు. |
| ౨౪ | పా॥ జ్ఞా॥ | ఆంధ్రతరంగణి | ఆంధ్రకవితరంగిణి. |
| ,, | ౧౨ | ద్విపదచందస్సు | ద్విపదచ్ఛందస్సు. |
| ౨౫ | ౨.౨ | ఆర్థము | అర్థము. |
| ౨౭ | ౧౯ | పేరు | విశేషణము. |
| ౨౮ | ౧౬ | * * నుండితొమ్మిది పంక్తులు | ౨౮ పుట మొదలు చేర్చి చదువుకొనవలెను |
| ౩౨ | ౪ | చేష్టాధికము | చేష్టాదికము. |
| ౪౧ | పా॥జ్ఞా॥ | కరస్థవి | కరస్థలి. |
| ౪౨ | ౬ | చెన్నమ | చెన్నమల్లు. |
| ౪౨ | ౩ | క్రీ. శ. ౧౨౪౯ | క్రీ. శ. ౧౨౯౪. |
| ౫౦ | ౧౫ | ఆంధ్రీకరించిన | ఆంధ్రీకరించివగాని. |
| ౫౧ | ౧౫ | వాడయియుండెను | వాడయియుండును |
| ౫౨ | ౧౫ | వేదములవాడమకవి | వేములవాడభీమకవి. |
| ౫౪ | ౬ | వేములవాడ | లేములవాడ |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౫౫ | ౧౩ | బ్రాహ్మణకుమారిని | బ్రాహ్మణకుమారుని |
| ౫౬ | ౧౪ | వర్ణకము | వర్ణనము |
| ౬౦ | ౧ | తరువాతి | తరువాత |
| ,, | ౪ | ముఖ్యమునిగ | ముఖ్యముగ |
| ౬౧ | పా॥జ్ఞా॥ | శివభపరుడు | శివభక్తిపరుడు |
| ౬౩ | ౪ | వ్యాఖ్య | వ్యాఖ్య |
| ,, | ౧౮ | అవచిదేవయ, తిప్పయ | అవచిదేవయ తిప్పయ |
| ౬౪ | ౧౧ | చతరత | చతురత |
| ౬౯ | పా॥జ్ఞా॥ | జమ్మ | జన్మ |
| ,, | ,, | పొతన | పోతన |
| ,, | ,, | ఒంటుమెట్ట | ఒంటిమెట్ట |
| ౭౨ | ౧౮ | దక్షినగంగ | దక్షిణగంగ |
| ౭౩ | ౪ | వాఙ్మయము | వాఙ్మయము |
| ,, | ౧౦ | ప్రాణధారము | ప్రాణధార |
| ౭౬ | ౩ | పోతరాజకడు | పోతరాజొకడు |
| ౭౭ | ౧౯ | పోతనామాత్యునికవిత్వమంత | పోతనామాత్యుని కత్యంత |
| ౮౩ | ౧౭ | పెద్దన. పోతరాజు | పెద్దనపోతరాజు |
| ౮౯ | ౧౫ | భావమరది | బావమరది |
| ౯౦ | ౧౭ | అనుశాసనికపర్వము | ఆనుశాసనికపర్వము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౯౨ | ౧౨ | సింహాసనద్వాత్రింశక | సింహాసనద్వాత్రింశిక |
| ,, | పా॥జ్ఞా॥ | షష్ఠిపూర్తి | షష్టిపూర్తి |
| ౯౬ | ౨ | లోకజ్ఞతము | లోకజ్ఞతయు |
| ౧౦౦ | ౧౫ | నాయకావిరహ | నాయికావిరహ |
| ౧౦౩ | ౧౧ | విస్తారముగయొప్పారినది | విస్తారముగ లేక యొప్పారినది |
| ,, | ౨౧ | కేశిద్వజి | కేశిధ్వజ |
| ౧౦౫ | ౬ | మాదర్శమైనట్లు | యాదర్శమైనట్లు |
| ,, | ౧౧ | ప్రబంధయుగాలకు | ప్రబంధములకు |
| ౧౦౮ | ౧౯ | (వాక్యము లోపించినది) | ప్రబంధ యుగమునాటి నుండియు కవులు పండిత ప్రీతికై ప్రౌఢశైలిలో రచించెడివారు. |
| ౧౦౯ | ౯ | అల్లిసాని | అల్లసాని |
| ,, | ౧౩ | నందవరక | నందవరీక |
| ౧౧౫ | ౭ | కుండునప్పటి | కుందునప్పటి |
| ౧౨౦ | ౩ | నిష్ప | నిష్ఠ |
| ౧౧౬ | ౧౫ | శృజియింపన్ | సృజియింపన్ |
| ,, | ,, | గుండరవీంద్రుడు | గుండలీంద్రుండు |
| ౧౪౧ | ౧౭ | విశ్వబ్రాహ్మణుడని, కంసాలియని | విశ్వబ్రాహ్మణుడని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౪౩ | పద్యము | సముస్త | సమస్త |
| ౧౪౪ | ౨ | తెగకు | తెగువకు |
| ,, | ౩ | కాముకుడను | కాముకుడగు |
| ౧౪౯ | ౧౩ | ఆపరకృష్ణదేవరాయలు | అపరకృష్ణదేవరాయలు |
| ౧౬౧ | ౨౨ | విస్మృత | విస్తృత |
| ౧౬౨ | ౬ | కళువెఅనుగ్రామము | కళులె— కళలెఅను గ్రామము. |
| ౧౬౩ | ౨౧ | ౧౭౨ | ౧౭౨౪ |
| ౧౬౭ | పా॥జ్ఞా॥ | చారితిృక | చారిత్రక |
| ,, | ,, | షష్ఠిపూర్తి | షష్టిపూర్తి |
| ౧౭౦ | ౨ | పటంచెరూ | పటంచెరువు. |
| ౧౭౨ | ౧౧ | కనువినుకవి | కనువినుకలి |
| ౧౭౫ | ౧౫ | సాగించెను | సాధించెను |
| ౨౧౦ | ౫ | బ్రహ్మపురాణముగత | బ్రహ్మపురాణగత |
| ౨౧౭ | పద్యము | మహాాత్వ్యము | మహాత్వ్యము |
| ౨౧౮ | ,, | కమలదకాక్షి | కమలదళాక్షి |
| ౨౨౬ | ౧౮ | మెల్లసతి | మొల్లసతి |
| ౨౩౨ | ౮ | విద్యాభ్యాసంగము | విద్యావ్యాసంగము |
| ,, | ౧౬ | భక్త్రి | భక్తి |
| ౨౫౧ | పద్యము | వర్ణంచు | వర్ణించు |
| ౨౫౩ | ౧౮ | పెదవేంకటాద్రిగారల | పెదవేంకటాద్రి చినవేంకటాద్రిగారల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౬౨ | ౩ | మరైను | మర్రైను |
| ౨౬౪ | ౮ | థారుణ | దారుణ |
| ,, | ౯ | సూరోఖదయమున | సూర్యోదయమున |
| ౨౬౭ | ౧౩ | కాక్యార్థాభినయ | వాక్యార్థాభినయ |
| ౨౬౮ | ౧౭ | ఇదివృత్తము | ఇతివృత్తము |
| ౨౬౯ | ౧౪ | అంకభజనము | అంకవిభజనము |
| ౨౭౦ | ౧౭ | చెట్టునుండి | చెట్టుచాటునుండి |
| ౨౭౧ | ౧౭ | మన్నారుదాసవిలస నాటకము | మన్నారుదాసవిలాస నాటకము |
| ౨౭౯ | ౨ | గారవ | గారన |
| ౨౮౫ | ౧౯ | శ్రీశైలమును వ్రాసెననియు | శ్రీశైలమును సందర్శింప బోవుచు కృష్ణాతీరమున నుండి యీ శతకమును వ్రాసెననియు |
| ౨౮౭ | పద్యము | అరయుఁ | అరయఁ |
| ౨౯౦ | ,, | బరితృప్తింబొందితే | బరితృప్తిఁ బొందితిన్ |
| ౨౯౧ | ,, | చిక్కలి | చిక్కని |
| ౨౯౭ | పాదజ్ఞాపిక | వ్యాజస్తుతి | వ్యాజస్తుతి |
| ౩౦౦ | ౮ | చవుతూరు | చవులూరు |
| ౩౦౨ | ౫ | సాస్త్రి | శాస్త్రి |
| ౩౦౩ | ౭ | లైన | నైన |
| ౩౦౭ | ౬ | పరశ్రీ | పదశ్రీ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౧౨ | ౨ | చెప్పదగినది | చెప్పదగినవి |
| ౩౧౫ | ౭ | మువ్వగోపానపదములు | మువ్వగోపాలపదములు |
| ౩౧౯ | ౮ | పల్నాటివీరులు | పల్నాటివీరులు |
| ౩౨౦ | ౩ | అజి రామర | అజరామర |
| ,, | ౧౦ | వీరికథ | వీరకథ |
| ,, | ౧౯ | రాయభామును | రాయబారమును |
| ౩౨౨ | ౧౭ | దేసింగి | దేసింగు |
| ,, | ౨౦ | త్రానుడు | బఖ్త్రానుడు |
| ౩౨౪ | ౨౧ | వ్యాసము | వ్యాసము |
| ౩౨౭ | ౮ | వాపోవుచున్నచో | వాపోవుచున్నచో |
| ౩౨౯ | ౧౧ | లోకజ్ఞత | లోకజ్ఞతతో |
| ౩౩౪ | ౪ | నిలీనమై | విలీనమై |
| ౩౪౧ | ౧౨ | మొదగు | మొదలగు |

# ఆంధ్ర చంద్రికా గ్రంథమాల

## నియమములు

౧. ఈ గ్రంథమాలలో దేశచరిత్రలు, మహా పురుషుల జీవితములు, ప్రకృతి శాస్త్రములు, ఇతర విజ్ఞానాత్మక గ్రంథములు ప్రకటింప బడును.

౨. ఈ గ్రంథములన్నియు ప్రజా సాహిత్య సంబంధములుగా నుండి, సులభమైన వచన శైలిలో ఆకర్షణీయముగా ప్రకటింపబడును.

3. గ్రంథములు పెద్దవిగా నుండక, వీలైనంత వరకు పరిమితమైన పుటలు కలిగి, అందరు కొనుటకు అందుబాటులో నుండులాగున ప్రకటింపబడును.

౪. ఈ గ్రంథమాలకు చందా లేదు. మాసపత్రిక కాదు. గ్రంథము తయారు కాగానే చందాదారులకు వి. పి. గా పంపబడును.

౫. మా గ్రంథమాల ప్రచురణము లన్నియు గొనుటకు నొప్పుకొనువారు "శాశ్వతపు చందాదారు" లనబడుదురు.

౬. శాశ్వతపు చందాదారులు కాగోరువారు, తమ యామోదమును లిఖిత పూర్వకముగా తెలిపి ఒకరూపాయి ప్రవేశ రుసుముగా చెల్లించవలెను.

౭. శాశ్వతపు చందాదారులకు మా గ్రంథమాల పుస్తకముల వెలలో నాల్గవభాగము తగ్గించి గ్రంథములు తయారు కాగానే వి. పి. గా పంపబడును. పోస్టుకర్చులు చందాదారులే భరించవలయును.

౮. ఇంతవరకు ఆంధ్ర వాఙ్మయములో లేని గ్రంథములే ఇందు ప్రకటింపబడును. ఈ గ్రంథములలో విషయవర్ణనకు సంబంధించిన పటములు, గ్రంథకర్తల పటములు ఉండును.

౯. ఆంధ్రభాషకు పుష్టి కలిగించుటయు, ఆంధ్రులలో విజ్ఞాన చంద్రికలను ప్రసరింపజేయుటయు మా యుద్దేశము. డబ్బు సేకరింపవలెనని మా యుద్దేశము కాదు.

౧౦. ఆంధ్ర భాషాభిమానులందరును గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులుగా చేరి, మా భాషా వ్యవసాయమునకు ప్రోత్సాహ మొసంగి, ఆంధ్ర సరస్వతీదేవి ఆరాధనమునందు పాల్గొని కృతకృత్యులు గావలయునని మా విజ్ఞాపన.

## ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు

### ౧. విస్మృత సామ్రాజ్యములు.

ఇదియొక చరిత్రగ్రంథము. నవలవలె మనోరంజకముగా నుండు కథాంశములతో నొప్పారుచున్నది. ఇందు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా యను ప్రాచీన సామ్రాజ్యముల చరిత్ర వర్ణింపబడినది,

ఈ సామ్రాజ్యములు నాలుగయిదు వేల సంవత్సరముల క్రిందట మిగుల వైభవదశలోనుండి కాలపురుషుని ప్రభావమున మాటుపడిపోయినవి. చరిత్రకారుల అవిశ్రాంత పరిశోధన ఫలితముగా వీటి అద్భుతకథనము బయటపడినది. ఇంగ్లీషులోని పెక్కు ఉద్గ్రంథములను పరిశీలించి, ఈ సామ్రాజ్యముల సభ్యత, శిల్పసంపద, మత విశ్వాసములు, ఆచారములు, విజ్ఞానము,

శౌర్యపరాక్రమములు మున్నగు పెక్కువిషయములను గూర్చి మనోహరముగా, అందరకర్థమగునట్లు ఈ గ్రంథము రచింపబడినది. ఆ కాలపు కళలు, దేవతలు మొదలగువానిని దెలుపు పటములు మంచి ఆర్టుపేపరుమీద ముద్రింపబడినవి కలవు. ప్రారంభమున ప్రాచీనమానవుడు నాగరికత శిఖరారోహణమునకు ఎట్లు ప్రయత్నముచేసెనో చక్కగా వర్ణింపబడినది.

గ్రంథకర్త : శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం, ఎం. ఏ. గారు.

పుటలు ౨౬౦. వెల చందాదారులకు రు ౨-౦-౦

ఇతరులకు. రు ౨-౧౨-౦

## ౨. తెలంగాణా ఆంధ్రోద్యమము

(మొదటి భాగము)

ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో నిది రెండవకుసుమము. ఇది తెలంగాణములోని ఆంధ్రోద్యమమునకు సంబంధించిన చరిత్రగ్రంథము. ఇచ్చటి ఆంధ్రులు తాము ఆంధ్రులమను సంగతి నెరుంగక, సాంఘికముగ, రాజకీయముగ, భాషా విషయికముగ, వెనుకబడియున్న తరుణమున వారిని మేల్కొల్పిన పవిత్రోద్యమ చరిత్రమిది. ఈ ఉద్యమ ప్రభావమున ఆంధ్రులకు రాజకీయముగ అస్తిత్వము లభించినది. ఆంధ్రభాషకు ప్రచండ ప్రోత్సాహము కలిగినది. ఆంధ్రసంఘమునకు గట్టి కట్టుదిట్టము లేర్పడినవి. ఇప్పటి వివిధోద్యమములయందు ఆంధ్రులు చూపుచున్న చైతన్యమునకు బీజములునాటి దోహదము కావించినదీ ఆంధ్రోద్యమమే.

ఈ ఆంధ్రోద్యమ రథమునకు బుజాలువేసిన మహానీయులకృషి చక్కగా వర్ణింపబడినది. వారిపటములును ముద్రింపబడినవి. అతిశయోక్తులులేకుండ, యథార్థ విషయములు మాత్రమే సప్రమాణములుగా వ్రాయబడినవి. ఈ గ్రంథమును ఆంధ్రులందరు చదివితీరవలయును.

గ్రంథకర్త : శ్రీ మాడపాటి హనుమంతరావుగారు.

పుటలు ౧౫౨. వెల చందాదారులకు రు ౧-౮-౦
ఇతరులకు ౨-౦-౦

## ౩. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము
(మొదటి భాగము)

అతి పురాతన కాలమునుండి క్రీ. శ. ౧౮౦౦ వరకు మన మాతృభాషయగు నాంధ్రమున, సాహిత్యము పొందిన వివిధ దశలు ఈ గ్రంథమున చక్కగ విశదీకరింపబడినవి. ఏతద్గ్రంథ ప్రత్యేకత్వము, ఏతద్గ్రంథకర్త ప్రతిభ ఆంధ్రలోక ప్రశంసను పొందదగియున్నవి. ఇందభివర్ణితములైన కళాక్షేత్రములప్రశంస, వచనవాఙ్మయ విన్యాసము, తెలంగాణకవుల యుదంతము, ఆంధ్రకవయిత్రుల ముచ్చట, చారిత్రక కావ్యముల ధోరణి, యక్షగానముల సంవిధానము, శతకవాఙ్మయపు రీతులు, గేయ వాఙ్మయ సౌందర్యము, ఇత్యాది ప్రకరణములు ఆంధ్ర వాఙ్మయముయొక్క వైశాల్యమును, శాఖలను, అభిరుచు

లను, గాంభీర్యమును, శోభను పరిశోభమానము గావించుటకు ఎంతయు తోడ్పడుచున్నవి. శైలి మృదుమధురముగ, ఇంపై యలరారుచున్నది. ఆంధ్రజనులు ఇందలి సాహిత్య చరిత్రామృతమును గ్రోలి యానందింతురుగాక!

గ్రంథకర్త : ఆచార్య, ఖండవల్లి లక్ష్మీరంజనము, ఎం.ఏ. గారు.

పుటలు 32౫. వెల చందాదారులకు రు ౨-౮-౦
ఇతరులకు రు 3-౦-౦

## రా బో వు గ్రం థ ము లు.

(౧) వైజ్ఞానికుల జీవితములు :
గ్రంథకర్త : బి. వి. రమణారావుగారు, ఎం. ఎస్సి.

(౨) రాజకీయ పరిజ్ఞానము :
గ్రంథకర్త : డాక్టరు, మారేమండ రామారావుగారు, ఎం. ఏ., పి. ఎచ్. డి.

(3) పౌరధర్మములు :
గ్రంథకర్త : డాక్టరు, రాంపల్లి విశ్వేశ్వరరావుగారు, ఎం. ఏ., బి. టి., పి ఎచ్. డి.

(౪) మాదనమంత్రి :
గ్రంథకర్త : భూపాలరావుగారు, ఎం. ఏ,

(౫) తెలంగాణా ఆంధ్రోద్యమము (రెండవభాగము) :
గ్రంథకర్త : మాడపాటి హనుమంతరావుగారు.

(౬) రోమక సామ్రాజ్యచరిత్ర :
గ్రంథకర్త : నూకల నరోత్తమరెడ్డిగారు, ఎం. ఏ.

(౭) ఆంధ్రసాహిత్య చరిత్ర (రెండవభాగము) :
గ్రంథకర్త : ఆచార్య, ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.

"ఆంధ్రకుటీరము,"
సుల్తాన్ బజారు,
హైద్రాబాదు-దక్కన్
౧౫-౧౧-౧౯౪౯.

మేనేజరు,
ఆంధ్ర చంద్రికా గ్రంథమాల.